## ఏతత్కవికృతులు:

| | |
|---|---|
| దుర్గేశనందని | నవల |
| నవాబునందిని | ,, |
| విశ్వప్రియత్నము | ,, |
| శ్రీ | ,, |
| రాధారాణి | ,, |
| చంద్రసేనుడు | ,, |

హిందూలా (సమష్టికుటుంబము)

మదరాసు లోకలుబోర్డుఆక్టు (రెండుసంపుటములు)

మదరాసు సహకార సంఘముల ఆక్టు

ఆంధ్రకవి తరంగిణి

శ్రీ

# ఆంధ్రకవితరంగిణి

## సప్తమసంపుటము

రచయిత:

శ్రీ చాగంటి శేషయ్య

హిందూధర్మశాస్త్ర గ్రంథనిలయము
కపిలేశ్వరపురం (తూ. గోదావరి)

ఆంధ్రకవి తరంగిణి ముద్రణమునకు విరాళము లొసంగిన

## భా షా భి మా ను లు.

### రా జ పో ష కు లు:

౧ శ్రీ బలుసు బుచ్చిసర్వారాయఁడు జమీందారువారు.
కపిలేశ్వరపురం, కేశనకుర్రు ఎస్టేట్లు, కపిలేశ్వరపురం.

### ప్ర ధా న పో ష కు లు:

౧. శ్రీ బిక్కిని వెంకటరత్నముగారు, భూస్వామి ఎమ్.ఎల్.ఎ. మాజీ మంత్రి, రామచంద్రపురం కో ఆపరేటివు సెంట్రల్ బ్యాంకి అధ్యక్షులు, చోడవరము.

### పో ష కు లు

౧. శ్రీ బలుసు బుచ్చిపట్టాభిరామయ్యగారి కుమారులు అచ్యుతరామయ్యగారు, భూస్వామి, కపిలేశ్వరపురం.
౨. శ్రీ మద్దూరి సూరన్నగారు, వర్తకులు, గోపాలపురం.
౩. శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారు, భూస్వామి, బుచ్చిరెడ్డిపాలెం.
౪. శ్రీ వాడ్రేవు విశ్వసుందరరావు బహద్దర్ వారు,
జమీందారు, వేగాయమ్మపేటయస్టేటు.

### స హా యు లు:

౧. శ్రీ దేశరాజు వేంకటసుబ్బారావుగారు, భూస్వామి, కపిలేశ్వరపురము.
౨. శ్రీ పోతాప్రగడ సూర్యనారాయణగారు, భూస్వామి, ప్రొప్రయిటరు: సుజనరంజనీ ప్రింటింగువర్క్సు, రాజమహేంద్రవరము.

౩. శ్రీ వట్టికూటి పట్టాభిరామయ్యగారు, పునకరమిల్లి యస్టేటు జమీందారు, వెల్ల.

౪. శ్రీ బండారు చినవెజ్జెయ్యఅనే రామకృష్ణయ్యగారు,భూస్వామి, వాడపాలెం.

౫. శ్రీ బలుసు వెంకటరామారావుగారి భార్య మాణిక్యంగారు, భూస్వామిని, కపిలేశ్వరపురము.

౬. శ్రీ కొరసాటి వెంకటాద్రియుడుగారి భార్య శ్రీమతి సత్యవతమ్మ గారు, భూస్వామిని, కపిలేశ్వరపురము.

౭. శ్రీ కేసాప్రగడ వెంకటరమణరాజేశ్వరరావుగారు, భూస్వామి, అన్నంపల్లి.

౮. శ్రీ పోతాప్రగడ కృష్ణమూర్తిగారు, ప్రొప్రయిటరు, మాస్టరు మాన్ ప్రింటర్సు, కాకినాడ.

౯. శ్రీ వాడ్రేవు రత్నేశ్వరరావుగారు, భూస్వామి, పసలపూడి.

౧౦. శ్రీ నెక్కంటి దొరయ్యగారు, భూస్వామి, కపిలేశ్వరపురము.

౧౧. శ్రీ నెక్కంటి రామయ్యగారు, భూస్వామి, అసిస్టెంటుయింజనీరు కపిలేశ్వరపురము.

౧౨. శ్రీ బుద్ధవరపు మహాదేవుడుగారు, బి. ఎ. బి. ఎల్. వకీలు, రామచంద్రపురము.

౧౩. శ్రీ లక్కరాజు సుబ్బారావుపంతులుగారు, అడ్వకేటు,భూస్వామి కాకినాడ.

౧౪. శ్రీ ఉప్పలూరి వెంకటరమణమూర్తిగారు,భూస్వామి,అడ్వకేటు, కాకనాడ.

౧౫. శ్రీ నెక్కంటి జగపతిరామయ్యగారు. భూస్వామి,ప్రొప్రయిటరు రైసుమిల్లు, వెదురుమూడి.

౧౬. శ్రీ ఏకా ఆంజనేయులుపంతులుగారు, భూస్వామి, గుంటూరు.

౧౭. శ్రీ కె. వెంకయ్యచౌదరిగారు, భూస్వామి, డివిజనలు యింజనీరు ప్రస్తుతం కాకినాడ.

౧౮. శ్రీ ఏలూరిపాటి నరసింహాసర్వతోముఖరాజులుగారు,
భూస్వామి, బిళ్ళకుర్రు.

౧౯. శ్రీ తురగా పురుషోత్తం పంతులుగారు, ఎమ్. ఎల్. సి., పలివెల.

౨౦. శ్రీ మల్లాడి సత్యలింగం నాయకర్రు చారిటీసువారు, సత్యలింగవరం, కాకినాడ.

౨౧. శ్రీ అయ్యగారి మోహనరావుపంతులుగారు, బి. ఎ., బి. ఎల్., అడ్వకేట్, సీతానగరం, విశాఖపట్టణంజిల్లా.

౨౨. శ్రీ రావుసాహెబ్ పట్టమట్ట శేషగిరిరావుపంతులుగారు, ప్రొప్రయిటరు, జార్జిప్రెస్, కాకినాడ.

౨3 శ్రీ వెంటూరు దొరయ్యగారు, భూస్వామి, కోటిపల్లి.

౨౪. శ్రీ బొప్పన దొరయ్యగారు, భూస్వామి, కందులపాలెం.

౨౫ శ్రీ వైట్ల వీర్రాజుగారు, భూస్వామి, కందులపాలెం.

౨౬. శ్రీ తురగా రామచంద్రరావుపంతులుగారు, భూస్వామి,
ఇన్ కమ్‌టాక్సుఆఫీసరుగారు, మదరాసు.

౨౭. శ్రీ ఏనుగు తమ్మిరాజుగారు, భూస్వామి, తాపేశ్వరం.

౨౮. శ్రీ వాడ్రేవు వెంకప్పారావుగారు, జమీందారు, దానవాయిపేట, రాజమహేంద్రవరము.

౨౯. శ్రీ వాడ్రేవు గోపాలకృష్ణగారు, భూస్వామి, పిఠాపురము

3౦. శ్రీ నేమాని వెంకటనారాయణగారు, బి. కామ్.,
ఇన్ కమ్‌టాక్సు ప్రాక్టీషనరు, కాకినాడ.

# విషయసూచిక


96. శ్రీకృష్ణదేవరాయలు 1

I కృష్ణరాయలవంశవర్ణనము 2

(1) తుళువవంశీయులు క్షత్రియులా? 5

(2) రాయలతల్లి భోగకాంతయా ? 8

(3) రాయలు కర్ణాటకుఁడా ? యాంధ్రుఁడా ? 13

II కృష్ణరాయల జననము 15

III కృష్ణరాయల రాజ్యస్వీకార కాలనిర్ణయము 18

IV కృష్ణరాయల పట్టాభిషేకమహోత్సవకాలనిర్ణయము 21

V కృష్ణదేవరాయల భార్యలు 29

(1) భార్యలను గూర్చిన కథలు, వరదరాజమ్మ లేక తుఖ్ఖాదేవి లేక రుచీదేవి 30

(2) గాండ్లసంగ కథ 34

(3) విదేశీయుల వ్రాఁతలు 35

(4) శాసనములు, గ్రంథములు 36

(5) చిన్నాదేవి 36

(౧) రాయలు చిన్నాదేవిని పెండ్లియాడెనా ? 38

(౨) గాండ్లసంగ చిన్నాదేవియా ? 39

(3) చిన్నాదేవి యెప్పుడు చనిపోయినది ? 40

(6) తిరుమలదేవి 40

(౧) రాయల పట్టాభిషేకమునాటికి దిరుమలదేవి వివాహమైనదా ? 43

(7) రాయల మూఁడవభార్య (గజపతికూఁతురు) 44

(౧) గజపతితనయ నామవిచారణము 44

(౨) గజపతిపుత్రిక పేరు లక్ష్మీదేవి 46

(3) ఆముక్తమాల్యదకృత్యాది పద్యము 47

(౪) గజపతిపుత్రి భర్తను జంపఁదలపెట్టెనా ? 49

(౫) ఈమె వివాహ మెప్పుడెచ్చటజరిగినది ? 50

(8) అన్నపూర్ణాదేవి యెవ్వరు ? 51

VI కృష్ణరాయల సంతానము 52

VII కృష్ణరాయల దిగ్విజయములు 56

(1) రాయల శత్రువులు 57

(౧) ఉమ్మత్తూరు గంగరాజు 57

(౨) బహుమనీ—మహమ్మదీయులు 58

(౩) ప్రతాపరుద్రగజపతి 60

(2) రాయల మొదటియుద్ధము 62

(౧) పరిభూతసురత్రాణబిరుదము 62

(౨) రాయలు మహమ్మదుషాహాతో రణమొనర్చెనా? 63

(౩) ౧౫౦౯ లో రాయచూరు ముద్గల్లుదుర్గము లెవరిస్వాధీనమునం దున్నవి ? 65

(౪) ౧౫౦౯ లో రాయచూరుదుర్గము రాయల వశమైనది 69

(౫) మొదటి రాయచూరుయుద్ధము 71

(3) దక్షిణదేశవిజయము 72

(4) రెండవ రాయచూరుయుద్ధము 75

(౧) ఆదిల్ ఖా నెవ్వరిచే నెప్పుడు మరణమందెను? 78

(i) ఇతని మరణమునుగూర్చి చరిత్రకారుల యభిప్రాయములు 80

(ii) కృష్ణరాయల బిరుదములు 83

(iii) ఆదిల్ ఖానుని మరణకాలనిర్ణయము 86

(౨) గుల్బర్గాపై మొదటి దండయాత్ర, సుల్తాను చెఱవిముక్తి 88

(౩) పోర్చుగీజు చరిత్రకారుల వ్రాతలు 90

(5) పూర్వదిగ్విజయములు 95

(౧) పూర్వదిగ్విజయయాత్రలను దెలుపు శాసనములు 97

(౨) ఉదయగిరి విజయము 100

(౩) కొండవీటి విజయము 100

(౪) కొండపల్లి విజయము 101

(౫) కళింగదండయాత్రలు 102

(౬) ప్రతాపరుద్రగజపతిభార్యను రాయలు బందీగాఁజేసెనా ? 106

(౭) కృష్ణానదీతీరమున రాయలకును గజపతికిని యుద్ధముజరిగెనా ? 107

(౮) వీరభద్రగజపతి ఆత్మహత్య చేసికొనియెనా? 108

(6) మూఁడవ రాయచూరుయుద్ధము 110

(7) బెడందకోట విజయము 111

(8) నాల్గవ రాయచూరుయుద్ధము 113

(9) రాయలు గుజరాతుపై దాడివెడలెనా ? 114

VIII కృష్ణరాయల పాండిత్యము 115

(1) ఆముక్తమాల్యద, స్వప్నకాల నిర్ణయము 118

(2) రచనాకాలము 125

(3) ఆముక్తమాల్యదయందలి యాశ్వాసములెన్ని ? 133

(4) ఆముక్తమాల్యదను కృష్ణరాయలు రచియింపలేదా? 134

(5) ఆముక్తమాల్యదా కథాసారము 135

(6) కవిత్వగుణము 141

IX అష్టదిగ్గజములు 144

X కృష్ణరాయలు కృతిపొందిన కావ్యములు 145

(1) పారిజాతాపహరణకృతి సమర్పణకాలము 145

(2) మనుచరిత్రకృతి సమర్పణకాలము 149

XI రాయల స్వరూపస్వభావాదులు 155

XII శ్రీకృష్ణరాయల నిర్యాణకాలనిర్ణయము 157

XIII తిమ్మరుసు మంత్రి 169

97. అల్లసాని పెద్దనార్యుఁడు 177

98. మాదయ్యగారి మల్లన్న 199

99. నాదెండ్ల గోపమంత్రి 213

100. నంది తిమ్మయ్య (ముక్కు-తిమ్మన) 223

101. ధూర్జటికవి 243



శ్రీరామచంద్ర

# ఆంధ్రకవితరంగిణి

## సప్తమ సంపుటము

## 96 శ్రీకృష్ణదేవరాయలు

ఈరాజమార్తాండునిచారిత్ర మొకగ్రంథముగా వ్రాయఁదగినది కాని కొన్నిపుటలలో ముగింప నర్హమైనది కాదు. ఈకవిపండితపోషకునిజీవితము ను స్వదేశీయవిదేశీయపండితు లనేకభాషలలో గ్రంథరూపమునను బత్రికలలో వ్యాసరూపమునను బ్రకటించియున్నారు. ప్రకటించుచున్నారు. ప్రకటించెదరు. ఆముక్తమాల్యద యనుమహాప్రబంధము నాంధ్రమున రచియించియుండుటచే నీపండితప్రభువు చరిత్రమును వ్రాయుభాగ్యము నాకుఁగూడఁ గలిగినది. ఈప్రతాపశాలిజీవితమును దెలుపుసమకాలికగ్రంథములున్నను నిప్పటికినిబండితు లిద మిత్థ మని నిర్ణయింపఁజాలని విషమసమస్యలు కొన్ని యీతనిచారిత్రమునఁ గలవు.

ఈమహారాయలనుగూర్చి యాంధ్రమునఁ బండితు లనేకులు వ్రాసియుండుటచే, నీగ్రంథమునం దీతనిచారిత్రమును సాధ్యమైనంత వఱకుఁ గ్లుప్తముగా వ్రాసెదను. నేనేమివ్రాసినను, బండితు లిదివఱకుఁ బ్రకటించినభావములే తఱచుగా నిందుఁ జేరుచుండును. ప్రత్యేకముగ వారినామముల నిం దుదాహరింపలేదని నాపైఁ గినియకుందురుగాక ! కొందఱుపరిశోధకులు తాము కనిపెట్టినవిషయముల నేపత్రికలయందో ప్రకటించియుందురు. వానినన్నిటిని నేనుజూచుట తటస్థించియుండదు. నాకు లభించినసామగ్రినిబట్టి స్వతంత్రముగ నూహించి కవితరంగిణియందు వ్రాసినవిషయములనుజూచియట్టివారు నాపైదోష మాపాదింప

కుందురు గాక ! ఒకరిభావములను నావిగాఁ బ్రకటించుకొనునుద్దేశము నా కెప్పుడును లేదు.

## I రాయల వంశవర్ణనము

ఈమహారాజువంశమునకుఁ దుళువవంశమని పేరు. "తులు" అను దేశమునుబట్టి యీవంశమున కీపేరువచ్చినది౧. లభ్యమైనంతవఱ కీతని వంశవృక్షము నీక్రింద నిచ్చుచున్నాఁడను.




ఇందు శ్రీకృష్ణదేవరాయులతండ్రియైననరసనాయకునకు నరసింహనాయకుఁడని, నరసింహరాయలని, నరసరాయలని వీరనరసింహరాయలని నామాంతరములు కలవు.

ఈతుళువవంశము సాళువవంశాంతర్భాగమని, కొందఱుచరిత్రకారులు వ్రాసియున్నారు. కాని యదిసత్యము కాదనియు, నీరెండు వంశములకు రక్తసంబంధము లేదనియు, నందిమల్లయ ఘంటసింగయ కవులచారిత్రమున వ్రాసియున్నాఁడను౨ ఈమల్లయ సింగయకవులు వరాహపురాణమును రచియించి యీనరసనాయకునకే కృతియిచ్చిరి.

౧ ఆంధ్రకవితరంగిణి ఆఱవసంపుటము 121 వ పుట
౨ ఆంధ్రకవితరంగిణి. ఆఱవసంపుటము 115 వ పుట

అందుఁ దుళువరాజ్యమునుబట్టి వీరికిఁ దుళువరాజులని పేరు వచ్చినట్లు వర్ణించియున్నారు. ఈక్రిందిపద్యములను జూడుఁడు.

ఉ. మిన్నుల మోచి భాగ్యయుల మీఱినకోటల రమ్యహర్మ్యసం
పన్నత సస్యవాటగరిమంబులఁ దోఁటల వాహవారణా
భ్యున్నతిఁ గేలిదీర్ఘికల నుగ్రభటావలి వన్నెకెక్క వా
రాన్నిధి కాంచిపైఁ దుళువరాజ్యము సంతతవీరభోజ్యమై.

క. ఆ తుళువరాజ్యమున వి
ఖ్యాతి వహించిరి దిగంతకరికటతటసం
భూతమదక్షాళనవి
ద్యాతత్పరకీర్తిఁ బెండ్లియాడిన రాజుల్.

ఉ. వారలకగ్రగణ్యుఁడు నివారితవైరివరూధినీధవ
శ్రీరమణీవిలాసుఁడు విచిత్రకళాకళలుండు తిమ్మధా
త్రీరమణుండు సంపద వరించె మరాటవరాటలాటగాం
ధారయుగంధరాధిపసదః ప్రకటీకృతబాహువీర్యుఁడై.

శాసనవాఙ్మయప్రపంచమున నీవంశమునకు మూలపురుషుఁడగుతిమ్మరయనాయకుని పూర్వులప్రశంస యెచ్చటను గనుపట్టలేదు. ఈతుళువదేశము విజయనగరరాజ్యమునకు లోఁబడిన యొకచిన్నసంస్థానమైయున్నది. తిమ్మరయనాయకునిపూర్వులకీతుళువసంస్థానపరిపాలనముతో సంబంధమున్నదో లేదో చెప్పఁజాలము. ఈతిమ్మరయనాయకుఁడు విజయనగరరాజులయొద్ద సేనానాయకుఁడుగ నుండియుండును. ఈతనినిగూర్చి మనుచరిత్రమున నీక్రిందిపద్యములోఁ గానవగును.

మ.స్ర. ఘనుఁడై తిమ్మక్షితీశాగ్రణి శరకమఠగ్రావసంఘాత వాతా
శనరాడాసాంతదంతిస్థవిరకిరుల జంఝాటముల్ మాన్పి యిమ్మే
దిని దోర్దండైకపీఠిం దరము పఱిచి కీర్తిద్యుతుల్ రోదసిం బ
ర్వ నరాతుల్ నమ్రులై పార్శ్వములఁ గొలువఁ దీవ్రప్రతాపంబు
చూపెన్.

ఈతఁ డేలినప్రదేశముగాని యాతఁడు సేనాధిపతిగా నున్న ప్రభువునామముగాని తెలియదు.

ఈతనిభార్య దేవకీదేవి. ఇతని కీశ్వరనాయకుఁడని తిమ్మనాయుఁడని యిరువురు తనయులు. ఇందు రెండవయాతనినిగూర్చినవిశేషము లేమియుఁ దెలియవు. పెద్దవాఁడైనయీశ్వరనాయకుఁడు సాళువగుండడనరసింహరాయల యొద్ద బ్రధానసేనాధిపతియై యనేకయుద్ధములలోఁబాల్గొని తనప్రభువునకు విజయములను జేకూర్చుచువచ్చెను. ఈతనినిగూర్చి సింగయమల్లయకవులచరిత్రమున వ్రాసియున్నాఁడను.

ఈశ్వరనాయకుని విషయమున పారిజాతాపహరణ మనుచరిత్రములయం దున్నసిన ... మూఁడుపద్యముల నిట నుదాహరించెదను.

ఉ. తామసవృత్తి లేదు సతతంబును నుగ్రుఁడు గాఁడు పౌరుషం
బేమియు వెలిగాదు తన రెంటను బైమటి రాజు లేఁడు సం
గ్రామములోన నొక్కఁడనరుగాసికి వాసి దొడంగఁ డీశ్వర
క్ష్మారమణ హిళామనోహరునిపాటియె యీశ్వరుఁ డెన్నిభంగులన్.

ఉ. రాజులనెత్తుటం బరశురాముఁడు వ్రింతలు సేసె రెండుమూఁ
డీజగతిన్ గణింప నవి యెంతటివిస్మయ మబ్బిసీసుహృ
త్తేజుఁడు కందుకూరికడఁ దిమ్మయయీశ్వరుచే జనించె ఘో
రాజి బెడందకోట యవనాశ్వికరక్తనదీసహస్రముల్.

పారిజాతాపహరణకృత్యాది.

చ. బలమదమత్తగుప్తపురభంజనుఁడై పరిపాలితార్యుఁడై
యిలపయిఁ దొంటియీశ్వరుఁడెయీశ్వరుఁడై జనియించెరూపటాన్
జలరుహనేత్రలం దొడఁగి శైలవనంబుల భీతచిత్తులై
మెలంగెడుశత్రుభూపతుల మేనులఁ దాల్చిన మన్మథాంకముల్.

మనుచరిత్రకృత్యాది.

ఈశ్వరనాయకునకు గౌరాంబ బుక్కాంబ యనునిరువురు భార్యలు. గౌరాంబకుఁ బురుషసంతాన ముండినట్లు గానరాదు. బుక్కాంబకు నరసనాయకుఁడు తిమ్మానాయకుఁడు ననునిరువురు తనయులు. ఇందులోఁ దిమ్మానాయకునిగూర్చి కవులేమియు వ్రాసియుండలేదు. నరసనాయకుఁడు సాళువనరసింగరాయల సేనాధిపతియై విశేషప్రఖ్యాతిని గాంచినవాఁడు. ఈతఁడే వరాహపురాణకృతి

భర్త. ఈతనినిగూర్చి సింగయమల్లయకవులచారిత్రమున విపులముగా వ్రాసియున్నాఁడను. ఇతఁడు నరసింగరాయలసేనాధిపతియైనను, విశేష పరాక్రమవంతుడు కావునఁ దనశక్తిసామర్థ్యములచే గొప్పఖ్యాతిని వలుకుబడినిసంపాదించెను. నరసింగరాయలయనంతరమున నాతనితనయుఁడైనయిమ్మడినరసింగరాయలను పేరునకు రాజుగానుంచి తానే పరిపాలనము చేయుచువచ్చెను. ఈతనినామముదాహృతములైనవియు నీతడుచేసినదానములను దెలుపునవియుశాసనములు పెక్కులుకలవు. ఈతఁడే జగద్విఖ్యాతయశస్సు నార్జించినశ్రీకృష్ణరాయదేవేంద్రునకు జనకుఁడు.

## I (1) తుళువవంశీయులు క్షత్రియులా?

తుళువవంశీయులు క్షత్రియులని కొందఱును శూద్రులనికొంద ఱును దలఁచుచున్నారు. కృష్ణదేవరాయలతండ్రియైన నరసభూపతిని నాతనితండ్రియైన యీశ్వరక్షితిపతిని నాయకశబ్దముచేఁ జెప్పియుండుటచే వారిని శూద్రులనియె యెంచఁదగియున్నది. క్షత్రియులను రాయలనియు శూద్రులను నాయకులనియు వాడుచుండిన ట్లాకాలమందలి శాసనవాఙ్మయదృష్టాంతము లుగన్పట్టుచున్నవి. సేనానాయకత్వమును వహించిన బ్రాహ్మణులకును క్షత్రియులకును దండనాయకశబ్దము చేర్చుచుండుట కలదు. కేవలనాయకశబ్దముచే వారినెచ్చటనైన నెవ్వఁడైనఁ జెప్పినను నది గమనింపదగినదికాదు. నాయకశబ్దముచే శూద్రులు వ్యవహృతులగుచుండుట బహుళముగాఁ గాననగును. కావుననీశ్వరనాయక నరసనాయకులు శూద్రులనియే మనమునిశ్చయింపవలసియున్నది. వరాహపురాణకృతికర్తలైన మల్లయసింగయకవులు తమగ్రంథమున సాళువనరసింహ భూమండలేశ్వరుఁడని రాయలని పేర్కొనుటయు,— "తుహినాంశువంశపాథోరాశిమాణిక్య" మని చంద్రవంశపురాజుగాఁ జెప్పి తమకృతినాయకుఁడైననరసవసుధాధ్యక్షుని నరసనాయకుఁడనియు, నతనితండ్రిని ఈశ్వరనాయకుఁడనియుమాత్రమేనుడివి, వారివంశమును సూర్యవంశముగాఁగాని చంద్రవంశముగాఁగాని చెప్పక మూకీభావము వహించుటయుఁ జూడ నీతుళువవంశీయులు క్షత్రియులు గారని నిస్సం

శయముగా నిర్ణయింపవచ్చును. వరాహపురాణకవులు పలుతావులఁ దమకృతినాయకుని తుళువవంశీయుఁడనియేచెప్పియుండిరి. కాని నూచనగా నైనను జంద్రవంశీయుఁడని చెప్పలేదు. వీరుక్షత్రియులుగారని యెచ్చటను నిర్దిష్టముగాఁ జెప్పియుండకపోవుటచేతను నరసనాయకుని తరువాతివారు తాము చంద్రవంశక్షత్రియులమని చెప్పుకొనియుండుట చేతను వీరిని క్షత్రియులనియె తలంపవచ్చునని యెవ్వరైన ననవచ్చును. కాని యది యంగీకార్యము కాదు. కాకతీయులుకూడఁ గ్రమముగాఁ దాము క్షత్రియులమని ప్రకటించుకొనుచువచ్చిరి. కాని వారిని క్షత్రియులుగాఁ జరిత్రకారు లంగీకరింపలేదు.

సాళువనరసింగరాయలయనంతరమున నరసనాయకుఁడు క్రమముగా రాయలనిపించుకొనఁ బ్రయత్నించినట్లు కనుపట్టుచున్నది. నరసనాయకునికుమారుఁడైన వీరనరసింహరాయలకాలమునుండి వీరుక్షత్రియులనిపించుకొనిరి. వీరనరసింహరాయలు కృతినందినకావ్యములు కన్పట్టుటలేదు. అతనితరువాతఁ గృష్ణదేవరాయని రాయలని బాహాటముగా జెప్పుటయేగాక యాతనిది చంద్రవంశమని స్పష్టముగా వర్ణించిరి. చంద్రవంశమునఁ బ్రసిద్ధుఁడైనయయాతికుమారుఁడగుతుర్వసునిసంతతిలో దిమ్మభూపతి జన్మించెనని జెప్పి చంద్రవంశముతో సంబంధమును గలిపి శాసనములలోను గావ్యములలోను వర్ణించుచు వచ్చిరి.

యయాతికి యదుపుతుర్వసుఁడు ననునిరువురు కుమారులున్నట్లు భాగవతపురాణమువలనఁ దెలియుచున్నది. అందుఁ దుర్వసువంశమును గూర్చి యీక్రింది వాక్యము లున్నవి. "తుర్వసునకు వహ్ని వహ్నికి భర్గుండు భర్గునకు భానుమంతుఁడు భానుమంతునకుఁ ద్రిసానువుఁ ద్రిసానువునకుఁ గరంధముండును గరంధమునకు మరుత్తుండు నతనికి యయాతిశాపంబున సంతతి లేదయ్యె "౧

అలసానిపెద్దనామాత్యుఁడు కృష్ణరాయలకుఁ గృతియొసంగిన మనుచరిత్రమున తుర్వసువంశమే తుళువవంశ మైనదని యీక్రింది పద్యములలోఁ జెప్పియున్నాఁడు.

---

౧ నవమస్కంధము ౭౦౧

క. అతనికి యదుతుర్వసు లను
సుతు లుద్భవమంది రహితసూదనులు కళా
న్వితమతులు వారిలో వి
శ్రుతకీర్తి వహించెఁ దుర్వసుఁడు గుణనిధియై.

తే. వానివంశంబు తుళువాన్వవాయ మయ్యె
నందుఁ బెక్కండ్రు నృపు లుదయంబునొంది
నిఖిలభువనప్రపూర్ణనిర్ణిద్రకీర్తి
నధికులైరి తదీయాన్వయమునఁ బుట్టి.

తుర్వసువంశము తుళువవంశమెట్లయ్యెనో పెద్దనామాత్యుఁడు చెప్పలేదు. దీనినిబట్టి కృష్ణరాయల నెట్లైన చంద్రవంశముతో సంబంధముకలుపుటకై ప్రథమాక్షరసామ్యముగల యొకపురుషుని బురాణములనుండి వెదకి తెచ్చినట్లుకన్పట్టుచున్నది. సూర్యవంశమునఁగాని చంద్రవంశమునఁగాని తుళుఁడనుపురుషుఁ డెవ్వఁడైన లభించియున్నచో నతనినే యీవంశకర్తగాఁ జేసియుందురేమో!

నందితిమ్మనార్యుఁడు తాను కృతియొసంగిన పారిజాతాపహరణ ప్రబంధమున నీతని దుర్వసువంశీయునిగానే యీ క్రిందిపద్యములలో వర్ణించియున్నాడు.

ఉ. ఆయమృతాంశునం దుదయమయ్యె బుధుం డతఁడార్తరక్షణో
పాయుఁ బురూరవుంగనియె నతని కాయువు పుత్త్రుఁడయ్యె న
య్యాయతకీర్తికి న్నహుషుఁ డాత్మజుఁడై యిలయేలెఁ దత్సుతుం
డై మలరె న్యయాతియతఁ డాహవదోహలు గాంచెఁ దుర్వసున్.

క. ఉర్వీశవరాళియగు నా
తుర్వసువంశంబునందు దుష్టాహిభుజా
దుర్వారగర్వరేఖా
నిర్వాపకుఁ డీశ్వరాఖ్యనృపతి జనించెన్.

ఇట్లువ్రాసియు నాప్రబంధమునందే కృష్ణదేవరాయలను శ్రీకృష్ణునితోఁ బోల్చుసందర్భమున

భోగకాంతయని యనుమానించుటకైన నవకాశము లేదు. ఆమె భోగ
కాంతయనుటకు శ్రీ గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారు తమకవి
జీవితములలో రెండుకథలను వ్రాసియున్నారు. వాని నిట నిచ్చెదను.

౧. "ఈకృష్ణదేవరాయలజననంబున కొకకథ కలదు. దీని
నిచటిసంప్రదాయజ్ఞులందఱు వాడుకొను టీక్రింద వివరింతము. ఈతని
తండ్రి యైన తెలుఁగుదేశపునరసింహరాయఁడు త్రిలింగదేశంబున రా
జ్యంబు సేయుచుండె ఈతం డొకనాటిరాత్రి కాలోచితకృత్యంబులు
నిర్వర్తింప బహిర్దేశంబునకుం జనియుండ నంతరిక్షంబునుండి యొక
యుల్క మిక్కిలి తేజంబుతో నాతనియుదకస్థాలిం బడియె. దానిం
జూచి యారాజు తనచేతనాపాత్రంబు మూసి యనతిదూరంబుననున్న
నిజభటుం బిలిచి యోరీ! అప్పాజికి (తిమ్మరుసునకు) ఈవార్త దెల్పు
ము అనుడు నాభృత్యుండు వేగిరంబ చని దాని నెఱిఁగించిన నాతం
డాసీరుం ద్రావుమని రాజుతోఁ జెప్పు నుత్తరం బిచ్చె. వాఁ డావార్తను
రాజునకుఁ దెలిపినతోడనే యాతండు తిమ్మరసు నాజ్ఞానుసారంబుగాఁ
గార్యంబు నడపె అనంతరము తిమ్మరసు రాజుకడ కేతెంచి యాతని
నారాత్రి స్వీయతో సుఖంబుగ నుండుమని తెల్పె. రాజును దిమ్మరుసు
మాటలయెడం గౌరవ ముంచి యంతిపురికిం జని పట్టపుదేవిం బిలువం
బంచిన నాపె కారణాంతరములచే రాలేదయ్యె. దాని కెంతయు వగ
చుచు నాపె చెలికత్తెలలో నొక్కజవరాలిం గూడి యాదినంబు సుఖం
బున నుండె. తోడనే యాయింతి గర్భంబు దాల్చె. నవమాసంబులు
నిండినయనంతర మాయింతి యొకశుభముహూర్తంబున దేవకి కృష్ణు
నిం గన్నట్లు తాఁ గృష్ణరాయనిం గనియె. ఆవార్త విని నరసింహరా
యఁడు విశేషోత్సవంబు సేయించె. పుత్రునిఁ జూచి యాతని తేజోధికత
కుఁ దండ్రి యెంతయు సంతసిల్లె. అప్పటినుండియు నీతని నతిప్రేమ
చేత, గాపాడుచుండె. అప్పటి నరసింహరాయనికి బీజనగరదేశ మం
తయు స్వాధీనమయ్యె. దానిచేఁ గృష్ణరాయం డెంతయు సదృష్టవం
తుండని యాతండు మఱియుం బ్రేమాతిశయంబున నాదరింపుచుండె.
రాజ్ఞులిండుటచే నోర్వలేక రాజభార్యలతనిం జంపఁ యత్నంబులొన
ర్చి యాతనిజంపఁ బంపిరి. అపుడు తిమ్మరసు కృష్ణరాయనియొద్ద

మిగుల నెనరుంచి యాతనిఁ దనమందిరంబునకుఁ గొనితెచ్చి యుచ్చటఁ జిరకాలముంచి సంరక్షించె. కృష్ణరాయ లీయువేసలు సమయంబున నెనిమిది తొమ్మిది సంవత్సరములవాఁడు. ఈతనికిఁ దిమ్మరసు జాగరూకుండై విద్యాబుద్ధుల నేర్పుచుండె. ఇట్టిసమయంబునఁ దిమ్మరసును అప్పా అని యీరాయండు పిల్చుటం జేసి యీతనికి నప్పాజియను నామాంతరంబుగల్గె."

౨ "విజయనగరపురాజులలో పదియాఱవవాఁడగు వీరనృసింహరాయలు చిరకాలము పుత్రులులేక ఖేదపడుచుండఁగా నొకనాఁ డొక విప్రశ్రేష్ఠుఁ డేతెంచి "రాజా! నేనేర్పఱచిన ముహూర్తకాలమునందు నీవు నీభార్యతోఁ గూడితివేనిఁ దప్పకుండ నీకుపుత్రుఁడు కలుగును" అని చెప్పెను. అందుల కారాజు సంతసించి ముహూర్తకాలమునకు సిద్ధముగా నుండుమనటుల నిజపత్నియగు తిప్పాంబకు వర్తమానము పంపెను "చీరె సింగారించువఱకు పట్నము కొల్లబోయెను" అను శ్లోకము వాడుక ప్రకారముగాఁ దిప్పాంబగారు దిద్దుకొని తీర్చుకొని రాజుసమ్ముఖమున కేతెంచువఱకు ముహూర్తకాలము మించిపోయెను ఈ మధ్యకాలములో రాజుగారిపడకటింటిలో దీపాలుబాగుచేసెడినాగి యనునొక దాసి ముహూర్తకాలమునకు హాజరుగానుండఁగ రాజు దానితో రమించెను. తత్క్షణమే నాగికి గర్భోత్పత్తి ఆయెను. నవమాసపూర్తియైన తర్వాత దివ్యతేజస్సుకలిగినశిశువును గనెను. ఈశిశువునకు కృష్ణదేవరాయలు అనునామ మేర్పడెను."

ఇట్టికథలు మఱికొన్ని యుండవచ్చును. అత్యధికముగానున్న శాసనవాఙ్మయసాక్ష్యమును త్యజించి యిట్టిపుక్కిటిపురాణములమీఁద నాధారపడి కృష్ణరాయలతల్లి భోగకాంతయని నిర్ణయింపరాదు. పై కథలయందలియౌచిత్యానౌచిత్యములను సత్యాసత్యములను విమర్శించి తీర్మానింపఁ దగినంత పటుత్వమాకథలయందు లేదు. కావునఁ గృష్ణరాయలతల్లి కులకాంతయనియే నిర్ణయింతము.

బ్రహ్మశ్రీ. వీరేశలింగముపంతులుగారు ఆంధ్రకవుల చారిత్రమున "కృష్ణదేవరాయలతండ్రియైననరసింహరాయనికి తిప్పాంబయనియు,

నాగాంబయనియు ఇద్దఱుభార్యలు గలరు. ఆయిరువురిలో తిప్పాంబ పట్టపురాణియనియు, నాగమాంబ భోగకాంతయనియు చెప్పుదురు. కొన్ని శాసనములయందుఁగూడ నిట్లే కానఁబడుచున్నది.'' అని వ్రాసి యున్నారు. కాని యిది కేవలము నాధారరహితమైనవ్రాఁత. నాగమాంబ భోగకాంతయని వ్రాసినశాసనమొక్కటియు లేదు.

కృష్ణరాయల కాలస్యముగ వివాహ మయ్యెననియు, దాసీపుత్త్రుఁ డనుకారణముచే నెవరును గన్యనీయకుండుటయే యాలస్యము నకుఁ గారణ మనియుఁ జెప్పుచున్నారు. రాయలకిరువదియైదేండ్లవయసునఁ జిన్నాదేవి, తిరుమలదేవి యను నిరువురు భార్యలున్నట్లు తిరుపతి యందలి శాసనములవలన స్పష్ట మగుచున్నది. ఆ కాలమున నిరువదియైదేండ్లు వివాహవయసు దాఁటిపోయినకాలముగాఁ బరిగణింపఁబడుట లేదు. కావున రాయలు దాసీపుత్త్రుఁ డనుట కిదియొకకారణముగాఁ దలంపరాదు.

ఈసందర్భమున నింకొకవిషయమునుగూర్చి యాలోచింపవలసి యున్నది. వీరనరసింహరాయలయొక్కయు, శ్రీకృష్ణదేవరాయలయొక్కయు శాసనములలో నరసనాయకున కిరువురు భార్యలనియు, నందు దిప్పాంబకు వీరనరసింహరాయలును నాగాంబకుఁ గృష్ణరాయలును జన్మించినట్లునుమాత్రమే చెప్పఁబడినది. కృష్ణరాయలయనంతరమున విజయనగర సింహాసన మధిష్ఠించిన యచ్యుతరాయల కంకితమైన యచ్యుతరాయాభ్యుదయమను సంస్కృతగ్రంథమున నరసనాయకునకు ముప్వురుభార్యలనియు మూఁడవభార్యపేరు "ఓబమాంబ" యనియు నీక్రింది శ్లోకములో నున్నది.

"తిస్రో నృపస్యైత్యభవ న్నభీష్టా
స్తిప్పాంబికా తాసు చ నాగమాంబా
పట్టాభిషిక్తాః పతిదేవతానా
ముత్తంసభూషామణి రోబమాంబా
తిప్పాంబికాయా ద్విజసంపదేఽభూ
ద్విఖ్యాతిమా న్వీరనృసింహరాయః

నాగాంబికాయాం నరసావనీన్ద్రోః
కీర్త్యాకరోఽజాయత కృష్ణరాయః ౧

సాళువభార్యయైన యోబమాంబకుమారుఁడే అచ్యుతరాయలు. వీరనరసింహరాయకృష్ణరాయలకాలములో నీయోబమాంబ నరసనాయకుని భార్యయని చెప్పఁబడలేదు. అచ్యుతరాయలు రాజ్యాధిపతి కాఁగానే యీమె నరసనాయకుని రాణి యైనది. దీనినిబట్టి యీ యోబమాంబ భోగకాంతయేమో! అనిసంశయము కలుగుచున్నది. ప్రస్తుతమున నావిచారణతో సంబంధము లేదు. కాని యిట్లేనాగమాంబ కూడ భోగకాంత యగుటలంపవలయునేమో యనియొక వాదము బయలు దేరుట కవకాశమున్నది. అయినను, పైని జెప్పినట్లు వీరనరసింహరాయలశాసనములలోనే నాగాంబ నరసనాయకునిభార్యగా వర్ణితమైనది. కావున నాసంశయమునకుఁ దావు లేదు.

నరసనాయకునిభార్యలపుట్టినింట్లవా రెవరో, యెచ్చటివారో, తెలియఁదగినసాధారము లేమియు దొరకకపోవుటయే యీసంశయములు కలుగుటకుఁ గారణము.

## I (3) కృష్ణరాయలు కర్ణాటకుడా? ఆంధ్రుఁడా?

ఈప్రశ్నకు శ్రీ డాక్టరు వెంకటరమణయ్యగారు చక్కని సమాధానము వ్రాసియున్నారు. దాని నీక్రిందఁ బొందుపరచెదను. "ఈప్రశ్నకు సమాధానము చెప్పుట సులభకార్యము కాదు. ఒకదృష్టితో జూచిన కృష్ణరాయలాంధ్రుడును గాడు కర్ణాటకుడునుగాడు. తుళువ రాజవంశమునకు మూలపురుషుడును గృష్ణరాయలకు ముత్తాతయు నగు తిమ్మరాజు తుళుదేశస్థుఁడని వరాహపురాణమున స్పష్టముగఁజెప్పియున్నది. అతనివంశమునఁ బుట్టినవారందఱు తుళుజాతివారగుదురు. కాని యన్యజాతివారు కాఁజాలరు కాని మఱియొక దృష్టినిజూచిన వా రాంధ్రులగుదురు. గాని యన్యులుకారు. వారిఆదిమజన్మస్థానము తులుదేశమైనను మూలపురుషుఁడైన తిమ్మరాజుదినములందే జన్మదేశమును

౧ మనుచరిత్ర పీఠిక పుట 4

త్యజించి దక్షిణాంధ్రదేశమునకు వచ్చి చంద్రగిరియందు సాళువరాజుల నాశ్రయించి యచటనే స్థిరనివాసము లేర్పఱచుకొని నిలిచిపోయిరి నాఁడాదిగ తుళువవంశమువారి కాంధ్రదేశము మాతృదేశ మాయెను. ఆంధ్రరాజ కుటుంబములతో సంబంధ బాంధవ్యములను గల్గించుకొనిరి. బుక్కమ్మ తిప్పమ్మ నాగమ్మ ఓలమ్మ తిరుమలమ్మ చిన్నాదేవి మొదలగు తుళువరాణు లందరును నాంధ్రనారీమణులే. ఆద్యము నుండి తుళుభాషను వర్జించి తెనుగునే మాతృభాషగ స్వీకరించి తెలుగుకావ్యములను రచించి తెనుగుకవుల నాదరించి పోషించి యాంధ్రవాఙ్మయమును బెంపొందించిరి. నందిమల్లయ ఘంటసింగయల నీశ్వరనాయకుఁడు పోషించెను. నరసనాయకుఁడు వరాహపురాణమును వరలక్ష్మీకళ్యాణమును నరసింహవిజయములను కావ్యముల నందుకొనెను. ప్రోలుగంటిరంగసపిన తాతకుమారుఁడును ద్విపదనారసింహపురాణము వచనబాలభారతము సౌభరిచరిత్ర జక్కులకథ మొదలగు గ్రంథములను రచించిన యష్టభాషాకవివర్యుఁ డగుచెన్నకవిని వీరనరసింహరాయ లగ్రహారముల నిచ్చి సత్కరించెను. కృష్ణదేవరాయలు స్వయమాంధ్ర కావ్యనిర్మాత. అష్టదిగ్గజములను సంరక్షించి వారి నుత్తమకావ్యరచనకుఁ బురిగొల్పెను. ఆంధ్రభోజుఁడని కీర్తి వడసెను. అచ్యుతరాయలు ఆంధ్ర కవిజనకల్పభూజము. ప్రతివర్షము నొకయుత్తమాంధ్రకావ్యమును రచింపఁజేసి తనయిష్టదైవ మగు శ్రీవేంకటచలపతి కిప్పించెడివాఁడు. ఇట్లు ఆంధ్రదేశమును స్వదేశముగను నాంధ్రభాషను మాతృభాషగను స్వీకరించి యాంధ్రరాజకుటుంబములతో తరతరములుగ సంబంధబాంధవ్యములను గల్గించుకొని యాంధ్రస్త్రీలగర్భమున జనించి యాంధ్రులతోఁ గూడిమాడి జీవనము సల్పి, యాంధ్రమున గ్రంథరచన జేసి, యాంధ్ర కవులనాదరించిపోషించి యాంధ్రవాఙ్మయమును బెంపొందించినతుళువ రాజు లాంధ్రులుగాక యన్యులెట్లు కాగలరు? కావున కృష్ణరాయలాంధ్రుఁడనుట యొప్పును." ౧

కీ. శే. లక్ష్మణరావుపంతులుగారుకూడ నీవిషయమున నిట్లే చర్చించి, కృష్ణరాయఁ డాంధ్రుఁడని, మహమ్మదీయ మహాయుగమున నిరూపించియుండిరి. రాయలాంధ్రుఁడే కాని కర్ణాటకుఁడు కాఁడు.

---

౧ భారతి. సర్వధారి ఫాల్గుణము ౧౬౨ పుట.

## II. శ్రీకృష్ణరాయుల జననము

"కృష్ణరాయలు ౧౪౮౭లో జన్మించెనని యొకరును, ౧౪౭౧ లో జన్మించెనని యొకరును వ్రాసియున్నారు. కాని యీమహారాజు జన్మదిన మిదియేయని నిశ్చయముగాఁ జెప్పుట కాధారమేదియు లేదు" అని మహమ్మదీయ మహాయుగమున శ్రీలక్ష్మణరావుపంతులుగారు వ్రాసియుండిరి. ఆంధ్రకవులచరిత్రమున శ్రీవీరేశలింగముపంతులుగారును నట్లే వ్రాసిరి౧. రాయల జన్మదిన మీరెండు సంవత్సరములునుగాక మరి యొకసంవత్సరమైనను గావచ్చును. ఈరెండిటిలో నేదేని యొకటియై యుండునని నిశ్చయించునెడల నది ౧౪౭౧ అయియుండునని నిర్ణయించుటయే లెస్స. నంది మల్లయ ఘంటసింగయకవులు వరాహపురాణమును ౧౪౯౪—౧౫౦౦ ప్రాంతమున రచియించియుండిరని వారిచారిత్రమున వ్రాసియుంటిని. ఆకవులు తమగ్రంథమున సరసనాయకుని పెద్దకుమారుఁడును కృష్ణరాయల యగ్రజుఁడు నగువీరనరసింహరాయలను వర్ణించిన యీక్రిందిపద్యమును బట్టి యప్పటికితఁడు యుక్తవయసురాని వాఁడైనట్లూహింపఁ దగియున్నది.

"సీ. అష్టభాషాకవితాబ్జసంభవు లైన
            సుకవిపుంగవులు సంస్తుతులు సేయ
    సంకీర్ణరాజరంజకు లైనగాణల
            గములు గీతప్రబంధములు పాడ
    కలకంకణక్వాణకరసరోరుహ లైన
            రమణులు వింజామరములు వీవ
    వరబలాధికులైనకరణాగతారాతి
            సామంతు లుభయపార్శ్వములఁ గొలువఁ
    గూర్మితనయుండు వరసత్త్వ గుణనిధాన
    మంతికంబున సేవింప నలఁదికొనిన
    సురభికాశ్మీరగంధంబు సోడుముట్ట
    నుండెఁ బేరోలగము నయనోత్సవముగ.

౧ పుట 3 చూ.

ఆకవులు కృష్ణరాయని పేరును దమగ్రంథమున నుదాహరింప లేదు. ఈతఁ డప్పటికి జన్మింపకపోయియుండును. పుట్టినను నత్యల్ప వయసున నుండియుండును. కావున శ్రీకృష్ణరాయలజననము, క్రీ. శ. ౧౪౮౭ ప్రాంతమనియే నిశ్చయింతము. ఇతఁడు కర్ణాటరాజ్యసింహాసన మధిరోహించునాఁటి కించుమించుగ ౨౨ ౨౩ సంవత్సరముల వయ సుండును. రాయలు భోగకాంతాతనయుఁ డగుటచే వరాహపురాణమున నాతనిఁ బేర్కొన లేదనువాద మంగీకార్యముకాదు. కృష్ణరాయలజన్మనక్షత్రము జ్యేష్ఠయు, మాసము (వైకాసి) వైశాఖనును నైనట్లొకానొకశాసనమువలనఁ దెలియుచున్నది ౧

ఆంధ్రకవులచరిత్రమున శ్రీ వీరేశలింగము పంతులుగారు రాయలజననవిషయమున నిట్లువ్రాసియున్నారు. ఇతఁడు శాలివాహన శకము ౧౩౮౭వ సంవత్సరమున ననఁగా క్రీస్తుశకము ౧౪౬౫ వికృతి సంవత్సర పుష్యబహుళద్వాదశీశుక్రవారమునాఁడు పుట్టినట్టు తెలిపెడి యీక్రిందిపద్యమొకటి వాడుకలోనున్నది.

ఉ. అందలి శాలివాహనశకాబ్దము లద్రివసుత్రిసోములన్
వందితమైన యవ్వికృతివత్సరమందలి పుష్యమాసమం
దుం దగుకృష్ణపక్షమున నుండెడిద్వాదశిశుక్రవాసరం
బం దుదయించెఁ గృష్ణుఁడు శుభాన్వితుఁ డానరసింహమూర్తికిన్

ఇది యెంతవఱకు విశ్వసింపఁదగినదో బుద్ధిమంతులగువా రాలోచించు కొందురుగాక ! అయినను ఇది మొదటివారు చెప్పినకాలముతో సరి పోవుచున్నందున దీనినధికవిశ్వాసార్హముగా నెంచవచ్చును." సామాన్యముగా బుష్య బ౧౨ నాఁడు-జ్యేష్ఠనక్షత్రమే యగుచుండును. కాని పైపద్యములోఁ జెప్పినశాలివాహనశకసంఖ్య ౧౩౮౭మాత్రము వికృతి సంవత్సరము కాలేదు. పార్థివమైనది. వికృతిసంవత్సరము శా. శ. శతాబ్దము ౧౩౯౨ కావున నీపద్యమునుబట్టి రాయలజననకాలమును దృప్తికరముగా నిర్ణయింపఁజాలము. నెల్లూరుశాసనములో రాయలు

౧ నె.శా.సం. ౩ పుట ౧౩౧౮

జన్మించిననెల వైశాఖమని యుండగా నిందు పుష్యమని యున్నది. కావున నీపద్యము రాయలజననకాలమును సరిగ తెలుపునదికాదు. కృష్ణరాయలు తనవృద్ధాప్యమున క్రీ. శ. ౧౫౨౪ వ సంవత్సరములోఁ దన కుమారుఁడైన తిరుమలరాయలను సింహాసనమెక్కించెనని న్యూనిజు వ్రాసియుండుటచే దానినిబట్టి వృద్ధుఁడనఁట కథమ మేబదియేండ్లయిన నుండవలయునుగదాయని యోచించి కృష్ణరాయలజననము శతాబ్దము ౧౩౯౬ (క్రీ. శ. ౧౪౭౪) ప్రాంతమై యుండునని శ్రీఆచార్య' నేలటూరి వేంకటరమణయ్యగారూహించి వ్రాయుచు "కాని యిది కేవలము నిరాధారమైనయూహ" అనివ్రాసియున్నారు.

"౧౮౨౯ వ సంవత్సరములో కావలి వేంకటరామస్వామిగారు కలకత్తా నగరమునందుఁ బ్రచురించిన దక్షిణహిందూదేశకవులచరిత్రములో కృష్ణరాయలు తననలువదవయేట శా. శ. ౧౪౪౬ క్రీ. శ. ౧౫౨౪ వ సంవత్సరమునందు మృతినొందినట్లువ్రాసియున్నారు దీనిని బట్టి చూడఁగా నీరాయలవారు శాలివాహనశకము ౧౪౮౪ వ సంవత్సరమునఁ బుట్టినట్లేర్పడుచున్నది."

ఏదియెట్లున్నను, పైనివ్రాసినట్లు రాయలజననము వేఱువిధమగు సాక్ష్యము లభించువఱకు క్రీ.శ. ౧౪౮౭ ప్రాంతమనియే నిర్ణయింతము. కానియీసిద్ధాంతమును బూర్వపక్షము చేయు శాసనమొకటి గుంటూరుమండలమున తెనాలితాలూకా తెనాలిలోనున్నది. ఆశాసనము శా. శ. ౧౪౧౧ సౌమ్యసంవత్సర వైశాఖ శు౧౧ నాఁడు గోవర్ధనేశుని బ్రతిష్ఠించివ్రాయించినది. ఆశాసనములో విజయనగరప్రభువగు కృష్ణరాయలును మంత్రిసత్తముఁడగు సాళువతిమ్మరుసును ఆలయమునకు విచ్చేసి దానములను గావించినట్లు వ్రాయఁబడియున్నది ఇది సత్యమయ్యెనేని కృష్ణరాయలజననము క్రీ. శ. ౧౪౮౭ కానేరదు. రెండేండ్ల వయసున రాయలు తిమ్మరుసుతో గలిసివచ్చి ధర్మములను గావించుట యసంభవము. దీనిని సంభవమగునట్లు చేయుటకు రాయలజననమును క్రీ. శ. ౧౪౬౯కుఁ దీసికొనిపోవలయును. అట్లుచేయుటకు ముం దీశాస

౧ భారతి. విరోధి చైత్రము ౫౭౫ పుట

నమూనా జాగ్రత్తగాఁ బరీక్షింపవలసియున్నది. దీని పూర్తి పాఠము నాకు లభింపలేదు. గోవర్ధనేశప్రతిష్ఠ శా.శ. ౧౪౧౧లో జరిగినదనియు నాకాలము నుదాహరించుచు శాసనమును మఱికొంతకాలము పోయిన పిమ్మటఁ గృష్ణరాయలరాజ్యకాలములో వారు ధర్మముల నిచ్చినప్పుడు వ్రాయఁబడియెనేమో యనియు నాయనుమానము. సంపూర్ణపాఠము లభించినపిమ్మట విమర్శించి యీవిషయమునుగూర్చి మఱియొకమారు వ్రాసెదను.

శా.శ. ౧౪౧౧వ సంవత్సరమునాఁటికి, శ్రీకృష్ణరాయలు సింహాసన మెక్కలేదు. తిమ్మరుసు రాయలకడ మంత్రిగాలేఁడు. ఆనాఁటికి (క్రీ.శ.౧౪౮౯) నరసనాయకుఁడే జీవించియున్నాఁడు. కృష్ణరాయలానాఁడు తెనాలికేఁగి దానమిచ్చుట యసంభవము. శాసనమందలికాలము గోవర్ధనేశప్రతిష్ఠాకాలమై యుండవలయును. లేదా శాసనము కల్పితమై యుండవలయును. ఈశాసనమునుబట్టి రాయలజననకాలమును క్రీ శ ౧౪౬౯నాఁటికిఁ దీసికొనిపో నక్కఱయుండదు. ఈశాసనము పైసిద్ధాంతమును బూర్వపక్షము సేయఁజాలదు.

క్రీ.శ, ౧౪౮౭వ సంవత్సరమున రాయలుజన్మించుటనిశ్చయమేని, యాతనిజననదినము కీలకసంవత్సరవైశాఖ బహుళవిదియ యగును.

## II (3) శ్రీకృష్ణరాయల రాజ్యస్వీకారకాలనిర్ణయము

రాయలు, విజయనగర రాజ్యసింహాసనమును గైకొనుటను గూర్చి కొన్నికథలుప్రచారములో నున్నవి. వానిసారాంశము, తండ్రియైననరసనాయకుఁడు జీవించియుండఁగనే పెద్దకుమారుఁ డైనవీరనరసింహరాయలకు రాజ్యమీయక కృష్ణరాయలను రాజ్యాభిషిక్తుని జేసెనఁట. నరసనాయకుఁ డవసానకాలమునఁ గుమారులను బిలిచి, తన వ్రేలినున్న యంగుళీయకమును దీసికొనుఁడని యాజ్ఞాపించెనఁట! దేహము నీరుపట్టియుండుటచే వాచియున్నయాతనివ్రేలినుండి యుంగరమును దీయుట యెట్లని పెద్దకుమారుఁ డాలోచించుచుండఁ గృష్ణరా

యులు వాడిగలకృపాణముచే నాతని వ్రేలును ఖండించి యుంగరమును దీసికొనెనఁట! ఆతనిసాహసమునకు మెచ్చి నరసనాయకుఁడు కృష్ణదేవరాయలే రాజ్యార్హుఁడని నిర్ణయించెనఁట! ఇట్టివే యింకఁ గొన్నికథ లున్నవి. వీనియందుసత్యములేదు. నరసనాయకునకుఁ దరువాత వీరనరసింహరాయలే రాజ్యాధికారము వహించెననియు నంతఁ గొంతకాలము సాళువనరసింహరాయలతనయుఁడగు నిమ్మడినరసింగరాయలు పేరునకు రాజుగా నుండెననియు నాతనియనంతరమున వీరనరసింహరాయలు స్వతంత్రుఁడై విజయనగరసింహాసన మధిరోహించె ననియు నందిమల్లయ ఘంటసింగయకవులచారిత్రమున వ్రాసియున్నాఁడను. (ఆంధ్రకవితరంగిణి ఆఱవసంపుటము 119వపుట.) సంగమ, సాళువవంశీయులకుఁబిమ్మట, విజయనగరసింహాసన మధిష్ఠించినతుళువవంశీయులలో నీతఁడే మొదటివాఁడు. ఇతఁడు క్రీ.శ. ౧౫౧౦ వఱకు రాజ్యము చేసెను. ఈకాలమున నీతనిశాసనము లనేకములున్నవి. ఈతనియనంతరముననే కృష్ణరాయలు రాజ్యభారమును గైకొనినట్లు పారిజాతాపహరణ, మనుచరిత్రలయందలి యీక్రిందిపద్యములు స్పష్టముగా సాక్ష్య మొసంగుచున్నవి.

క. వారలలోఁ దిప్పాంబకు
మారుఁడు పరిపంథికంధిమంధాచల మై
వీరనరసింహరాయఁడు
వారాశిపరీతభూమివలయం బేలెన్.

శా. వీరశ్రీనరసింహశౌరిపిదప న్విశ్వక్షమామండలీ
ధౌరంధర్యమునన్ జనంబు ముదమంద న్నాగమాంబాసుతుం
డారూఢోన్నతిఁ గృష్ణరాయఁడు విభుండై రాజ్యసింహాసనం
బారోహించె విరోధులున్గహనశైలారోహముం జేయఁగన్.

పారిజాతాపహరణకృత్యాది.

క. వీరనృసింహుఁడు నిజభుజ
దారుణకరవాలపరుషధారాహతవీ
రారి యగుచు నేకాతప
వారణముగ నేలె ధర నవారణమహిమన్.

క. ఆ విభుననంతరంబ ధ
రావలయముఁ దాల్చెఁ గృష్ణరాయఁడు చిన్నా
దేవియు శుభమతి తిరుమల
దేవియునుం దనకుఁ గూర్చు దేవేరులుగాన్,

మనుచరిత్రకృత్యాది.

వీనినిబట్టి పైఁ జెప్పినకథలయందు సత్యములేదని స్పష్టమగుచున్నది. పెద్దనార్యతిమ్మనాచార్యులు, వాస్తవమును మఱుగుపుచ్చి తమగ్రంథములయందుఁ బైరీతిగ వ్రాసినారని యెవరైన ననవచ్చును. కాని వీరనరసింహరాయలశాసనము లిందులకుఁబ్రతికూలముగ సాక్ష్యమిచ్చుచున్నవి. ఆశాసనములను ద్రోసివేయఁజాలము కదా!

చనిపోవునాఁటికి వీరనరసింహరాయల కెనిమిదేండ్లవయసు కలతిమ్మరాజను తనయుఁ డుండెడివాఁడనియుఁ దనయనంతరమున నాబాలునకు సంక్రమింపకుండ బలవంతుఁడైన శ్రీకృష్ణరాయలు రాజ్యము నపహరించుననితలంచి తనమంత్రియైన తిమ్మరుసును బిలిపించి కృష్ణరాయలకండ్లు తీయించి తనకుఁ జూపింపుమనియాజ్ఞాపించెననియు నట్లే యని తిమ్మరుసు మేకకండ్లనుదీయించి రాజునకుఁ జూపించి కృష్ణరాయలను గాపాడెననియు నొకకథ ప్రచారములో నున్నది. వీరనరసింహరాయలయనంతరమున నాతనికుమారుఁడైనతిమ్మరాజును జెఱయందుంచి కృష్ణరాయలు రాజయ్యె ననుదురు. ఈకథ సత్యమనుటకు గ్రంథస్థనిదర్శనములు లేవు. వీరనరసింహరాయలకుఁ జనిపోవునాఁటికి దాదాపుగ ముప్పది యైదేండ్లు వయసుండవచ్చును. అప్పటి కెనిమిదేండ్ల కుమారుఁడుండిన నుండవచ్చును. కాని యాతనిని కృష్ణరాయలు చెఱయందుంచెనని తలంచుట కాధారములు లేవు. ప్రబలమైన యాధారము లభించినఁగాని రాయలపై నిందమోపరాదు. తిమ్మరాజును గూర్చి శాసనములలోఁగాని వాఙ్మయములలోఁగాని యేమియుఁ గన్పడదు.

వీరనరసింహరాయల జీవితకాలములోనే కృష్ణరాయలశాసనము లొకటిరెండు కన్పించుచుండుటచే నాతనిచే ననుజ్ఞాతుఁడై కృష్ణ

రాయలు రాజకార్యనిర్వహణమునం దాతనికిం దోడుపడియున్నట్లును, వీరనరసింహరాయలు కృష్ణరాయలతో మైత్రిగా నుండియే చనిపోయె ననియుం దోంచుచున్నది. ఒకప్రక్క-తురుష్కులును నొకవంక గజపతియుం గర్ణాటకరాజ్యమును మ్రింగివేయయత్నించుచున్న యాతరుణమునం, దనసామంతు లగు నుమ్మత్తూరు, శివసముద్రాది దుర్గాధిపతులే తనసామ్రాజ్యమునంగీకరింపక తిరుగుబాటొనర్చుచున్న యాసమయమునం దనయొనిమిదేండ్లపుత్త్రుఁడు రాజ్యభారమునువహించినను నిలుపుకొనంజాలఁడనియు, నప్పటిపరిస్థితులనుబట్టి కృష్ణరాయలవంటి ప్రతాపశాలియే రాజ్యాధికారమును వహించుట యుత్తమకార్యమనియుం,గర్ణాటకరాజ్యగౌరవము నాతనివలనస్థిరము కాఁగలదనియు నాతనివలననే తనకుమారునకు క్షేమమును గౌరవమును గలుగుననియుం దలంచి వీరనరసింహరాయలు తనచరమకాలమునం గృష్ణరాయలతో మైత్రి కలిగియుండెనని తలంచుటలో విరుద్ధ మేమియును లేదు.

కృష్ణరాయలకు వీరనరసింహరాయలే రాజ్యమొసంగినట్లు కృష్ణరాయవిజయము నందీక్రిందిపద్యములోనున్నది.

ఉ. వీరనరసింహరాయమణి వేడుకతోడుతఁ గృష్ణరాయలం
గోరికమీఱ రాజ్యమునకుం దొరఁ జేసిననాఁటనుండియున్
వీరుఁ డతండు శాత్రవులవెంటఁబడంగఁ దలంచు టెంతయున్.
గౌరవమొప్ప నచ్చటిమ ఖానులువ్రాయఁదొణంగి రెంతయుక్. ౧

ఈకృష్ణరాయవిజయము రాయలకుఁ బిమ్మట ౧౦౦ సంవత్సరములలో రచితమైనది. వీరనరసింహరాయలు తనయవసానసమయమునం గృష్ణరాయలను శత్రువుగా నెంచెననుటకు వీలులేదు.

## కృష్ణరాయల పట్టాభిషేకమహోత్సవకాలనిర్ణయము

శ్రీకృష్ణదేవరాయలపట్టాభిషేక మెప్పుడు జరిగె ననువిషయమున నించుక భిన్నాభిప్రాయ మున్నది. శ్రీకొమఱ్ఱాజులక్ష్మణరావు పంతులుగారు మహమ్మదీయమహాయుగములో "శా. శ. ౧౪౩౦ సరి

౧ ఆ. ౫ ప. ౧౧౩

రైన శుక్లనామసంవత్సర మాఘశుద్ధచతుర్దశి యగు ౨౮వ ఫిబ్రవరి ౧౫౦౯వ దినమునఁ గృష్ణరాయఁడు పట్టాభిషిక్తుఁడైనట్లు హంపీలోని పంపావతీ దేవాలయములోనున్న యొక శాసనమువలనఁ దెలియుచున్నది. (ఎ. ఇం. ౧సం. ౩౬౬పుట) కావున నీదిన మాంధ్రకర్ణాటకుల కందఱికిని శుభదినఁబని యెన్నవలసియున్నది.” అనివ్రాసినారు౧. ఇందలిశక సంవత్సరము పొరపాటు. శుక్లసంవత్సర చైత్రశుక్లపాడ్యమి నాఁటికి శాలివాహనశకాబ్దములు ౧౪౩౧ గతించినవి. శుక్లసంవత్సరమున వర్తమానశకాబ్దము ౧౪౩౨. పైనిఁజెప్పిన మాఘశుద్ధచతుర్దశి క్రీ. శ. ౧౫౧౦ సంవత్సరము జనవరినెల ౨౮వ తేదీ యైనది. కాని శ్రీ లక్ష్మణ రావుపంతులుగారనినట్లు ౨౮వ ఫిబ్రవరి ౧౫౦౯ కాదు.

సుప్రసిద్ధపరిశోధకు లగు ఆచార్య శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారు పట్టాభిషేకకాలము శుక్లసం॥ శ్రావణబహుళాష్టమి శ్రీకృష్ణ జయంతి (క్రీ. శ. ౧౫౦౯ ఆగష్టు ౮) అని నిర్ణయించియున్నారు౨. వీర వెంకటపతిరాయల వారియాజ్ఞానుసారముగా శా. శ ౧౫౨౬వ సంవత్సరమున (పార్థివ) వారియుద్యోగస్థులు వ్రాసియుంచిన “విజయనగరసామ్రాజ్యము” అనుగ్రంథమున రాయలపట్టాభిషేకకాలము శుక్లసంవత్సర శ్రీకృష్ణజయంతిదినమని వ్రాసియుండిరి. శ్రీ వెంకటరమణయ్యగారినిర్ణయ మావ్రాఁతపై నాధారపడియున్నది.

“కొంగదేశరాజకాల్” అను అరవవచనచరిత్రగ్రంథములో “ఇతఁడు విజయనగరములో నవరత్నసింహాసనాధిరోహణము, శా. శ. ౧౪౨౬ అగు నేఁటి రక్తాక్షిసంవత్సర చైత్రమాసములోఁ బట్టాభిషేకము అయినపిమ్మట చేసెను.” అనివ్రాసియున్నది.” అని శ్రీగురజాడ శ్రీ రామమూర్తి పంతులుగారు కవిజీవితములలో వ్రాసియున్నారు, ౩. కాని యీకాల మనేకశాసనములకు విరుద్ధముగా నున్నది. కావునదీనిని గూర్చిచర్చ చేయు టయనవసరము. ఈకాలము వీరనరసింహరాయల

౧ పుట ౩౬౩

౨ భారతి-విరోధి చైత్రము ౨౯౦పుట.

౩ కవిజీవితములు ౪౯౧పుట.

పట్టాభిషేకకాల మయినఁ గావచ్చును ఇఁక నీపట్టాభిషేకము శుక్లసంవత్సరమున శ్రీకృష్ణజయంతినాఁడు జరిగెనా? మాఘ శు ౧౪ నాఁడు జరిగెనా? యను విషయమును దేల్చవలసియున్నది.

శుక్లసంవత్సర వైశాఖ శు౧౫ శుక్రవారమునాఁడు (క్రీ. శ. ౧౫౦౯ మేనెల తేదీ) వీరనరసింహరాయలు రాజ్యము చేయుచున్నట్లు సాళువతిమ్మరసుమంత్రి వ్రాయించిన యీక్రిందిశాసనము వలనఁ దెలియుచున్నది.

"స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహనశకవరుషంబులు ౧౪౩౧ బూన్తె అగు నేంటిశుక్లసంవత్సరవయిశాఖ శు౧౫శుక్రవారానను శ్రీమన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీవీరనరసింహ్వరాయ మహారాయల విజయనగరమందు పృథివీరాజ్యం శేస్తున్నండగాను తత్పాదపద్మారాధకులైన శ్రీమన్మహాప్రధాన సాళువతింమయ్యంగారు గుత్తిరాజ్యంలోను పెన్నబడితాడివరతిరామేశ్వరదేవరకు దండం వెటి సమర్పించిన గ్రామభూదానక్రమ మెట్లన్నను శ్రీమన్మహారాజాధిరాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీవీరనరసింహరాయమహారాయలు పాలించి మాకు నాయంకరమై చెల్లేటిగుత్తిరాజ్యంలోని పెన్నబడిస్థళంలోను నెలదలపాడు అనేటిగ్రామాను వీరనరసింహపురమనే ప్రతినామం వెటి ఆవీరనరసింహరాయమహారాయలకు బుణ్యంగాను ఆదేవునికి నేము భోగమంటపమునను కటించి గోపురప్రాకారాదినిర్మాణము సేవింపుచున్న......౧"

దక్షిణారాకాడు మండలమందలి విక్రవాండి యనుగ్రామమున నరవభావలోనున్న యొకశాసనములో శా. శ. ౧౪౩౧ శుక్లసంవత్సర కర్కటకశుద్ధ ౫శుక్రవారము హస్తానక్షత్రము (క్రీ. శ ౧౫౦౯ జూలై ౨౨వ తేదీ)నాఁడు వీరనరసింహరాయలు విజయనగరమునఁ బృథివీరాజ్య మేలుచున్నట్లు వ్రాసియున్నది... ...౨.

శ్రీకృష్ణదేవరాయలనామ ముదాహృతమైన శాసనములు వందలకొలఁదిగ నున్నవి. వానిలో లభించినంతవఱకు మొట్టమొదటిశాస

౧ ద. హిం శా. సం. ౪ సంఖ్య ౭౦౨

౨ A.R. 289 of 1916

నము బళ్లారిమండలమున ఆలూరుతాలూకా గుల్యయనుగ్రామమున నున్నది౧. గండికోటసీమయందలి యేటూరుప్రభువును, యజుశ్శాఖీయుఁడును, కౌండిన్యగోత్రుఁడు నగునరసరాజనునాతఁడు కట్టించిన యాలయమునకు విరూపసముద్రమందలిమామిడితోఁటలో నున్నభూముల నొసంగి వ్రాయించిన యాశాసనము శా.శ.౧౪౩౦ (?) శుక్లసంవత్సర శ్రావణశు౧౦ గురువారము నాఁడు పుట్టినది (క్రీ.శ.౧౫౦౯ జూలై ౨౬వ తేదీ) ఈమూఁడుశాసనముల నాధారముగాఁగొని శుక్లసంవత్సర శ్రావణశు॥-౧౦ నడుమనఁగా క్రీ.శ. ౧౫౦౯ జూలై ౨౨-౨౬ తేదీలనడుమ, వీరనరసింహరాయలు చనిపోవుటయుఁ గృష్ణరాయలు రాజ్యాధికారమును వహించుట జరిగినదనియు, విజయనగర సామ్రాజ్యమునఁ జెప్పినట్లు శుక్లసంవత్సర శ్రీకృష్ణజయంతినాఁడే పట్టాభిషేకము జరిగినదని యెంచవలయుననియు, శ్రీ వెంకటరమణయ్యగారభిప్రాయపడిరి. రాజ్యాధికారమును వహించినపిమ్మట నారు మాసములు పట్టాభిషేకము నాపినారనుటకంటె పదునైదుదినములాపి రనుటయే సమంజసమని వారియభిప్రాయము.

పైని జెప్పినవిక్రవాండిశాసనము వీరనరసింహరాయలనామముదాహృతమైన శాసనములలోఁ దుదిశాసనము కాదు. శుక్లసంవత్సర పుష్యబ౨ నాఁటి యొకశాసనములో౨ వీరనరసింహరాయల పేరున్నది. దక్షిణకన్నడజిల్లా కుందపురముతాలూకా బసరూరు గ్రామమున వేఱొకశాసనమున్నది౩. ఈశాసనము శుక్లసంవత్సర మాఘశు॥నాఁడు మహాలింగేశ్వరస్వామి కొక గ్రామమునిచ్చి, బారకూరు రాజ్యపరిపాలనమునకు రాజుచేనియమితుఁడైన పోవణయకునితమ్ముఁడగు మల్లప్పనాయకునిచే వ్రాయింపఁబడినదనుటచే నిదియసత్యమని యనలేము. ఇందు వీరనరసింహరాయలు జీవించియున్నట్లుస్పష్టముగాఁ జెప్పియుండుటచేనింతవఱకును నాతఁడు బ్రతికియున్నట్లు నిశ్చయింపవలసియున్నది. వీరనరసింహ

౧ A.R. 703 of 1899

౨ A. R. 27 of 28 ద. హిం. శా. సం ౯ సంఖ్య ౪౭౨ అనంతపురంజిల్లా బెలగుప్పగ్రామమునను్నది.

౩ A. R. 410 of 1928 ద. హిం. శా. సం. ౯ సంఖ్య ౪౭౯.

రాయలు మాఘమాసముల క్రితము చనిపోయియున్నచో, మఱియు శ్రీకృష్ణరాయలు మాఘమాసములక్రిందటనే పట్టాభిషిక్తుఁడైయున్నచో సుప్రసిద్ధమైన బారకూరురాజ్యపరిపాలకుని సోదరుఁడు తన శాసనమున నిట్లు వ్రాసియుండఁడు. ఆశాసనములోని ముఖ్యభాగము నీక్రిందనిచ్చుచున్నాఁడను.

"స్వస్తిశ్రీజయాభ్యుదయ శాలివాహనశకవర్ష ౧౪౩౨ సందు మూఱసయ వర్తమానద శుక్లసంవత్సర మాఘశుద్ధ౫లూ శ్రీమన్మహారాజాధిరాజ పరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీవీరభుజబలనరసింగమహారాయరు విజయనగరియసింహాసనదలూ సుఖసంకథావినోదదింద సకల సాంబ్రాజ్యవను ప్రతిపాలిసువ కాలదలూ అవర నిరూపదింద కుఱంగోడ సోవణనాయకర తంమ మల్లపనాయకరూ బారకూర రాజ్యవను ఆళువలి బసఱూర వడువకైవర్య శ్రీమహాదేవరిగ ధర్మక్కె అమృతపడి నందాదీపిక అంగరంగవఝుభోగఃడవహాగి మల్లపవొడెయరూ... ..."

ఈశాసనమునకుఁ బిమ్మట వీరనరసింహరాయలశాసనములు లభింపలేదు. కావున నీకాలమునకుఁ దరువాతఁ గొలఁది దినములలో వీరనరసింహరాయలు చనిపోయెనని యెంచవలసియున్నది. పైనినుదాహరించిన గుల్యగ్రామశాసనములలోను మరికొన్నిశాసనములలోను[1] కృష్ణదేవరాయలనామము శుక్లసంవత్సర మాఘమాసమునకుఁ బూర్వమే యుదాహృతమై యున్నదికదా! అది యెట్లువచ్చినదని ప్రశ్నింపవచ్చును. వీరనరసింహరాయల చరమదశలోఁ గృష్ణరాయలు కొంతవఱకుఁ బ్రభుత్వాధికారమును వహించియుండవచ్చును. ఆకాలములోఁ గొన్నిశాసనములలో శ్రీకృష్ణదేవరాయలు విజయనగరసింహాసనమున రత్నసింహాసనస్థుఁడై పృథివీరాజ్యము చేయుచుండగాను" అని వ్రాసియుండవచ్చును. వీరనరసింహరాయలుచనిపోయినపిమ్మట నాతఁడు జీవించియున్న ట్లాతనియుద్యోగస్థుఁడే శాసనము వ్రాయించినాఁడని తలంచుటకంటె నాతనిజీవితకాలములోఁ గృష్ణరాయలపేరుతో శాసనములు వ్రాయఁబడినవని తలంచుటయే సమంజసమని నాయభిప్రాయము. వీరనరసింహరాయలు శుక్లసంవత్సరమాఘశుద్ధపంచమి వఱకు

[1] A. R. 491 of 1906; 14 of 1922

జీవించియుండెననుపక్షములో మాఘశుద్ధచతుర్థశినాఁడు పట్టాభిషేకో త్సవము జరిగెనని నిర్ణయించుటయే సమంజసము. వీరనరసింహరా యలు శుక్లసం॥ శ్రావణమాసములోనే చనిపోయెనని వాదముకొఱకంగీ కరించి పట్టాభిషేకోత్సవము మాఘశు ౧౪ నాఁడుజరిగెనా? శ్రావణ బ ౮ నాఁడుజరిగెనా? యను విషయము నాలోచింతము.

ఈసందర్భమున విజయనగర సామ్రాజ్యమున కెక్కువ విలువ నీయవలయునా? శిలాశాసనమున కెక్కువ విలువనీయవలయునా? యనువిషయమే తేల్చవలసినసమస్యమైయున్నది. విజయనగరసామ్రా జ్యమనుగ్రంథము పట్టాభిషేకకాలమునకు దాదాపు నూరుసంవత్సర ములకుఁ బిమ్మటవ్రాయఁబడినది, శిలాశాసనమన్ననో పట్టాభిషేక మైన శుక్లసంవత్సరములోనే వ్రాయఁబడినది. అందుచే విజయనగరసా మ్రాజ్యముకంటె నీసందర్భమున శిలాశాసనమునకే యెక్కువప్రాము ఖ్యతనీయవలసియుండునని నాయభిప్రాయము.

పట్టాభిషేకోత్సవము శ్రీకృష్ణజయంతినాఁడే జరిగినదనియు, ఆనాఁడే విరూపాక్ష దేవునకు శాసనమునఁ జెప్పఁబడినదానము లీయఁ బడినవనియు శాసనరచనము మాత్రముమాఘశు౧౪నాఁడుజరిగెననియు నొకవాదము రావచ్చును. కాని యాశాసనము చదివిచూచినప్పుడా వాదమునందు బలములేదని తోఁచును. ఆశాసనము కన్నడభాషలో నున్నది. అందలిముఖ్యభాగము నీక్రింద నిచ్చెదను. (ద. హిం. శా. సం ౪ సంఖ్య ౨౪౯)

"...స్వస్తి శ్రీవిజయాభ్యుదయ శాలివాహనశకవర్ష ౧౪౩౦ సందు మేలే నడువ శుక్లసంవత్సరదమాఘ శు౧౪లు శ్రీమన్మహారా జాధిరాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీవీరకృష్ణరాయమహారాయలు పట్టాభిషేకోత్సవకాలదలూ శ్రీవిరూపాక్షదేవర అమృతపడిగె వేద్యకె సింగినాయకన హళ్ళియనూ సమర్పిసి దేవరసంముఖద మహారంగ మంటపవను ఆముందణ గోపురవను కటిసి ఆముందణ హిరిగోపురవను జీర్ణోద్ధారణ మాడిసి శ్రీవిరూపాక్షదేవరిగె నవరత్నఖచితవాద సువర్ణ కలశవన్నూ నాగాభరణమున్ను సమర్పిసిదరు... ..."

శ్రీకృష్ణరాయలు వీరనరసింహరాయుల జీవితకాలములోనే రా జ్యాధికారమును నిర్వహింపనారంభించినపిమ్మట రంగమంటపమును గోపురమును కట్టించుటయు శిథిలమయినమఱియొకగోపురమును బాగుచేయించుటయు నాగాభరణాదులు చేయించుటయు నాలుమాసములలో పునఁ బూర్తి చేసి యింతలో వీరనరసింహరాయలు చనిపోఁగా బట్టాభిషేకోత్సవమును జరుపుకొని యానాఁడే యవి స్వామికి సమర్పించియాశాసనము వ్రాయించెననితలంచుటయే సమంజసము. వీరనరసింహరాయలు శ్రావణమాసములోనే చనిపోయెననుపక్షములోఁగూడ దనపట్టాభిషేకమునకుఁ బూర్వము స్వామికి రంగమంటపాదులు నిర్మించె నని తలంపవచ్చును. సింహాసన మధిష్ఠించినపిమ్మట బట్టాభిషేకమున కాఱు మాసములు గాలయాపన చేసెననితలంచుట భావ్యము కాదందుము. కాని యాయుత్సవము నతివైభవముగా జరుపఁదలంచి వర్షాకాలమును శూన్యమాసమును దాటించి మాఘమాసమున జరిపె ననుటలో విరుద్ధమేమియు లేదు. ఇంతకాల మాఁగినందువలన రాజకార్యములకు భంగము కలుగుటలేదు. శత్రురాజులబాధలేదు. నిష్కంటకముగాఁ బరిపాలనము నిర్వహింపఁబడుచుండెను. పట్టాభిషేకోత్సవ మెప్పుడైన నేమి?

శుక్లసంవత్సర మాఘశు ౫ నాఁడు వీరనరసింహరాయలు చనిపోయినచోఁ దొమ్మిదిరోజులలోఁ గృష్ణరాయలపట్టాభిషేకము జరుగుట యసంభవమనియు నప్పటికి శుచిదినములు గడువవనియు నొకయాక్షేపణము రావచ్చును. అట్టియాక్షేపణ శ్రావణపక్షమునకును గలదు. ప్రభువుల విషయములో నాకాలమున నిట్టి నిర్బంధములుండెనో లేదో చెప్పలేము. కావున నిది యొకయాక్షేపణము కాఁజాలదు.

పట్టాభిషేకమైనపిమ్మటఁగాని శాసనములలో "రత్నసింహాసనస్థుఁడై" అనివ్రాయుట తటస్థింపదనియు, మాఘశు ౧౪కిపూర్వమే కృష్ణరాయల పేరున్న శాసనములలో నట్లు వ్రాసియున్నది. కావున శ్రావణ బ౮ నాఁడే పట్టాభిషేకోత్సవము జరిగెనని నిర్ణయింపవలయు ననియు నొకపూర్వపక్షము రావచ్చును. ఈపూర్వపక్షము శ్రావణపక్షమున

కును నన్వయించును. శ్రావణశు॥౧౦నాఁడు వ్రాయించినగుల్య శాసనముసఁగూడ నట్లేకలదు.

కావున నేవిధముసఁజూచినను శిలాశాసనమునకే యెక్కువ విలువనిచ్చి శుక్లసంవత్సర మాఘశు॥౧౪యే పట్టాభిషేకోత్సవముజరిగిన దినమని నిర్ణయింతము.

వీరనరసింహరాయలు శుక్లసం॥ మాఘమాసమువఱకు జీవించి యుండెననుట కాతఁడు కంచికంకరాచార్యపీఠస్థుఁడగు సదాశివసరస్వతిశిష్యుఁడైన మహాదేవసరస్వతికి తుంగభద్రానదీతీరమున శ్రీవిరూపాక్షస్వామిసన్నిధిని చెంగల్పట్టుమండలములోని "కుడియాంతండై" యనుగ్రామమును దానమిచ్చి వ్రాయించిన తామ్రశాసనమొకటి యాధారముగాఁ గలదు. (ఎపి.ఇం.సం.౧౪పుట౨౩౧)

ఎట్లుచూచినను పట్టాభిషేకము శుక్లసంవత్సర మాఘ శు॥౧౪ యనుటయే సమంజసముగాఁ గన్పట్టుచున్నది. వీరనరసింహరాయల యనుమతిపై శ్రీకృష్ణజయంతినాఁడు కృష్ణరాయలు రాజ్యాధికారమును స్వీకరించెనని తలంపవచ్చును.

పట్టాభిషేకసమయమున నాసభామందిరమున నున్నముఖ్యులగు సరదారుఁ నామములను గృష్ణరాయవిజయమునఁ గుమారధూర్జటి యీక్రిందిపద్యములోఁ బేర్కొనియున్నాఁడు.

సీ. చక్కరవిలుకాని చక్కఁదనముఁగల్గి
  చౌకమా నార్వీటి బుక్కరాజు
సాకల్యముగఁ గీర్తి సర్వదిక్తటులందు
  బ్రకటసితి మించు నౌకువారు
కంటక రాజన్య గర్వంబులడగించి
  లీలచే మించు నంద్యాలవారు
ఘాటీనిరాఘాట ఘోటీహతవిరోధి
  కోటులై వెలయు వెల్గోటివారు
గీ. చండతరశౌర్యు లగుపెమ్మసానివారు
బూదహాళివారు మొదలైనభూమిపతులు

గొలువఁ బట్టాభిషిక్తుఁడై చెలువు మీఱ
రమ్యగుణపాళి శ్రీకృష్ణరాయమౌళి.

ఈపద్యములో బుక్కరాజును దక్కతక్కినవారి వంశనామము లనేగాని, పేరులను జెప్పలేదు. మొదటి మూఁడుపాదములలోను జెప్ప బడినవారు చంద్రవంశ పుత్రక్షత్రియులు. వెల్గోటివారు, వెలమవారు. పెమ్మసాని వారు కమ్మవారు, బూదహాళివా రేకులమువారో నాకుఁ దెలియలేదు. బళ్ళారిమండలమున బూదహాళియను గ్రామమున్నది

ఆరవీటిబుక్కరాజునకుఁ బ్రపౌత్రుఁడైన రామరాజునకు శ్రీకృష్ణదేవరాయలు తనకుమార్తెనిచ్చి పరిణయ మొనర్చియుండెను. పట్టాభిషేక కాలమునాఁటికి శ్రీకృష్ణదేవరాయలకు ౨౩ సంవత్సరములప్రాయముండెను. అరవీటిరామరాయలజననము. క్రీ.శ. ౧౪౭౦ ప్రాంతము. ఆపత్కములో నార్వీటిబుక్కరాజుజననము క్రీ.శ. ౧౪౧౦ప్రాంత మగు చున్నది. కృష్ణరాయలపట్టాభిషేక కాలమునాఁటికి ఒకటిరెండు సంవత్సరములు హెచ్చుతగ్గుగా నూఱేండ్లగును. కావున పట్టాభిషేకసమయమున బుక్కరాజుండుట యసంభవము. అతని పుత్రుఁడో పౌత్రుఁడో యుండియుండును. లేదా పురుషాంతరవ్యవధి ౨౫ సంవత్సరములుగా భావించి గణనము చేసి, బుక్కరాజుజననకాలము ౧౪౨౫గానిర్ణయించి యెనుబదిదేండ్లవయసున నాతఁడు పట్టాభిషేకసభలో నుండెనని చెప్పవలసివచ్చును. ఇది యస్వాభావికముగాఁ గాన్పించుచున్నది. కావున నిదియంగీకార్యముగాదు.

## V కృష్ణదేవరాయల భార్యలు

రాయలకు భార్యలెందఱు? వారేవంశమువారు? ఆవివాహము లెప్పుడు జరిగినవి? అనుప్రశ్నలకుఁ దృప్తికరము లగుసమాధానములు లభింపలేదు. ఈవిషయమునఁ బండితులలో భిన్నాభిప్రాయము లున్నవి.

రాయలభార్యలవిషయమునఁ గొన్నికథలు, ప్రచారములో నున్నవి. వానినిబట్టియునువిదేశీయులవ్రాఁతల నాలోచించియు, గ్రంథములను శాసనములను బరిశీలించియు, వానికి మనయూహలను గొన్ని

టిని జేర్చి పైప్రశ్నలకు సమాధానములను సమకూర్పవలసియున్నది. అందు ముందుగ రాయలభార్యలవిషయమునఁ జెప్పఁబడెడి గాథలను గూర్చి యాలోచింతము.

## V (1) రాయలభార్యలనుగూర్చినకథలు

### వరదరాజమ్మ లేక తుక్కాదేవి లేక రుచీదేవి.

(శ్రీ)గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారు తమకవిజీవితముల యం దొకకథను ౧౦పుటలలో వ్రాసియున్నారు దానిని సంగ్రహముగ నిట వ్రాసెదను.౧

ఇదియే రాయలప్రథమవివాహమఁట. ఈమె గజపతికుమార్తె యఁట. రాయలు తాను కులీనుఁడు గాకపోవుటచేఁ దనకెవ్వరును బిల్లనీయనిరాకరించుచున్నారని తిమ్మరుసుతోఁ జెప్పఁగా నాతఁడు సత్కులీనయగు కన్యం దెచ్చి పెండ్లిచేసెదనని చెప్పి తమచే జయింపఁ బడిన వినుకొండకు వచ్చి గజపతితో మాటలాడి యొప్పించి యాతని కుమార్తెను బరిణయముచేయుటకు నిర్ణయించి రాయలకుఁ దెల్పఁగా నాతఁడు దాను కన్యను జూచినఁగాని పెండ్లిచేసికొననని ప్రత్యుత్తర మిచ్చెనఁట అప్పుడు తిమ్మరుసు రాయలకుఁ దమలపాకులందిచ్చువాని వేషమమర్చి యాతనిని దనతోఁగూడఁ దీసికొనిఁబోయి కాఁబోవు కర్ణాటకపురాణి దర్శనమిప్పింపుఁడని గజపతిని గోరఁగా నామెను దిమ్మరుసునకుఁ జూపింప నేర్పాటు గావించె నఁట. ఆకన్యకామణి రాయలపాదమునం దున్నపచ్చలకడియమును బట్టి యాతఁడే కృష్ణరాయలని యానవాలుపట్టి తల్లితోఁ జెప్పఁగ నెట్లైనఁ గృష్ణరాయల నంత మొందింప యత్నించి యామె కోటగమనిక మాయింప నాజ్ఞ యొసంగులోపల తమలపాకులకు సున్నమెక్కువ రాసితివని కొట్టఁబోవువానివలె తిమ్మరుసు కృష్ణరాయనిఁ దరుముకొనివచ్చి కోటగుమ్మములనుదాఁటి యిరువురును దమశిబిరములోనికిఁ బోయిరఁట స్త్రీలు వలదనుచున్నను గజపతి తనకుమార్తెను రాయలకిచ్చి పరిణయమొనర్చెనఁట.

౧ కవి జీవితములు ౫౪౬-౫౫౬ పుటలు

ప్రథమపయాగమసమయమున రాయలు గజపతిపుత్రికధరించిన పావడను గాలితోఁ దొర్కిపట్టి యామెను దగ్గఱకుఁ దీసికొనఁగా యామెమొలనూలుగ నున్నక త్తికిఁదఁ బడెనఁట! ఆమె తనను జంప నుద్దేశించినదని తలంచి రాయలామెను బరిజనమునిచ్చి తండ్రియొద్దకు బంపివేసెనఁట! ఆమె కొంతదూరమువచ్చి యిఁక ముందునకుఁబోనని తెల్పి యరణ్యమధ్యమున నివసించెనఁట! రాయలావృత్తాంతము నెఱింగి, యామెకుఁ గావలసినద్రవ్యమిచ్చుచుండు నట్లేర్పాటుగావించె ననియు నామెతనపేరును వరదరాజమ్మయనిమార్చుకొని యాయరణ్య మధ్యముననే నివసించి యాప్రదేశము నిర్జలమగుటచే నచ్చట నొక పెద్దచెఱువును ద్రవ్వించెననియు నెంతగట్టిగకట్టినను నాతటాకము యొక్క కనుములు రెండు తెగిపోవుచుండెననియు నందుల కామెవిచా రించుచుండఁగా నొకగొల్లదివచ్చి నరబలియిచ్చినఁగాని యాకనుములు నిలువవనియుఁ దనయిరువురుకుమారులను చెఱియొకకొమ్మున నిలువఁ బెట్టి మట్టితోఁ గప్పివేసినచో నవితెగిపోవక నిలుచునని చెప్పెననియు నరబలియిచ్చుటకు వరదరాజమ్మ యంగీకరింపకపోవఁగా నాగొల్లది బల వంతముచేసి తనకుమారులను బంపెననియు వారు సంతోషహృదయు ముతో నాచెఱువుకొమ్మలలో నిలువఁబడఁగా మట్టితోఁగప్పివేసి రనియు, నందుమీఁదట నాచెఱువుగండ్లు తెగక నిలిచిపోయెననియు నా గొల్లవాండ్రపేరుశాశ్వతముగాఁ జేయఁదలంచి కంబడు చినకంబడు అనువారిపేరులతోఁ గంబము చినకంబము అను రెండుగ్రామముల నా యరణ్యమునఁ గట్టించెననియు నాకథ యందున్నది. ఆరెండుకంబము లును గలిసిపోయి యిప్పుడు కంబమనుపేరున పిలువఁబడుచుండెనఁట! ఈవరదరాజమ్మకు తుక్కాజీ అనినామాంతరముండెనఁట! ఆమె తన యందుఁ గృష్ణరాయల కనుగ్రహము కలుగుటకై తుక్కాపంచకమను పేర నైదుశ్లోకములను రచియించిపంపెనఁట. ఈశ్లోకములను గవిజీవిత ములనుండి గైకొని యీక్రిందవ్రాయుచున్నాఁడను.

౧. చర న్వనాంతే నవమంజరీషు న షట్పదో గంధఫలీ మజిఘ్రత్
స్తా కిం న రమ్యా న చ కిం న రంతా బలీయసీ కేవల మీశ్వరాజ్ఞా

౨. మా కింశుక ప్రకటయాత్మని మేమమాత్రం
మస్మి న్తకే విహరతీతి మధువ్రతో౽యమ్
కిం మాలతీ విరహ వేదనయా త్వదీయమ్
దృష్ట్వా ప్రసూన మచిరా దనలభ్రమేణ.

3. భ్రమరభ్రమతా దిగన్తరాళే
క్వచి దాస్వాదిత మీక్షితం శ్రుతం వా
వద సత్య మపాస్య పక్షపాతం
యది జాతీకుసుమానుకారిపుష్పమ్

౪. కుసుమాని లిఖన్తు నామచిత్రే
కతిచి త్కారువిశేషరూఢశిక్షాః
సురభిత్వ మమూని కిం లభంతే
కిము చైతేషు రసం పిబంతి భృఙ్గాః.

౫. కిం మాలతీం మాయసి మాం విహాయ
చుచుంబ తుంబీకుసుమం షడంఘ్రిః
లోకే చతుర్భి శ్చరణైః పశుస్స్యా
త్పషడ్భి రత్యర్థపశు ర్న కిం స్యాత్.

తుకానామ గజపతిపుత్రి కృష్ణదేవరాయపత్ని.

వరదరాజమ్మత్రవ్వించినతటాకమార్గమునఁ బోవుచు నొక నాఁడు రాయలు తత్సమీపమున నున్న శిలాశాసనముంగాంచి యందు శ్రీకృష్ణరాయచరణదాసి వరదరాజమ్మత్రవ్వించినతటాక మనియర్థ మిచ్చు నా శాసనాక్షరములను జదివి యామె యెవ్వరని యనేకుల నడిగి తెలిసికొని తనయొద్దకురప్పించుకొని యాదరించెనఁట !

ఈకథనే 'షైలరు' అనునాతఁడు మార్చివ్రాసెను. గజపతితనయ పేరు రుచీదేవియనియు నామె విజయనగరమునకుఁ బోవనిచ్చగింపక

మార్గమధ్యమున నాఁగిపోయెననియు, నామెతండ్రి యామెకుఁ గావలసినద్రవ్యమంపుచుండెననియు వ్రాసియున్నాఁడు.౧

కవిజీవితములయందు దీయఁబడిన యీకథవిశ్వాసార్హమైనది కాదు. రాయల కిది ప్రథమవివాహము కాదు. గజపతిని క్రీ.శ.౧౫౧౫కు పూర్వము కృష్ణరాయలు జయింపలేదు. అప్పటికి రాయల కిరువురు భార్యలున్నారు. గజపతియన ప్రతాపరుద్రగజపతియో వీరభద్రగజపతియో పైకథలోఁ జెప్పలేదు. వీరభద్రగజపతిని రాయలు చెఱయుంచెను. ఆతనితనయను రాయలు పరిణయమాడలేదు. కొండవీడు విజయానంతరము ప్రతాపరుద్రగజపతి కటకమునకుఁ బోయెను గాని కొండవీటియందుఁగాని వినుకొండయందుఁగాని లేడు. ఆతనితోఁ దిమ్మరుసు అచ్చటమాటలాడుట కవకాశము లేదు. కావున నీపరిణయగాథ కేవల మసత్యము. పైనిఁజెప్పినతుష్టాపంచకము, తుష్టారమః రచించినవిగావనియు, నిందొకశ్లోకము క్రీ.శ.౧౨౦౦కుఁ బూర్వమే రచింపఁబడినవల్లభదేవుని సుభాషితావళిలోనున్నదనియు నింకొకశ్లోకము ౯౦౦సంవత్సరమునకుఁ బూర్వమే ముకుళభట్టు తనయభిధావృత్తిమాతృకలో నుదాహరించియున్నాఁడనియు, శ్రీరామకృష్ణకవిగారు చెప్పిరని తిరుపతిదేవస్థానము వారిరిపోర్టులో నున్నది. ఉదయగిరిదుర్గము నాక్రమించుకొనినప్పుడు దుర్గాధ్యక్షుని మేనత్తను రాయలు బందీగాఁ దీసికొనిపోయెనని న్యూనిజు వ్రాసియున్నాఁడు ఆమెయే కంబమునొద్ద జెఱువుఁ ద్రవ్వించినధర్మాత్మురాలై యుండును. ఆమెపేరు రుచీదేవి కావచ్చును.

---

౧. కవిజీవితములు ౫౫౨ వ పుట.

"The Gajapati King's daughter named Ruchidevi felt disposed to remain near Stambam (Cumbam) and the Rayar directed to do so, while he returned to Vizianagaram. That daughter of Gajapati, Ruchidevi, said that as Krishnadevaraya was the son of a Dasi, and she herself noble tribe illustrious by her birth. She preferred to abide by Kambam. Her father sent her thither large sums of money ; She sold those jewels and had a very large walir reservoir excavated near Kumbam and she destributed very extensive charities. Tailor's Analysis.

ప్రస్తుతమునఁ గర్నూలుతాలూకాలోఁ గంబ మనుగ్రామముం డుటయు నందు గొప్పతటాక ముండుటయుసత్యము. ఆతటాకముకడఁ బద్యాత్మక మైనశిలాశాసన మున్నదఁట! ఆచెఱువునుగూర్చిన పూర్వపుగాథ యాశాసనమునలిఖితమై యున్నదఁట, దానిపూర్తిపాఠము నాకు లభింపలేదు. లభించినప్పు డందేమైన విశేషము లున్నవేమో చూచెదను.

## V (2) గాండ్లసంగకథ

'గాండ్లసంగ' యనునొకవేశ్యకథ కొండవీటిసామ్రాజ్యమున గ్రంథస్థమై యున్నది. రాయలొకనాఁడు గజారూఢుఁడై నగరమును జూడ నేఁగెననియు, నప్పుడు గాండ్లసంగ యనువేశ్య యతనికగంటఁబడి యెననియు, నామెయందు బద్ధానురాగుఁడై రాయలామెను గోటలోనికి రప్పించి యామెతోఁ గలియుచుండె ననియు, రాయ లొకనాఁడు తిరుమలదేవితో నత్యంతసౌందర్యవతి యగునొక వేశ్యను గోటలోనికిఁ దెచ్చితి ననిపరిగల్భములాడ నామె "తెచ్చినదివేశ్యకాని గజపతికూఁతురుకాదుగదా"యని మేలమాడె ననియు, నందులకాతఁడు కుపితుఁడై గజపతితనయనుమాత్రము తేఁజాలనా యనిపంతమాడి యానాఁడే "గజపతిపై దండయాత్ర జరుపనిశ్చయించితిని. కావున సైన్యము నాయత్తపరుపు"మని తనమంత్రి యైనతిమ్మరసున కాజ్ఞాపించెననియు, నీకథాసారాంశము. దీనినిబట్టి రాయలు క్రీ.శ.౧౫౧౫ర ప్రాంతమున నీవేశ్యను దెచ్చి తనయుంపుడుకత్తెనుగాఁ జేసెనని తేలుచున్నది. ఇదిసత్యమైన నై యుండును. ఇంతమాత్రమే యైనచో, రాయలభార్యలను గూర్చి యాలోచించునప్పుడీకథతోఁ బ్రసక్తి లేదు, కాని కొందఱామెయే కృష్ణరాయలభార్య యగుచిన్నాదేవియని తలంచుచుండుటచే నీకథకుఁ బ్రసక్తి కలిగినది. ఈమె చిన్నాదేవి కాదు. చిన్నాదేవినిగూర్చి వ్రాయునప్పు డీవిషయమున మరలఁ బ్రస్తావించెదను. రాయలభార్యలనుగూర్చిన పుక్కిటిపురాణము లింకనుగలవు. కాని యవి కేవలము కల్పనాకథలు, ఔచిత్యరాహిత్యములు, కావున వానిని వదలివైచితిని.

## V (3) విదేశీయుల వ్రాతలు

రాయలకాలములోనే, విజయనగరమునకు వచ్చినపోర్చుగీజు దేశీయులు కొందఱు, విజయనగరరాజ్యమునుగూర్చియుఁ, గృష్ణరాయలనుగూర్చియుఁ బోర్చుగీసుభాషలో గ్రంథములను వ్రాసియుండిరి. అందుఁ గొన్ని యాంగ్లేయభాషలోనికిఁ బరివర్తితములై యున్నవి. రాయలభార్యలనుగూర్చి వారేమివ్రాసిరో తెలిసికొనవలసియున్నది.

(1) క్రీ. శ. ౧౫౨౦ లో ఫిగరిడో యనుపోర్చుగీసురాయబారి విజయనగరమునకు వచ్చెను. అతనివెంట పెయిస్ అనువాఁడొకఁడు కలఁడు. ఇతఁడు తాను విజయనగరములోఁ జూచినయంశములన్నియు వ్రాసియుంచినాఁడు[1]. ఇతఁడు "రాయలభార్యలవృత్తాంతము నిట్లు వర్ణించియున్నాఁడు. ఈరాజునకు ధర్మపత్నులు పన్నిద్దఱు గలరు. అందు ముఖ్యులు మువ్వురు...ముఖ్యభార్యలయం దొకర్తె యుత్కల రాజపుత్రిక; మఱియొకర్తె యీరాజుసామంతులలోనొక్కఁడగు శ్రీరంగపట్టణప్రభువు కుమారిత; ఇంకొకర్తెభార్య వేశ్య. రాజ్యమునకు రాకముం దాతని కామె యుంపుడుగత్తెగ నుండినది; రాజైనపక్షమున దన్ను భార్యగ జేకొందునని యతనిచే వాగ్దానము గొన్నది. ఈరీతిగ వేశ్యయొకర్తె రాజమహిషియగుట సంభవించినది. ఆమెయందు గలయనురాగాతిశయముచే నతడామెపేర నొకపట్టణము గట్టించెను."

వీరు మువ్వురుగాక తక్కినతొమ్మండుగురుభార్యల వృత్తాంతముల నీతఁడీయలేదు. రాయలసన్నిధిని సర్వదా యూడిగము సేయు పరిచారికలను, గాండ్లనుగవంటియుంపుడుకత్తెలను నీతఁడు భార్యలుగాఁ బరిగణించియుండును.

(2) రాయలకాలముననేవచ్చి, యాతనియనంతరమునఁగూడ నీదేశమునఁ గొంతకాల ముండినపోర్చుగీసుదేశీయుఁడును గుఱ్ఱపువర్తకుఁడు నగున్యూనిజ్ అనునాతఁడు రాయలకు భార్యలు పెక్కురున్నను నందుఁ బెండ్లాడినవారు నల్గురని వ్రాసియున్నాఁడు[2].

---

౧ మహమ్మదీయమహాయుగము ౩౭౬ పుట

౨ డా. వెంకటరమణయ్యగారి వ్యాసములు భారతి, సం ౨౬ పుట ౫౮౩

## V (4) శాసనములు : గ్రంథములు

శాసనములను గ్రంథములను బరిశీలించి చూడఁగా రాయలకు భార్యలు నలుగురున్నట్లు కన్పట్టుచు న్యాయనిజవార్తతో నేకీభవించు చున్నవి. ఇం దిరువురనుగూర్చి స్పష్టము లైన యాధారము లున్నవి. తక్కినయిద్దరినిగూర్చి మన యూహాలనుజేర్చి నిరూపింపవలసియున్నది. పెద్దనార్యుఁడు మనుచరిత్ర కృత్యాదియందు:—

> "ఆ విభు ననంతరంబ ధ
> రావలయముఁ దాల్చెఁ గృష్ణరాయఁడు చిన్నా
> దేవియు శుభమతి తిరుమల
> దేవియునుం దనకుఁ గూర్చు దేవేరులుగాన్.

అనుపద్యమున రాయలభార్యలు చిన్నాదేవి, తిరుమలదేవి యని యిరువురను బేర్కొనియున్నాఁడు. రాయలు కృతినందినపారిజాతాపహరణకావ్యమునఁగూడ నీయిరువురే యుదాహృతులైరి. అనేక శాసనములలో నీయిరువురినామములును రాయలభార్యలుగాలిఖింపఁబడియున్నవి. తిరుపతియందు రాయలకిరుప్రక్కలను చిన్నాదేవి తిరుమలదేవుల విగ్రహములు ప్రతిష్ఠితములైయున్నవి. కావున వీరిరువురును రాయలభార్యలనుట నిశ్చయము. వీరియుదంతముల నీక్రింద వ్రాయుచున్నాఁడను.

## V (5) చిన్నాదేవి

పట్టాభిషిక్తుఁడుకాకపూర్వ మొకవేశ్యతో రాయలకు సంబంధము గలిసినదనియు నాతఁ డామెయం దత్యనురక్తుఁడై తనకు విజయనగర రాజ్యము లభించెనేని, యీయామెను వివాహమాడి, దేవేరిగఁ జేసెదనని వాగ్దాన మొనర్చెననియు నట్లే సింహాసన మధిష్ఠించినపిమ్మట గూడ రాయ లామెయం దనురాగముగలిగి లోకోపవాదమునకు జంకి యామెను గోటలోనికి రప్పింపక రహస్యముగ రాత్రులయం దామె యింటికిఁ బోవుచుండువాఁడనియు నొకప్పు డావిషయమును గనిపెట్టి శత్రువు లాతనికపకృతిచేయు యత్నములో నుండఁగాఁ దిమ్మరుసుమంత్రి బ్రతికృతియొనర్చి యాతనిని గాపాడెననియు నావేశ్యతో సంబంధము

వదలుకొనుటుచితమని తిమ్మరుసు రాయలకుబోధించియుఁ గార్య ముఁగానక రాయల కామెయందుగల యనురాగ మనివార్య మని యెఱిఁగి ముందుగనొక రాజకుమార్తెను దెచ్చి పరిణయ మొనర్చియపుడే యావేశ్యనుగూడఁ దీనికొనివచ్చి యంతఃపురవాసినిగఁ జేసి రాయల వాగ్దానమును నెరవేర్చెననియు నొకకథ కలదు. పోర్చుగీసు దేశస్థుడగు పెయిసు వ్రాఁత లీకథను బలపరచుచున్నవి. 'న్యూనిజు' కూడ నీవిషయమును విపులముగా వర్ణించుచు నావేశ్యపేరు చిన్నాదేవియని పేర్కొనినాఁడు.

పారిజాతాపహరణకృత్యాదియందు, మనుచరిత్రలోవలె, పై పద్యము వంటిపద్యము లేదు. కాని చిన్నాదేవి తిరుమలదేవులనామములనుదాహరించినవి మూఁడుపద్యములు కలవు.

"క. తిరుమలదేవీవల్లభ"

ఆ ౨ ప ౧౦౫

"క. శ్రీవర్ణనీయ! తిరుమలదేవీహృదయేశ"

ఆ ౫ ప ౧

"క. శ్రీవెంకటగిరివల్లభ
సేవాపరతంత్రహృదయ! చిన్నమ
దేవీజీవితనాయక"

ఆ ౪ ప ౧,

తిరుమలదేవినిగూర్చి "వల్లభ, హృదయేశ" అనుపదములనుపయోగించి, చిన్నాదేవివిషయమున "జీవితనాయక" అనుపదము నుపయోగించుటచేఁ గవి యీయిరువురకు భేదమును జూప నుద్దేశించినట్లు గన్పట్టుచున్నది. చిన్నాదేవి వెలయాలనిస్ఫురింపఁజేయుటకై "జీవితనాయకుఁ"డనుశబ్దమును గవి యుద్దేశపూర్వకముగ వ్రాసెనని తలంచుట కవకాశముకలదు.

రాయలసమకాలికు లగుపేయస్ న్యూనిజు మొదలగువిదేశీయులు చిన్నాదేవి వెలయాలని స్పష్టముగా వ్రాసియున్నారు. చిన్నాదేవిపుట్టినింటివారెవరో తెలియుటలేదు. మఱియు నామెవేశ్యకులసంజా

తయని జనశ్రుతి కలదు. ఈకారణములవలన నామె వేశ్యకులమునందు జన్మించిన దనినిశ్చయించుట సహేతుకమే యగును.

## V (క) ౧ రాయలు చిన్నాదేవిని పెండ్లియాడెనా?

జన్మముచేఁ జిన్నాదేవి వేశ్యయే యైనను రాయ లామెను బెండ్లియాడెనా? లేక ఆజన్మాంత ముంపుడుకత్తెగానే యుంచెనా? యనువిషయ మిట నాలోచనీయము. రాయలయాస్థానకవి యగు పెద్దనార్యుఁ డామెనామమును ముందుదాహరించి, తిరుమలదేవితో సమానముగ దేవేరియని చెప్పియున్నాఁడు అనేక శాసనములలో "శ్రీకృష్ణరాయలదేవులు చిన్నాదేవి అమ్మంగారును తిరుమలదేవి అమ్మంగారున్ను"అని సమానగౌరవము నిచ్చి లిఖించియున్నారు. శాసనములలోఁ దఱచుగాఁ జిన్నాదేవి నామమునే ముందుగా వ్రాయుచు వచ్చిరి. ఆమె నిజముగా వెలయాలితనయయే యైనను, రాయల కిరువది యేండ్లవయసుననే పరిచితురాలై యాజన్మాంతమాతనియనురాగమును జూఱగొని నిష్కళంకమజీవితమును గడపినదగుటచే రాయల కామె భార్యయనియే తలంపవలసియున్నది. ఆమెయందు రాయల కమితమైనప్రేమ కలదు. తనదేవేరి యగుతిరుమలదేవితో సమానగౌరవ మొసంగినాఁడు. ఆకాలపుకవులు, పండితులు,మంత్రులు, దండనాయకులు, ఉద్యోగస్థులు, ప్రజలుకూడ నామెను రాయలపట్టపుదేవియని యంగీకరించి గౌరవించినారు. అందుచే రాయలామెను బెండ్లాడెననియే నిశ్చయింపఁదగియున్నది. అట్లుగాక యామె రాయలయుంపుడుకత్తెగానే యుండెనందు మేని, రాయలుచేసినవాగ్దానమును నెరవేర్పలే దనిచెప్పవలసివచ్చును. ఒకవేశ్యయొక్క కుమార్తెను బెండ్లియాడుట రాయలంతవానికి యుచితమా? అని యెవ్వరైన ననవచ్చును. ఆమెయందలియనురాగముచే రాయ లుచితానుచితములను బాటింపకపోయి యుండును. చిన్నాదేవి వేశ్యకాదని యొక్కమాటలోఁద్రోసివేయుట యింతకంటె సులభకార్యమే యగునుకాని పైనిఁజూపినహేతువు లట్లుచేయుట కాటంకము గల్పించుచున్నవి.

## V (౫) ఆ గాండ్లసంగ చిన్నాదేవియా?

గాండ్లసంగ యను వేశ్యనుగూర్చి పైని వ్రాసియుంటిని. ఆమెయే చిన్నాదేవియని కొందఱియభిప్రాయము. తిరుమలదేవినిపరిణయమైన పిమ్మటం గొంతకాలమునకుంగాని గాండ్లసంగను రాయలు తీసికొనిరా లేదు. మఱియు నట్లుతీసుకొనివచ్చుట, గజపతిపై యుద్ధమునకుంబోవు టకు సన్నిహితపూర్వమై యుండవలయును. ఈ రెండును జిన్నాదేవివట్ల వర్తింపవు. చిన్నాదేవి పరిణయమును తిరుమలదేవివివాహమును నేక కాలమునందే జరిగినవి. గాని తిరుమలదేవివివాహమైనకొంతకాలము నకుం దరువాతం జిన్నాదేవిపరిణయము కాలేదు. వారిరువురును కృష్ణ రాయలభార్యలుగాం దిరుపతిదేవస్థానమందలిశాసనమున నుదాహృతు లైయున్నారు. ఆశాసనకాలము క్రీ శ. ౧౫౧౩ సం॥ ఫిబ్రివరినెల౧౦వ తేదీ. వారి వివాహములు ౧౫౧౨ లోనో అంతకుపూర్వమో జరిగి యుండవలయును. ఈ కాలము గజపతిపైదండయాత్రకు సన్నిహిత పూర్వము కాదు. గజపతిని జయించుటకై పూర్వదిగ్విజయయాత్రి ౧౫౧౩ లోంగాని ప్రారంభము కాలేదు. ఈ కారణములచే గాండ్లసంగ చిన్నాదేవి కానేరదు. ఇంతేకాదు. తిరుమలదేవితోనైనపరిణయమునకు ముందే చిన్నాదేవితో రాయలకు సంబంధ మేర్పడినది. తిరుమలదేవి వివాహమైనకొంతకాలమునకుం బిమ్మటందీసికొనిరాంబడినది గాండ్ల సంగ. అందుచే వీరిరువురు నేకవ్యక్తులుకారు.

తిరుమలదేవిని బెద్దదేవియనియు, గాండ్లసంగను జిన్నదేవియ నియును బ్రజలనుచుండిరనియు, నావాడుకయే గ్రంథములలోను శాసనములలోను జిన్నాదేవిగా మార్పుచెందెననియు, నెవ్వరైన ననవ చ్చును. కాని ముక్కుతిమ్మన "చిన్నమదేవి"యని పైన నుదాహరించిన పద్యములోం జెప్పియుండుటచే నామెపేరు "చిన్నమ్మ" లేక "చిన్నమ్మి" యైయుండునని తెలంపవలసియున్నది. సంగయే యీమె యైనచో "సంగాదేవి"యని యందురు. కాని చిన్నాదేవియనుట సంభవింపదు, కావున గాండ్లసంగ చిన్నాదేవికాదు.

## V (5) 3 చిన్నాదేవి యెప్పుడు చనిపోయినది?

చిన్నాదేవి, వివాహమైనపిదప నాలుగేండ్లకంటె యెక్కువకాలము జీవించినట్లగపడదు. తిరుపతి దేవస్థానమున ధాతసంవత్సరపుష్యశు ౧౦ నాఁడు (క్రీ. శ ౨ జనవరి ౧౫౧౭) వ్రాయించిన శాసనములలో చిన్నాదేవి పేరున్నది[౧] శ్రీకృష్ణరాయలమంత్రులలోనొకరగు కొండమరుసయ్య ఈశ్వరసంవత్సరమార్గశిర బ ౨ (క్రీ శ ౧డిశంబరు౧౫౧౭ నాఁడు వ్రాయించినచోళసముద్రపు శాసనము[౨]లో దిరుమలదేవిపేరే కాని చిన్నాదేవిపేరులేదు. కావున నామె ధాతసం॥ పుష్యశు ౧౦ ఈశ్వరసంవత్సరమార్గశిర బ ౨ నడుమ ననఁగా క్రీ. శ. ౧౫౧౭ వ సంవత్సరములోఁ గాలధర్మము నొందె ననుట నిశ్చయము.

## V. (6) తిరుమలదేవి

ఇఁకఁ దిరుమలదేవినిగూర్చి యోచింతము. ఈమె గజపతికుమార్తెయని న్యూయెల్ పండితుఁడు వ్రాసియున్నాఁడు[3] కాని యది వాస్తవముకాదు. కృష్ణరాయలు తిరుపతి వెంకటేశ్వరస్వామిని మొదట దర్శించినది. క్రీ. శ. ౧౫౧౩ ఫిబ్రవరి ౧౦ వ తేది. అప్పుడు రాయలతోఁ జిన్నాదేవియుఁ దిరుమలదేవియుఁ గూడనుండి స్వామి కాభూషణాదులు సమర్పించినట్లు శిలాశాసనమున్నది. అప్పటికి రాయలు గజపతినిజయింపలేదు. గజపతితనయను బరిణయమాడలేదు. కావున న్యూయెల్ వ్రాఁత నిరాధారమైనది. త్యజింపఁదగినది.

న్యూనిజు తిరుమలదేవి నరసింగరాజకుటుంబమునకుఁ జెందిన కన్యయని వ్రాసియున్నాఁడు[౪]. ఆకాలమున నరసింగరాజులని ప్రసిద్ధిచెందినవారు సాళువవంశములోను ఆరవీటివంశములోను గలరు సాళువవంశములో నరసింహరాయలపుత్రికగాని యిమ్మడినరసింహరాయల తనయగాని యై యుండవలయును. కాని వీరికి పుత్రికలున్నట్లుగాని

౧. తిరుపతిదేవస్థానమువారిశాసన సం. ౫ సంఖ్య.
౨. ద. హిం. శా సం. ౯ సంఖ్య ౫౦౭.
3. ఆర్చిలాజికలు సర్వే-రెండవసంపుటము.
౪. మహమ్మదీయ మహాయుగము. పుట 3౬3.

రాయలు పెండ్లాడెననిగాని నిశ్చయించుట కా[illegible]యుఁ గాన రాదు. అట్లే ఆరవీటివారితోను రాయలకు సంబంధము కలసినట్లు గన్పడదు.

న్యూనిజుమఱియొకతావునఁ గృష్ణదేవరాయల రాయచూరుదండయాత్రను వర్ణించుసందర్భమున "గృష్ణరాయలకుఁ గూఁతునిచ్చినవాఁడును మయిసూరుమండలాధిపతియు నగుకుమారవీరయ్య (కుమారవీరశ్యామరాయలు) ఎనిమిదివేలకాల్బలమును నాల్గువందలగుఱ్ఱములను ఇరువదేనుంగులును గలసైన్యముతో నాతనివెనుకఁ బోవుచుండెను" అని వ్రాసియున్నాఁడు[౧].

తిరుమలదేవి శ్రీరంగపట్టణ ప్రభువు తనయ యని పేయస్ యభిప్రాయము కాని యాప్రభువుపేరెవ్వరో తెలియుటలేదు. తిరుపతి దేవస్థానమువారు ప్రకటించిన రిపోర్టులోఁ బైనిఁజెప్పిన వీరశ్యామరాయలే శ్రీరంగపట్టణప్రభువై యుండునని వ్రాసియున్నారు[౨].

న్యూయెల్ పండితుఁడు ప్రకటించిన మయిసూరు వంశావళిని బట్టి, క్రీ.శ. ౧౪౭౮ మొదలు ౧౫౧౩ వఱకు, మయిసూరుమండలపరిపాలకుఁడుగా నొకచామరాజున్నట్లు తెలియుచున్నది[౩]. ఈతఁడే తిరుమలదేవి తండ్రియని తోఁచుచున్నది.

ఆకాలములోఁ గృష్ణదేవరాయలు మయిసూరురాజ్యమును గూడ జయించినట్లు సుప్రసిద్ధచరిత్రకారులగు లక్ష్మణరావుపంతులుగారిట్లు వ్రాసియున్నారు[౪].

"కాని కృష్ణరాయలకాలపురా జగుగంగరాజు తిరుగఁబడి కప్పమిచ్చుటమానెను. అందుచేఁ గృష్ణరాయఁడు శతఘ్నులతోను ప్రబలసైన్యముతోను దానిని సాధించుటకు వెడలెను. శ్రీరంగపట్టణపురాజగు చిక్కరాయనికిని గంగరాజునకును వైరమగుటచే వానిని గలుపుకొని కృష్ణరాయలు కొండత్రోవనుబోయి శివసముద్రపుకోటను ముట్టడించి

౧. మహమ్మదీయ మహాయుగము ౩౬౩ వ పుట.

౨. దేవస్థానపు రిపోర్టు పుట ౧౯౧.

౩. రెండవ సంపుటము ౧౯౪ వ పుట.

౪. మహమ్మదీయ మహాయుగము ౩౫౫-౩౫౬ పుటలు.

శౌర్యముతోఁ బోరాడి వశపఱుచుకొనెను. గంగరాజు కావేరిలోఁబడి ప్రాణములను ద్యజించెను. అంతనుమ్మటూరు జయించెను. శ్రీరంగపట్టణపురాజగు చిక్కరాయని వశపఱచుకొని యాతఁడు తనకుఁ గప్పము కట్టునట్లు చేసెను. తరువాత మహిసూరు దేశమంతయుఁ గర్ణాటకంబంతయుఁ గృష్ణరాయలకు లోఁబడెను. తాను జయించిన కర్ణాటదేశమునకంతటికిని శ్రీరంగపట్టణము రాజధానిగా నేర్పరచి కృష్ణరాయధ్వజమనుపేర నొకవిజయధ్వజము నెత్తించి యచ్చట చిక్కరాజునుతన ప్రతినిధిగా నేర్పరచెను. ఆసమీపమండలిపాళెముల జయించి, కాంబగౌడుఁడు, వీరప్పగౌడుఁడు అనుపాళెగాండ్రవశమున నుంచెను."

కృష్ణరాయవిజయమున "అనంతరం బొక్కహూరుమత్తున నుమ్మత్తూరు శివసముద్రస్థలంబుల నెసంగు గంగరాజునొడయుల నోడించి తదీయస్థలంబున నాకోబులు బలియించి, శ్రీరంగపట్టణంబునిరీక్షించి" అని యున్నది[౧].

వీనినిబట్టి యాకాలమున శ్రీరంగపట్టణమునఁ జిక్కరాయలును మైసూరునందుఁ జామరాయలును ప్రభువులుగా నున్నట్లు తెలియుచున్నది. రాయలకుఁ గూఁతు నిచ్చినవాఁడు మైసూరుమండలాధిపతియని 'న్యూనిజు' వ్రాసియుండుటచేఁ దిరుమలదేవి, చామరాజు (శ్యామలరాయలు) నామధారియగు మైసూరు మండలాధిపతి తనయ యనియు, ౧౫౧౨ లో రాయలొనర్చిన దక్షిణదిగ్విజయయాత్రలో మైసూరునకేఁగినప్పుడామె లభించియుండుననియు లేదా యంతకుపూర్వమే తిమ్మరసుప్రయత్నమువలన వీరశ్యామరాయలు,కృష్ణరాయలకుఁదనకూఁతు నొసంగి పరిణయము చేసియుండుననియుఁ దలంపవలసియున్నది. తిరుమలదేవి వివాహముకూడ బలవంతము మీఁదనే జరిగినదనియు, నామె కృష్ణరాయలను బ్రథమసమాగమసమయమునఁ జంపఁబ్రయత్నించెననియు నొకకథ చెప్పెదరు. కాని యది విశ్వసించుట కాధారములు లేవు. ఇది నమ్మనర్హము కానిదని త్యజింపవలసియున్నది.

---

౧. కృష్ణరాయ విజయము. ౩ ఆ. ౫ క.

## V 6 (1) రాయలు పట్టాభిషిక్తుఁడగునప్పటికిఁ దిరుమలదేవి వివాహమైనదా?

పట్టాభిషిక్తుఁ డగునాఁటికి రాయలకుఁ బరిణయమయ్యెనో లేదో తెలియదు. పట్టాభిషేకమహోత్సవము జరుపుకొనునపుడు భార్యకూడ నుండవలయునను నాచారమప్పు డున్నదో లేదో, ఉన్నను రాయలు దానిని పాటింపక వివాహముజరుగకుండగనే పట్టాభిషిక్తుఁ డయ్యెనో, వివాహ మైనచో పట్టమహిషిగా నెవ్వరుండిరో తెలియుటలేదు. ఈ క్రిందఁ జెప్పఁబోవు వృత్తాంతములనుబట్టి రాయలకుఁ బట్టాభిషేక కాలమునాఁటికి వివాహము కాలేదని తోఁచుచున్నది. అప్పటి కాతనికి ౨౨-౨౩ యేండ్లవయసు. కావున నప్పటికి వివాహము కాలేదనినను నందువిపరీతముండదు.

తిరుపతిదేవస్థానమువారు ప్రకటించినరిపోర్టులో తిరుమలదేవి రాయలపట్టమహిషియనియు, ఆమె వివాహము పట్టాభిషేకమునకుఁ బూర్వమే జరిగెననియుఁ బట్టాభిషేకసమయమున నామెయే పట్టపుదేవిగానుండి రాయలతో సింహాసనమునఁ గూర్చుండెననియు వ్రాసియున్నారు. వారివ్రాఁతకాధారము రాయస్త కొండమరుసయ్య వ్రాయించిన శాసనము౧. ఆశాసనమును జదివిచూచితిని. అందీవిషయములు స్పష్టముగా లేవు. ఆశాసనకాలము శా. శ. ౧౪౩౯ ఈశ్వరసం॥ మార్గశిర బ ౩. అందు "కృతయుగాంశప్రవర్తకశ్రీతిరుమలాంబికాలక్ష్మీసమోపేత శ్రీకర్ణాటకసింహాసనారూఢ శ్రీకృష్ణరాయమహారాయలసామ్రాజ్యదల్లి" అనియున్నది. అప్పటికిఁ జిన్నాదేవి చనిపోయినది. ఈమాటలనుబట్టి రాయల పట్టాభిషేకమునాఁడు తిరుమలదేవి సింహాసనమునం దున్నదనిభావింపరాదనియు, శాసనకాలమునాఁడు రాయలు తిరుమలాంబికా సమోపేతుఁడై కర్ణాటకసింహాసనమునం దున్నాఁడని చెప్పుటయే శాసనకావ్యకర్తయుద్దేశ మనియు, నాయభిప్రాయము. దొరతనమువారిశాసనపరిశోధకశాఖవారుకూడ రాయలతోఁ బట్టాభిషేకసమయమునఁ గర్ణాటకసింహాసనమధిరోహించినది తిరుమలాంబయనియే యీశాసనము చె

---

౧ A. R. 86 of 1912; ద. హిం. శా. సం. ౯ భా ౨ సంఖ్య ౫౯౩.

ప్పూచున్నదని వ్రాసియున్నారు. కాని నేనీవిషయమున వారితో నేకీభవింపఁజాలను.

## V (7) రాయలమూఁడవభార్య (గజపతికూతురు)

ఇఁక రాయలమూఁడవభార్యనుగూర్చి యోచింపవలసియున్నది. ఉత్కలదేశాధిపతి యైనప్రతాపరుద్రగజపతికుమార్తెను కృష్ణరాయలు పరిణయమాడెనని స్వదేశీయవిదేశీయచరిత్రకారులందఱు నంగీకరించుచున్నారు. కృష్ణరాయవిజయమునఁ జతుర్థాశ్వాసమంతయు నీపరిణయవర్ణనముతో నిండియున్నది. కృష్ణరాయలయనంతరమున నల్లసాని పెద్దనామాత్యుఁడు చెప్పినచాటువునందలి:—

"ఘనతర నిర్భరగండ పెండెర మిచ్చి

కూఁతు రాయలకొడఁగూర్చినాఁడు" అనువాక్యము లీవివాహమును ధ్రువపర్చుచున్నవి. సంగీతసూర్యోదయము, నాదెండ్లగోపమంత్రికృతప్రబోధచంద్రోదయవ్యాఖ్య, రాయవాచకము, విజయనగరసామ్రాజ్యము మొదలగుగ్రంథములును నీపరిణయము నేకగ్రీవముగా నంగీకరించినవి. కావున ప్రతాపరుద్రగజపతిదుహితను రాయలు పెండ్లాడె ననుమాట నిశ్చయము. ఈమె రాయలకు మూఁడవభార్య.

## V (7) ౧ గజపతితనయనామవిచారణము

రాయలకు మూఁడవభార్య యైనగజపతికొమరిత పేరువిషయమున భిన్నాభిప్రాయము లున్నవి. రాయలకు నాల్గవభార్యయుండెనా? ఉన్నచో నామెపే రెవ్వరు? అనుప్రశ్నలకు సమాధానములు ప్రతాపరుద్రగజపతికూఁతురుపేరుపై నాధారపడియున్నవి. గావున నీపేరునుగూర్చిన చర్చ యవసర మగుచున్నది.

కృష్ణరాయవిజయమునందలి యీక్రిందిపద్యమునుబట్టి యీమె పేరు తుక్కారమణియని తెలియుచున్నది.

క. అలతుక్కారమణీమణి
జలజాస్యలు వెంటఁ గొల్వ జనకునియాజ్ఞ

వెలయుచు నంతఃపురికిన్
విలసితగతి నరిగె నపుడు వేడుక మీఱన్ ౧

రాయవాచకము ననుసరించియీయామె పేరుజగన్మోహిని౨. నరపతి రాజులచరిత్రనుబట్టి యీయామె పేరు "తుఖ"3

నాదెండ్లగోపమంత్రి ప్రబోధచంద్రోదయవ్యాఖ్యయందలి యీ క్రిందిశ్లోకమును జూచి, గజపతితనయ పేరు "భద్ర"యనికొందఱు తలంచుచున్నారు.

ప్రతాపరుద్రస్య గజేశ్వరస్య
పుత్రీం పవిత్రీకృతభూతధాత్రీం
ప్రత్యాగ్రహీద్యః ప్రకటప్రతాపో
భద్రాం సుభద్రామివ పాండవేయః

మైలరుదొర వ్రాసినదానినిబట్టి గజపతి కూఁతురుపేరు రుచీదేవి౪

విజయనగరసామ్రాజ్యమను గ్రంథములో :—

"శ్రీముఖసంవత్సరం చిత్రిమాసం శ్రీరామదశమి జగపతి మీదికి దండుయెత్తి తర్లిపోయి జగపతికుమార్తె లక్ష్మీదేవమ్మవారిని హావాలాచేసుకుని విజయనగరపట్టణానకు వచ్చి రాజ్యప్రతిపాలనం చేసినవివరం"౫ అనివ్రాసియుండుటచే స్త్రీమె పేరు లక్ష్మీదేవమ్మ యని తెలియుచున్నది.

ఈనామములలో నేదినిజమయినదియో తెలిసికొనుట సుకరముకాదు.

మైలరుదొరవ్రాసిన 'రుచీదేవి'యనుపేరు సరియైనది కా దని యిదివఱకే వ్రాసియుంటిని. కావున దానిని త్యజించివేయుదము.

రాయలతో సమకాలికుఁడై యాతఁడు జయించిన కొండవీటి దుర్గమునకుఁ బరిపాలకుఁడైననాదెండ్లగోపమంత్రి గజపతిపుత్రినామమును జెప్పకుండ నుండఁడు. కావున, నామెపేరు భద్రయని తలంపవలయునని కొందఱియభిప్రాయము. 'భద్రాం' అనుశబ్దమును సుభ

౧ నాల్గవయాశ్వాసము, ప.౨౫
౨ పుట ౧౦౯
3 Further sources page 156.
౪ కవిజీవితములు ౫౫౪పుట.
౫ డా. వేంకటరమణయ్యగారి వ్యాసములు. భారతి సం. పుట

దత్రిపు విశేషణముగాఁ జెప్పవలయునని కొందఱియుద్దేశము. ఇదియే యనుసరణీయమని నాయభిప్రాయము. కావున భద్రయనునామ మును వదలివేయుదము.

తుఖా,లుఖ యనురెండుశబ్దములును, ఒకేనామమును సూచిం చుననియు నందలి మొదటియక్షరములలో నేదేనియొకటి పొరబాటయి యుండుననియుఁ దలంపవలసియున్నది. ఇది యోఢ్రభాషయందుం చినముద్దుపేరయియుండునని తలంపవచ్చును. ఓఢ్రభాషయందు "లక్ష్మి" యనుశబ్దమునకు లఖ'యనియందురఁట! ఆలఖ'యే తెలుఁగున "లుఖ" యయ్యెనని తలంపవలసియున్నది.

రాయవాచకమునందలి జగన్మోహినీనామ మామెసౌందర్య మును సూచించుటకై తత్కర్త పెట్టిననామమే కాని, యామె నిజ నామమై యుండదు. కావున నానామముతో సంబంధించినచర్చను వదలివేయుదము.

## V (7) (అ) గజపతిపుత్రికపేరు లక్ష్మీదేవి

ఇఁక మిగిలినది విజయనగరసామ్రాజ్యమునందిచ్చిన లక్ష్మీదేవి ఇదియే యామె నిజమైననామము. దీని కొకశాసనాధారముకూడఁ గలదు౧. అనంతపురమండలమునందలి హిందూపురముతాలూకా లోని చోళసముద్రమునయున్న చౌడేశ్వరీయాలయమునకు ధర్మమొసం గుచు రాయలవారిమంత్రులలో నొకరగుకొండమరుసయ్య వ్రాయిం చినశాసనములో "కృతయుగాంశప్రవర్తక శ్రీతిరుమలాంబికా లక్ష్మీ సమోపేత శ్రీకర్ణాటకసింహాసనారూఢ శ్రీకృష్ణరాయమహారాయర సామ్రాజ్యదల్లి" అనియున్నది. ఆశాసనకాలము. శా. శ. ౧౪౩౯ ఈశ్వరసం॥ మార్గశిర బ౩. (౧వ డిశంబరు ౧౫౧౭ వ సంవత్సరము) ఇంతకుఁబూర్వమే రాయలకును గజపతికిని సంధిజరిగినది. గజపతి పుత్రికకును రాయలకును బరిణయము జరిగియుండును. పైశాసనము నందలిలక్ష్మి గజపతితనయయే యనుటకు సంశయము లేదు. రాయల కప్పటి కిరువురుభార్య లున్నవ్వాడు, కొండమరుసయ్య, అందొకరిని

౧ ద. హిం. శా. సం ౯ సంఖ్య ౫౦౩

విడిచిపెట్టుట తటస్థింపదు. కావున నీశాసనమునుబట్టి రాయలమూఁడవభార్యపేరు లక్ష్మీదేవియనుట నిస్సంశయము. తిరుమలాంబిక యను లక్ష్మీదేవియనుటకంటె లక్ష్మీదేవి వేఱొకభార్యయనుటయే లెస్స.

V (7) (3) ఆముక్తమాల్యదకృత్యాదియందలి పద్యము

ఈసందర్భమున నాముక్తమాల్యదకృత్యాదియందలి యీ క్రిందిపద్యమునుగూర్చి యాలోచింపవలసియున్నది.

క. ఆవిభు ననంతరంబ ధ
రావలయము బూని తీవ్ర రహిమై దిరుమ
ల్దేవియును నన్నపూర్ణా
దేవియుఁ గమలాబ్జముఖియు దేవేరులుగాన్.

అల్లసాని పెద్దనార్యుఁడు మనుచరిత్రమున వ్రాసినపద్యము నే యవసరము లగుమార్పులనుజేసి, రాయ లాముక్తమాల్యదయందుఁ బైపద్యముగా వేసికొనియున్నాఁడు. పాఠకులసౌకర్యముకొఱకు మను చరిత్రమునందలిపద్యమును మరల నిట నుదాహరించుచున్నాఁడను.

క. ఆవిభు ననంతరంబ ధ
రావలయముఁ దాల్చెఁ గృష్ణరాయఁడు చిన్నా
దేవియు శుభమతి తిరుమల
దేవియునుం దనకుఁగూర్చు దేవేరులుగాన్.

ఆముక్తమాల్యదనురచియించునప్పటికిఁ జిన్నాదేవి స్వర్గము నలంకరించియుండుటచే, నామెపేరును విడిచి, యప్పటికి రాయలకు భార్యలుగానున్నవారి పేరులను పైపద్యములోఁ జేర్చినట్లు స్పష్ట మగుచున్నది.

పైపద్యములోని కమలాబ్జముఖియు అనువాక్యమునకు "కమలాబ్జముఖులు" అని పాఠాంతర మున్నది. ఈపాఠాంతరమును గ్రహించి కొందఱు ఆముక్తమాల్యదారచనమునాటికిఁ గృష్ణరాయలకుఁ దిరుమలదేవి, అన్నపూర్ణదేవి, కమలాదేవి, అబ్జముఖిదేవి యనునలువురు భార్య లున్న ట్లర్థముఁ జెప్పఁజూచిరి. కానియది యంగీకార్యము కాదు.

"కమలాబ్జముఖులు" అనువాక్యము తిరుమలదేవికిని, అన్న పూర్ణాదేవికిని విశేషణములనియుఁ, దిరుమలదేవి కమలముఖి యనియు, అన్నపూర్ణాదేవి అబ్జముఖి (చంద్రవదన) యనియు నభిప్రాయపడి కొందఱు రాయలకప్పటి కిద్దఱుభార్య లున్నా రనియు నందన్నపూర్ణాదేవి గజపతికొమరితయనియుఁ దలంచుచు న్నారు. అబ్జముఖియనఁగా చంద్రవదన యనక, పద్మముఖియనియే యని యర్థముఁ జెప్పవలయుననియుఁ జంద్రవదనయని చెప్పుటయే కవి యుద్దేశమైనయెడల "కమలేందుముఖులు" అని చెప్పియుండుననియుఁ గొందఱనెదరు. కవియభిప్రాయమది కాదనియు, నదియే యైనచోఁ "గమలేభముఖులు." అనికాని యట్టియర్థము నిచ్చు మఱియొక వాక్య మునుగాని గవి వేసియుండుననియుఁ గొందఱు దానికిసమాధాన మిచ్చు చున్నారు. సుప్రసిద్ధపండితులగు శ్రీవేదము వెంకటరాయశాస్త్రులుగారు తమవ్యాఖ్యానములో "కమలమునకును జంద్రునకును విరోధముండుట నీవిరోధవస్తువులతో నీసామ్యమేల తెచ్చె" నని సంశయముఁజూపి, "కమ లాబ్జముఖియు" ననుపాఠమును గ్రహించి యావాక్యమునకు "కమల" యనియెడి కమలముఖి (లేకచంద్రవదన)యని యర్థముచెప్పిరి

శ్రీ ఓకుమళ్ళఅచ్యుతరావుగారు "కమలాబ్జముఖులు" అనుపా ఠమే సరియైనదనియు, అన్నపూర్ణాదేవి యనుచంద్రవదనవలనఁ దిరు మలదేవి కమలముఖియయ్యెనని కవి సూచించినాఁడనియు,యౌవనవతి యగునన్నపూర్ణరాకచే సవతి యగుతిరుమలదేవిముఖము ముకు ళించుట స్వాభావికము కావునఁ గవి నిగూఢముగా నట్లుచెప్పెననియు నభిప్రాయపడిరి. దక్షిణనాయకుఁడగుకృష్ణరాయలు గ్రంథమునం దట్టి భేదమును జూపఁడనియు, "కమలాబ్జముఖియు" ననుపాఠమే సమంజస మనియుఁ గొందఱిమతము, శ్రీవెంకటరాయశాస్త్రులవారియర్థమునే గ్రహించితిమేని రాయలకప్పటికిఁ దిరుమలదేవి, అన్నపూర్ణాదేవి, కమలాదేవి యనుముగ్వురుభార్యలు లుండిరని తేలుచున్నది. ఈపక్ష ములోఁ జిన్నాదేవితోఁ గలిసి రాయలకు నల్గురు భార్యలై, న్యూనిజు వార్తతో సరిపోవుచున్నది.

అయినచో నీకమలయెవ్వరు ? అన్నపూర్ణాదేవియెవ్వరు? అను ప్రశ్నలకు సమాధానములు కావలసియున్నవి. గజపతితనయనామము లక్ష్మీదేవి యనిపైనినిర్ణయించియుంటిమి. ఆనామమునకే "కమల" యని పర్యాయపదమును గవి యిందువాడియుండెనని తోఁచుచున్నది. సంజ్ఞావాచకపదమున కాయర్థమునిచ్చెడి పర్యాయపదము నుపయోగించుట నియమభంగమగునని సంశయమును గలుగుచున్నది. నామమును జెప్పు నప్పుడది యాంధ్రపదమైనచో సంస్కృతీకరించుట కలదు. కాని సంస్కృతనామమున కదియేయర్థమిచ్చెడిమఱియొకపదమును వాడునాచారము లేదు. అయినను గవి యిచ్చట లక్ష్మీదేవియనుట కాయర్థమునిచ్చెడి 'కమల' యనుశబ్దమును స్వతంత్రించి యుపయోగించెననియు, "నిరంకుశాఃకవయః" యనుసూక్తి యిచ్చట వర్తించుననియు నామె గజపతిపుత్రియనియు నిశ్చయింపవలసియున్నది. లేకున్న నాముక్తమాల్యదయందలిపైపద్యములో, గజపతితనయను విడిచిపెట్టుట కేమిహేతువని ప్రశ్నించుకొని, దానికి సమాధానముకొఱకై తడవులాడుటయుఁ గమల యనునింకొకభార్య యున్నదనితలంచి యామెవృత్తాంతమును దెలిసికొనుటకై ప్రయత్నింపవలసివచ్చుటయుఁ దటస్థించును.

### V (7) (౮) గజపతిపుత్రి భర్తను జంపఁదలచెనా?

గజపతిపుత్రికను రాయలు బలవంతముగాఁ దీసికొనివచ్చియుండుటచే నెట్లయిన నాతనినిజంపి పగదీర్చుకొనవలయునని వాడిగల కత్తిని మొలనూలులో ధరించివచ్చి ప్రథమసమాగమము నాఁటిరాత్రి రాయలను జంపఁబ్రయత్నించె ననియు నాయుదంతమును ముందే తెలిసికొని తిమ్మరుసు, ఆరాత్రి కృష్ణరాయల నాగదిలోనికిఁ బంపక వసంతము పోసియుంచిన యొకవిగ్రహమును శయ్యపైఁ బరుండఁబెట్టి దుకూలముచేఁ గప్పియుంచెననియు దాసీజనము రాణిని లోపలికిఁ బంపి వెడలిపోయినపిమ్మట నామె తనవడ్డాణములోపల నున్న కత్తిచే నావిగ్రహమును బొడువగా నందున్నవసంతము రక్తమువలెఁ జిందియామెవస్త్రములమీఁదను కండ్లలోను బడఁ గత్తినటనుంచి కండ్లు తుడుచుకొనుసమయమునఁ దిమ్మరుసు లోపలికివచ్చి కత్తినందుకొని

"అమ్మా! అవివేకపుపని చేసినీభావిసుఖమును జెడఁగొట్టుకొంటి వని బోధించి యప్పుడు కృష్ణరాయల నామెకుఁ జూపెననియుఁ, గృష్ణరాయ లామెను క్షమించి పల్లకిమీఁద ససైన్యముగా నామెను దండ్రియొద్దకుఁ బంపివేయుట కాజ్ఞాపించెననియుఁ రాయలను జూచినప్పటినుండియు నామె మిగులఁ బశ్చాత్తాపపడి తనయకార్యమునకు నిందించుకొనుచు రాయలు తనపై నాగ్రహింపక దయఁజూపి తనతండ్రియొద్దకుఁబంప నాజ్ఞయిడినందుల కాతనియౌదార్యమునుగొనియాడుచు దనతప్పిదము నుక్షమించి రాయలు దనను జేకొనునట్లుచేయుమని తిమ్మరుసును గోరె ననియు నామెవాస్తవముగాఁ బశ్చాత్తప్తచిత్తయయ్యెనో లేదో యని పరీక్షించి యామెహృదయమును దెలిసికొని మంత్రి రాయలతోఁ జెప్పి యామెను స్వీకరించునట్లు చేసెననియు నొకకథ ప్రచారములో నున్నది.

కృష్ణరాయలతో సంబంధించినవుక్కిటిపురాణములిట్లే ప్రతివిష యమునను గలవు ఇవియౌనని సమర్థింపలేము. కాదని విసర్జింపలేము. వీనిని జర్చించుసందర్భమునఁ జరిత్రకారులకార్యము మిగులఁ గష్టమగు చున్నది. రాయలకును బ్రతాపరుద్రగజపతికిని సంధిజరిగినను గజపతి హృదయమున విద్వేషబీజములు నశించిపోలేదు. తనకుమార్తె విజయ నగరముననున్నను దనయల్లుఁడు చనిపోయె నను విచారము లేక రాయల యనంతరమున గజపతి విజయనగరముమీఁదకు దండెత్తెనని పెద్దవా ర్యసిచాటువు చెప్పుచున్నది. ఎట్లయిన శత్రునిర్మూలనమే ప్రధాన కార్యమని తలంచునాకాలములో గజపతికోటలోనివీరనారులచేఁ బ్రబోధింపఁబడి గజపతికూఁతురు తనప్రాణములపై నాశగోల్పోయి వీరనారియనిపించుకొనవలయునను దీక్షతో నట్టిసాహసమున కొడిగట్టె నని తలంచినఁ దలంపవచ్చును. దక్షిణనాయకుఁడును నారీహృదయ మర్మజ్ఞుఁడును శూరాగ్రేసరుఁడు నైనరాయ లామెను క్షమించి మరల బరిగ్రహించినను గ్రహించియుండవచ్చును. ఈవిషయమున నిదమిత్థ మని నిర్ణయింపఁజాలము.

**V (7) (௩) గజపతిపుత్రిక వివాహమెప్పు డెచ్చటజరిగినది ?**

గజపతితనయకును రాయలకును బరిణయము, కళింగదేశవిజ యానంతరము గజపతితో సంధియైనపిమ్మట జరిగెనని కృష్ణరాయవిజ

యము చెప్పుచున్నది. కొండవీడు దుర్గమును బట్టుకొనినప్పుడు రాయలు ప్రతాపరుద్రగజపతి భార్యను కుమారుఁ డైన వీరభద్రగజపతిని గూడఁ బట్టుకొని చెఱయం దుంచెననియు, వీరభద్రగజపతి యాత్మహత్య చేసికొనెననియుఁ జెఱయందున్న, తనభార్యను విడిపించుట కై కృష్ణరాయల కోర్కెననుసరించి ప్రతాపరుద్రగజపతి తనపుత్రికను రాయలకడ కంపెననియు నొకకథ కలదు. ఇది సత్యమైనచో నీవివాహము కళింగ దేశ విజయమునకుఁ బూర్వము జరిగియుండవలయును.

గజపతితో సంధిజరుగుటయుఁ దన్మూలముననే రాయలకు గజపతి పుత్రిక నొసంగుటయు జరిగెనని నిర్ణయించుటయే సమంజసము. అంతకుఁ బూర్వ మీవివాహము జరిగియున్నచోఁ గళింగదండయాత్రల కవసరముండదు. రాయలు మామగారిని శత్రువుగా భావించియుండఁడు. కావున నీపరిణయము క్రీ.శ. ౧౫౧౭ వ సంవత్సరములో జరిగియుండు నని నిశ్చయింతము.

ఈవివాహము కృష్ణరాయవిజయమునఁ జెప్పినట్లు కటకమున జరిగినదనుటకంటె న్యూనిజు వ్రాసినట్లు విజయనగరమున నడచినదనుటయే లెస్స. యుద్ధవిరమణమునకుఁ బణముగాఁ గైకొనినకన్యను దనయింటికిఁ దెచ్చుకొని పరిణయమాడునుగాని యప్పటివఱకు శత్రువుగానున్నవాని యింట నామహోత్సవమును జరుపనిచ్చగింపఁడు.

## V (8) అన్నపూర్ణాదేవి యెవ్వరు?

ఇఁక నాముక్తమాల్యదలోని అన్నపూర్ణాదేవి యెవ్వరు ? అను ప్రశ్నమిగిలియున్నది. ఇది చిన్నాదేవియొక్క నామాంతరమని యొకవాదమున్నది. కాని యది యంగీకార్యము కాదు. అదివఱ కనేక శాసనముల లోను గావ్యములలోను నుదాహృతమై విశేషఖ్యాతినిగడించిన చిన్నాదేవినామమును మార్చి యాముక్తమాల్యదలో నీక్రొత్త పేరును జేర్చుటకుఁ గారణమగపడదు. చిన్నాదేవి యదివఱకే కాలధర్మము నొందినది. ఆముక్తమాల్యదారచనమునాఁటి కామె యిహలోకమున లేదు కావున నన్నపూర్ణాదేవి చిన్నాదేవి కాదు.

అన్నపూర్ణాదేవి, గజపతిపుత్త్రియే యని వేఱొకవాదము. ఓఢ్ర భాషలోనున్నచారిత్రకగ్రంథములయం దీమె పేరు "అన్నపూర్ణా దేవి"యే యని యున్నట్లు తెలియుచున్నది. అనేక హేతువులనుజూపి యామె పేరు లక్ష్మీదేవియని పైని నిర్ణయించియుంటిమి. పైనిఁ బేర్కొనిన రాయవాచకాది యేగ్రంథములలోను జెప్పఁబడని అన్నపూర్ణా దేవియను పేరు నాముక్తమాల్యదలో నుపయోగించినాఁ డనుట కవ కాశము లేదు. తుక్కా మొదలయిన నామములు బాగుగా లేవని రాయ లీనామమును బెట్టినాఁ డందురు. కాని యందుల కాధారములు లేవు. "కమలాబ్జముఖులు" అను పాఠమును గ్రహించి అన్నపూర్ణాదేవిని గజపతిపుత్త్రిగా భావింపవలయు నను వాదమునందుఁ గొంతయర్థము న్నది. కాని యదిసత్యమందుమేని న్యూనిజువ్రాత యసత్యమై పోవును. భావికాలమున నేమేని వేఱువిధమైన సాక్ష్యములభించువఱకు గజ పతి తనయునామము లక్ష్మీదేవియని నిశ్చయించి, అన్నపూర్ణాదేవి, కృష్ణరాయలనాల్గవ భార్యయనినిర్ణయింతము. ఈమె యెవరితనయయో యామె వివాహమెప్పుడుజరిగెనో తెలియదు. కొండమరుసయ్య శాసన మునకుఁ (౧ డిశంబరు ౧౫౧౭) బిమ్మటను నాముక్తమాల్యదారచన మునకుఁ బూర్వమునను నీవివాహముజరిగియుండును. ఇంతకంటె నన్న పూర్ణాదేవివిషయమై యేమియుఁ దెలియదు. పోర్చుగీజు దేశీయుఁడగు పేయస్, చరిత్రవ్రాయునప్పటి కన్నపూర్ణాదేవి వివాహము కాక పోయియుండును. అందుచేనాతఁడు మువ్వురుభార్యలని వ్రాసియుండును.

చిన్నాదేవితప్ప తక్కినభార్యలు మువ్వురును గృష్ణరాయల యనంతరమువఱకును జీవించియున్నట్లు కన్పట్టుచున్నది. వారితరువాతి వృత్తాంతములుగాని, వారు చనిపోయినకాలములుగాని తెలియవు. వారు దానమొసంగివ్రాయించినశాసనములును గన్పట్టుటలేదు.

## VI. కృష్ణరాయల సంతానము

శ్రీకృష్ణరాయల కొకకుమారుఁడును నిరువురు కుమార్తెలును గలిగిరనుట కాధారములున్నవి. కుమారుని పేరుతిరుమలరాయలు.

పెద్దకుమార్తె పేరు తిరుమలాంబిక. రెండవతనయ నామము కృష్ణమాంబ. తిరుమలాంబిక ఆరవీటిబుక్క-రాజునకుఁ బ్రపౌత్రుఁడును, రామరాజునకుఁ బౌత్రుఁడును శ్రీరంగరాజునకు బుత్రుఁడు నగు రామరాజు వరిణయమాడెను. ఇతని నే యళియ రామరాజందురు. రెండవతనయయగు కృష్ణమాంబ మట్లబొమ్మరాజునకుఁ బ్రపౌత్రుఁడును సోమరాజునకుఁ బౌత్రుఁడును పోతరాజునకుఁ గుమారుఁడును నగు వరదరాజునకు భార్య యయ్యెను. కకుత్స్థవిజయమును రచియించిన మట్లఅనంతభూపాలుని ప్రపితామహుఁడగు తిమ్మరాజును బైనిఁ జెప్పిన సోమరాజును సోదరులు. బొమ్మరాజుకుమారులు-తిరుమలాంబకును కృష్ణాంబకును గూడసంతానము కలదు. వారివంశ మభివృద్ధి చెందినది. ఆరవీటివారు చంద్రవంశపు క్షత్రియులు. మట్లవారు సూర్యవంశపు క్షత్రియులు

తిరుమలాంబతల్లి పేరేదియో తెలియదు. తిరుమలదేవియని యందురు కృష్ణాంబ జనని యెవ్వరో యదియును యెఱుంగరాదు. వీరి జననకాలములును దెలియవు కృష్ణరాయలు క్రీ. శ. ౧౫౨౯ లోఁ జనిపోయెను. అప్పటికీ కుమార్తెల వయసెంతో వీరిపరిణయములు కృష్ణరాయలకాలములో జరిగెనో తరువాత జరిగెనో తెలియఁదగిన యాధారములు లభింపలేదు. కృష్ణరాయలనాఁటి శాసనములలోఁగాని వాఙ్మయములోఁగాని యీయిరువురిజామాతలనామములును గన్పట్టలేదు. అళియ రామరాయలు క్రీ.శ. ౧౫౬౫లో తళ్లికోటవద్దమహమ్మదీయులతో జరిగినయుద్ధములోఁ జనిపోయెను. అప్పటి కాతనివయసు ౬౦-౬౫ ఏండ్లని చరిత్రకారులు వ్రాసియున్నారు. దీనినిబట్టి యీతని జననము క్రీ.శ. ౧౫౦౦ ప్రాంతమని నిర్ణయింపవచ్చును. ఇందువలనఁ గృష్ణరాయలుచనిపోవునప్పటి కీతనివయస్సు ౨౫-౩౦ నడుమ నుండును వరదరాజతనికంటెఁ జిన్నవాఁడనితలంచుటసహజము. కావున నాతనివయసు ౨౦-౨౫ నడుమనుండును. కుమార్తెలవివాహములు రాయలు జీవించియుండఁగా జరుగలేదని తోఁచుచున్నది. కాదేని యింక నొకటిరెండుసంవత్సరముల కాతఁ డిహలోకమును వీడిపోవు ననఁగా జరిగియుండును. అళియరామరాయలుకొంతకాలము గోలకొండప్రభు వగుకులీకుతుబ్షాకడఁ గొలువులో నుండెననియు నాతఁ

డొకమారు తన్నవమానించఁగాఁ గోపమువచ్చి యాకొలువువదలి కృష్ణరాయలకడ సైన్యములోఁజేరి పనిచేసెననియు నొకకథకలదు. ఇది సత్యమని నమ్ముట కాధారములు లేవు ఇది నిజమగు నెడల అళియరామ రాయలు తనయిరువదవయేట ననఁగా ౧౫౨౦ప్రాంతమున గులీకుతుబ్షా సేవలోఁ జేరియుండి నాల్గయిదుసంవత్సరములు పనిచేసినమీఁదట ననఁగా క్రీ. శ. ౧౫౨౫ ప్రాంతమునఁ గృష్ణరాయలకొలువులోఁ జేరి యుండవలయును. ఇతనిశక్తిసామర్థ్యముల నెఱింగినపిదపఁ దనతనయ నిచ్చి పరిణయము చేసియుండవలయును. ఇది పైనిఁ జెప్పినకాలమునకు సరిపోవును.

అళియరామరాయలతండ్రితాతలు కృష్ణరాయలకును నాతనిపూర్వులకును మిత్రులై యనేకయుద్ధములలో వారికి సాహాయ్యము చేసి యున్నట్లు వాఙ్మయసాక్ష్యమును శాసనసాక్ష్యమునుగూడఁ గలదు. అట్టిస్థితిలో రామరాయలు కులీకుతుబ్షాకొలువున నేల చేరవలసివచ్చెనో తెలియదు.

కృష్ణరాయలు చనిపోవునప్పటి కొకటిన్నరసంవత్సరము వయసుగలకుమారుఁడు గలఁడనియు నాతనిసంరక్షణభారమును గృష్ణరాయలుతనయల్లుఁడైనరామరాయలపైఁ బెట్టిచనిపోయెననియుఁ గొందఱు చరిత్రకారులు వ్రాసియున్నారు. ఇది సత్యమయ్యెనేని యళియరామ రాయలపరిణయము కృష్ణరాయ లుండగనే జరిగెనని నిశ్చయింప వచ్చును.

కృష్ణరాయలయొద్ద నుద్యోగిగానున్న రాయసంకొండమరుసయ్య అనంతపురమండలమందలి కమలాపురగ్రామమునఁ గలచౌడేశ్వరి యాలయమునకు దానమొసంగి వ్రాయించినట్టి యసంపూర్తిశాసనము లోఁ గృష్ణరాయలకు సంతానాభివృద్ధినిగోరి తాసీధర్మమును జేయుచు న్నానని వ్రాసియున్నాఁడు.

"... ...రాయసస్త కొండమరుసయ్యనవరూ తంమ్మస్వామి కృష్ణరాయమహారాయరిగె సంతానాభివృద్ధియాగబేకెందు చోడసముద్రద చఉడేశ్వరీదేవ ..." abruptly stops here.

ఈశాసనమునుబట్టి రాయలకింతవఱకు సంతానమే లేదని కొం దఱియభిప్రాయము. అది సత్యమైనచో రాయలకు స్త్రీసంతానముకూడ లేదని యర్థము వచ్చుచున్నది. అట్లయినయెడల, అళియరామరాయల భార్యయైనతిరుమలాంబకు కృష్ణరాయలు చనిపోవునప్పటి కెనిమిది, తొమ్మిదేండ్లకంటె నెక్కువవయసుండదు. ఆవయసులో నామెవివాహము జరిగినదని చెప్పవీలులేదు. కావున నాశాసనములోని వాక్యములకు స్త్రీసంతానమున్నదనియుఁ బురుషసంతానము లేదనియు నందుచేత నే సంతానాభివృద్ధియని యుపయోగించినాఁడనియు మనము నిశ్చయింపవలసియున్నది.

అనంతపురము మండలమునందలి కమలాపురముతాలూకా కమలాపురము గ్రామములోని 'అంజనగిరి' దేవాలయమునకు ధర్మముసేయుచుఁ గృష్ణరాయలపట్టమహిషియైన తిరుమలదేవి వ్రాయించినశాసనములోఁ దిరుమలరాయలకుఁ బుణ్యమునకుగాను అనివ్రాసియున్నది.

"శ్రీకృష్ణరాయమహారాయరపట్టమహాదేవి తిరుమలదేవి అంమనవరూ తిరుమలరాయమహారాయరిగె పుణ్యవాగబేకు..." శాసనకాలము శ౧౪౩౯ బహుధాన్యసంవత్సర కార్తిక శు౧౨శ. (30 అక్టోబరు ౧౫౧౮)

ఈతిరుమలరాయలెవ్వరో శాసనమునుబట్టి తెలియదు. కాని ఆమె కుమారుఁడనియే మనమెంచఁదగియున్నది. అప్పటికాతనివయసు ఒకవత్సరములోపు. శా.శ. ౧౪౪౬ (క్రీ. శ. ౧౫౨౪) లో కృష్ణదేవరాయల కుమారుఁడైన తిరుమలరాయలు విజయనగరసింహాసనమందున్నట్లు కొన్నిశాసనములు కలవు.

కృష్ణరాయలు తనవృద్ధాప్యమునఁ గుమారునకుఁ బట్టముగట్టెనని న్యూనిజు వ్రాసియుండెను. తిరుమలరాయల శాసనములు శా. శ. ౧౪౪౬తారణ సంవత్సరమునఁ గన్పట్టుచున్నవి. రాయలకప్పటికి నలువదిసంవత్సరములకంటె నధికవయసు లేదు. అది వృద్ధాప్యమనిపించుకొనదు.

రాయలజాతకగణనముచేసినదైవజ్ఞులాతని కిక నాల్గుసంవత్సరములలో మారక మున్నదని చెప్పిరనియు నందుచేఁ దానుండగనే

కుమారునిఁ బట్టాభిషిక్తునిజేసి తనసవతిసోదరులైన యచ్యుతరాయాదులు సింహాసనమాక్రమింపకుండఁ జూడవలయునని రాయలు సంకల్పించెననియుఁ గొందఱందురు.

రాయలకుమారుఁడైనయీతిరుమలరాయ లేమయ్యెనో తెలియదు. రాయలమంత్రి యగుతిమ్మరుసు, ఆబాలుని రహస్యమార్గమునఁ జంపించెనని యొకప్రవాదము కలదు. ఆపాపకార్యమును దిమ్మరసు చేయింపలేదనియుఁ దిమ్మరుసుకుమారుఁడు చేయించెననియుఁ గొందఱందురు. లేనినింద వారిపైమోపఁబడియె నేగాని యాబాలుఁడు స్వాభావిక మరణమొందెనని కొందఱందురు. ఏమిచెప్పుటకును నాధారములు లేవు. కావున నీవిషయము నింతటితో వదలివేయుట లెస్స.

రాయలుచనిపోవునప్పటి కుండెనని యెండుసంవత్సరములబాలుఁడుకూడ స్వాభావికమరణ మందె నందురు. ఏమయ్యినేమి రాయల పురుషసంతతి వృద్ధినందలేదు. రాయఁలయనంతరమున నాతనిసవతిసోదరుఁడగునచ్యుతరాయలుసింహాసన మధిరోహించెను.

రాయలకుఁ జిన్నాదేవియం దొకకుమార్తె కలిగెననియు నామెను దిరుమలరాయలు పెండ్లాడెననియు న్యూయెల్ వ్రాసియున్నాడు ౧ కాని యామెపే రెవ్వరో, తిరుమలరాయ లెవ్వరో యేవంశమువాఁడో యేమియుఁ దెలియదు.

## VII శ్రీ కృష్ణదేవరాయల దిగ్విజయములు

శ్రీకృష్ణరాయలు జయించిన దేశములను శత్రురాజులను వివరముగా వర్ణింపవలయుననినచో నది యొక గ్రంథమగును. అవర్ణనమున కిటఁ దావులేదు. రాయలురచించినట్టియుఁ గృతినొందినట్టియు గ్రంథముల రచనాకాలములను నిర్ణయించుటకుఁ గావలసినంతవఱకును ఆగ్రంథములయందు వర్ణింపఁబడిన విజయవృత్తాంతములను నర్థముచేసికొనుట కావశ్యకమై నంతవఱకునుమాత్రమే యీతని దిగ్విజయములనుగూర్చి క్లుప్తముగ నిట వ్రాసెదను.

౧ ఆర్కియాలజికల్ సర్వే ఆఫ్ సదరన్ ఇండియా, సం ౨ పుట ౨౪౯

## VII (1) రాయల శత్రువులు

కృష్ణరాయల విజయములనుగూర్చి తెలిసికొనుటకుముందు రాయలు సింహాసన మధిష్ఠించునాటికి విజయనగర రాజ్యము క్రింద నున్న దేశము లెవ్వియో, శత్రురాజ్యము లెవ్వియో, శత్రురాజ్యముల నేలు ప్రభువు లెవ్వరో తెలిసికొనుట ముఖ్యము.

### కృష్ణరాయల శత్రువులు :—

ఇప్పుడు రాయలసీమ యని పిలువఁబడుచుండెడి కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురము జిల్లాలు రాయలురాజ్యమును గైకొనునాఁటికి విజయనగరసింహాసనముక్రింద నున్నవి. రాయల సరదార్లు, సేనానాయకులు, మంత్రులు మొదలగువారీప్రదేశములయందలి దుర్గముల కధిపతులై రాయల యనుమతిని, బరిపాలనాకార్యములను నిర్వహించుచుండిరి. రాజధానీ నగరము, బళ్ళారిమండలములోని హాంపీ విజయనగరము. ఈసీమయందు రాయలు నెరవేర్పవలసిన యుద్ధకార్యములు లేవు.

### VII (1) (౧) ఉమ్మత్తూరుగంగరాజు

విజయనగర సింహాసనమున కప్పడు రామేశ్వరమువఱకుఁగల దక్షిణదేశమంతయు లోఁబడియే యుండెడిది. ఎచ్చటనైనఁ గొందఱు పాళెగాం డ్రప్పుడప్పుడు కప్పములను జెల్లింపక తిరుగుబాటు చేయుచున్నను నది గణుతింపఁదగినది కాదు. కాని యిందులో యుమ్మత్తూరు ప్రభువుమాత్రము వీరనరసింహరాయల కాలములోనే విజయనగర ప్రభుత్వమునకు లోఁబడక తిరుగుబాటొనర్చెను. కృష్ణరాయలు సింహాసనమధిరోహించునాఁటికిఁ గూడ నీ యుమ్మత్తూరుప్రభువు విజయనగరమునకు లొంగక ప్రత్యర్థిగనే యుండెను. అప్పటికి ఉమ్మత్తూరు శివసముద్రము శ్రీరంగపట్టణము అను ప్రధాన దుర్గములు మూఁడును ఉమ్మత్తూరు రాజుక్రిందనుండెడివి. అతనిపేరు గంగరాజు ఒడయరు. అనంతపురమండలములోని పెనుగొండ దుర్గమును గూడ నీతఁడాక్రమించుకొనియుండెను.

కృష్ణదేవరాయలు ఉమ్మత్తూరు మొదలగు నీదుర్గములను బట్టుకొని దక్షిణదేశమందు తిరుగుబాటుచేయుచున్న, చేయనెంచిన, యితర సామంతులనుగూడ జయించి దక్షిణదేశమంతయుఁ దనకుఁ గప్పము చెల్లించునట్లును వారు మరల విజయనగర సింహాసనముపైఁ దిరుగుబాటొనర్పకుండగను గట్టుదిట్టములు చేయవలసియుండెను.

## VII (1) (౨) బహుమనీ—మహమ్మదీయులు.

విజయనగరరాజ్యమున కుత్తరమున బహుమనిరాజ్య మనుపేరుగల మహమ్మదీయరాజ్య ముండెడిది. దీనికిని విజయనగరమునకును జిరకాలమునుండి యుద్ధములు జరుగుచుండెడివి. కృష్ణరాయలు సింహాసనమునెక్కొనునప్పటికి బహుమనీరాజ్య మైదు భాగములుగాఁ జీలిపోయినది. కాని యీయైదును మహమ్మదీయరాజ్యములే. అదివఱకు బహుమనిరాజుక్రింద సేవకులుగానున్న మహమ్మదీయ సరదార్లు నలుగురు తమప్రభువు బలహీనుఁడుగా నున్న సమయమును గనిపెట్టి స్వతంత్రులై స్వతంత్రరాజ్యములను స్థాపించుకొనిరి. ఆనాల్గురాజ్యములు నివి.

౧. విజాపురరాజ్యము :—విజాపురము రాజధానిగా, విజాపురము, కొంకణము మొదలయిన ప్రదేశములతోఁగూడిన రాజ్యము, ఈరాజ్య పరిపాలకులకు ఆదిల్ సాహా లనిపేరు. కృష్ణరాయల రాజ్యప్రారంభము నకు విజాపురమును పాలించుచున్నవాఁడు యూసుప్ ఆదిల్ఖానుఁడు. ఇతఁడే, తనప్రభువును లక్ష్యముసేయక క్రీ. శ. ౧౪౮౨ ప్రాంతమున స్వతంత్రుఁ డయ్యెను. ఇతఁడు, సర్వదా విజయనగరరాజులకుఁ బ్రతిస్పర్థియై యుండెను. విజయనగరరాజ్యములోఁ జాలభాగమున కీవిజాపుర (Bijapur) రాజ్యము సరిహద్దుగా నుండెను.

౨. అహమ్మద్ నగరరాజ్యము:—అహమ్మదు నగరమును రాజధానిగాఁ జేసికొని దౌలతాబాద్ పరగణాలను బాలించుచున్న యీరాజ్యపాలకులకు నిజామ్ శాహీ లనిపేరు.

౩. బీరారురాజ్యము :—బీరారు రాజధానిగా యీరాజ్యమును పాలించుచున్న ప్రభువులకు ఇమాద్‌సాహీ లనిపేరు.

౪. గోలకొండరాజ్యము :— గోలకొండరాజధానిగాఁ బ్రస్తుతపు హైదరాబాదు రాజ్యమునందున్న కొంతప్రదేశము. దీనిపాలకులకు కుతుబ్‌షాహీ లనిపేరు. దీనికి మొదటస్వాతంత్ర్యమును స్థాపించినవాఁడు కులీకుతుబ్‌షాహీ. రాయలకాలమునాఁటి కితఁడే ప్రభువుగా నుండెను.

పైనివ్రాసినవిధముగా బహుమనీరాజ్యమునుండి నాల్గుముక్కలును విడిపోవఁగా మిగిలినమొండెము బీదర్ రాజ్యము. దీని కొకప్పుడు కలబరిగె (ప్రస్తుతము గుల్బర్గ) యును నొకప్పుడు బీదరు (బెడందకోట) యును రాజధానులు. ఈరాజ్యము రాయలకాలమున బహుమనీ వంశీయుఁడగు మహమ్మదు షాహీ పాలనములో నున్నది. ఇతఁడు క్రీ.శ. ౧౪౮౨వ సంవత్సరమునఁ దండ్రియనంతరము సింహాసన మెక్కి ౧౫౧౮ వఱకుఁ బరిపాలించెను. ఇతఁడు విషయలోలుఁడును నసమర్థుఁడు నగుటచే, రాజ్యమీతనిచేతులనుండిజారిపోయి యైదుచీలికలైనది. తనక్రింద నున్నబీదరురాజ్యమునందుఁ దక్కఁ దక్కిననాల్గుభాగములపరిపాలనములోను రాయలకాలమునాఁటి కీతని కిసుమంతయు సంబంధము లేకుండపోయినది. బీదరురాజ్యమునం దైనను నితనికంతగాఁ బలుకుబడిలేదు. ఇతనికి 'బరీదు' వంశీయులు మంత్రులుగా నుండిరి. కాశిమ్‌బరీదు మొదటిమంత్రి. అతనియనంతరమునన్నాతనికుమారుఁడైనఅమీరుబరీదు మంత్రియై తనయజమానియగుమహమ్మదుషాహీను పేరునకు రాజుగానుంచి తానేపరిపాలనము చేయుచుండెను.

తుద కితఁడుతనరాజ్యకాంక్షబలముకాఁగా, మహమ్మదుషాహీ కుమారులను జెఱయందుంచి, తానేప్రభు వయ్యెను. రాయలకాలము నాఁటి బహుమనీరాజ్యముయొక్క పరిస్థితి యిట్లుండెను.

ఈయైదు రాజ్యములను విజయనగరమునకు లోఁబడునట్లు చేయుట మాటయెట్లున్నను, నీమహమ్మదీయులు విజయనగర పాలనమునందు

న్న ప్రదేశములలో నడుగిడకుండఁ జూడవలసియున్నది. అందు ముఖ్యమైనవిషయ మొకటి కలదు. విజయనగరరాజ్యమునంటి రాయచూరు, ముద్గల్లుఅను ప్రబలదుర్గములు కృష్ణానదికి దక్షిణమున నున్నవి. కృష్ణకుత్తరమున నంతయు మహమ్మదీయరాజ్యమే. మహమ్మదీయులొక్కొకపుడు కృష్ణానదిని దాఁటి యీదుర్గముల నాక్రమించుచుండుటయు విజయనగరప్రభువు లీదుర్గములను దమవశమునందుంచుకొని యొక్కొకపుడు కృష్ణానదిని దాఁటి మహమ్మదీయరాజ్యములోనిప్రదేశము నాక్రమించుకొనుచుండుటయు జరుగుచుండెను. ఇట్టియుద్ధము లనేకములు విజయనగరరాజులకును మహమ్మదీయులకును జాలకాలము జరిగెను. కృష్ణరాయలు సింహాసన మధిష్ఠించునాఁటికిఁ బైరెండుదుర్గములును విజాపురప్రభువులక్రింద నున్నవి. అప్పుడు విజాపురప్రభువుగా యూసుఫ్ ఏదుల్ ఖా ననునాతఁడుండెడివాఁడు. ఈదుర్గములు విజయనగరసింహాసనమునకు స్వాధీనమైనఁగాని యారాజ్యమునకు నెమ్మది కలుగదు. విజాపురమహమ్మదీయప్రభువులు సమయముచూచి, విజయనగరరాజ్యములోనికిఁ బ్రవేశించి, దానిని నాశనము జేయఁబ్రయత్నించెదరు. తక్కిన మహమ్మదీయ రాజ్యములు వారికిఁ దోడుపడినచో సర్వనాశనమగును. కావున రాయచూరుదుర్గమును బట్టుకొనుటయు, మహమ్మదీయులు కృష్ణదాఁటి యివ్వలకు రాకుండఁ గాపాడుకొనుటయు రాయల కత్యవసరకార్యములు.

### VII (1) (3) ప్రతాపరుద్రగజపతి

రాయలు సింహాసనమునుగైకొనునప్పటికి ఉత్కళ (ఒరిస్సా) దేశాధిపతియగు ప్రతాపరుద్రగజపతి మిగులఁ బరాక్రమవంతుఁడై యిప్పటినెల్లూరు, గుంటూరు కృష్ణామండలములను నైజామురాష్ట్రమునందలి తెలంగాణాజిల్లాలను గోదావరి, విశాఖపట్టణము గంజాము మండలములను దనస్వాధీనమునం దుంచుకొని సమయముదొరికినచో విజయనగరసింహాసనమును మ్రింగివేయవలయునని చూచుచుండెను. పూర్వ మీప్రదేశమంతయుఁ బ్రౌఢదేవరాయలకాలములో విజయనగరసామ్రాజ్యముక్రింద నుండెడిది. ఆతనియనంతరమునఁ బ్రతాపరు

ద్రిగజపతిపితామహుఁడైన కపిలేంద్రగజపతికాలములోను దండ్రియైన పురుషోత్తమగజపతికాలములోను గ్రమక్రమముగా నీప్రదేశమంతయు గజపతులస్వాధీనమైపోయినది. సాళువనరసింగరాయలును తుళువనరసనాయకుఁడును వీరనరసింహరాయఁడును గూడ గజపతులను జయించలేకపోయిరి. కృష్ణదేవరాయలు జయింపవలసినవారిలో గజపతి ముఖ్యుఁడు; ఇతఁడు విజయనగరసింహాసనమునకుఁ బ్రబలవిరోధి. మూఁడు తరములనుండి పాదుకొనిపోయి, విశేషదేశమును; గొప్పగజబలమును గలిగి విజయనగరమునకుఁ బక్కలోనిబల్లెమువలె యున్న యితనిని జయించినఁగాని విజయనగరరాజ్యమునకు నిలుకడ యుండదు.

ఒకప్రక్క నశ్వపతులును నొకవంక గజపతులును బ్రబలశత్రువులుగా నున్నసమయమున, మఱియుఁ దనసామంతులుకొందఱు తిరుగుబాటొనర్చుచున్నతరుణమునఁ గృష్ణరాయమహీపతి కర్ణాటకసింహాసన మధిరోహించెను. ఇట్టిప్రబలశత్రువులను జయించి రాయలు తన రాజ్యము నెట్లు వ్యాపింపఁజేసెనో తెలిసికొనవలసియున్నది.

కృష్ణరాయలు క్రీ. శ. ౧౫౦౯ సంవత్సరము జూలై ౨౬ వ తేదీని రాజ్యాధికారమును స్వీకరించి, ౧౫౧౦ వ సంవత్సరము జనవరి నెల ౨౪ వ తేదీని బట్టాభిషిక్తుఁడయ్యెనని పైనివ్రాసియుంటిని. రాజ్యస్వీకారానంతరము దాదాపుగనాలుమాసములు శత్రురాజ్యముల వంకకుఁ బోవక తన రాజ్యములోపలివ్యవహారములను జక్కచేసికొనుటలోఁ గడపెను. తనసామంతులలో నెవరు రాజభక్తి గలిగి తనకుఁ దోడునీడగ నుండిరో, యెవరు తిరుగబాటుగనుండిరో, యెవరు యిటు నిటుగాక యూగులాడుచుండిరో తెలిసికొనియెను. పరదేశములకు గూఢచారులను బంపి శత్రువులొనర్చుకుట్రలను వారిశక్తిసామర్థ్యములను నెప్పటికప్పుడు తెలిసికొని వానికిఁ దగినయుపాయముల నాలోచించుచు దనబొక్కసమును జాగ్రతగ నభివృద్ధి చేసికొనుచుఁ బదాతులను గజాశ్వదళములఁ బెంపొందించుకొనుచుండెను. ఈకార్యములలోఁ దనయపారబుద్ధికౌశలముచే హితవుఁగఱపి రాయలకు సర్వవిధములఁ దోడుపడినవాఁడు తిమ్మరసుమంత్రి.

## VII (2) రాయల మొదటియుద్ధము

ఈవిధముగఁ దనరాజ్యములోపలివ్యవస్థను జక్కఁబఱచుకొని శత్రుజయమునకై యుద్ధసన్నద్ధుఁడయ్యెను. రాయలు మొట్టమొదట మహమ్మదీయులతో యుద్ధముచేసినట్లును, నం దొకసుల్తానును రాయలు పరిభూతునిగఁ జేసినట్లును హంపిశాసనమునందలి "పరిభూతసురత్రాణేన" యను వాక్యమువలనఁ దెలియుచున్నదిI. ఈశాసనకాలము క్రీ.శ. ౧౫౧౦ సం॥ జనవరి నెల ౨౮ వ తేదీ. దీనినిబట్టి యీయుద్ధము ౧౫౦౯ వ సంవత్సరమునఁ గడపటిపాదమున జరిగియుండవలయును. యుద్ధము జరుగకుండ నొకసుల్తానును పరాభవించుట యసంగతము. ఈయుద్ధ మెవరితో నెచ్చట జరిగెను? అందు రాయలచే జయింపఁ బడినమహమ్మదీయప్రభు వెవ్వరు? అనువిషయము లిటఁ జర్చనీయములు

### VII (2) (౧) పరిభూతసురత్రాణబిరుదము

ఈవిషయమును జర్చించుటకు ముందుఁ బైనివ్రాసినబిరుదమునుగూర్చి కొన్నిసంగతులు తెలిసికొనవలసియున్నది. "పరిభూతసురత్రాణేన" యనువాక్యము శాసనమునందు రాయలప్రశస్తిలో నున్నది. సామాన్యముగాఁ బ్రశస్తి వంశపారంపర్యముగ వచ్చుచుండును. ఈ బిరుదము వంశానుగతముగ వచ్చినదియా? లేక రాయలకాలములో రాయ లొనర్చినపరాక్రమకార్యములవలన సంపాదింపఁబడినదియా? యని యాలోచించుట కర్తవ్యము. ఇదివంశానుగతమయ్యెనేని, దీనిని బట్టి క్రొత్తగ నాలోచింపవలసినయావశ్యక ముండదు. రాయలు తన స్వశక్తిచే సంపాదించిన దందుమేని, ఎవనిని బరాజితునిగాఁ జేసినందువలన నీబిరుదము వచ్చినదియో యెఱుంగవలసియున్నది. ఈబిరుదము వంశానుగతమైనను, రాయలు తనభుజశక్తిచే మఱియొకఘనకార్యము నొనర్చి యాబిరుదమును, నిలుపుకొనెనని యో, లేక యదివంశానుగతము కాదనియో, తలంచి యీవిషయమును జర్చించిచూతము.

"పరిభూతసురత్రాణేన" యనువాక్యముతో సంబంధించినయుద్ధము ౧౫౦౯-౧౦ లో బహుమనీసుల్తానుతో జరిగె ననియు, నంచు

I ఎపి. ఇండియా సం ౧. పుట ౩౬౧

విజాపురనవాబగు యూసుఫ్ ఆదిల్ ఖానుఁడు రాయలచే నిహతుఁడయ్యె ననియు సుప్రసిద్ధపరిశోధకులగు డాక్టరు వెంకటరమణయ్యగారు వ్రాసి యున్నారు.౧ కాని నేను వారియభిప్రాయముతో నేకీభవింపఁజాల కున్నాఁడను.

## VI (2) (౨) రాయలు మహమ్మదుషాహాతో రణమొనర్చెనా?

బహమనీసుల్తానగు మహమ్మదుషాహా, యెందుకొఱకెచ్చట రాయలతో నీయుద్ధమును జేసెనో వారు చెప్పలేదు. విజయనగరము నకుఁ బ్రబలప్రత్యర్థిగనున్నవాఁడు బీజపూరునవాబగు ఆదిల్ ఖానుఁడు. వీరనరసింహరాయలకాలములో నితఁడు ఆదవాని, కందనోలుదుర్గముల మీఁదకు దండెత్తిపోయి, యాతనిచే నోడింపఁబడి వెనుకకుఁబాఱిపోయి యుండెను. ఈయుద్ధములలో నెప్పుడును బహమనీసుల్తా నీతనికి సాహాయ్య మొనర్పలేదు. బహమనీసుల్తాను రాయలతోఁ బోరి, విజయనగరరాజ్యమందలి కొంతభాగమును జయించినను, నదివిజాపుర ప్రభు వైనయూసుఫ్ ఆదిల్ ఖానునకుఁ బోవునుగాని సుల్తానునకుండదు. సుల్తానుప్రభుత్వము నంగీకరింపక, స్వతంత్రముగఁ దనరాజ్యమును బరిపాలించుకొనుచున్నయాదిల్ ఖాను, తనరాజ్యమునకును విజయనగర రాజ్యమునకును నడుమ సుల్తాను, సుల్తానురాజ్యమును స్థాపించుటకు సమ్మతింపఁడు. సుల్తానునాజ్ఞప్రకారము వర్తించుట కాదిల్ ఖాన్ ఆతనికి లొంగియున్నవాఁడు కాఁడు. సరియేకదా సుల్తానును గుల్బర్గాదుర్గమున బందీకృతునిగాఁ జేసిన దీయూసుఫ్ ఆదిల్ ఖానుఁడే యనియొక వాద మున్నది. దానినిగూర్చి తరువాత వ్రాసెదను.

కేవలరాజ్యకాంక్షచేఁగాక మతసంరక్షణకై మహమ్మదుషాహా కృష్ణరాయలపై దండెత్తి వచ్చెనాడనినచో నదియుఁ బొసఁగదు. క్రీ.శ. ౧౫౦౧ లో నొకసారిసుల్తాను, విగ్రహారాధకు లగువిజయనగరరాజులతోఁ బోరుసల్పుచుండుఁ డని తనయమీరులకును సరదారులకును నాజ్ఞయిచ్చియుండె ననిడాక్టరుగారు వ్రాసియున్నారు. ఆయాజ్ఞయిచ్చిన నాఁటికిని బ్రస్తుతికథాకాలమునకును నడుమ పదేండ్లు గడచినవి. ఈ

౧. భారతి విరోధి. ఆషాఢము ౭౬—౭౬ పుటలు

మధ్యకాలములో మహమ్మదుషాహాకును సరదార్లకును బొత్తు పూర్తిగాఁ జెడిపోయినది. సుల్తానుమాట నెవ్వరును లక్ష్యము సేయుటలేదు. ఆతనిమంత్రియే యాతనిని జెఱపట్టి రాజ్యమును గైకొనుస్థితిలో నున్నాఁడు. ఇట్టిసమయమున మహమ్మదుషాహా రాయలతో రణము సేయుటకై వచ్చెననుట కవకాశము లేదు.

క్రీ. శ. ౧౫౧౦ వ సంవత్సరముననో, యంతకుఁదరువాత కొలఁదికాలముననో, మహమ్మదుషాహా గుల్బర్గకోటలో, బందీకృతుఁ డయ్యెననుమాట వాస్తవము. అతనిని ౧౫౧౨ వ సంవత్సరమునఁ గృష్ణరాయలు చెఱనుండి విడిపించి, బీదరుసింహాసనము నెక్కించి యవనరాజ్యస్థాపనాచార్యుఁ డగుటయు వాస్తవము. క్రీ.శ. ౧౫౧౯-౧౦ లో మహమ్మదుషాహా కృష్ణరాయలపై దాడివెడలియుండినచో, నట్టిశత్రువును, రాయలు చెఱనుండి విడిపించియుండఁడు. దీనినిబట్టి కూడ ౧౫౧౯ లో రాయలపై మహమ్మదుషాహా దండెత్తియుండఁడని నిశ్చయింపవలసియున్నది.

ఈ ౧౫౧౯-౧౦యుద్ధమే హంపీశాసనమునకుఁ దరువాతకూడఁ గొనసాగెననియు, నందే, గోలకొండసరదుస్థలమున, గోవెలకొండ సమీపమునందు గృష్ణరాయలచే క్రీ. శ. ౧౫౧౯ ఫిబ్రవరి 3 తేదీ ౧౫౧౦ సం॥ ఫిబ్రవరినెల ౨౫ తేదీలనడుమ ఆదిల్‌ఖాను మృతినందెననియు, నారణరంగమున మహమ్మదుషాహాయును, గోలకొండ, అహమ్మదునగరప్రభువులుగూడ నుండిరనియు, నాయుద్ధమున మహమ్మదుషాహా పరాజితుఁడై మరలిపోయె ననియు, శ్రీవెంకటరమణయ్యగా రభిప్రాయపడిరి.

౧౫౧౯-౧౦ లో జరిగినదనెడి యీాయుద్ధమెప్పు డేస్థలమున నారంభమైనదో యెచ్చట నెప్పుడు ముగిసినదో, సుల్తానెవ్వ డెచ్చటఁ బరాజితుఁ డయ్యెనో శ్రీడాక్టరుగారు చెప్పలేదు. ఈసంగతులు తెలిసినఁగాని యీాయుద్ధవృత్తాంతము మనకుఁ బూర్తిగఁ దెలియదు.

గోలకొండసరదుస్థలమున ౧౫౧౯-౧౦ లో యుద్ధము జరుగనే లేదనియు, నచ్చట ౧౫౧౨ లో విజాపురము, గోలకొండ, అహమ్మదు

నగరరాజులకును కృష్ణరాయలకును నొకయుద్ధము జరిగినదనియు నందు మహమ్మదుషాహా లేఁడనియు, నారణమునసే ఆదిల్‌ఖానుఁడు మరణించెననియు నాయభిప్రాయము.

ఈవిషయములను స్పష్టముగాఁ దెలిసికొనుటకు ముందు రాయచూరుదుర్గ మెవరిస్వాధీనమున నుండెననుటనుగూర్చి యాలోచింపవలసినయావశ్యకము కలదు.

## VII (2) (3) ౧౫౧౮ లో రాయచూరు ముద్గల్లు దుర్గము లెవరిస్వాధీనమునం దున్నవి ?

కృష్ణా తుంగభద్రానదులయంతర్వేదియందు, రాయచూరు ముద్గల్లు నను రెండుప్రధానదుర్గములుండె ననియు, వానికొఱకై విజయనగరరాజులకును, మహమ్మదీయులకును దఱచుగా యుద్ధములు జరుగుచుండెడి వనియు, నాదుర్గము లెవరిస్వాధీనమునందుండునో వారిస్వాధీనమునందే సామాన్యముగాఁ బైనిజెప్పిన రెండునదులనడుమనుండుప్రదేశ ముండుననియు నందుచేనా రెండుదుర్గములును బ్రాధాన్యము వహించిన వనియుఁబైనివ్రాసియున్నాఁడను.

"సాళువనరసింహరాయలకాలములో నాదుర్గములను దురుష్కులాక్రమించుకొనిరి. కావున విజయనగరసింహాసనాసీనులగురాజులాబలాఢ్యదుర్గములనుస్వాధీనపఱచుకొనవలసినదని సాళ్వనరసింహరాజు తనమరణశాసనమునందు వ్రాసియుంచెను"[౧] ఆతనిపిమ్మట తుళువనరసనాయకుఁ డాదుర్గములను వశపఱచుకొనఁబ్రయత్నించియు విఫలుఁడయ్యెను. ఆతనికాలములో నాదుర్గములు విజాపురనవాబగుఆదిల్‌ఖాన్ వశమునందుండెను. వీరనరసింహరాయ లాదుర్గములను స్వాధీనపఱచుకొనుటకుఁ బ్రయత్నింపనే లేదు. ఆతనికాలములో నాదిల్‌ఖానుఁడు తుంగభద్రానదినిగూడ దాఁటి ఆదవాని, కర్నూలుదుర్గములపై దండెత్తిరాఁగా నాతనిని యచ్చటనుండి పాఱఁద్రోలి మరలతుంగభద్రానదిని దాఁటించుటయే కష్టమయ్యెను. కావునఁ గృష్ణరాయలు

౧ మహమ్మదీయ మహాయుగము. పుట ౩౬౧,

రాజ్యాధికారమును స్వీకరించునప్పటికి రాయచూరు ముద్గల్లుదుర్గ ములు ఆదిల్‌ఖాను స్వాధీనమునందున్నవనుట నిశ్చయము.

౧౫౭౯-౮౦ వ సంవత్సరములో నవఁగా బహుమనీసుల్తానును, ఆతనితో విజాపురము,గోలకొండ, అహమ్మదునగరనవాబులును గలిసి యుద్ధమునకు వచ్చిరనిచెప్పినకాలమున, రాయచూరుముద్గల్లుదుర్గము లెవరిస్వాధీనమునం దున్నవి ? అనుప్రశ్నకుసమాధానము కావలసి యున్నది. ఇవి విజాపురనవాబుస్వాధీనమం దున్నవందుమేని, యీ యుద్ధము గోలకొండసరదుస్థలములయందుఁగాక, కృష్ణాతుంగభద్రల యంతర్వేదియందుఁ బ్రారంభము కావలయును. మఱియువిజాపుర సైన్యము లదివఱకే యాస్థలమునం దున్నవని తలంపవలసియుండును. ఈరెండుసందర్భములునుగూడ సత్యములు గా వని రాయవాచకము నందలియీక్రిందివాక్యములు ఋజువు సేయుచున్నవి.

### రాయవాచకమునందలి వాక్యములు: వానిఫలితము

“గోలకొండవారి సరహుస్థలాలకై నడవంగా అక్కడ మూడు తెగల రాతులున్న మోర్చావేసి పాళ్యము దిగినారు. వేగర్లు వచ్చి రాయలదేవునితో తురకలు లక్షగుఱ్ఱాలుతోడట్టున్న వెయ్యియేనుగు లతోడట్టున్న కృష్ణదాంటివచ్చి పాళ్యం దిగినారని విన్నపం సేయంగా రాయలువారు విని 'తురకలు కృష్ణవేణిదాంటి వచ్చి డేరిజా వేసి దిగేర్రా' అని ఆగ్రహించుకొని అమరనాయకం వారలలో పెమ్మసాని రామలింగనాయణ్ని బిలిచి 'తురకలు కృష్ణవేణి' దాంటి వచ్చి డేరి జా వేసి పాళ్యం దిగినారట. ఇందులకు యేరీతున నడవవలెనో ? అని అడిగినందులకు 'తురకల కార్య మనంగా యెంతమాత్రం ? దేవర వారి ప్రతాపంవల్ల డేరిజాతాళ్ళు తెగకోసెను. అప్పుడు భేరి తాడ నంసేసి నడిస్తేను తురకలు మూడుతెగలున్నూ విరిగి యథాయథలై తమతమస్థలాదులకు పొయ్యేటట్టు సేసేను' అని విన్నపం శాయగా రాయనవారు చాల సంతోషపడి రామలింగమ నాయనికి వస్త్రాలు యిచ్చి అంపగా రామలింగమనాయడు వెలువడిని వచ్చెను”.౧

---

౧. శ్రీవెంకటరమణయ్యగారి వ్యాసము. భారతి, విరోధి-శ్రావణము - ౧౮౪ పుట

"ఆక్షణాన్నె కృష్ణవేణి వుభయతీరాలున్ను ప్రివాహాంనిండి రాసాగెను. జగడముఖానను తురకలయేనుగల మొనచేస్తే గ్రీష్మకాలం యెండచేతను డస్సినయేనుగులు గనక దగదప్పి పుట్టి చల్లగాలిచేత కాలుజారి కృష్ణవేణిలో బోయి పడెను. గుఱ్ఱాలరౌతులు "యేరు నీళ్లు వచ్చెను. యివతలనుండి కార్యంకా"దని గుఱ్ఱాలవారు యేనుగలవెంబడినే తిరిగిరి. మొదటిదొరలు ముగ్గురున్ను 'దైవికంగా పెడతలపోటుగా ప్రివాహంవచ్చె గనక యిక్కడను పాళ్యందిగి జగడమిచ్చేటంటే రస్తు సామగ్రిలును అమరదు. అన్నింటికిన్ని యేఱు దాంటి ఆవల నిల్చి సరిపోయినట్లు నడిపించుకొందాము' అని సీమకు తిరుగగానె యేరు నిండారుగా వచ్చెను. రాయలవారున్ను వెంబడించి నడచి జగడం సేయగా అందరున్ను విరిగి పారిపోయిరి. మూడు తెగల తురకలున్ను హతశేషులైనవారిగూర్చుక విజయాపురం, గోలకొండ, అహముదానగరం చేరబోయినారు."[౨]

ఈవాక్యములవలన మనకు రెండువిషయములు స్పష్టమగుచున్నవి. (1) ఈయుద్ధములో, విజాపురం, గోలకొండ, అహముదానగరము, ప్రభువులు ముగ్గురే తప్ప బహుమనీసుల్తానుగాని యాతనిసైన్యములుగాని పాల్గొనలేదనుట. నిజముగా నాతఁడీయుద్ధమునకు వచ్చియుండినయెడల, ముఖ్యముగా నాతనిపేరు ముందుగాఁ జెప్పఁబడియుండును. లేదా అధమము నల్గురు తురకదొరలని చెప్పియుండును. కృష్ణరాయలచేఁ బరాజితులయినవారు విజాపురము, గోలకొండ, అహమ్మదానగరదొరలని స్పష్టముగాఁ జెప్పుచుండ, మహమ్మదుషాహా నందుఁ జేర్చుటెట్లు? కావున బహుమనీసుల్తానీయుద్ధమునలేఁడనుట నిశ్చయము.

[ముగ్గురు తురకదొరలును మూఁడు పాళ్యములుగా విడిసి డెరీజా వేఱుగా వేసినారని రాయవాచకమునఁ జెప్పియుండుటచే డెరీజాయం దింకొక రుండినట్లర్థమనియు నందు సుల్తానుమహమ్మదుషాహా యున్నట్లు భావింపవలయుననియు శ్రీ వెంకటరమణయ్యగారి

౨. శ్రీవెంకటరమణయ్యగారి వ్యాసము. భారతి, విరోధి శ్రావణము. ౧౫౫ పుట.

యభిప్రాయము. అంతమాత్రముచే బహమనీసుల్తా నందున్నాఁడని భావింప నగత్యము లేదనియు, ముగ్గురుదొరలు వేలువేలుగా పాళ్యెములుగానున్నను డేరీజాను గాపాడుభారమును ముగ్గురును వహించి తమతమసైనికులలో ముఖ్యులయిన సరదారులను పరాక్రమవంతులైన సైనికులను ఏర్చి డేరిజావద్దనుంచి కాపాడుచుండిరని తలఁపవచ్చుననియు నా యభిప్రాయము.]

(౨) పై వాక్యములవలన స్పష్టమైన రెండవయంశ మీయుద్ధమునాఁటికి రాయచూరుముద్గల్లు దుర్గములు విజాపురప్రభువుక్రింద లేవనుట. అవి యాతని క్రిందనున్నచో, ముగ్గురుతురకల సైన్యములు కృష్ణదాఁటి వచ్చుచున్నవని వేగరులు, కృష్ణరాయలకుఁ దెలుపుట పొసఁగదు. విజాపురసేనలు కొన్ని క్రొత్తగాఁ దక్కిన యిరువురు తురుష్కప్రభువులతోఁ జేరి వచ్చుచున్నందున వా రట్లు చెప్పిరని తలంచినను, వారందఱును రాయచూరు ముద్గల్లు దుర్గములలో విడిసి, యాదుర్గములకును, తుంగభద్రానదికిని నడుమ, పాళ్యెముల నేర్పరచుకొని డేరీజా వేయుట తటస్థించును గాని, కృష్ణానదీతీరమున డేరిజా వేయుట తటస్థింపదు. అదియే సత్య మైనయెడల, విజాపురనవాబు రాయచూరుముద్గల్లుదుర్గములను వానిచుట్టునున్న ప్రదేశములను వదలివేసి యచ్చటిసైన్యములను, వెనుకకుఁ గృష్ణానదీతీరమునకురప్పించినట్లగును ఇది రణనీతి కాఁజాలదు. కావున నప్పటి కా దుర్గములు విజాపురనవాబుక్రింద లేవనియు, వానిని స్వాధీనము చేసికొనుట కొఱకే, తురుష్కులు కృష్ణనుదాఁటివచ్చి యానదీతీరమున దండు విడిసిరనియు నిస్సంశయముగా నిశ్చయింపఁదగియున్నది.

---

౧ డేరిజా యనఁగా యుద్ధరంగమున వేయుడేరా (వెలిగుడారము) శత్రువులు డేరీజాను పడగొట్టకుండ జాగ్రతగా గాపాడుచుండుభారము డేరీజావేసినవారిది. శత్రువు లీడేరాను పడగొట్టిరేని, డేరిజావేసినవారి కపజయము వచ్చిన దనియర్థము. దానితో, వారిసైనికులకు నిరుత్సాహమును శత్రుసైనికులకు జయోత్సాహము నధికమగును. కావున డేరీజాచుట్టును పరాక్రమవంతులును ధైర్యసాహసముగలవారును గాపలా కాయుచు శత్రువులు దానిసమీపమునకు రాకుండఁ గాపాడుచుందురు. కృష్ణరాయలుకూడ యుద్ధరంగమున నిట్టిడేరిజా యెత్తించెడివాఁడు.

VII (2) (४) రాయచూరుదుర్గము ౧౫౨౦ లో రాయలవశమైనది—

నిశ్చితము లైనపైయంశములనుబట్టి, రాయచూరు ముద్గల్లు దుర్గములను కృష్ణరాయలీయుద్ధాత్పూర్వమే వశముచేసికొనినట్లు సిద్ధాంత మగుచున్నది. అయినచో నతఁడెప్పుడు వానిని స్వాధీనము చేసికొనెనను ప్రశ్నకు సమాధానము చెప్పవలసియుండును. రాయలు రాజ్యాధికారమును స్వీకరించిన నాల్గుమాసములకుఁ బిమ్మట క్రీ. శ. ౧౫౧౦ సంవత్సర నాల్గవపాదమున నాదిల్ ఖాను ఏమరుపాటున నున్నప్పు డాకస్మికముగ రాయ లాదుర్గములపైఁబడి యచ్చటనున్న సైన్యమును బాఱఁదోలి వానిని స్వాధీనము చేసికొనియె నని నిశ్చయింపవలసియున్నది. ఆదిల్ ఖాన్ రణమునకు సన్నద్ధుఁడైయుండకపోవుటచేఁ జేయునదిలేక యాదుర్గములను వదలిపాఱిపోవలసినవాఁడయ్యెను. ఈవిజయమే రాయలహంపిశాసనమున నుదాహృత మయ్యెనని తలంపవలసియున్నది. ఆయుద్ధమున నాదిల్ ఖాను పరాభూతుఁడయ్యెనే కాని మరణింపలేదు. అందుచేతనే యాశాసనమున "పరిభూతసురత్రాణేన" అని లిఖింపఁబడినది.

సుల్తానుశబ్దమునకు సంస్కృతమున 'సురత్రాణ' యనుట కవి సాంప్రదాయము. పైవాక్యములోనిసురత్రాణశబ్దము సుల్తానుశబ్దమునకుఁ బర్యాయపదమనియు, నాదిల్ ఖానునకు సుల్తా ననుపదము నుపయోగించుట ఆకాలపు సాంప్రదాయము ననుసరించి యసంభవమనియు నప్పటికి దక్షిణదేశమున సుల్తానుపదముచే గౌరవింపఁబడుచున్నవాఁడొక్క బహుమనీసుల్తాను తప్ప వేఱొకరు లేరనియు, నందుచే నా శాసనమునందలిశబ్దప్రయోగమునుబట్టి బహుమనీసుల్తానునే రాయలు పరిభవించెనని యర్థము చెప్పవలయుననియు, శ్రీవెంకటరమణయ్యగారియభిప్రాయ మైనట్లు కనుపట్టుచున్నది. హంపీశాసనకావ్యకర్త, యాభేదమును గమనింపక దక్షిణదేశమున నొకగొప్పరాజ్యమునకు స్వతంత్రప్రభువై విజయనగరచక్రవర్తులకుఁ బ్రతిస్పర్థిగనున్న యాదిల్ ఖానునే సుల్తానుశబ్దముచే సూచించినాఁడనియు నంతటివానిని బరాజితునిగాఁ జేసెననుకీర్తిని కృష్ణరాయలకు శాశ్వతముగఁ జేయుసంకల్ప

ముతో సురతాణశబ్దమును శాసనమునఁ బ్రయోగించినారని యని నా యభిప్రాయము. కేవల సురతాణ శబ్దప్రయోగము ననుసరించి, సుల్తాను బిరుదమున్నంతమాత్రమున నెట్టి సంబంధములేని మహమ్మదు షాహా, రాయలతో నాకాలమున యుద్ధమొనర్చె ననితలంచుట సమంజసము కాఁజాలదు.

సురతాణశబ్దమునకు, బహమనిసుల్తానును దప్ప, ఆదిల్‌ఖానునర్థము చెప్పఁగూడదని యనువారలు, కేవలమా శబ్దమునుబట్టి రాయలకును బహమనీసుల్తానునకును ౧౫౧౭–౧౮లో యుద్ధము జరిగెనని నిర్ణయించుటకంటె నది వంశానుగతబిరుదమని నిర్ణయించి, యీ యుద్ధముతో సంబంధించినచర్చకును నాబిరుదమునకును సంబంధమును గలుపకుండుటయే లెస్స. బహమనీసుల్తాను, క్రీ.శ. ౧౫౦౯ లోనో అంతకుఁబూర్వమో యొకసారి విజయనగరరాజులచే విజితుఁడై వెనుకకుఁ బోయియుండును. "పరిభూతసురత్రాణః" యనువాక్య మున్నప్రశస్తిగలపూర్వుల శాసనములు మనకు లభింపకపోయి యుండవచ్చును.

ఆపక్షములోఁగూడ రాయలు, బీజపూరునవాబునోడించి యీ తనిస్వాధీనమున నున్నరాయచూరుముద్గల్లుదుర్గములను, ౧౫౧౭–౧౮లో ఉమ్మత్తూరు దండయాత్రకుఁబూర్వము తనవశము చేసికొనెననుట మాత్రము నిశ్చయము.

కృష్ణదేవరాయలపట్టాభిషేకము శుక్లసంవత్సరమాఘ శు ౧౪ నాఁడు జరిగెనని పైనివ్రాసియుంటిని. అదియును బైహంపీశాసనసిద్ధాంతమును నేకకాలమున జరిగినవి విరూపాక్షస్వామికి మండపగోపురనాగాభరణాదిసమర్పణముకూడ నాకాలముననే జరిగినది. ఆకాలము క్రీ.శ. ౧౫౧౦ సంవత్సరపు జనవరిమాసాంతము. రాయ లాకాలమున నామహోత్సవములలోఁ బాల్గొనుచున్నాఁడు. ఆకాలములోఁ గృష్ణవేణీనదీతీరమునఁగాని గోలకొండసరిహద్దులలోఁగాని, మహమ్మదీయులతో రణము సలిపెనని యెంచుటకణుమాత్రము నవకాశము లేదు. ఆమహోత్సవము లైనపిమ్మటఁ గొన్నినెలలు విశ్రాంతిగైకొని క్రీ.శ ౧౫౧౦సంవత్సర మధ్యకాలమునుండి దాదాపుగ ౧౫౧౧ సంవత్సరాంతము

వలెను, రాయలు, ఉమ్మత్తూరు మొదలుగా దక్షిణ దేశ దండయాత్రలో నిమగ్నుఁడై యున్నాఁడు ముగ్గురు తురకదొరలతో గోలకొండ సర దుస్థలములలో జరిగినయుద్ధమును, ఆదిల్‌ఖానుని మరణమును దక్షిణ దేశ దండయాత్రానంతరము న జరిగినవి వానినిగూర్చి తరువాత వ్రాసెదను. ఉమ్మత్తూరుయుద్ధము ౧౫౧౦-౧౧లో జరిగెనని చరిత్ర కారు లందఱు నేకగ్రీవముగా నంగీకరించుచున్నారు.

## VII (2) (అ) మొదటి రాయచూరు యుద్ధము

ఉమ్మత్తూరు ప్రభు వగుగంగ రాజుపై యుద్ధమునకు వెడలుటకుఁ బూర్వము రాయలొకయుద్ధమును గావించి కొన్నిదుర్గముల నాక్రమించినట్లు కృష్ణరాయవిజయమునందలి యీక్రిందిపద్యగద్యములవలనఁ దెలియుచున్నది.

"సీ. రటిళదిక్తటచట త్పెటపెటార్భటులతో
ఘోరమైన తుపాకిగుండ్లచేత
దవ్వుదవ్వన హెచ్చి రివ్వురివ్వనవచ్చి
ప్రసరించు రాచూరిశాణములను
పెల్లుగా వెస చిత్రజల్లుగా వెదజల్లు
పెంపరుల్ బెంపారువంపగముల
ధాటీగతి నటింప మాటికి నూటిగా
నాటుకొన్ బల్లెంపుటీటిగములు

తే నఱిమి తఱిమిన భయమున విఱిగి జరగి
నిజబలంబులధాకకు నిల్వలేక
శరణుజొచ్చినవారలఁ గరుణఁ జూచి
యచటిదుర్గస్థలంబుల నాక్రమించి.

వ. "అనంతరం బొకక్షుహరుమత్తున నుమ్మత్తూరు శివసముద్ర స్థలంబుల నెసంగు గంగరాజునొడయుల నోడించి తదీయ స్థలంబున నాశెంబులు, బలిమ్మించి శ్రీరంగపట్టణంబు నిరీక్షించి
.........."

ఈపద్యమున వర్ణితమైన యుద్ధమే రాయలకును ఆదిల్ ఖానునకును ౧౫౨౦ లో జరిగినయుద్ధమనియు నిందు రాయలు లాక్రమించుకొని నట్లు చెప్పినదుర్గములే. రాయచూరు, ముద్గగల్లులనియు, నిం దాదిల్ ఖానువధ జరుగ లే దనియు నాయభిప్రాయము. దీని నీగ్రంథమున మొదటిరాయచూరుయుద్ధ మనివాడుచున్నాఁడను.

గంగరాజుఒడయరును, ఆదిల్ ఖానును భిన్నమతస్థులైనను, వీరిరువురకును విజయనగరప్రభువులు శత్రువులగుటచే శత్రుశత్రువు మిత్రుఁడను సూక్తి ననుసరించి వీరిరువురు మిత్రులుగ నుండిరి. వీరనరసింహరాయలు, ఉమ్మత్తూరుపై దండు వెడలినకాలములో నాదిల్ ఖాన్ విజయనగరముపైని త్రివచ్చి యావిధముగ గంగరాజునకు సాహాయ్య మొనఁగూర్చుటచే నాతనికి జయ మొనఁగూడినది. కృష్ణరాయల కుమ్మత్తూరువిజయమే మొదటికార్య మైనను, ఆదిల్ ఖానునుండి, రాయచూరుముద్గగల్లుదుర్గములను గైకొనకుండినచో, వీరనరసింహరాయలనాఁటివలెనే తాను, దక్షిణమునకుఁ బోయినయెడల, నాతఁడు విజయనగరమువంక రావచ్చునని యోచించి, ముందుగ, రాయచూరుపైఁ బడి యాదుర్గములను వశముచేసికొనియెను. ఈరణములో నాదిల్ ఖాను పరాజితుఁడయ్యెను. ఇదియే హంపీశాసనమున లిఖింపఁబడినది.

## VII (3) దక్షిణదేశవిజయము

ఈవిధముగఁ గృష్ణరాయలు ౧౫౨౦ సంవత్సరములో రాయచూరు మొదలగుదుర్గములను స్వాధీనము చేసికొని, యాదుర్గసంరక్షణమునకై తగినయేర్పాటులను గావించెను. మఱియు, మహమ్మదీయులు కృష్ణానదిని దాఁటి రాకుండునట్లు కట్టుదిట్టములను జేసెను.

ఇఁక బలవంతులైన గజపతులతోఁ బోరుసల్పుటకుముందు దక్షిణదేశమునఁ దనప్రభుత్వమును నిష్కంటకముగఁ జేయవలయునని తలఁచి, మొట్టమొదటఁ దనకుఁ గప్పముచెల్లింపక తిరుగుబాటు చూపుచున్న యుమ్మత్తూరుప్రభు వగుగంగరాజును జయింపఁగోరి, రాజనీతిచతురుఁ డగురాయలు భేదోపాయముచే గంగరాజువొడయరుకుఁ బ్రత్యర్థిగనున్న యాతనిదాయాదియగునిమ్మడిచిక్కరాయలను దనవంకకుఁ

దిప్పుకొని, కొంతరాజ్య మిచ్చెదనని యాశపెట్టి యాతఁడు సాహాయ్య మొసంగుచుండఁ ఉమ్మత్తూరు, శివసముద్రము, శ్రీరంగపట్టణపుదుర్గములనుజయించెను. ఉమ్మత్తూరుప్రభు వగుగంగరాజు కావేరిలోఁ బడి యాత్మహత్య గావించుకొనెను. ఉమ్మత్తూరు మొదలగుదుర్గములను బట్టుకొనుటకు రాయల కొకసంవత్సరము పట్టినట్లు కనుపట్టుచున్నది. తనతోఁగూడనున్న యిమ్మడిచిక్కరాయలను నుమ్మత్తూరునకుఁ బ్రభువుగాఁ జేసెను. ఉమ్మత్తూరుప్రభు వగునీచిక్కరాయల శాసనమొకటి కోయంబత్తూరుమండల మంపలికుంతూరు గ్రామమందున్నది.౧ ఆశాసనకాలము శా.శ. ౧౪౩౪ ఆంగీరససంవత్సరజ్యేష్ఠశు౧౩ (క్రీ శ. ౧౫౧౨-మే నెల 30వ తేదీ) దీనినిబట్టి యుమ్మత్తూరుయుద్ధ మింతకుఁబూర్వమే ముగిసినదని నిశ్చయింపవచ్చును. లేకున్న నీశాసనమున నీచిక్కరాయలు ఉమ్మత్తూరుప్రభువునని వ్రాసికొనఁజాలఁడు.

అనంతపురమండల మంధ్రలిబుక్క పట్టణమున నున్నయొకశాసనమునుబట్టి, కృష్ణరాయలు ౧౫౧౨ సం॥ ఆగస్టునెలలో శివసముద్రమున నున్నాఁడని డా. వెంకటరమణయ్యగారు వ్రాసియున్నారు.౨ బుక్కపట్టణశాసనపూర్తిపాఠము నాకు లభింపలేదు. దొరతనమువారి 'సాలువారీ' రిపోర్టునందు ఆంగీరస శు౧౨ బుధవార మనియున్నది.౩ మాసమున్నభాగము శిథిలమైనది. ఆగస్టునెలయనుటకు డాక్టరుగారి కాధార మేదియో తెలియలేదు. రాయలవారియాజ్ఞ పెనుగొండలో జరిగినలక్షహోమోత్సవసందర్భమున వెల్లడిచేయఁబడినట్లందువ్రాయఁబడియున్నది. సామాన్యముగా లక్షహోమము, లక్షపత్రిపూజ మొదలయినవి కార్తికమాసములోఁ జేయుదురు. ఉత్థానద్వాదశికావున నాఁడు లక్షహోమము చేసిరనినిశ్చయించి యామాసము కార్తికమని పూర్తిచేయవలయును. అయినచో నాదినము దాదాపుగ నక్టోబరుమాసాంతమగును గాని ఆగస్టుకాదు. కార్తికమాసమువఱకును,

---

౧. ద. హిం. శా. సం ౯ సంఖ్య ౩౦౧.

౨. శ్రీ వెంకటరమణయ్యగారి వ్యాసము. భారతి-విరోధి-వైశాఖము-౪౦౨ పుట.

౩. A. R. 180 of 1913,

రాయ లుమ్మత్తూరుదండయాత్రలో నిమగ్నుఁడై యున్నాఁడని తలంప రాదు. ఆదండయాత్రలోఁ బైనిజెప్పినరీతిగఁ జ్యేష్ఠమాసమునకుఁ జాల పూర్వమే విజయము సమకూరినది. కార్తికమాసములో రాయ లేదేనికారణమువిూఁద శివసముద్రము వెళ్లియుండును, లేదా యంత కుఁబూర్వ మెప్పుడో యీయాఁబడినయాజ్ఞ నానాఁడు వెల్లడిచేసి, శాస నము వ్రాయించియుండవలయును. శాసనపూర్తిపాఠము లభించినఁ గాని యీవిషయమును నిర్ధారణము సేయఁజాలను.

ఉమ్మత్తూరుదండయాత్రలో విజయము చేకూరినపిమ్మట రాయల దక్షిణదేశదిగ్విజయమును గూర్చి శ్రీలక్ష్మణరావుపంతులుగా రిట్లు వ్రాసియున్నారు[౧].

"ఇట్లుకర్ణాటకము జయించినపిదప కొడగు (Coorg) మళయా ళము అనుదేశములఁగెలిచి యచ్చటిరాజు లిచ్చుకప్పము నిర్ణయించు కొని పాఁడ్యాదిదక్షిణదేశములను జయించుటకై లక్షసేననిచ్చి విజ యప్పనాయకుఁడు వెంకటప్పనాయకుఁడు అనువారిని బంపెను. విజ యప్పనాయకుఁడు వేలూరుప్రాంతమును జయించి వేలూరు మధ్య స్థానము చేసికొని యచ్చటనుండి పన్నులు వసూలు చేయుచుండెను, చిత్తూరు పాలెగాండ్రను, తొండమండలములోనిపాలెగాండ్రను జింజీ దుర్గమును చోళమండలములోనిపాలెగాండ్రను వశపఱుచుకొని వా రీయవలసినపన్నుల నిర్ధారణచేసి, జింజిలోఁ గాపురముండి కృష్ణరాయ లకై పన్నులు రాఁబట్టుకొనుచుండెను. తంజావూరు, తిరుచునాపల్లి, మధుర, తిరునగరురాజులు విజయప్పనాయకునకు వశులై కప్పము లొప్పుకొనిరి. ఇట్లుపూర్వకర్ణాటద్రవిడదేశ మంతయుఁ గృష్ణరాయ లకువశమై మూఁడుకోట్లరూకలిచ్చుచుండెను. కృష్ణరాయ లీదక్షిణ దేశమంతను మూఁడుభాగములుగా విభజించి వానిపై ముగ్గురు నాయకుల నేర్పఱిచెను. జింజీలోనుండు కృష్ణప్పనాయకుఁడు నెల్లూరు మొదలు కొల్లడము (Coleroon) నదివఱకును, విజయరాఘవనాయ కుఁడు తంజావూరిలో నుండి కావేరీనదిప్రవహించుఫలవంతదేశమున

౧ మహమ్మదీయమహాయుగము.

కును వెంకప్పనాయకుఁడు దక్షిణమండలి తిరునల్వేలిప్రాంతమునకును పాలకులుగానుండిరి. ఇట్లు కర్ణాట ద్రావిడ మళయాళదేశము లాంధ్రస్వాధీనమయ్యెను. ప్రస్తుత మాదేశములలోఁ గానవచ్చు తెలుఁగు బ్రాహ్మణులు రెడ్లు మొదలయినవా రాకాలమందుఁ దెలుఁగుదేశము నుండి వెళ్ళినవారే."

కృష్ణరాయల యీదక్షిణదేశ దిగ్విజయమును బ్రత్యేకముగాఁ దెలిపెడిశాసనములు గానరావు. కాని పైనిఁ జెప్పఁబడినప్రదేశముల లోని శాసనములను బరిశీలించినచో నాదేశమంతయుఁ గృష్ణరాయల యేలుబడికి లోఁబడియున్నదని స్పష్టమగును. అట్టిశాసనములు జాలగ నుండుటచే గ్రంథవిస్తరభీతి వానివివరముల నిందీయలేదు. ఉమ్మత్తూరు విజయమును దక్షిణదిగ్విజయవృత్తాంతమును పారిజాతాపహరణమునఁ గ్లుప్తముగవర్ణించియున్నాఁడు.

దక్షిణదిగ్విజయకథలును మొదటిరాయచూరియుద్ధ విషయమును శాసనములలోఁగాని వాఙ్మయమునఁగాని విశేషముగాఁ గన్పడకపోవుటకుఁ గారణ మాప్రదేశము లదివఱకు విజయనగరరాజ్యము లోనివే యగుటయు, వానిని మరలఁ దమయధికారముక్రిందకుఁ దెచ్చుటలో నంతవిశేషములేదని యప్పటివారు తలంచుటయునై యుండును.

## VII (4) రెండవరాయచూరుయుద్ధము

దక్షిణదేశవిజయము పూర్తియై తనరాజ్యమున శాంతి నెలకొనినపిమ్మటఁ బ్రబలశత్రువైన గజపతిని జయించుటకై రాయలు యుద్ధసన్నాహములను జేయుచుండెను. ఇంతలో విజాపురప్రభువు, గోలకొండ, అహమ్మద్ నగరసుల్తానులను సాహాయ్యముగాఁగొని రాయచూరుపై దండయాత్ర సలుప మన్నాఁడని తెలియుటచేఁ గృష్ణరాయలు తనప్రచండసైన్యముతో, రాయచూరునకేఁగి యటనుండి, కృష్ణానదిని దాఁటి ముద్గలు మహమ్మదీయప్రభువులను జయించెను. ఇదియే రెండవ రాయచూరుయుద్ధ మనిచెప్పవచ్చును.

ఈయుద్ధ మెప్పుడు జరిగెనను టనుగూర్చి యాలోచించుటకు ముందు మన మొకవిషయము నాలోచింపవలసియున్నది. ముద్గలు మ

హమ్మీరుదీయ ప్రభువులతో రాయలు యుద్ధ మొనర్చె ననికృష్ణరాయవిజయమందలి యీక్రిందిపద్యములు చెప్పుచున్నవి.

తే. లక్షగుఱ్ఱంబులతోడను లక్షణంబు
మెఱయ బీరాన మూఁడిండ్లతురకదొరలు
కృష్ణవేణికి నీవలఁ గృష్ణరాయ
నృపున కెదురుగ జనుదెంచి నిలిచి రపుడు. 3 ఆ. ౧౧

క. ఆవృత్తాంతము చారుల
చే విశదము గాఁగ విని వజీరులు ముగురున్
భావంబుల నాలోచన
గావింపుచు భయముఁ జెందికళవళపడుచున్. 3 ఆ. ౨౨

ఈముగ్గురురాజులను జయించినందువలననే కృష్ణరాయలకు మూరురాయరగండఁ డనుబిరుదమువచ్చినది. ఈవిజయానంతరము రాయలు తన మంత్రియైన తిమ్మరుసును, "జయించినప్రదేశముల నాక్రమించుకొనవలదా?" యని ప్రశ్నింపఁగా బలవంతుఁడైన శత్రువు ప్రక్కనున్నప్పుడు, వానిని జయింపకుండ, జయించినప్రదేశములు నాక్రమించుట తగదనియు, గజపతినిజయించిన పిమ్మట నీసంగతిని జూచుకొనవచ్చుననియుఁ దిమ్మరుసు ప్రత్యుత్తరమిచ్చెనని కృష్ణరాయవిజయమందలి యీక్రిందిపద్యములవలనఁ దెలియుచున్నది.

"జనవరుఁ డప్పాజి గనుం
గొని యిట్లని పలికె నపుడు కుతుకం బలరన్. 3 ఆ ౪౯

చ. విరిగినవైరులం దఱిమి వేగమె వారలసీమ లెల్ల సు
స్థిరమతి నాక్రమింపవలదే యను డానఱమంత్రిబల్కె భూ
వర యిది వేళగాదు పౌరవం జనవిచ్చి కెలంకులందు స
త్వరు లగుశాత్రవుల్ గదియ వైపు దొరంగదె యెంతవారికిన్.
3 ఆ ౫౦

తే. భూమిపాలక ! గజపతిసీమలోనఁ
గలుగువారలు మించి మార్గములయందు

నెందు ముట్టడి గావించ నెంచ మనకు
రస్తుసామగ్రి చేరుటనుస్తరంబు. 3 ఆ ౫౧

క. తూరుపునం గలగజపతి
వారిదళము నెల్లఁ గెల్చి వరుసన్ జయల
క్ష్మీరమణిఁ జెందు మనవుడు
భేరీభాంకార మడరఁ బృతనాయుతుఁడై. 3 ఆ ౫౨

ఈపద్యములనుబట్టి గజపతిసేనలతో యుద్ధప్రారంభమునకు సన్నిహితపూర్వమే పైనిఁ జెప్పిన రెండవరాయచూరుయుద్ధము జరిగినదని స్పష్ట మగుచున్నది.

రాయలు పూర్వదిగ్విజయయాత్రకై మొట్టమొదట నుదయగిరిదుర్గముపైకి క్రీ.శ. ౧౫౧౩ సంవత్సరపు వర్షకాలము గతించినపిదప నక్టోబరునెలలో విజయనగరమునుండి బయలువెడలినట్లు కన్పించుచున్నది. గజపతిపై రణభేరిమ్రోగించుటకుఁ బూర్వము గొప్పసన్నాహము చేయవలసియుండునుకదా? ఈవిషయముల నన్నిటి నాలోచించిచూచినచో, రెండవరాయచూరుయుద్ధము, క్రీ.శ. ౧౫౧౨ వ సంవత్సరమున జరిగియున్నట్లు నిశ్చయింపఁదగియున్నది.

క్రీ.శ. ౧౫౦౯లో రాయచూరుదుర్గమును రాయలుస్వాధీనము చేసికొనినపిదప దానినిమరలఁ దనవశము చేసికొనవలయునని యాదిల్ ఖానుఁడు తలపెట్టియుఁ దానొక్కఁడును రాయలనోడింపఁజాలనని తలంచి రాయలవలన మహమ్మదీయరాజ్యములకు రానున్నవిపత్తును గూర్చి అహమ్మదునగరము గోలకొండప్రభువులకుఁ దనమంత్రుల మూలమున వర్తమానముచేసి వారలతోఁ దాత్కాలికముగ మైత్రి నొడఁగూర్చుకొనియెను. వారు మువ్వురును దమతోఁగూడ రాయలపై యుద్ధమునకు రావలయునని గజపతికిఁగూడ వర్తమానమంపిరి. కాని గజపతి యందుల కంగీకరింపలేదు. మాపాలిట శ్రీజగన్నాయకుఁడే యున్నాఁడని చెప్పి మహమ్మదీయులతోఁ గలియలేదు. గజపతిపాలనములో నున్నదుర్గములను బలపఱచుకొని యచ్చటనుండి రాయలకు రస్తుసామగ్రులందకుండ సైనఁ జేయుఁడని మహమ్మదీయులు కోరఁగా

గజపతి యందుల కంగీకరించి యాకట్టుదిట్టములను జేసెను. ఈవిష యములన్నియు రాయవాచకమువలన మనకుఁ దెలియుచున్నవి. గ్రంథవిస్తరభీతిచే నావాక్యముల నిట నుదాహరింపలేదు.

ముగ్గురుతురకదొరల నేకముచేయుసామర్థ్యము యూసుప్ ఆదిలుఖానున కుండునుగాని యాతనికుమారుఁడును, బాలుఁడునైన యిస్మాయిల్ యాదిల్ ఖానున కుండదు. ఆబాలునిమాటలువిని గోలకొండ; అహమ్మద్ నగరప్రభువులు రాయలుమీఁద దండెత్తరు. ఆబాలునిఁ జంపఁ బ్రయత్నించుచున్నరాజద్రోహి యగుకమాలుఖానునితోఁగలిసి వారు రాయలపైకి వచ్చెదరని తలంపరాదు. కావున సర్వవిధముల యూసఫ్ ఆదిలుఖానుఁడే తక్కినయిరువురితోఁగలిసి రాయచూరుదుర్గ స్వాధీనముకొఱకును రాయలనుజయించి మహమ్మదీయరాజ్యములవంక కాతఁడు దిరిగిచూడకుండఁ జేయుటకొఱకును ౧౫౧౦ లో రాయలపై దండెత్తెనని తలంపవలసి యున్నది.

౧౫౧౦లోనే రాయలు రాయచూరుముద్దకల్లుదుర్గములను స్వాధీనముచేసికొనినచో నాదిల్ ఖానుఁడు ౧౫౧౨వఱకు నేల యూరకుండెనని ప్రశ్నింపవచ్చును. ౧౫౧౧వసంవత్సరమంతయు గోవాపట్టణము కొఱకుఁ బోర్చుగీజులతో నాతఁడు యుద్ధములనుచేయుటతోఁ గడచిపోయెను. రాయలపైకి దండెత్తుటకుఁ దగినసైన్యసన్నాహములను జేయుటకును, గోలకొండ, అహమ్మదునగరప్రభువులతో మైత్రియొనఁగూర్చుకొనుటకును గజపతిసాహాయ్యమునకై ప్రయత్నించుటకును ౧౫౧౧వ సంవత్సరము పట్టెనని చెప్పవలసియున్నది. ఈప్రయత్నములన్నియుఁ జేసినవాఁడును దుదకు ముగ్గురునుగలసి రాయలపైదాడిచేసినవాఁడును యూసుప్ ఆదిల్ ఖానుఁడేకాని యిస్మాయిలు ఆసెలుసాహాయునుగాఁడు. ఆతనిపక్షమునఁ గమాలుఖానుఁడును గాఁడు.

## VII (4) (౧) ఆదిల్ ఖానుఁడు ఎవరిచే నెప్పుడు మరణమొందెను?

ఆదిల్ ఖాను మరణమునకును రాయచూరుయుద్ధమునకును సవిసాభావసంబంధ మున్నది. ఆయుద్ధముననే యాదిల్ ఖాను చనిపోయెనని చరిత్రకారులందఱు నంగీకరించెదరు. ఈయుద్ధ మెప్పుడు జరిగిన

దనుటనుగూర్చిమాత్రము భిన్నాభిప్రాయములున్నవి. అట్లే ఆదిల్ ఖాన్ మరణమునుగుఱించియు నభిప్రాయభేదము లున్నవి. ఈ రెండుసంఘటనలలో దేనిని నిర్దిష్టముచేయఁగలిగినను, రెండవదికూడ నిర్దిష్టమగును. కాని వీనినిగూర్చి వేఱువేఱుగ నాలోచించి విమర్శింపలేము. అయినను, రాయచూరుయుద్ధకాలమునుగూర్చి, విమర్శించి, యది ౧౫౨౦ లో జరిగెనని పైనివ్రాసియుంటిని ఆదిలుఖానుమరణకాలమును గూడ నిర్ణయించినఁగాని రాయచూరుయుద్ధ కాలనిర్ణయము సరియైనదని స్థిరపడదు,

ఆదిల్ ఖాను కృష్ణరాయలచే వధింపఁబడినట్లు, ఆముక్తమాల్యద కృత్యాదిలోని యీక్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

మ. అలుక న్స్ఫోటకదట్టికాఖురపుటీహల్య న్ఖురాసానిపు
చ్ఛలు వోదున్ని చలచ్చమూగజమదాసారప్లుతి న్గీర్తిపు
ష్కలసస్యం బిడి యేకధాటి బళి శాకట్టించి తౌ దృష్టికే
దులఖానోగ్రకపాల మర్ధపహరిద్భ్యాజాంగలక్షోణికిన్.

[ఈపద్యార్థము:—"ఓకృష్ణరాయా! నీవు ఉత్తరదేశముపై దాడివెడలినప్పుడు అచ్చటిభూములలో [పొలములలో] ఖురాసానుదేశజులైన మహమ్మదీయులనియెడి పుచ్చచెట్లు లేకుండగా నీసైన్యమందలి గుఱ్ఱములగిట్టలనెడు నాఁగండ్లతోఁ జెడదున్ని యేనుగులమదధారలతో నా పొలములఁ దడిపి పదునుచేసి యందుఁ గీర్తి యనుపైరును ఎక్కువుగా నాటి, దానికి దృష్టిపరిహారముగా ఏదులఖానుని భయంకరమైనపుఱ్ఱెను వెరబొమ్మవలెఁ గట్టించితివి."

లక్ష్మణరాయవ్యాసావళి]

"ఖురాసానుదేశము కాబూలునకు పూర్వోత్తరముననున్నది. కనుక ఖురాసాని పుచ్ఛలన్నచో ఆదేశపుభటులు ఏదిలఖానుని సేనలో నుండిరని తలంపనగును."

ఆముక్తమాల్యద వ్యాఖ్య.

బహుమనీరాజ్య మైదుభాగములుగా విడిపోయినప్పుడు విజాపురమున స్వాతంత్ర్యమును బ్రకటించినదితఁడే. ఈతనితరువాతవచ్చినవా

రండటు ఏదులసాహాలని పిలువఁబడినను, ఈతఁడే మొదటివాఁడగు టను అదివఱ కీతనిని 'ఏదులఖాను' అనియే యనుచుండుటచేతను ఆముక్తమాల్యదయం దీతనిని ఏదులఖా ననియే వ్రాసియుండెను. తరువాతిచరిత్రకారు లీతనినిగూడ ఏదులసాహా యనియే వ్రాయుచువచ్చిరి. కాని. యంతమాత్రమున నీయిరువురును భిన్నవ్యక్తులని యనరాదు.

ఆదిల్ ఖానును వధింపనిదే యాతనిపుత్త్రెను దృష్టిపిడతగాఁ గట్టుట యసంభవము. ఈవిషయమునఁ గృష్ణరాయలసత్యమువ్రాసెనని తలంపపరాదు. కావున రాయలచే నాతఁడు చంపఁబడియెననుమాట నిశ్చయము. అది యెప్పుడు జరిగెననువిషయమే యిట విమర్శనీయము. ఈ పద్యములోఁ జెప్పఁబడినయాతఁడు ఆదిల్ షాహా సేవకులలోనొకఁ డగు సలబత్ ఖాను అయియుండునని కుందూరి ఈశ్వరదత్తుగారు వ్రాసిరి.[1] కాని యది యంగీకార్యము కాదు. ఏదుల్ ఖాన్ సలబత్ ఖాను కాఁజాలడు. విజాపురనవాబగు నాదిల్ ఖాన్ వధయే ప్రాముఖ్యమునందును గాసియాతనియుద్యోగివధ నంతముఖ్యమైనదిగా నెంచియుండరు.

ఈయాదిల్ ఖాను వంశీయులందఱకిని, ఆదిల్ షాహా లేక ఏదుల్ షాహాయని వారినామము తుదను జేర్చుటకలదు. వీనిఁ జూచి పాఠకులు తబ్బిబ్బులగుచుందురు. రాయలచే వధింపఁబడినవాని పూర్తినామము యూసుఫ్ ఆదిల్ ఖాన్. ఇతనికుమారుఁడు 'ఇస్మాయిల్ ఆదిల్ ఖాన్' లేక ఆదిల్ షాహా. ఈయిరువురే మనకథాకాలమున నున్నవారు. ఇస్మాయిలు, కృష్ణరాయల యనంతరమున నాలుగేండ్లు రాజ్యముచేసి యున్నట్లు చరిత్ర లేకగ్రీవముగా నంగీకరించుచున్నవి. కావునఁ గృష్ణరాయలచేఁ జంపఁబడినవాఁడు యూసుఫ్ అదిల్ ఖానుఁ డనుట నిశ్చయము. ఆముక్తమాల్యదలోనీతనిపుత్త్రయే దృష్టిపిడతయైనది.

### (VII) (4) (౧) (i) ఆదిల్ ఖానుమరణకాలమునుగూర్చి చరిత్రకారుల యభిప్రాయములు

(౧) శ్రీఆచార్య నేలటూరివెంకటరమణయ్యగారు "యూసుఫ్ ఆదిల్ ఖానుడు క్రీ.శ. ౧౫౧౦ ఫిబ్రవరి 3 తారీఖుచనును, క్రీ.శ. ౧౫౧౦

[1] ఆంధ్రసా.ప. పత్రిక ౨౦సం ౪ సంచిక ౧౭౩పుట

ఫిబ్రవరి ౨౦ తారీఖునకును మధ్య అనఁగా క్రీ శ ౧౫౦౯-౧౦వ సంవత్సరమున మృతినందెనని నిస్సంశయముగఁ జెప్పవచ్చును .... గోల్కొండ సరదుస్థలమున నుండుకో వెలకొండయందో లేక యాదుర్గము కనుచూపుదూరమునందుండగనో యసువులువిడిచెను." అని వ్రాసియున్నారు.౧

(౨) శ్రీ ఓరుగంటి రామచంద్రయ్యగారు "రాయలచేతుల మడిసిన నేమఁ ఖా నొకడున్నచో నాతడు యూసఫ్ ఆదిల్ ఖానగును గాని యతనిపుత్రుడును క్రీ.శ. ౧౫౩౪ వరకు జీవించినవాఁడు నగు—ఇస్మాయిల్ కాజాలడు. యూసఫ్ క్రీ. శ. ౧౬ ఆగష్టు—నవంబరు ౧౫౧౦ లోపల మరణించినట్లు నిర్ధారింపవచ్చును."౨ అని వ్రాసియుండిరి.

(౩) మహమ్మదీయచరిత్రకారుల వ్రాతలనుబట్టి "యూసుఫు ఆదిల్ ఖానుని మరణకాలమును నిర్ణయించుటకు సాధ్యము గాదు. అతనిమరణకాలము నొక్కొక్క రొకవిధముగఁ జెప్పియున్నారు వీరిచ్చుభిన్నకాలములను జబీరీ యిట్లుసంగ్రహముగ బొందుపఱచియున్నాడు. 'యూసుఫుఆదిల్ ఖానునిమరణము తబకాత్-ఇ-యక్బరీరచయితప్రకారము హి ౯౧౩వను, మహమ్మదుకాసిమ్ ఫెరిష్టాప్రకారము హి౯౧౬వను, రఫీఉద్దీన్-షిరాజీ, మీర్ ఇబ్రాహిమ్అసద్ ఖానీలప్రకారము హి౯౨౫ నను సంభవించెను. మఱియు సయ్యద్ ఆలీబిన్ అజీజుల్లాతభా, యూదిల్ ఖానుడు మృతినందినది హి ౯౧౨ నకుదరువాత యనియు తారీఖు-ఇ-మహమ్మదుకుల్లీకుతుబుశాహురచయిత హి ౯౧౦ లో ననియు, కాసీఖానొకచోట హి ౯౧౬ లోననియు, మఱియొకచోట హి ౯౧౪ లోననియు వ్రాసియున్నారు."౩

(౪) స్మిత్ అనుఇంగ్లీషుచరిత్రకారుఁడు, యూసుఫ్ఆదిల్‌షాహా 1910 సం॥ అక్టోబరులోనో నవంబరులోనో చనిపోయెనని వ్రాసియుండెను౪

౧ భారతి. విరోధి శ్రావణము. ౧౯౨ పుట.

౨ భారతి వ్యయ శ్రావణము ౧౧౧ పుట.

3 శ్రీవెంకటరమణయ్యగారి వ్యాసము. భారతి, విరోధి శ్రావణము పుట ౧౯౦.

౪ స్మిత్ హిందూదేశచరిత్ర పుట ౩౯౨.

(౫) స్యూయెల్ పండితుఁడు, ఇస్మాయిల్ ఆదిల్ ఖాన్ క్రీ. శ. ౧౫౧౧-౧౫౩౪ రాజ్యము చేసెనని వ్రాసియున్నాఁడు. దీనినిబట్టి యూసుఫ్ ఆదిల్ ఖాన్ దాదాపుగ ౧౫౧౦ సంవత్సరాంతమువఱకు జీవించియున్నట్లు స్పష్టమగుచున్నది.౧.

(౬) ఈ "యూసుఫ్" అనునతనికి మొదట యూసుఫ్ ఆదిల్ ఖాన్ అని పేరు. ఈతఁడు మొదట బహుమనీ రాజుల సేవకుఁడుగా నుండి విజాపురమునకు సుబేదారుగా నుండెను. ౧౪౮౯ లో స్వతంత్రుఁడై "యూసుప్ ఆదిల్ శాహా" యన్న బిరుదము ధరించెను. కాని యింకను బహుమనీసుల్తానులు పేరునకైనను నుండుటవలనను, కృష్ణరాయలు వారికి సాయము చేయువలయునని తలంచుచున్నందునను, స్వామిద్రోహి యయినయూసప్ ఆదిల్ ఖానుని 'శాహా'గా ననఁగా స్వతంత్రరాజుగా నొప్పుకొనక ఒకానొక ఖానుగా నెన్నుటయే రాజనీతియనుటకు సందేహము లేదు......ఆముక్తమాల్యదలో వ్రాసినట్లు కృష్ణరాయఁడు, ఆదిల్ ఖానుని నిజముగఁ జంపినయెడల నీసమాచారము ౧౫౧౦ వ సంవత్సరప్రాంతమున జరిగియుండును. లేదా యూసుఫ్ ఖాన్ ౧౫౧౨ లో నైనఁజచ్చియుండవలెను. ఈవిషయము శోధింపఁదగియున్నది" అని కొమఱ్ఱాజు లక్ష్మణరావుపంతులు M. A. గారు వ్రాసియున్నారు ౨

ఆదిల్ ఖాన్ మరణకాలమునుగూర్చి చరిత్రకారులు భిన్నాభిప్రాయులై యుండుటవలనను, సుప్రసిద్ధ చరిత్రకారు లగు లక్ష్మణరావుపంతులుగా "ఈవిషయము శోధింపఁదగినది" యని వ్రాసియుండుటవలనను నీవిషయమింతవఱకును సునిశ్చితము కా లేదని తలంపవలసియున్నది. కావున, నీసంఘటనమునుగూర్చి మరల విమర్శించి, తగిన హేతువులు చూపబ్టినేని, భిన్నాభిప్రాయమును వెలిబుచ్చుటకును నాదిల్ ఖానుని మరణకాలమును వేఱుగా నిర్ణయించుటకును సంశయింపఁబనియుండదు.

---

౧ రెండవభాగము.

౨ లక్ష్మణరాయ వ్యాసావళి పుట ౪౦,

## VII. (4) (౧) (ii) కృష్ణరాయుల బిరుదములు

ఈసందర్భమునఁ గృష్ణరాయల బిరుదములనుగూర్చి యాలోచింపవలసిన యావశ్యక మున్నది. రాయలకుఁగలబిరుదములలో (౧) బరిభూతసురత్రాణుఁడు, (౨) మూరురాయరగండఁడు (3) యవన రాజ్యస్థాపనాచార్యుఁడు అనుమూఁడుబిరుదములు ముఖ్యములైనవి. ఇందు మొదటిబిరుదమునుగూర్చి పైని వ్రాసియుంటిని. మూరురాయర గండఁడనుబిరుదము వంశానుగతముగా వచ్చినది. వీరనరసింహ రాయలశాసనమునం దీబిరుద మున్నది.౧ పాండ్య, చేర, చోళ దేశపు రాజులనుజయించుటచే, రాయలపూర్వుల కీబిరుదము లభించినది.౨ ఇది రాయల హంపిశాసనమున రాయలకుఁగూడ "మూరురాయరగండశ్చపరరాజభయంకరః" అని చేర్చఁబడినది.3

కాని, యీమూరురాయరగండశబ్దము శ్రీకృష్ణరాయలనాగుల వరముశాసనములోఁ బూర్వులశాసనములలో వలెనే మొదటిశ్లోకములలో నుదాహరింపఁబడియుండియు, రెండవమాఱు; మరల

"భూపాలమౌళిమాణిక్య రంజితాంఘ్రిద్వయాంబుజ
మూరు రాయరగండాంక కృష్ణ రాయమహీపతే.
స్వామినోబహవోదుర్గాః సంభవంతీహవత్సరే"౪

అని యీబిరుదమును రెండవమారుదాహరించుటచే, మొదటిబిరుదము వంశానుగతముగా, చేర, చోళ, పాండ్య దేశాధీశులను జయించుటనుబట్టి వచ్చినదనియు, నీరెండవసారియుదాహృతమైనబిరుదము కృష్ణరాయలు తనభుజశక్తిచే ముగ్గురుతురకలనుజయించుటచే లభించినదనియు నిశ్చయింపవలసియున్నది. పునరుక్తియని నిర్ణయించుటకంటె బైనిర్ణయమే సమంజసమైనది. కొండవీడువిజయమైనకొలఁదిదినములలోనే, అనఁగా యువ సం॥ శ్రావణ శు౧౫ చంద్రగ్రహణమునాఁడు (౧౫౧౫ జూను

౧ ఎపిగ్రాఫియా ఇండికా. సం. ౧౪ పుట ౨౩౬—౨౪౦.

౨ నెల్లూరు శా. సం పుట ౭౬.

3 ఎ ఇం. సం. ౧ పుట 3౭౧.

౪ నెల్లూరు శా. సం. పుట ౧3౨.

నెల్లూరయార్యుఁ డను దైవజ్ఞునకు నాగలాపురమను గ్రామము నొసంగి వ్రాయించిన శాసన మిది. దీనినిబట్టి మూరురాయరగండబిరుద మంతకుఁబూర్వము రాయలకు ముగ్గురుతురకలనుజయించుటవుబట్టి వచ్చిన దని స్పష్ట మగుచున్నది కృష్ణరాయవిజయ, రాయవాచకములు, అహమ్మదునగర, గోలకొండ, బీజపూరురాజులతోఁ గృష్ణరాయలు యుద్ధమొనర్చెనని స్పష్టముగాఁ జెప్పుచున్నవి. కావున రాయలు ముగ్గురుతురకలతో యుద్ధమొనర్చె ననుట నిర్వివాదాంశము. దానిని బట్టి యీమూరురాయరగండబిరుదము వచ్చినదనుటయు సమంజసమే యగును. ముగ్గురుతురుష్క ప్రభువులతో రాయలకు జరిగినయుద్ధ మెప్పుడు జరిగినను నొక్కసారియేగాని రెండుమారులుకాదని చరిత్రకారు లందఱు నంగీకరించుచున్నారు. అది ౧౫౨౦-౨౧ లో జరిగెనా? ౧౫౨౨ లో జరిగెనా? అనునదియే, వివాదాంశము. అనఁగా ఉమ్మత్తూరుదండయాత్రకుఁ బూర్వముననా? లేక, పరముననా? అని ప్రశ్న. పరమునందే యగు నెడల, నది ౧౫౨౨వ సంవత్సరాంతమున జరిగెననుట స్పష్టము ఈయుద్ధ ముమ్మత్తూరు దండయాత్రకుఁ బూర్వము జరుగలేదని సహేతుకముగాఁ బైనివ్రాసియుంటిని.

రాయలచే, నాదిల్ ఖాన్ మరణమందె నని యాముక్తమాల్యద యందలిపద్యమును మనము నమ్మితిమేని, యతఁ డీముగ్గురు తురకల లో నొకఁ డనియు, గోలకొండసరదుస్థలములలోఁ గోవెలకొండవద్ద నతఁడు ౧౫౧౨లో హతుఁడయ్యెననియు నిశ్చయముగాఁ జెప్ప వచ్చును

"యవనరాజ్యస్థాపనాచార్య" బిరుదముకూడ నీయంశమునే ఋజువుచేయు ను. ఇది వంశానుగతముగా వచ్చినది కాదు. రాయల పూర్వులెవరును యవనుని రాజ్యమునస్థాపించలేదు. కృష్ణరాయలచేనను గ్రహింపఁబడినయవనుఁడు బహుమనీసుల్తా నగురెండవమహమ్మదుషా హా, ఇతఁడు గుల్బర్గదుర్గమునఁ జెఱయుందుండఁగా రాయ లీతనిని విడి పించి, బీదరుసింహాసనమున మరలఁ బ్రతిష్ఠించి, యాబిరుదమునువహించెను. రాయలయందుండు భయముచేఁ, దురుష్క ప్రభువులందఱు నాతనిసుల్తాను పదవి నంగీకరించిరి భిన్నమతస్థుని, విశేషించి, విజయ

నగరసింహాసనమునకుఁ బ్రతినిధిని సింహాసనాసీనుం జేయుట రాయల రాజనీతికిఁ దార్కాణము. అతఁడుగాని, అతనియాధిపత్యము నంగీకరించినయితరులుగాని, తాత్కాలికముగ నైనను. దనకు శత్రువులుగ నుండఁజాల రనియుఁ బ్రబలశత్రువుగ నున్నగజపతికిఁ దోడ్పడరనియు, గజపతితోఁ బోరు జరుగుచున్నంతకాల మైనను, మహమ్మదీయుల వలనఁ దనకు వత్తిడికలుగకుండు ననియు, రాయలు తలంచియట్లుచేసి యుండును.

కొందఱు చరిత్రకారులు, రాయలు సింహాసన మెక్కించిన వాఁడు మహమ్మదుషాహా కాఁ డనియు, నాతనిముగ్గురుకుమారులు, విజాపురనవాబగుఇస్మాయిల్ ఆదిల్‌షాహాచే గుల్బర్గకోటయందుఁ జెఱలో నుంచఁబడిరనియు, రాయలు వారిని విడిపించి యందుఁ బెద్దవానిని సింహాసన మెక్కించెననియు, నందుచే నాతని కాబిరుదమువచ్చెననియు వ్రాసియున్నారు. కాని యది సత్యము కాదు. మహమ్మదుషాహాకు ముగ్గురు కుమారు లున్నమాట నిజమే. అందొక్కనిని రాయలు సింహాసన మెక్కించిన నెక్కించి యుండవచ్చును. కాని రాయల కాబిరుద మందుచే వచ్చినదిమాత్రము కాదు. మహమ్మదుషాహా క్రీ.శ. ౧౫౧౮ వఱకు జీవించి రాజ్యాధిపతిగా నున్నాఁడు. ఈలోపున నాతనికుమారుని రాజ్యమున స్థాపించుట పొసఁగదు. రాయల కాబిరుదము క్రీ. శ. ౧౫౧౦నాటికే యున్నట్లు కందుకూరు శాసనము చెప్పుచున్నది.౧ ఇది రాయలమంత్రి యైనకొండమరుసయ్య భావసం॥ భాద్రపద శు ౧౩ గురువారము (౧ సెప్టెంబరు ౧౫౧౦) నాఁడు వ్రాయించినది. కావున నాదినమునకుఁ బూర్వము చెఱయం దున్నసుల్తాను మహమ్మదుషాహా కాని, యాతనికుమారుఁడు కాఁ డనుటనిశ్చయము. మహమ్మదుషాహానే రాయలు సింహాసన మెక్కించియుండె ననుట నిస్సంశయమైన విషయము.

రాయలు క్రీ శ.౧౫౧౩ సెప్టెంబరు మొదలు గజపతిపై దండయాత్రాకార్యములలో నిమగ్నుఁడైయున్నాఁడు. అంతకుఁబూర్వము ర

౧ సె.శా.సం. పుట ౫౩౪

నెలలు వర్షకాలము. కావున రాయలు ౧౫౧౩ జూను నెలకుఁ బూర్వమే, గుల్బర్గాకేఁగి మహమ్మదుషాహాను చెఱనుండివిడిపించె నని నిశ్చయింప వచ్చును. రాయలు ౧౫౧౩ సెప్టెంబరు మొదలు గజపతిపై యుద్ధము నర్చ్చుప్రయత్నములో నున్నట్లుస హేతుకముగా నీక్రింద "పూర్వదిగ్విజయయాత్రలు" అనుశీర్షికక్రింద నిరూపించెదను.

దీనినిబట్టి, గోలకొండసరదుస్థలములలో ౧౫౧౨ గ్రీష్మకాలములో ముగ్గురుతురకలను జయించి, యందు యూసుఫ్ ఆదిల్ ఖానుని వధించి యామార్గముననే గుల్బర్గా (కలబరిగె) కేఁగి మహమ్మదుషాహాను ౧౫౧౨సంవత్సరాంతమున విడిపించెననియు నాపిమ్మట విజయనగరమునకు, దిరిగివచ్చి యనంతరమునఁ బూర్వదిగ్విజయప్రయత్నముల నొనర్చెననియు నిశ్చయించుటకు సంశయపడ నక్కఱలేదు. ఇందువలన నాదిల్ ఖాన్ మరణము ౧౫౧౨ మే, జూన్ నెలలలో సంభవించెనని నిశ్చిత మగుచున్నది.

## VII (4) (౧) (iii) ఆదిల్ ఖానుని మరణకాలనిర్ణయము

ఆదిల్ ఖాన్ తన౭౫వయేట బీజపూరునందే స్వాభావికమరణ మందెనని మహమ్మదీయచరిత్రకారుఁ డగు ఫెరిష్టా వ్రాసినవ్రాఁత లసత్యములని నిర్ణయించి, శ్రీ డా. వెంకటరమణయ్యగారు, గోలకొండ సరుదు (సరిహద్దు)స్థలములయందు ముగ్గురుతురకలతో నైనయుద్ధమున రాయలచే నేదుల్ ఖాను హతుఁడయ్యెనని యంగీకరించియున్నారు. కాని యాకాలము మాత్రము ౧౫౦౯ ఫిబ్రవరి 3వ తేదీకిని ౧౫౧౦ ఫిబ్రవరి ౨౦వ తారీఖునకును నడుమనని సిద్ధాంతము చేసినారు దీనిని బట్టి, గుల్బర్గాదండయాత్రకూడ నాకాలముననే జరుగకూడదా? యని యనవచ్చును.

కృష్ణరాయలు ౧౫౦౯వ సంవత్సరము జూలై నెలలోఁ గాని రాజ్యాధికారమును స్వీకరింపలేదు. కావున రాయలచే హతుఁడయ్యెననుట కాకాలమును "౧౫౦౯జూలై-౧౫౧౦ ఫిబ్రవరి౨౦ తేదీ" యని సవరింపవలసివచ్చును. రాయలు ౧౫౧౦సం॥రం జనవరినెల మొదలు

పట్టాభిషేకమహోత్సవములలోనున్నాఁడనియు నందుచే రాయ లాదిల్ ఖానుని నాకాలమునఁ జంపియుండుట యసంభవ మని పైనివ్రాసి యుంటిని. ఇఁకను౧౫౧౫ జూలై–డిశంబరు నెలలమధ్య ముగ్గురునవాబుల తోను యుద్ధము జరిగియుండకూడదా? ఆకాలములో నాదిల్ ఖాన్ మరణించియుండకూడదా? యని యెవరైనఁ బ్రశ్నింపవచ్చును. జూలై నెల వర్షకాలారంభము. ఆకాలములో నెవరును యుద్ధమున కాయత్త పడరు. మఱియు రాయవాచకమున నీయుద్ధము గ్రీష్మకాలములో నడచిన దనియు, నప్పుడే కృష్ణానది పొంగినదనియు వ్రాసియున్నాఁడు. "జగడము ఖానకు తురకల యేనుగుల మొనచేస్తే గ్రీష్మకాలం యెండ చేతను డస్సిన యేనుగులు...కృష్ణవేణిలో పోయిపడెను...దైవికంగా పెడతలపోటుగా ప్రవాహం వచ్చె......యేరు నిండారుగావచ్చెను. "యిదిగాక యీగ్రీష్మకాలాన దగదప్పులకు తాళి వాండ్లు నిలువ లేరు."

శ్రీ వేంకటరమణయ్యగారు చెప్పిన ౧౫౧౫ ఫిబ్రవరి-౧౫౧౬ ఫిబ్రవరి నడుమ గ్రీష్మకాల మొకటియే వచ్చినది. ఆగ్రీష్మకాలమునఁ గృష్ణ రాయలు రాజుగా లేఁడు. కావున నాకాలములో గోలకొండసరదుస్థలములో రాయలకును దురకలకును యుద్ధము జరుగలే దనుట స్పష్టము. ౧౫౧౧సం॥ గ్రీష్మకాలములో రాయలు ఉమ్మత్తూరు మొదలగుదక్షిణ దేశదండయాత్రలలో నున్నాఁడు. కావున నాగ్రీష్మమునను నీముగ్గురుతురకలతో యుద్ధముజరుగలే దనుటనిశ్చయము. ౧౫౧౨ వసంవత్సర రగ్రీష్మకాలమున గోలకొండసరదుస్థలమున యుద్ధముచేయుటయు, నాదిల్ ఖానుని వధించుటయునాపైని, గుల్బర్గవఱకు బోవుటయు, మరల విజయనగరమునకువచ్చి ఆసంవత్సరము సెప్టెంబరులోపున పూర్వదిగ్విజయయాత్రకుసన్నద్ధుఁడగుటయు నసంభవము. అందుచే ౧౫౧౨లోని గ్రీష్మమునను నీయుద్ధము జరుగలేదు. ఇఁక మిగిలినది౧౫౧౩ గ్రీష్మ కాలము. అందే రెండవరాయచూరుయుద్ధము జరిగెననియు నందే యాదిల్ ఖాను వధింపఁబడియె ననియు నిస్సంశయముగాఁ జెప్ప వచ్చును.

## VII (4) (అ) గుల్బర్గా మొదటిదండయాత్ర; సుల్తాను చెఱవిముక్తి

౧౫౦౯-౧౦ లోనే ఆదిల్‌ఖానుమరణమును, ముగ్గురుతురుష్కులతో యుద్ధమును, మహమ్మదుషాహా పలాయితుఁడగుటయుఁ జరిగినదనునెడల, రాయలు గుల్బర్గావెళ్ళి, సుల్తానును విడిపించిన దెప్పుడు? ౧౫౧౨ లోనో ౧౫౧౩లోనో ప్రత్యేకముగ విజాపురగోలకొండ ప్రదేశములనుదాఁటి సుల్తానును విడిపించుటకై గుల్బర్గాపై దండయాత్ర నడిపించెననుట కవకాశములేదు.

౧౫౦౯-౧౦ లోనే మహమ్మదుషాహాను చెఱనుండి విముక్తి చేసెననుటకు మొదలే యవకాశము లేదు. తనపై యుద్ధమునకువచ్చిగోలకొండసరములనుండి పలాయితుఁడైనాఁడనుచున్న మహమ్మదుషాహాను రాయలు విడిపించుట యనఁగా నర్థమేమి?

మహమ్మదుషాహానుబందీగానుంచిన దెవరు? అనువిషయమున భిన్నాభిప్రాయ మున్నది. అతనిమంత్రియైన అమీరుబరీదు అని కొందఱును, విజాపురప్రభువైన యూసఫ్ ఆదిల్‌ఖానుఅని కొందఱును, అతనికుమారుఁడగు నిస్మాయిల్ ఆదిల్‌షా యనికొందఱును, అతనిపక్షమునఁగమాలుఖానుఁడనికొందఱును దలంచుచున్నారు. మహమ్మదుషాహా యెప్పటినుండి చెఱయందుండె ననువిషయముగూడ సంశయాస్పదముగానే యున్నది.

"కమాల్‌ఖానుఁడు బరీద్-ఇ మమాలికుతో సంధిచేసికొనిన పిమ్మట షోలాపురముపై నెత్తిపోయి యాపట్టణమును మూడునెలలకాలము ముట్టడించి కైవశము గావించుకొనెను. తరువాత విజాపురమునకు దిగివచ్చి యచట దనప్రభువైనఇస్మాయిల్ ఆదిల్‌ఖానుని నాతనితల్లి యగుబూబూజీఖానమును దుర్గమునందు చెఱబెట్టెను. ఆసమయముననే కమాలుఖానునిమిత్రుఁడగుబరద్-ఇ-మమాలికు దనయజమానుఁడగు నిమ్మడిమహమూదుషాహానుగుల్బర్గదుర్గమున చెఱయందుంచి రాజ్యము నాక్రమించుకొనెను."౧

౧ వెంకటరమణయ్యగారివ్యాసములు భారతి విరోధి ఆషాఢము పుట ౪౧

"అతని (ఇస్మాయిల్ ఖానుని) తల్లి బూబూజీఖానము దనయను చరులచే కమాలుఖానుని జంపించి క్రీ.శ. ౧౫౧౧ మే నెలలోఁ దనకుమారుని చెఱనుండి విడిపించెను." ౨

ఈవాక్యములనుబట్టి ౧౫౧౦ వ సంవత్సరమునందే మహమ్మదు షాహా గుల్బర్గదుర్గమున బందీగా నుండెనని స్పష్టమగుచున్నది గోలకొండసరదుస్థలమునజరిగినయుద్ధమునఁ బలాయితుఁడై గుల్బర్గాకేగిన కొలఁదికాలములోనే మహమ్మదుషాహాను అమీరుబరీదు గుల్బర్గయందే బందీకృతునిగఁ జేసెననియు నిందులకు ఇస్మాయిల్ పక్షమున రాజ్యము చేయుచున్నకమాలుఖానుఁ డంగీకరించెననియుఁ దెలుచున్నది.

ఈకథ సత్యమనుట కొకప్రతిబంధకము కన్పట్టుచున్నది. ఈకథా కాలమున గుల్బర్గాపట్టణము మహమ్మదుషాహాస్వాధీనమునఁగాని, యమీర్ బరీదుస్వాధీనమునఁ గాని లేదు.

"గుల్బర్గాపట్టణమును యూసఫ్ ఆదిల్ ఖానుఁడు ౧౫౦౪వ సంవత్సరమునఁ బట్టుకొనెను. అది౧౫౧౪ వఱకు ఆదిల్ శాహాల స్వాధీనమం దుండెను. ఆసంవత్సరమున అమీర్ జేరిద్ దానిని సాధించెను. అని యిదివఱకున్న చరిత్రములు చెప్పుచున్నవి." ౩

ఈపక్షములో అమీరీబరీదు మహమ్మదుషాహాను గుల్బర్గయందు బందీకృతునిగాఁ జేయుట తటస్థింపదు. అతఁడు చేయఁదలఁచుకొనినచో బీదరు (బెడందకోట)నందే చేసియుండును. మహమ్మదుషాహా గుల్బర్గయందు బందీగా నుండుటయు రాయలాతనిని విడిపించుటయు వాస్తవము. కావున నాతనిని యూసఫ్ఆదిల్ ఖానుఁడో, లేక యాతనియనంతరమున నిస్మాయిల్ ఆదిల్ ఖానునిపక్షమునఁ గమాల్ ఖానుఁడో యీ కార్యమును జేసియుండవలయును. తండ్రిచనిపోవునప్పటి కిస్మాయిలు పదునొకొండేండ్లబాలుఁడు. అతనిని రాజ్యమునుండి తొలఁగించి తానాక్రమించుకొనవలయునని యాలోచించుచున్నకమాల్ ఖానుఁడు బహమనీసుల్తానును బందీగాఁ జేయలేఁడు. యూసఫ్ఆదిల్ ఖానుఁడే

౨ వెంకటరమణయ్యగారి వ్యాసములు భారతి విరోధి ఆషాఢము పుట ౯౫

౩ లక్ష్మణరాయవ్యాసావళి పుట ౪౨-౪౩

మహమ్మదుషాహాను జెఱయందుంచెననియు, విడిపింపసమర్థత లేకయో తాను స్వతంత్రముగ బీదరురాజ్యము నేలవచ్చునని తలంచియో బరీదు తనప్రభువును జెఱనుండివిడిపింపక యూరకుండెననియుఁదలంపవచ్చును.

యూసుఫ్ఆదిల్ ఖానుని స్వాధీనమునందున్న గుల్బర్గాపట్టణమును ఆతనివధానంతరమునజయింపఁగోరి రాయలు ౧౫౧౦ సంవత్సరముననే వర్షకాలానంతరమున నటకేఁగి, యందుఁ జెఱలో నున్న సుల్తానును విడిపించి, సింహాసన మెక్కించి యుండునని తలంపవలసి యున్నది. దీనినిబట్టి మహమ్మదుషాహా గోలకొండసరదుస్థలమునఁ గృష్ణరాయలకును మూడిండ్లతురకదొరలకును జరిగినయుద్ధమునకుఁ బూర్వమే చెఱయందుండెనని స్పష్టమగుచున్నది.

ఆదిల్ ఖానునిమరణము ౧౫౧౦ లోనని పైని వ్రాసియుండుటచే నాతనికుమారుఁ డగుఇస్మాయిల్ సింహాసనమధిరోహించుటయుఁ, గమాల్ ఖానునివధయు, నాపిమ్మటనైయుండు నని నిశ్చయింపవలసి యున్నది.

## VII (4) (3) పోర్చుగీజుచరిత్రకారుల వ్రాఁతలు

డాక్టరు వెంకటరమణయ్యగారు ఆదిల్ ఖానుని మరణకాలనిర్ణయమునకు అబ్బూకెర్కు కామెంటరీసు అనుగ్రంథమును బ్రధానాధారముగాఁ గొనియున్నారు. నేనాగ్రంథమునుజదువలేదు. దానిని జదువకుండ నేనాగ్రంథముమీఁదను, దానినిబట్టి చేసిన నిర్ణయముల మీఁదను నభిప్రాయ మొసంగుట తగదు. కాని, పైనుదాహరించిన శాసనాద్యాధారములనుబట్టి యాదిల్ ఖాను మరణము ౧౫౧౦ వ సంవత్సరములో సంభవించెనను సంపూర్ణవిశ్వాసముతో, శ్రీ వెంకటరమణయ్యగారి యందధికగౌరవము గలవాఁడనయ్యును భిన్నాభిప్రాయమును వెలిబుచ్చసాహసించితిని.

విజాపురరాజ్యమునంటి, పశ్చిమసముద్రతీరమున గోవాయను రేవుపట్టణమున్నది. మక్కాకుఁబోఁదలచినమహమ్మదీయయాత్రికు లీరేవున నోడలనెక్కి పోవుచుండెడివారు. యూసఫ్ ఆదిల్ ఖానునకీ పట్టణమనిన నెంతయో ప్రీతి. ఇతఁడు తఱచుగా నాపట్టణానకుఁ

బోవుచుండెడివాఁడు. విజాపురరాజ్యమున కీపట్టణమును రాజధానిగాఁ జేయవలెననియెడికోర్కె యాతని కుండెడిది. పోర్చుగీజువర్తకులు, హిందూదేశమునకు గుఱ్ఱములు మొదలగువాని నారేవున దిగుమతి చేసి వర్తకము చేసికొనుచుండెడివారు. ఆపట్టణమును దమయధికారముక్రిందికిఁ దీసికొనవలయునని పోర్చుగీజువారితలంపు అందుకొఱకీయుభయులకును యుద్ధములు జరుగుచుండెడివి. మహమ్మదీయులును పోర్చుగీజులు నొకరినొకరు హత్యగావించుచుండెడివారు. గోవాపట్టణమునకు పోర్చుగీజుపక్షమున అబ్బూకెర్కుఅనునాతఁ డాకాలమున గవర్నరుగా నుండెడివాఁడు. అతని పరిపాలనాకార్యములనుగూర్చి "అబ్బూకెర్కుకామెంటరీసు" అనుగ్రంథము రచియింపఁబడియెను.

అబ్బూకెర్కు గోవాపట్టణముపై నెత్తివచ్చునప్పటికి ఆదిల్ ఖాన్ చనిపోయెనని యాతనికీ వార్తలు వచ్చినవనియు, నతఁడు ఆదిల్ ఖాఁ చనిపోయినపిమ్మట క్రీ. శ. ౧౫౧౦ సం. మార్చినెలలో గోవాపట్టణమును స్వాధీనపర్చుకొనె ననియు, నాగ్రంథమున వ్రాయఁబడియుండెనఁట ! దానినిబట్టియు నింకను మఱికొన్ని పోర్చుగీజురచయితల గ్రంథములనుబట్టియు శ్రీ వెంకటరమణయ్యగారు ఆదిల్ఖానుమరణకాలమును నిర్ణయించినారు.౧

కేవలము విదేశీయులవ్రాఁతల నాధారముచేసికొని కాలనిర్ణయము చేయుటవలన ప్రమాదముకలుగవచ్చును. వారికి మనదేశీయుల నామములు, పట్టణములపేర్లుకొ్రత్తవి యగుటచే వానియుచ్చారణ సరిగానుండదు. ఒకదానికొకటి తబ్బిబ్బుగా వ్రాయుచుందురు. ఆదిల్ ఖానును హిదల్ఖాను అనివ్రాసియుండిరి. హిదల్ఖానుఅనఁగా, యూసఫ్ ఆదిల్ ఖానుఁడో, ఇస్మాయిల్ ఆదిల్ఖానుఁడో తెలియదు. ఆదిల్ ఖానుపక్షమున గోవాయందుండుముఖ్యుఁ డైనసరదారుఁ డెవఁడైన చనిపోయినను, ఆదిల్ఖాను చనిపోయెనని వ్రాసియుండవచ్చును. ఈ కామెంటరీసు ఎప్పుడు వ్రాయఁబడియెనో, ఆవ్రాఁతల కాధారము లెట్లువచ్చినవో యివియన్నియుఁ దెలిసికొనినఁగాని యందలిసత్యాసత్యము లెఱుకపడవు.

---

౧. శ్రీ వెంకటరమణయ్యగారి వ్యాసములు, భారతి, విరోధి-శ్రావణము

గోవాపట్టణమును మహమ్మదీయులనుండి లాగుకొనెనని తెలిసి కృష్ణరాయలు పోర్చుగీజుగవర్నరుకుఁ దనసంతోషమును వెలిబుచ్చుచు, మనుష్యులను ౧౫౧౦ సెప్టెంబరు నెలలోఁ బంపెనఁట. రాయలకుఁ బ్రబలశత్రువైనయూసఫ్ఆదిల్ ఖానునుండి గోవాను స్వాధీనముఁ చేసికొనెననిన రాయలకు సంతోషము కాని,పదునొకొండేండ్ల బాలుఁ డైన యిస్మాయిల్నుండి వశపఱుచుకొనినచో రాయలంత వాఁడు సంతోషపడఁదగినవిషయ మేమికలదు ? ఇస్మాయిల్ బాలుఁడు. ఆతనిపక్షమున నధికారము చేయుచున్నకమాల్ ఖానుఁడు రాయలకు మిత్రుఁడు. ఈ సందర్భమున రాయలు తనసానుభూతిని గనుపర్చు టేల?

పోర్చుగీజుచరిత్రకారులవ్రాఁతలలోఁ బరస్పరవిరుద్ధము లైన విషయములు కన్పట్టుచున్నవి. అందుఁ గొన్నిటి నీక్రింద నిచ్చెదను. మహమ్మదుషాహాను జెఱయందుంచుటనుగూర్చి చూడుఁడు.

౧. “బరీదు ఆతని కాశ్రయమిచ్చి యూదిలుఖానుని కలుబరిగెనుండి పాఱదోలుటకు సైన్యముతోఁ గూడ బయలు వెడలెనుకాని యుద్ధమునఁ బరాజితుఁడయ్యెను. సైన్యముతో గూడవచ్చినబహాముసీసుల్తాను ఇమ్మడి మహామూద్దుశాహు కమాలుఖానునిచేఁ జిక్కి బందీకృతుఁ డాయెను.”

౨. “ఆసమయమునందే కమాలుఖానునిమిత్రుఁ డగుబరీదు—ఇ—మమాలికు దనయజమాను డగునిమ్మడిమహామూదుశాహాను గుల్బర్గ దుర్గమున జెఱయందుంచి రాజ్యమునాక్రమించుకొనెను.”

౩. “తరువాత కమాల్ ఖానుడు బీదరుపై నడిచి దానిని స్వాధీనము చేసికొని మహమూదుశాహా నతనిమందిరముననే చెఱబెట్టి యతని యధికారము నంతటిని నాచికొని యుజ్జత్ ఉల్ ముల్కానునాదిల్ ఖానునిసామంతు నాతనిపైఁ గాపుంచెను.

౪ వ్రియ్యరలూయి క్రీ.శ ౧౫౧౦ డిశంబరుమాసమం దాల్బూకెర్కుకు విజయనగరమునుండి వ్రాసినయుత్తరమున దక్కనురాజ్య రాజయకీస్థితి నిట్లు వర్ణించియున్నాఁడు.

“హిదలాకాను గొప్పసైన్యముతో దక్కనురాజ (సుల్తాను) సామంతుఁ డగుమెలిక్ దస్తూరను హాచిసీమాబదొర పాలనక్రిందనుండు

కల్బర్గేటు (కలుబరిగ) సాధించుటకొఱకు బయలుదేరెనని తనకు నమ్మకమయినవార్త వచ్చినదనియు; నాదుర్గముట్టడి కాగఁ జాలకపోవుటవలన రెండుమాసములైన తరువాత కొన్నిషరతులపై నతనికిఁ గైవశమాయెను; హిదల్కాను దక్కనురాజుయొక్క సకలాధికారములను నాచికొని యతని జెఱగొని పోవుటవలన నారాజ్యములోనిసామంతులు పలువురాతనిని బ్రతిఘటించి యతని నిర్మూలించు నుద్దేశముతో నతనిపై నెత్తిపోయిరనియు; మార్గమున నొకనదికడకు వచ్చి దానిదాటువెఱవెఱుగక నచటవిడిసి విశ్రాంతినందియుండిరనియు" దెలియపఱచెను"౧

బహామనీసుల్తానును జెఱయందుంచినది అమీరుబరీ దనియొకరును, కమాల్ఖానని యొకరును, హిదల్కానుఅని ఫ్రియ్యాసలూయియును వ్రాసియుండిరి. సుల్తానును గుల్బర్గకోటలో నుంచిరని యొకరును, బీదరులో నతనిమందిరముననే యనియొకరును వ్రాసిరి. లూయి వ్రాసినయుత్తరములో (౧౫౧౦ డిశంబరు) గమాల్ఖానుని ప్రసక్తియే లేదు. హిదల్కాను అనఁగా యూసఫ్ ఆదిల్ఖానుఁ డనుకొనవలయునుగాని, ఇస్మాయిల్ ఆదిల్ఖానుఁ డనుకొనరాదు. ఏలనన నాతఁ డప్పటికి పదిపండ్రెండేండ్లవాఁడు.

కమాల్ఖన్ని ౧౫౧౧ మేయినెలలో, ఇస్మాయిల్ తల్లి చంపించెనని చెప్పుచున్నారు. అందులకై యామె యదివఱకెంతయో ప్రయత్నము చేసియుండెనఁట. అంతకుపూర్వము కమాల్ఖాను ఇస్మాయిలును నాతనితల్లిని జెఱయందుంచెనఁట ! దీనినిబట్టి లూయి యుత్తరము వ్రాసిన ౧౫౧౦ డిశంబరునాఁటి కిస్మాయిల్ చెఱయం దుండియుండునని యూహింపనగుచున్నది. అందుచే నాతఁడు కల్బరిగెమీఁద దండెత్తుటయు, సుల్తానును జెఱయందుంచుటయు నసంభవము. కావున లూయియుత్తరములోని హిదల్కాను యూసఫ్ ఆదిల్ఖాను అనియే నిశ్చయింపవలసియున్నది. అతఁడు ౧౫౧౦ నవంబరువఱకు జీవించియుండెనని స్మిత్, న్యూయల్ మొదలగుచరిత్రకారులు వ్రాసియున్నారు. పరస్పర విరుద్ధములైన వ్రాఁతలను జూపించుట కొఱకే

---

౧ శ్రీవెంకటరమణయ్యగారివ్యాసములు. విరోధి ఆషాఢము. ౯౯-౮౧పుటలు.

యీమాటలను వ్రాసితిని. నే నీ యభిప్రాయములతో నేకీభవించుట లేదు.

ఇట్లే కల్బరిగెదుర్గమునుగూర్చి పరస్పరవిరుద్ధము లైన యభిప్రాయము లున్నవి. ఇంపీరియల్ గెజటీరు ఆఫ్ఇండియాయందు, కల్బరిగె దుర్గము ౧౫౦౪ లో యూసుప్ ఆదిల్ ఖాను వశపర్చుకొనెననియు, ౧౫౧౪వఱకు నది విజాపురమువారి స్వాధీనమందుండె ననియు వ్రాసియుండఁగా లూయి ౧౫౧౦లో హిదల్ఖాను కల్బరిగెను వశముచేసికొనెనని వ్రాయుచున్నాఁడు. మఱియొకచరిత్రకారుఁడు కమాలుఖానుడు పసివాఁడగు తనయజమానుని దొలగద్రోసి సంస్థానమునకుదానే యధిపతి కావలయుననునాస యతనిహృదయమున బాదుకొన తన యుద్యమమును నెరవేర్చుకొనుట కతడు మొదట బరీద్-ఇ.మ మావి తునకు గలుబరిగ మున్నగు భీమాపూర్వతలదుర్గములను రాష్ట్రమును వశపఱచి సంధిచేసికొనెను" అని వ్రాయుండెను. ఈసంధి ఇస్మాయిల్ ను జెఱయందుంచుటకుఁ బూర్వమై యుండవలయును.

పరస్పరవిరుద్ధము లైనయభిప్రాయములతోఁ గూడియున్న విదేశీయచరిత్రకారులవ్రాఁతలు పరమప్రమాణములు గావనియునం దీయఁబడినకాలముగూడ మార్పు చేయఁగూడని పరమసత్యముగా భావింపనక్కఱ లేదనియు నాయభిప్రాయము.

ఈచర్చనుబట్టి తేలిన ముఖ్యాంశములివి కృష్ణరాయలు:—

౧. ౧౫౦౯-౧౦లో రాయచూరుముద్దగల్లు దుర్గములను స్వాధీనము చేసికొనియెను.

౨ ౧౫౧౦-౧౧లో నుమ్మత్తూరు, శివసముద్రము, శ్రీరంగపట్టణములయందలి దుర్గములను పట్టుకొని, దక్షిణదేశమునంతను జయించెను.

౩. ౧౫౧౨-౧౩ లో, ఆదిల్ ఖానునివధించుటయు మూఁడింట్లతురకలనుజయించి మూరురాయరగండాంకుఁడగుటయు, కలబరిగెదండయాత్రచేసి జయస్తంభము నాటుటయు, బహామనీసుల్తానును జెఱ

విడిపించి, సింహాసనమెక్కించి యవనరాజ్యస్థాపనాచార్య బిరుదమును సంపాదించుటయు జరిగెను.

౪. మహమ్మదుషాహా రాయలతో యుద్ధమొనర్పలేదు.

దీనితో రాయలదక్షిణోత్తర దిగ్విజయములు పూర్తియైనవి. ఇంక బూర్వదిగ్విజయయాత్రలను గూర్చి తెలిసికొనవలసియున్నది.

## VII (5) పూర్వదిగ్విజయయాత్రలు

కృష్ణదేవరాయలకుఁ బ్రబలవిరోధిగ నున్నవాఁడు ప్రతాపరుద్రగజపతి యనియు, నెల్లూరు మొదలు గంజాముమండలము వఱకును నిజామురాష్ట్రమందలి తెలంగాణాఖండములో మహమ్మదీయుల క్రింద నున్నదిగాక మిగతాప్రదేశమును నతని క్రిందనున్నవనియుఁ బైనివ్రాసియుంటిని. ఆకాలమున సైన్యసంపదలోను గజబలమునందును రాజ్యవిస్తీర్ణమునందును ధనమునందును దక్షిణభారతఖండమున గజపతికి మించినవాఁడు మఱియొకఁడు లేఁడు. జగన్నాథస్వామి యాతనియిష్టదైవము. దక్షిణోత్తరదేశవిజయములు సమకూరినపిమ్మట రాయలు గజపతిపై దండయాత్ర సలుప నారంభించెను. నెల్లూరు మండలము మొదలు గజపతికిరాజధానియైన కటకమువఱకును గల యాప్రదేశముపై రాయలు నాల్గుమారులు జైత్రయాత్రలు సలిపెను.

గజపతిదేశముపై నీదండయాత్రలు క్రీ.శ. ౧౫౧౩ వ సంవత్సరములో నారంభమై ౧౫౧౬ సంవత్సరాంతముతో ముగిసినవి. మొత్తముమీఁద బ్రతాపరుద్రగజపతిని జయించుటకు రాయలకు నాల్గు సంవత్సరములు పట్టెను. తుద కీయిరువురకును సంధిజరిగి, గజపతి తనయను రాయలకిచ్చి పెండ్లిచేయుటతో నీరణ మంత మొందినది. రాయలు జయించినప్రదేశములోఁ జాలభాగము మరల గజపతి కిచ్చివైచెను.

కృష్ణరాయ లీయుద్ధయాత్రలలోఁ దీర్థయాత్రలుకూడ చేయుచుండెడివాఁడు. ఈదిగ్విజయములన్నియు దేవునియనుగ్రహమువలననే తనకు లభించుచున్నవని యాతనినమ్మకము. తిరుమల శ్రీ వెంకటేశ్వరుఁ డీతనియిష్టదైవము.

మహామ్మదీయులతోడను గజపతితోడను యుద్ధములుజరుగుచుండగనే రాయలు ౧౫౧౩ సంవత్సరములో మూఁడుమారులును ౧౫౧౪, ౧౫౧౫, ౧౫౧౭, ౧౫౨౧ సంవత్సరములలో నాల్గుమారును దిరుపతి వచ్చి యాస్వామికి రత్నకిరీటాద్యాభరణములు, గ్రామములు, ద్రవ్యము నిచ్చుటయేగాక గర్భాలయముమీఁదివిమానమునకు బంగారుపూఁత పూయించెను.

మఱియు, నీమహారాజు కంచి, కాళహస్తి, కుంభకోణము, తంజావూరు, రామేశ్వరము, మధుర, గోకర్ణము, శ్రీరంగము, శ్రీశైలము, అమరావతి, శ్రీకాకుళము, బెజవాడ, రాజమహేంద్రవరము, సింహాచలము, శ్రీకూర్మము, శ్రీజగన్నాథము మొదలగు చెన్నరాష్ట్రమందలి ప్రధానపుణ్యక్షేత్రముల నన్నిటిని దర్శించి, యాదేవస్థానముల కనేకవసతుల నొసంగి యుండెను. ఇఁక నాతనిరాజధానీనగరమగు హంపియందలి విరూపాక్షస్వామికిని, నచ్చటియితర దేవాలయములకును జేసినదానము లపరిమితములు. అనేకనూతనాలయములను నిర్మించి వానికి వసతుల నేర్పరచెను. ఉగ్రనరసింహస్వామి విగ్రహమును బ్రతిష్ఠించెను. మహామ్మదీయులచే, గొంతధ్వంసము చేయబడినను నావిగ్రహ మిప్పటికిని భీతిగొలుపుచుఁ జూపరుల నాశ్చర్యనిమగ్నులఁ జేయుచుండునఁట! ఉదయగిరిదుర్గమునుండి యొకబాలకృష్ణవిగ్రహమును దీసికొనివచ్చి విజయనగరమున స్థాపించి, దానికిఁ దగిన వసతుల నొసఁగి శాసనమును వ్రాయించెను.

క్రీ. శ. ౧౫౧౭ ఈశ్వరసంవత్సరములోఁ, గుంభకోణమున జరిగినమహామాహాత్మ్యదర్శనార్థమై బయలుదేరి దక్షిణదేశమందలి ప్రధానపుణ్యక్షేత్రముల నన్నిటిని దర్శించి యనేకదానములను గావించి శాసనములను వ్రాయించుటయే గాక, తానుదర్శింపని శైవవైష్ణవాలయములకొఱకు, బెజవాడయందుఁ గృష్ణానదీతీరమునఁ బదివేల వరహాల నొసంగెను.

ఈవితరణశాలి శాసనములు వందలకొలఁదిగ నున్నవి. ఈరాజచంద్రుఁ డొసంగినదానములను, నిర్మించినయాలయములను, త్రవ్విం

చినకాలువలను, ఇచ్చినయగ్రహారములను, జేసినధర్మములను, ఒనర్చినపుణ్యకార్యములను, దెలుపుట కిటఁ దావుచాలదు.

కొన్ని శాసనములలో నీదక్షిణభారతచక్రవర్తి తానుజయించిన దేశములను బరాజితులను జేసినశత్రువులను, బేర్కొనియున్నాఁడు. పూర్వదిగ్విజయయాత్రావిషయములు దెలియుశాసనములలో నవసరములైనవానిని గొన్నిటి నిట నుదాహరించెదను.

## VII (5) (౧) పూర్వదిగ్విజయయాత్రలను దెలుపుశాసనములు

౧. "స్వస్తి శ్రీజయాభ్యుదయ శాలివాహనశకవర్షంబులు ౧౪౩౬ చెల్లంగా నామీఁద నడచే భావసంవత్సర జ్యేష్ఠ బ౨లు శ్రీమన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీవీరకృష్ణరాయమహారాయలు వుదయగిరిదుర్గం మీఁద విడిశి ప్రతాపరుద్రగజపతిని కొండవీటుపర్యంతం విరుగం బొడిచి వుదయగిరిదుర్గానకు మేణశ వేయించి దుర్గం పుచ్చుకుని ప్రతాపరుద్రగజపతివారిపినతండ్రి తిరుమలకాంతరాయనిని పట్టుకొని తిరిగి విచ్చేసి యిప్పుడు వుదయగిరి కోనవల్లభరాయనికి సమర్పించిన నెల్లూరిశీమలోని శికల్లుగ్రామం......"[౧]

౨. "స్వస్తి శ్రీజయాభ్యుదయ శాలివాహనశకవర్షంబులు ౧౪౩౬ మీఁద నడచే భావసంవత్సర ఆషాఢశు౧౫గు, శ్రీమన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీవీర కృష్ణదేవరాయమహారాయలు ప్రతాపరుద్రగజపతిని కొండవీటిదనకాను విరుగంబొడిచి ఉదయగిరి దుర్గమున్ను కైకొని తిరిగి విజయనగరం రాజధానికి విచ్చేస్తున్న తిరుమలమీఁదికి విచ్చేసి తిరువేంగళనాథదేవున్ని దర్శించి తిరువెంగళనాథ దేవునికి కనకాభిషేకంచేసిన రొఖవరహాలుగ ౩౦౦౦౦ ఇవేఅక్షరాల ముప్పైవేలవరహాలున్ను ... ..."[౨]

౩. శుభమస్తు స్వస్తి శ్రీమన్ మహారాజాధిరాజ రాజపరమేశ్వర మూవరాయరగండ అరియరాయవిభాడ అష్టదిక్కు-రాయమనోభయం

---

౧ ఉదయగిరికొండమీఁది ఆలయములోనున్న శాసనము నెల్లూరిశా.సం. 3 పుట ౧౩౭౪

౨ తిరుపతి దేవస్థానముద్వారి శాసనసం ౩ సంఖ్య ౭౪

శరభాషగెతప్పువరాయరగండ పూర్వదక్షిణపశ్చిమసముద్రాధీశ్వర యవనరాజ్యస్థాపనాచార్య గజపతివిభాడ శ్రీవీరప్రతాప శ్రీకృష్ణరాయ మహారాయలు విజయనగరానుండి పూర్వదిగ్విజయ యాత్రకు విచ్చేసి వుదయగిరి దుర్గమూన్నుసాధించి తిరుమల కాంతరాయమహా పాత్రునింన్నిపట్టుకొని అద్దంకి వినికొండ బెల్లంకొండ నాగార్జునకొండ తంగేడు కేతవరం మొదలయిన గిరిదుర్గస్థలదుర్గాలు యేకథాడినిక్షైకొని కొండవీటిదుర్గంమీదను విడిచి దుర్గంచుట్టుచుట్టి మొదట చప్పరాలు పెట్టి కోట పడకొట్టించి దుర్గమును పట్టుకొని దుర్గంమీదనుండు ప్రతాపరుద్రగజపతిరాయల కొమారుండు వీరభద్రరాయండు కొమార హంవీరపాత్రునికొడుకు నరహరదేవు రాచూరిమల్లుఖానుండు వుద్దండఖానుండు జన్యావులకసవపాత్రుండు పూసపాటిరాచిరాజు శ్రీనాధరామరాజులక్ష్మీపతిరాజు పశ్చిమబాలచంద్రమహాపాత్రుండు వీరు మొదలైనపాత్రసామంతులాను మన్యవారినిన్ని జీవగ్రాహంగాను పట్టుకొని వారికి అభయదానమును యిచ్చిధరణికోట అమరేశ్వరానకు విచ్చేసి కృష్ణవేణ్యానదీతీరమందు అమరేశ్వరదేవునిసన్నిధిని తులాపురుషమహాదానమును శాయనవధరించి తమదేవుళ్ళు చిన్నాజిదేవమ్మ తిరుమలదేవమ్మగారిచేతను మహాదానాలు శేయించినవధరించి తిరిగి విజయనగరానకువిచ్చేసి రత్నసింహాసనమునుండి సాంమ్రాజ్యంచేస్తున్న స్వస్తిశ్రీజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౩౭ అగునేటి యువసంవత్సరకార్తిక బ౩గు. నాండు తిరువేంగడనాధదేవునికి నవరత్నప్రభావళి౧......"[1] (క్రీ.శ.౧౫౧౫అక్టోబరు౨౫)

౪. పైనివ్రాసిన ౩సంఖ్యగలశాసనములోని "శుభమస్తు...తిరిగి విజయనగరానకు విచ్చేసి" అనువాక్యములను మరల యీశాసనమున వ్రాసి పిమ్మట నీక్రిందివాక్యములను వ్రాసెను.

"సామ్రాజ్యంచేస్తున్న మరింని కళింగదేశదిగ్విజయార్థమై బెజవాడకు విచ్చేసి కొండపల్లిదుర్గమున్ను సాధించి ఆదుర్గంమీదనున్న

౧ తిరుపతి దేవస్థానము శాసన. సం. ౩ సంఖ్య ౭౧

ప్రిహార రాజెశిరశ్చంద్రమహాపాత్రుండు బోడజనమహాపాత్రుండు బిజిలిఖానుండు వీరు మొదలయినవారినింని జీవగ్రాహంగాను పట్టుకొని వారికిఅభయదానం ఇచ్చి అనంతగిరి, ఉండ్రికొండ, ఉల్లకొండ, ఆరువపల్లి, జల్లిపల్లి, కందికొండ, కప్పలువాయి, నల్లగొండ, కంభంమెట్టు, కనకగిరి, శంకరగిరి ఇవి మొదలయిన తెలుంగాణ్యాఖ్యదుర్గాలు ఏకధాటిని కైకొని సింహాద్రి పొట్నూరికి విచ్చేసి అక్కడను జయస్తంభము వేసి, మహాదానమును శాయ నవధరించి తిరిగి రాజమహేంద్రవరానకు విచ్చేసి తమ దేవులు చిన్నాదేవంమ్మ తిరుమల దేవంమ గారిచాతను మహాదానాలు శేయించనవధరించి విజయనగరానకు విచ్చేసి స్వస్తి శ్రీజయాభ్యుదయ శాలివాహనశకవర్షంబులు ౧౪౩౮ అగు నేటి ధాత సంవత్సర పుష్యశుద్ధ ౧౦శు నాండు (క్రీ.శ. ౧౫౧౭ జనవరి ౨వ తేదీ) తిరుమలమీదికివిచ్చేసి తిరువేంగళనాథుంని దర్శించి దేవునికి కంఠమాల ౧ పదకం ౧ గర్భగృహంమీదివిమానానకుం పైండిపూశేఅందుకునరహాలుగ ౩౦౦౦౦ దేవునికి......... ౫౦౦ వరహాలుసమర్పించి తిరిగివిజయనగరానకు విచ్చేసి సామ్రాజ్యంచేస్తుంను మరింని విక్రమసంవత్సర ఫాల్గుణశుద్ధ ౧౧అ నాండు (క్రీ.శ. ౧౫౨౧ ఫిబ్రవరి ౧౭వ తేదీ) తిరుమలమీందికి విచ్చేసి తిరువెంగళనాథదేవుని దర్శించి నవరత్నఖచితమైనపీతాంబరముంను ముత్యాలుంను మాణిక్యాలుంను పచ్చలుంను నీలాలుంను టూపించినకుల్లావు అదిన్నినవరత్నఖచితమైన వింజామరాలు రెండును సమర్పించి తమ దేవులు తిరుమల దేవంమంగారిచాతను నవరత్నాలపదకముంను సమర్పణసేయించి యీ సేవ ఆచంద్రార్కస్థాయిగాను నడవవలెననియిచ్చినధర్మశాసనం... ...”[౧]

౫. సింహాచలమందలి నరసింహస్వామివారి యాలయమం దున్న శాసనము.

“శుభమస్తు. శ్రీమన్ మహారాజాధిరాజ రాజపరమేశ్వర మూరురాయరగండ అరిరాయవిభాడ భాషగెతప్పావ రాయరగండ

---

౧. తిరుపతిదేవస్థానము వారిశాసన సం ౩ సంఖ్య ౭౦

యవనరాజ్యస్థాపనాచార్య శ్రీవీరప్రతాప కృష్ణదేవమహారాయలు విజయనగరసింహాసనారూఢుండై పూర్వదిగ్విజయయాత్రకువిచ్చేసి ఉదయగిరి కొండవీడు కొండపల్లి రాజమహేంద్రవరం మొదలయినదుర్గాలు సాధించి సింహాద్రికి విచ్చేసి స్వస్తిశ్రీజయాభ్యుదయ శాలివాహనశక వర్షంబులు ౧౪౩౮ అగు నేంటి ధాతుసంవత్సర చైత్ర బ౧౨ వరాన సింహాద్రినాథున్ని దర్శించి తమతల్లి నాగాదేవమ్మంగారికిన్ని తమ తండ్రి నరసానాయనింగారికి పుణ్యంగాను దేవునికి సమర్పించిన కంఠమాల ౧కి ముత్యాలు ౯౧ వజ్రమాణిక్యాలకడియాలజోడు౧. శంఖచక్రాలుపదకం౧. పైంజిపళ్ళెం౧కి తూంకాలుగ ౮౮౭౮౨ కానిక మాడలు ౨౦౦౦. తమ దేవులు చిన్నాదేవమ్మంగారిచాతను సమర్పించినపదకం౧. వరహాలుగ౫౦౦. తిరుమలదేవమ్మంగారిచాతను సమర్పించినపదకం౧ వరహాలుగ౫౦౦, ఇంతవట్టుసమర్పించిన ధర్మశాసనం.౫.౨ (౨౬మార్చి ౧౫౧౬సం||) అమరావతిశాసనము, అహోబల శాసనము మొదలగుమరికొన్ని శాసనము లున్నవి గ్రంథవిస్తరభీతిచే నిందీయలేదు.

## VII (5) (౨) ఉదయగిరి విజయము

ఈశాసనములనుబట్టి రాయలు:—

(౧) క్రీ.శ. ౧౫౧౩ సెప్టెంబరు అక్టోబరు నెలలలో మొదటిదండయాత్రకు బయలువెడలి ౧౫౧౪ జూను నెలలోపున నుదయగిరిదుర్గమును వశపఱచుకొని, మరల విజయనగరమునకుఁ దిరిగి వెళ్లెనని స్పష్టమగుచున్నది.

## VII (5) (3) కొండవీటి విజయము

(౨) ౧౫౧౪ సం॥వర్షకాలమును విజయనగరములోఁ గడపి వర్షకాలానంతరము మరల బయలుదేరి, ఉదయగిరిదుర్గమును మరల సాధించి

౨, ద.హిం.శా సం. ౬ సంఖ్య ౬౯౬

కొండవీటిదుర్గముపైకి వచ్చి మిగులదుర్గమయినయాదుర్గమును బహు కష్టముమీఁద ౧౫౧౫ జూలైనెలలోపున సాధించి, ప్రతాపరుద్రగజపతికుమారుఁ డైనవీరభద్రగజపతిని, నాతనితోఁగూడ నాదుర్గమందున్నగొప్పసరదారులను జెఱగొని విజయనగరమునకుఁ దీసికొనిపోయెను. ఇది రెండవదండయాత్ర. కొండవీటిదుర్గమును, శా.శ. ౧౪౩౭ యువ సం. ఆషాఢశుక్ల యేకాదశీశనివారము (౨౩వ జూన్ ౧౫౧౫) నాఁడు తిమ్మరుసు జయించిన ట్లీదుర్గముమీఁద నొక శాసనము కలదు.౧ కొండవీటిదుర్గమును బట్టుకొనినపిమ్మట నమరావతి కేఁగి తులాపురుష దాన మొనర్చినట్లు పైశాసనములలో నున్నది. అమరావతియందును నొకశాసన మున్నది. ఆశాసనము యువసంవత్సరఆషాఢ బ౧౨ భాను వాసరమున (౧౫౧౫ జూలై 8 వ తేదీ) వ్రాయించెను. ౨ అచ్చటినుండి శ్రీశైలమునకుఁ బోయియచ్చట యువసంవత్సరశ్రావణ శు ౧౫ బుధ వారమునాఁడు శాసనము (౧౫౧౫ జూలై ౨౫ వ తేదీ) వ్రాయించెను.

## VII (5) (4) కొండపల్లి విజయము

(3) ౧౫౧౫సంవత్సరపువర్షాకాలమున విజయనగరమందుండి పిమ్మట మరలఁ బ్రచండసైన్యముతో బయలువెడలి, బెజవాడకు వచ్చి, యట నుండి కొండపల్లిదుర్గమున కేఁగి దానిని సాధించి, యచ్చటనున్నసరదారులను జెఱగొని యాపట్టున తెలంగాణాదుర్గములన్నిటిని వశపఱచుకొని, రాజమహేంద్రవరమునుజయించి,సింహాద్రివఱకుఁజని పొట్నూరి వద్ద జయస్తంభమును బాతించి, సింహాచలనరసింహస్వామిని దర్శించి యాస్వామికి దాన మొసంగి క్రీ.శ. ౧౫౧౬ సం.మార్చి ౨౯వ తేదీని శాసనమువ్రాయించెను. ఈదండయాత్రలోనే రాజమహేంద్రవరమును జయించెను. దానిని దాఁటినపిమ్మట మార్గమధ్యమునఁ జితాపుఖానునునాతఁ డడ్డుదగిలి రాయలతో రణ మొనర్చెను. ఈయుద్ధమును గూర్చి చరిగొండధర్మన్నకవిచారిత్రమున వ్రాసెదను.

---

౧ మహమ్మదీయమహాయుగము పుట ౩౪౯

౨ ద. హిం. శా. సం ౬ సంఖ్య ౨౪౮

## VII (5) (అ) కళింగదండయాత్రలు

(ర) పొట్నూరున జయస్తంభమునా టుటతోఁ గళింగ దేశవిజయము పూర్తి కాలేదు. ఈజయస్తంభమును బాతించినపిమ్మట మరల తీర్థయాత్రాసక్తిని, కోటిలింగపుణ్యక్షేత్రమును, గోదావరితటమును, ననేక దేవాలయసంయుతంబునగు రాజమహేంద్రవరమునకు వచ్చి యచ్చట తనదేవులచేత ననేకధర్మములు చేయించి, యచ్చటనుండి విజయనగరమున కేఁగి మరల, ౧౫౧౭ సఁ॥ జనవరి ౨వ తేదీకి, తిరుపతికి వచ్చినట్లు పైనివ్రాసినశాసనమువలనఁ దెలియుచున్నది. రాజమహేంద్రవరమున రాయలదేవుల శాసనములు గన్పట్టలేదు. గజపతిపైఁ గటకమునకుఁ దుదిదండయాత్ర యెప్పుడు వెడలెనో, ఎప్పుడు గజపతితో సంధి జరిగెనో, ఎప్పుడు గజపతికూఁతును రాయలు పెండ్లాడెనో రాయలశాసనములవలనఁగాని, అప్పటివాఙ్మయమువలనఁ గాని స్పష్టముగాఁ దెలియుట లేదు. గజపతి కల్లుఁడైనకతమున నాతనిని జయించుటనుగూర్చిన యుదంతములను రాయలు తరువాతిశాసనములలో వ్రాయుట కిష్టపడ లేదేమో యనితోఁచుచున్నది. దీనినిబట్టి, పొట్నూరున జయస్తంభమును బాతించినపిమ్మట రెండవసారి కళింగముపైకి శ్రీకృష్ణరాయలు యుద్ధమునకై వెడలనే లేదనియు, నాతఁడు విజయనగరమునందుండగనే, గజపతితనయను రాయల కిచ్చినట్లును రాయలు యుద్ధమును విరమించునట్లును సంధి జరిగెననియుఁ గొందఱు భావించుచున్నారు. కొండవీడుదుర్గమున, వీరభద్రగజపతితోఁబాటుగ బ్రతాపరుద్రగజపతిభార్యనుగూడ ఖయిదీగాఁ దీసికొనిపోయె ననియు, గజపతితనయను రాయలకిచ్చి పరిణయ మొనర్చునట్లును, గజపతిభార్యను విడిచిపుచ్చునట్లును దిమ్మరుసుతో గజపతిజరిపిన యుత్తరప్రత్యుత్తరముల మూలమున సంధి జరిగె ననియు నొకకథ చెప్పుచున్నారు. ఈకథయందలి సత్యాసత్యములనుగూర్చి తరువాత చర్చించెదను.

రాయలు జగన్నాథమువఱకు వెళ్లినట్లును రాయలు వచ్చుచున్నాఁడనువార్తను విని గజపతి పాఱిపోయినట్లును, ఆముక్తమాల్యద

లోని సప్తమాశ్వాసాంతపద్యమువలనఁ దెలియుచున్నది. రాయలమంత్రియగు రాయసం కొండమరుసయ్య వ్రాయించిన చోళసముద్రపు శాసనమునందలి.

"దేవబ్రాహ్మణసీమాపాలకం స్వామికార్యహితవంతం
ఘనగిరిఉదయాద్రిప్రముఖాది అనేకదుర్గప్రజారక్షకం
సింహాద్రి శ్రీకూర్మ జయస్తంభకార్యనిర్వాహకం చప్పన్న
దేశచిత్రలిపిలేఖకోవిదం......"౧

అనువాక్యములనుబట్టి శ్రీకృష్ణరాయలు గంజాముమండలమందలి శ్రీకూర్మమున జయస్తంభమును నాటించినట్లును, ఆకార్యమును కొండమరుసయ్య నిర్వహించినట్లును స్పష్టమగుచున్నది. ఈరెండు కార్యములును సింహాచలమునకు వచ్చినమీఁదవదండయాత్రలో జరిగినవి కావు శ్రీకూర్మమును జగన్నాథమును సింహాచలమున కుత్తరమున విశేషదూరములో నున్నవి, జగన్నాథము కటకమునకు నాతిదూరమునం దున్నవి. కావున రాయలు నాల్గవదండయాత్రలో కటకమునకు వెళ్ళెననుట నిశ్చయము. కటకపురిగాల్చె, వడ్డాదిమసియొనర్చె" అను మనుచరిత్రవాక్యములుకూడ నీవిషయమును ధ్రువపర్చుచున్నవి.

కటకముపై దండయాత్ర యెప్పుడుజరిపెను? అనువిషయమును గూర్చి యాలోచింపవలసియున్నది. పైనివ్రాసిన కొండమరుసయ్యశాసనము, ఈశ్వరసంవత్సర మార్గశిర బ3 (౧డిశంబరు ౧౫౧౭) నాఁడు వ్రాయించినది. కావున నంతకుపూర్వమును, సింహాచల ప్రథమశాసనమునకుఁ బిమ్మటను (౨౯మార్చి ౧౫౧౬) కటకమునకు రాయలేఁగెననియు నప్పుడే కళింగదేశ సంపూర్ణవిజయమును, గజపతితో మైత్రి వాటిల్లుటయు, రాయలుగజపతికల్లుఁడగుటయు సంఘటిల్లెననియు నిశ్చయింపఁదగియున్నది.

---

౧ ద. హిం. శా. సం ౯ సంఖ్య ౫౦౩

గుంటూరుమండలమందలి కొమ్మూరుగ్రామమున రాయలసేవకుఁ డగులక్ష్మీకాంతరుసు ధాతసంవత్సర ఫాల్గుణ బ౹౫ గురువారము (౧౨ మార్చి ౧౫౧౭) నాఁడు వ్రాయించిన శాసనములో రాయలు కటకమువఱకును జయించినట్లు వ్రాయఁబడియున్నది ౧ ఈశాసనము యొక్క పూర్తిపాఠము నాకు లభింపలేదు. ఇందలి సంగతులను గూర్చి పూర్తిపాఠము లభించినపిమ్మటఁ జర్చింపవలసియున్నది. దీనిని బట్టి రాయలు కటకమునకు. ధాతసం॥ర ఫాల్గుణ బ ౫ గురువారమునకుఁ బూర్వమే వెళ్ళియుండవలయును. ధాతసం॥ర చైత్ర బ ౧౨ నాఁడు సింహాచలమునందుండి శాసనము వ్రాయించి, యచ్చటనుండి రాజమహేంద్రవరము వచ్చి యటఁ గొన్నినాళ్లుండి దానధర్మములు చేసి పిమ్మట విజయనగరమున కరిగినట్లు తిరుపతిశాసనమునం దున్నది. విజయనగరమునకు ధాతసం॥ జ్యేష్ఠమాసములో వెళ్ళియుండవలయును. మఱియు నాసం॥ర ఆషాఢ బ౩౦ (౨౯ జూన్ ౧౫౧౮) వఱకును రాయలు విజయనగరమునందే యున్న ట్లొకశాసనము ౨చెప్పుచున్నది.

తిరుపతిదేవస్థానమువారిరిపోర్టులో, కటకవిజయము క్రీ. శ. ౧౫౧౮ సం॥ మార్చినెలకు లేక జూను నెలకు పూర్వమే జరిగియుండు నని వ్రాసియున్నారు౩. కాని పైకారణములనుబట్టి యది య గీకార్యము గాఁ దోఁచుటలేదు.

ధాతసం॥శ్రావణమాసము మొదలు కార్తికమాసాంతమువఱకు రాయ లెచ్చట నున్నది తెలియుటలేదు. ఈమాసములు వర్షాకాల మగుటచేఁ గటకవిజయయాత్ర యీకాలములో జరిగెనని చెప్పలేము. వర్షాకాలమును లెక్కచేయక యీకాలములోనే యీదండయాత్ర చేసియుండినఁ జేసియుండవచ్చును. శ్రీకూర్మమునను, శ్రీజగన్నాథమునను రాయలు దానములు చేసి శాసనములు వ్రాయించియుండును. కానియవి నాకు లభ్యముకాలేదు. అవిదొరకినచో, గటకవిజయకాలము స్పష్టముగాఁ దెలియును. వానికై ప్రయత్నింపవలసియున్నది. ధాతసం॥

౧ A R 824 of 1922,
౨ A. R. 457 of 1923
౩. ౧౪౪ ౧౫౧.

వర్షకాలమున రాయలు కటకముపైకి వెడలలేదని తలంచితిమేని, ధాత సంవత్సరమంతయు నూరక యుండెనని తేలుచున్నది. ఈకాలములో రాయలు తనసైన్యమును సింహాచలప్రాంతమున నుంచెనో, సైన్యసమేతుఁడై తిరిగివచ్చెనో తెలియదు.

ధాతసం॥ పుష్యమాసము మొదలు ఈశ్వరసంవత్సర చైత్రమాసమువఱకును శ్రీకృష్ణరాయలు దక్షిణదేశతీర్థయాత్రలు చేయుచున్నట్లు శాసనములవలనఁ దెలియుచున్నది

ధాతసం॥ పుష్య శు౧౦ శు. (౩-౧-౧౫౧౭) తిరుపతి
  ,, పుష్య బ౨ బు॥ (౯-౧-౧౫౧౭) కంచి
  ,, మాఘమాసము (౬-౨-౧౫౧౭) కుంభకోణము
ఈశ్వరసం॥ చైత్రము (౧-౪-౧౫౧౭) కంచి

కంచినుండి విజయనగరమునకు వచ్చి యచ్చటనుండి కటకముపైకి దండయాత్రసాగించి, యీశ్వరసంవత్సర వేసవికాలములో ననఁగా ౧౫౧౭ మే-జూలై నెలలలోఁ గళింగదేశసంపూర్ణవిజయమునందుటయు గజపతితో మైత్రి నెఱపుటయు నాతనితనయను బరిణయమాడుటయు జరిగించియుండునని తలంచుట కవకాశమున్నది. కటకముపైకి ధాతసం॥ ర వర్షాకాలములో వెళ్లెననుటకంటె నీశ్వరసంవత్సర వేసవికాలములో వెళ్లెననుటయే సమంజసమని తోఁచును. కాని యిందులకుఁ గొమ్మూరు శాసన మాటంకము గల్పించుచున్నది. కొమ్మూరుశాసనము సత్యమయ్యేనేని, ౧౨ మార్చి ౧౫౧౭కుపూర్వమే, కళింగదేశదండయాత్ర పూర్తియయ్యెనని నిశ్చయింపవచ్చును. ఎట్లయినను, నీదండయాత్ర కొండమరుసయ్యచోళసముద్రపుశాసనమునకుఁ (౧డిశంబరు ౧౫౧౭) బూర్వము నడచెననుట నిశ్చయము. రాయలు, కటకముపైఁజేసినదండయాత్ర క్రీ.శ. ౧౫౧౬ ఆగష్టు-డిశంబరు నెలలలోజరిగెనా? ౧౫౧౭ మే-నవంబరు నెలలలోఁజరిగెనా? యనువిషయమును భావిపరిశోధనము వలన నిశ్చయింపవలసియున్నది.

సింహాచలమందున్న రెండవశాసనములోని[1] "ప్రతాపరుద్రమహా

---

౧ ఈశాసనమును ఆముక్తమాల్యదా స్వప్నకాలనిర్ణయ మనుశీర్షికక్రింద నిచ్చియున్నాఁడను.

రాయఁ వద్దపుచ్చుకున్నగ్రామములు" అనుమాటలనుబట్టి ఆశాసనకాల మైన ౧౫౧౯నాఁటికిఁగాని కళింగదేశవిజయము పూర్తికాలేదని కొందఱు భావించుచున్నారు. కాని యది యంగీకార్యము కాదు. కృష్ణరాయలానాఁటికి రెండవమారు సింహాచలమునకు విచ్చేసి స్వామి కర్పించుటకొఱకై మామగారి నడిగి కొన్నిగ్రామములను బుచ్చుకొనె నని తలంచుటయే సమంజసము. స్వామికొఱ కల్లుఁడడుగుటయు, మామగా రిచ్చుటయుఁగూడ విరుద్ధము గాదు. అదియునుగాక యా దేశమంతయు విజయానంతరమల్లుఁడు మామ కొసఁగినదియే. "ప్రతాపరుద్రమహారాయఁయొద్ద జయించిపుచ్చుకొనిన" యనియాశాసనమున లేకుండుటకూడ నాయూహకు బలమొసంగుచున్నది.

VII (5) (ఌ) ప్రతాపరుద్రగజపతిభార్యను రాయలుబందిగాఁ జేసెనా?

పూర్వదిగ్విజయయాత్రలోఁ గొండపల్లిదుర్గముననో, కొండవీడుదుర్గముననో యుండఁగాఁ బ్రతాపరుద్రగజపతిభార్యను కృష్ణరాయలు బందీగా విజయనగరమునకుఁ దీసికొనిపోయె నని న్యూయెల్ వ్రాసియున్నాఁడు. కాని యిది యథార్థమని చెప్పుట కాధారములు లేవు. ఉదయగిరికోటను బట్టుకొనినది మొదలు కృష్ణరాయలు, తనదేశముపైకి దండయాత్రలు సలుపనున్నాఁడని ప్రతాపరుద్రగజపతికిఁ దెలియును. తాను కృష్ణానదియొద్ద రాయలతోఁ డీకొని వెనుకకు మరలవలసినవాఁడయ్యెను. ఈసందర్భములో గజపతి తనభార్యను గొండవీటిలోఁగాని కొండపల్లిలోఁగాని యుంచునా యనిసంశయము కలుగుచున్నది. మనుచరిత్రయందుఁ బెద్దన రచించిన:—

శా. హిందూరాజ్యరమాధురంధర భుజాహిగ్రామణీకంచుక
 త్కుండస్వచ్ఛయశోగుళుచ్ఛ యవనక్షోణీధవస్థాపనా
 మందీభూతకృపాకటాక్ష యసకృన్మాద్యత్కళింగాంగనా
 బందీగ్రాహ విగాహితోత్తర కకుబ్ధాటీసమాటీకనా ![1]

యనుపద్యమునందలి "కళింగాంగనాబందీగ్రాహ" యనువాక్యమును బట్టి ప్రతాపరుద్రగజపతిభార్యను రాయలు బందీగా విజయనగరము

[1] ప్రథమాశ్వాసము ౧౮౩వ పద్యము.

నకుఁ దీసికొనిపోయెనని యనుచున్నారు. కొండపల్లి కొండవీటిదుర్గము లలో సేనానాయకులను సరదార్లను ననేకులను జీవగ్రాహముగాఁ బట్టుకొని చెఱయందుంచినాఁడు. వారితోఁబాటుగ వారిభార్యలను గూడఁ బందీలుగాఁ దీసికొనిపోయియుండును. అట్టివారినే పెద్దనార్యుఁడు పైవాక్యముచే సూచించినాఁడనియుఁ బ్రతాపరుద్రగజపతిభార్యను బందీగాఁ జేయలేదనియు నాయభిప్రాయము.

కృష్ణరాయలు యుద్ధయాత్రలలోఁ జేజిక్కిన నారీమణులను జాల గౌరవముతోఁ జూచెడివాఁ డనిచరిత్రకారులందఱు నేకగ్రీవము గా వ్రాసియున్నారు.

## VII (5) (2) కృష్ణానదీతీరమున ప్రతాపరుద్రగజపతికిని రాయలకును యుద్ధము జరిగెనా?

ఈవిషయమున మహమ్మదీయమహాయుగ మిట్లు చెప్పుచున్నది. "కృష్ణదేవరాయ లుదయగిరిఁ దీసికొని కొండవీటిమీఁదికి దండెత్తి వెళ్లు చున్నాఁడనివిని కటకాధీశ్వరుఁ డగుప్రతాపరుద్రదేవుఁడు పదుమూఁడు వందల యేనుఁగులను, ఇరువదివేల గుఱ్ఱములును, అయిదులక్షల కాల్బ లమును వెంటదీసికొని యోఢ్రదేశమునుండి బయలుదేరి కృష్ణరాయ లతోఁ బోరాడుటకుఁ గృష్ణానదిని సమీపించెను. ఈవర్తమానము విని కృష్ణరాయలు కొండవీడువిడిచి తనసైన్యములతో గజపతిసైన్యముల సమీపించెను. కృష్ణ కుత్తరమున గజపతిసైన్యమును దక్షిణమున రా యలసైన్యములును విడిసి యుద్ధమునకు వేచియుండెను. ఏఱు దాఁటు నప్పుడు పోరాడుటవలన అనావశ్యకముగా సైనికులు మడియుదురు కావున మీరుకృష్ణదాఁటి యటువచ్చెడియెడల మేము రెండుమైళ్ళు వెను కకుఁ బోయెదము. లేదా మీరు క్రోసెడుదూరము వెనుకకుంబోయి మమ్ము నావలకు రానిం'డని రాయలు గజపతికి వర్తమానమంపెను. కాని యందులకుఁ బ్రత్యుత్తరము రానందున రాయలు శత్రువులతోఁ బోరాడుచుఁ గృష్ణానదిని స్వసైనికులతో దాఁటి గజపతితో ఘోర ముగాఁబోరి యాతనిఁ బాఱఁదోలి యెన్నియో యేనుంగులును గుఱ్ఱం బులును ధనంబును గొల్లగొట్టెను."

ఈయుద్ధము క్రీ. శ. ౧౫౧౫ సం. మొదటిపాదములో జరిగియుండవలయును పైనివ్రాసిన నెల్లూరుశాసనములో ఉదయగిరిదుర్గమును బట్టుకొనినప్పుడే అనఁగా ౧౫౧౪ సంవత్సరము జూను నెలలోపుననే "ప్రతాపరుద్రగజపతిని కొండవీటిదనకాను విరగంబాడిచి ఉదయగిరి దుర్గంపుచ్చుకొని" అని వ్రాసియున్నది. దీనినిబట్టి ప్రతాపరుద్రగజపతితో ౧౫౧౪లో నొకమారు యుద్ధము జరిగినట్లును అందు గజపతి యోడిపోయి, కొండవీటిదుర్గములోనికి బాఱిపోయినట్లు కనఁబడుచున్నది ౧౫౧౪ లోఁ గటకమునకేగి సైన్యమును గూర్చుకొనివచ్చి ౧౫౧౫లో మరల రాయలతోఁ గృష్ణానదియొద్దన రణమొనర్చియుండును. లేదా, నెల్లూరుశాసనములోని "ప్రతాపరుద్ర గజపతిని" అను మాటలకు "ప్రతాపరుద్రగజపతి సైన్యమును" అనియర్థము చెప్పుకొని, ౧౫౧౪లో రాయలకును, గజపతికిని యుద్ధము జరుగనే లేదని తలంపవలసియుండును.

## VII (5) (౮) వీరభద్రగజపతి ఆత్మహత్య చేసికొనియెనా?

ప్రతాపరుద్రగజపతికుమారుఁడైనవీరభద్రగజపతిని కొండవీడు దుర్గమున రాయలు జీవగ్రాహముగాఁ బట్టుకొని, విజయనగరమునకు బందీగాఁ దీసికొనిపోయెనని రాయలశాసనమువలనఁ దెలియుచున్నది. విజయనగరమున వీరభద్రగజపతి యాత్మహత్య చేసికొనెనని మహమ్మదీయమహాయుగమున నిట్లు వ్రాసియున్నది

"రాయలు విజపురమునకువచ్చినతరువాత నొకనాఁడు చెఱసాలలో నున్నగజపతిపుత్రుని ఖడ్గకౌశలముఁజూడ నాతనిఁ బిలిపించి వినోదము చూపుమనఁగా నతఁడాయగౌరవమున కోర్వలేక పొడుచుకొని చచ్చెను. తరువాత రాయలకును గజపతికిని సంధి జరిగి తనకూఁతుని రాయలకిచ్చి వివాహము చేసెను."

వీరభద్రగజపతిని బట్టుకొనినది ౧౫౧౫జూనుప్రాంతము. గజపతితో సంధిజరిగినది ౧౫౧౬ వ సంవత్సరము. ఈనడుమ నీయాత్మహత్య జరిగియుండవలయును.

అనంతపురమండలములోని మడకశిర తాలూకాయందలి చరులోపల్లి గ్రామమున నున్న శిలాశాసనములో[1] వీరభద్రగజపతి కృష్ణరాయనికి పుణ్యముగా నొక చెఱువును త్రవ్వించి సిరలోనున్న తిరువెంగళనాథుని కర్పించినట్లును నాతఁడు మలయబెన్నూరు సీమకుఁ బరిపాలకుఁడుగానున్నట్లును గన్పట్టుచున్నది. శాసనకాలము యువసంవత్సర కార్తిక శు౫ (౧౫౧౫ అక్టోబరు) కొండవీడుదుర్గమున వీరభద్రగజపతిని బట్టుకొనినది ౧౫౧౫ జూను ౨౩వ తేదీ. నాల్గుమాసములలో రాయలు తనశత్రువును తనక్రిందనున్న యొకసీమకుఁ బరిపాలకుఁడుగా నిర్ణయించుటయు, వీరభద్రగజపతి రాయలయొద్ద నుద్యోగమును స్వీకరించుటయు విచిత్రముగాఁ గన్పట్టుచున్నది. అప్పటి కింకను గళింగదేశవిజయము పూర్తికాలేదు. ప్రతాపరుద్రగజపతితో సంధిజరుగలేదు. వీరభద్రగజపతి రాయలయొద్ద నుద్యోగమునందున్నచో ఖడ్గవిద్యాకౌశలముఁ జూపుమనినప్పు డేల యభిమానమును జెంది యాతఁడాత్మహత్య గావించుకొనియెనో తెలియదు. చరులోపల్లి శాసనపూర్తిపాఠము నాకలభింపలేదు. అదిలభించువఱకు నీవిషయ మనుమానాస్పదముగా నెంచుటయే లెస్స.

శా. శ. ౧౪౪౦లోఁ గృష్ణరాయలును వీరభద్రగజపతియుఁ గలిసి కృష్ణానదీతీరమున నొకదాన మొసఁగి యొకశాసనము వ్రాయించినట్లు గుంటూరుమండలమందలి గుంటూరుతాలూకాలోని యుండవిల్లి గ్రామమునందలి శాసనమును బట్టి తెలియుచున్నది. అని దొరతనమువారి రిపోర్టులయందున్నది.[2]

ఇందలి విషయములు నిజమయ్యెనేనియును, నీవీరభద్రగజపతి ప్రతాపరుద్రగజపతికుమారుఁ డయ్యెనేనియును నతఁడాత్మహత్య చేసికొనలేదనియు, క్రీ. శ. ౧౫౨౮ వఱకు జీవించియుండెననియు స్పష్టమగును.

---

౧ A. R. 744 of 1917

౨ A. R. 44of 1909 దొరతనమువారి రిపోర్టు 1908-09 పుట 118 పేరా
'(; 1912-13 పుట 122 పేరా 58.

ఉండవిల్లి శాసనము ప్రకటితమైనది ౧ ఇది క్రీ.శ. ౧౫౨౮ ఫిబ్రవరి ౨౯వ తేదీనాఁడు (పార్థివసంవత్సర ఫాల్గుణ శు౧౫ సోమవారం) పెనుగొండవాస్తవ్యు లగునల్లురు వైశ్యులు వ్రాయించినది. ఇందుఁ గృష్ణరాయల నామముగాని వీరభద్రగజపతినామముగాని యుదాహరింపబడలేదు. "వీరప్రతాపరుద్రగజపతి" అనియున్నది. ఇతఁడు ప్రతాపరుద్రగజపతియేగాని యాతనికుమారుఁడైనవీరభద్రగజపతి కాఁడు. ఇతని ప్రశస్తిలో "నవకోటికర్ణాటేశ్వర" అనియుండుటచేఁ గృష్ణరాయలును వీరభద్రగజపతియు, నీశాసనమున నుదాహృతులైరని దొరతనమువారి శాసనశాఖవారభిప్రాయపడినట్లు కన్పట్టుచున్నది. కాని అదిపొరపాటు. చరులోవల్లి శాసనమునఁగూడ నిట్టిపొరపాటేమైనఁ గలదేమోయని యనుమానము.

ప్రతాపరుద్రగజపతి కృష్ణరాయలయనంతరమున మూఁడేండ్లు అనఁగా క్రీ.శ. ౧౫౩౨వఱకు జీవించియున్నాఁడు. ఆతనితరువాత వీరభద్రగజపతిరాజ్యమునకు రాకపోవుటచే నాతఁ డంతకుముందే చనిపోయెననుమాట వాస్తవము. కాని యంతమాత్రముచే నాతఁ డాత్మహత్య గావించుకొనెనని నిశ్చయించి చెప్పలేము. ప్రతాపరుద్రగజపతితో సంధిజరుగువఱకు నాతఁడు చెఱయందుండిన నుండవచ్చును. చెఱలోఁగాని, యటుపిమ్మటఁగాని యాతఁడు స్వాభావికమరణము నొందిన నొందియుండవచ్చును. సత్య మిదియని నిశ్చయము గావింపలేము. ఈతనితోఁ బట్టువడిన సరదారులేమయిరో అదియును దెలియదు.

## VII (6). మూఁడవ రాయచూరు యుద్ధము

ఈయుద్ధము, లభించినంతవఱకు కాలమునాఁటి యాంధ్రకావ్య ప్రపంచములోఁగాని, శిలాశాసనములలోఁగాని వర్ణితమైనట్లు కన్పట్టదు. ఎచ్చటనైనఁ జెప్పఁబడియున్నను నది స్పష్టముగా లేకయో, మఱుఁగువడియో యుండియుండును. ఈయుద్ధము క్రీ శ. ౧౫౨౦ సం. మేనెల ౧౯వ తేదీని జరిగెనని, చరిత్రకారు లందఱు నంగీకరించుచున్నారు. రాయచూరుదుర్గము కృష్ణరాయల స్వాధీనమునుండి తొలఁగిపోయి

౧ ద. హిం. శా. సం. ౧౦ సంఖ్య ౭౩౭

ఇస్మాయిల్ ఆదిల్ షాహా తనవశముచేసికొనుటచే దానిని మరలఁ దీసి కొనుటకై రాయలీ యుద్ధమున కుపక్రమించెనని కొందఱందురు. ఇస్మాయిల్ ఆదిల్ షాహా రాయల స్వాధీనమందున్న రాయచూరుదుర్గమును స్వాధీనము చేసికొనుటకై గొప్పప్రయత్నము లొనర్చుచుండుటను దెలిసికొని రాయలుకూడ విశేషప్రయత్నము చేసి యాతని నోడించెనని కొందఱందురు. ఇది యే సత్యము. ఆదుర్గములు రాయలస్వాధీనము నుండి తొలఁగిపోలేదు.

ఈ యుద్ధమునకుఁ గృష్ణరాయలు చేసిన సన్నాహమును న్యూనిజు చక్కఁగా వర్ణించియున్నాఁడు. ఆవర్ణనమును వ్రాయుట కిటఁ దావుచాలదు. ఈయుద్ధములో ఇస్మాయిల్ ఆదిల్ షాహా పలాయితుఁడయ్యెను.

ఇస్మాయిల్ ఆదిల్ షాహాకు సహాయమొనర్చినవారిలో బీదరు రాజ్యమును బాలించుచున్న అమీరాబరీ దొకఁడనియు, ఇస్మాయిల్ సాహాయ్యమునుగొని అమీరుబరీదు, బహుమనీ సుల్తానగు మహమ్మదుషాహా కుమారులను ముప్వురిని బీదరునందుఁ జెఱయందుంచి తాను స్వతంత్రుఁడై రాజ్యము చేయుచుండెననియుఁ జెప్పుచున్నారు.

## VII (7) బెడందకోట విజయము.

కృష్ణరాయలు, ఇస్మాయిలును జయించినపిమ్మట బీదరుపై వెడలి బరీదును జయించి యటఁ జెఱలోనున్న మహమ్మదుషాహా కుమారులను విడిపించి యందుఁ బెద్దవానిని సింహాసనాసీనుం జేసెనని న్యూనిజు వ్రాసియుండెను. బీదరు కా కాలమున "బెడందకోట" యని పేరు. బెడదకోటను రాయలు జయించినట్లు రెండు చాటువులు తెలుపుచున్నవి.

అలసాని పెద్దన :—

"సమరక్షోణిని కృష్ణరాయలభుజాశాతాసిచేఁబడ్డ దు
ర్గమదోర్దండ బెడందకోట యవనవ్రాతంబు సప్తాశ్వమా
ర్గముసం గాంచి సెబాసహో హరిహరంగాఖూబుఖూడాకితే
తుముకీబాయిలబాయిదే ములకీ యందు గ్రొంటికిం బోవుచున్"

ఒక అజ్ఞాతకవి :—

గనకుల్ బల్లిదమయ్యె ఢిల్లికిని మక్కాకోట మేలయ్యె మం
డువకున్ గొత్తగ కొత్తడంబు లమరెన్ బోలేరు చందేరులన్
దవసం బెక్కె బెడందకోటపురకాంతాగర్భనిర్భేదన
ప్రవణాం దైనభవత్ప్రయాణ జయవార్తన్ కృష్ణరాయాధిపా॥

బెడందకోటప్రస్తావము, మనుచరిత్ర, ఆముక్తమాల్యదలలో లేక కేవలచాటువులలో నుండుటంబట్టి మూఁడవ రాయచూరు యుద్ధానంతర మేళధాటిని బీదరువఱకు దండయాత్ర సాగించి, యమీరుబరీదును జయించి, యాకోటలో బందీలుగా నున్న మహమ్మదుషాహాకుమారులను విడిపించి, యందొకని నాసింహాసన మెక్కించి రాయలు మరల విజయనగరమునకు వచ్చెనని తలంపవచ్చును. ఇది యంతయు ౧౫౨౦ లో జరిగియుండును. ఈ బెడందకోటవిజయము మఱియేగ్రంథములలో నైనవర్ణింపఁబడ లేదేమో! ఆగ్రంథము[౧] పెద్దనహరికథాసారమువలె బయటపడలేదేమో!

రాయవాచకములోని యీక్రిందివాక్యములు బెడఁదకోట (బీదరు) విజయమున కన్వయించు నని తలంచుచున్నాఁడను.[౨] "కృష్ణరాయలవారు ఉత్తరాన తురకలకార్యం జయం చేసుకొని శీఘ్రమై తిరిగి తిరుపతికి రాగా కళ్యాణకలుబరిగె కోటలవారు గర్వితులై కోటమీఁద నుండి కూత లీంగ్గా ఆవార్తలు రాయలువారు విని యెదిరితెగవారిని అడుగగా మ్లేచ్ఛులతెగవారు వున్నారు గనుక కోటమీఁదికై అంద్దుల మగుడించ్చమని కలుబలిరేగ కోట లగ్గబెట్టించ్చి మూడుముక్కాలు ఘడియలలో కోటసాధించి ఆకోటలో వుంన్నయజమానుంణ్ణి చేపట్టుగా పట్టుకొని ఆరువేలగుర్రాలవారినింన్ని గుర్రాలనున్ను ఏకవాగా బట్టుకొని ఆకోటకు తాణ్యాం గుజ్జరికళ్యాణరావును వుంచ్చి తిరుపతికి వచ్చి"

ఉత్తరాన తురకలకార్యం జయం చేసుకొనుట యనఁగా బెడందకోట యవనులను జయించి, తిరిగి విజయనగరమునకు వచ్చు

౧ శ్రీవెంకటరమణయ్యగారి వ్యాసము. భారతి. విరోధి. ఆషాఢము. పుట ౭౪.
౨ ఆం. సా. ప. పత్రిక. రాయవాచకము ౨౦౩ పుట.

నప్పుడు మార్గమధ్యముననున్న కలబరిగె (గుల్బర్గ) యందుండిన మహమ్మదీయులు రణభేరి వేయఁగా వారిని జయించి పిమ్మట తిరుపతికి వచ్చెనని తలంపవలసియున్నది. రాయలు, రెండుమాఱులు మాత్రమే యుత్తరదేశదిగ్విజయమునకు వెళ్ళియుండెను. మొదటిసారి ౧౫౧౨లో గుల్బర్గవఱకుమాత్రమే యుద్ధయాత్ర సాగించి యచ్చట జయస్తంభమును నాఁటి వెనుకకుఁ దిరిగి వచ్చెను. అందుమార్గమధ్యమున గుల్బర్గను జయించుట యసంభవము. ఆయాత్రలో గుల్బర్గ యంత్య ప్రదేశము కాని మార్గమధ్యప్రదేశము కాదు. రెండవయుద్ధయాత్ర బెడఁదకోటవఱకును వెళ్ళెను. కావునఁ దిరిగివచ్చునప్పుడు మార్గమధ్యమున గుల్బర్గను జయించుట సంభవ మయ్యెను.

ఈయుద్ధయాత్రనుండి తిరిగి తిరుపతికి రాయలువిచ్చేసినదినము విక్రమసంవత్సర ఫాల్గుణ శు ౧౧ ఆదివారము (౧౭–౨–౧౫౨౧) ౧౫౨౦ వ సంవత్సరం మేయినెలాంతమునకదా మూఁడవ రాయచూరు యుద్ధము జరిగినది అచ్చటినుండి బీజపురువఱకును బోయి, యాదుర్గమును జయించి, తిరిగివచ్చునప్పుడు దారిలో గుల్బర్గదుర్గమును గొట్టి విజయనగరమునకు విచ్చేసి యచ్చటనుండి తిరుమల దేవితోఁగూడఁ దిరుపతి కేఁగునప్పటి కేడుమాసములు పట్టునని యందు విరుద్ధమేమియు లేదు.

కావున, మూఁడవ రాయచూరు యుద్ధానంతరమున క్రీ శ. ౧౫౨౦ ఉత్తరార్ధమున బెడఁదకోటవిజయము సమకూరెనని నిశ్చయింతము. సాళువనరసింహరాయల సేనాధిపతియుఁ గృష్ణదేవరాయల పితామహుఁడు నగునీశ్వరనాయకుఁ డీబెడందకోటయందే యవనరక్తస్రవంతిని బ్రవహింపఁ జేసెనని పారిజాతాపహరణకృత్యాదియందు రచించినపద్యమును రాయలవంశవర్ణనమునఁ బైని నిచ్చియున్నాఁడను.

### VII (క) నాల్గవ రాయచూరు యుద్ధము

కృష్ణరాయలచరమదశలో ననఁగా క్రీ.శ. ౧౫౨౯లో మఱియొకమాఱు రాయచూరుకడ యుద్ధము జరిగినట్లు శ్రీ శా. లక్ష్మణరావు

పంతులుగారు లక్ష్మణరాయవ్యాసావళిలో వ్రాసియున్నారు ౧ అది యిస్మాయిల్ ఆదిల్‌షాహాకును, కృష్ణరాయలకును జరిగినట్లును నం దిస్మాయిల్ పాఱిపోయినట్లును దెలియుచున్నది. అంతకంటెనూ యుద్ధ వివరము లేమియుఁ దెలియుటలేదు.

## VII (9) రాయలుగుజరాతుపై దాడివెడలెనా ?

కృష్ణరాయలు గుజరాతుదేశముపై దండయాత్రచేసినట్లు మను చరిత్రయందలి "ఉదయాచలేంద్రంబు" అను పద్యమునుబట్టి శ్రీలక్ష్మణ రావుపంతులుగారు లక్ష్మణరాయవ్యాసావళిలో వ్రాసియుండిరి ౨ కాని యీవిషయమునఁ గొందఱు పండితులు సంశయమును జూపుచున్నా రు. ఇందునుగూర్చి, "రాయలు కృతిపొందిన కావ్యములు" అనుశీర్షిక క్రింద వ్రాసెదను.

రాయల దిగ్విజయములతోసంబంధించిన విషయములు పెక్కు లున్నను, వానినన్నిటి నిటఁ దెలుపఁజాలను. రాయలు రణములో నపజయమనుమాట యెఱుంగఁడు. తనసైన్యములెప్పుడైన శత్రుసేనల ధాటి కాగఁజాలక నిరుత్సాహము చెందుట తటస్థించెనేని, యాతరుణ మునఁ దాను ముందున కేఁగి యుచ్చైస్స్వరముతోఁ దన సైన్యమును సరదారులను బురికొల్పుచు పౌరుష మెక్కించి విజయముగాంచెడి వాఁడు. విజయానంతరమున బహుమతులనొసంగి సైన్యమును గౌర వించుచుండెడివాఁడు. సరదార్లను మంత్రులను ఉద్యోగులను గౌర వించి వారి విశ్వాసమును జూఱగొనుచుండెను. ఇతఁడు సామదానభేద దండోపాయములను జక్కగనెఱింగి సమయానుకూలముగ వాని నను వర్తింపఁజేయుటలో మిగుల నేర్పరి. జ్యోతిషశాస్త్రమునం దీతని కెక్కువ నమ్మకము. సిద్ధాంతులుంచిన ముహూర్తముననేగాని యుద్ధ మునకు బయలుదేరెడివాఁడు కాఁడు. శకునశాస్త్రమునందును నీతనికి నమ్మకముకలదు. యుద్ధయాత్రలోనున్నప్పుడీతనిసైన్యము సముద్రము

---

౧ లక్ష్మణరాయ వ్యాసావళి ౪౦ పుట

౨ ,, ౪౫ పుట

వలె నుండెడిదనియు, సైన్యమునకుఁ గావలసిన యన్నిపదార్థములును సదుపాయములును గూడ నుండుటచే నదియొక ప్రయాణముచేయు చున్న మహాపట్టణమువలెనున్నదనియుఁ జరిత్రకారులు వర్ణించి యున్నారు. ఈతఁడొనర్చెడి జైత్రయాత్రలలో నీతని రాణీలు, దాసీలు పండితులు, కవులు, గాయకులు, హాస్యగాండ్రు, నర్తకులు గూడ నుండుటచే దండువిడిసిన ప్రదేశములెల్ల రాజధానీనగరములై యంతఃపుర సౌధములై రాజసభామందిరములై శోభిల్లుచు నాహ్లాదమును గలిగించు చుండెడివి.

ఇదివఱకే యీతని దిగ్విజయకథనము విస్తారమైనది. దీని నింత టితో వదలి యీతని విద్యావిషయిక కథనమున్నకై మరలెదను.

## VIII కృష్ణరాయల పాండిత్యము

కృష్ణరాయలు ప్రత్యేక మొకశాస్త్రమునఁ బండితుఁడైనట్లు గానిపింపదు. ఆతని ప్రత్యేకశాస్త్రపరిజ్ఞానమునుగురించి యెవ్వరును జెప్పియుండలేదు కాని యీతఁడు సింహాసనమధిష్ఠించునాఁటికి సంస్కృతభాషయందనుపమానమైనసాహిత్యజ్ఞానముకలవాఁడని తిరుమలదేవ స్థానమునందలి క్రీ.శ.౧౫౧౩ జూను నెల౧౩వ తేదీశాసనమునందలి ప్రశస్తి లోని యీక్రిందివాక్యములవలనఁ దెలియుచున్నది.

"ఇహ కిల జగతి నిఖిలకవికులాభినంద్యమానౌదార్య ధైర్య శౌర్యాదిజనిత యశఃపూరకర్పూరపూరిత బ్రహ్మాండకరండేన, సమర చండేన, విహసితనృగనలనహుషనాభాగ దుంధుమారమాంధాతృభరత భగీరథరామాదిచరితేన, కృతభూసురత్రాణేన, పరిభూతసురత్రాణేన వదనవిజితాంభోజేన, భోజేనాపరేణ, కావ్యనాటకాలంకారమర్మజ్ఞేన, ధర్మజ్ఞేన, ప్రతివర్షప్రవర్తితకనకవసంతమహోత్సవేన,సవేన, కృతార్థిత విప్రసార్థేన, సార్థేన, నిఖిలనృపతిమూర్ధన్యేన ధన్యేన నాగాంబికానరస నృపనందనేన, నిఖిలహృదయానందనేన, సమరముఖవిజయేన, విజయేన దిశాంవిజయనగరే సింహాసనమారుహ్య శాసతా సకలాం భువం భుజ విజితసాంపరాయేణ, కృష్ణదేవమహారాయేణ,భువనభరణసావధానాయ

వేంకటేశాభిధానాయ శేషాచలవాసాయ శ్రీనివాసాయ దత్తమిదం ధర్మశాసనమ్.

ఈవాక్యములవలనఁ గృష్ణరాయలు అపరభోజుఁడని కావ్యనాటకాలంకార రహస్యముల నెఱింగినవాఁడని తెలియుచున్నది. ఇతఁడు సింహాసనమధిష్ఠించుటకుఁ బూర్వమే విద్యార్థిదశయందుఁ గావ్యనాటకాలంకారగ్రంథములనుజదివి వానియందుఁ జక్కనిజ్ఞానమలవఱచికొనియుండె ననియు సంస్కృతాంధ్రములయందుఁ గవిత్వము చెప్పగలసమర్థతను సంపాదించెననియుఁ జెప్పవచ్చును. రాజ్యభారమును వహించినపిమ్మట నిరంతరమును రాజకార్యములయందువలెనే భాషావిషయమునను శ్రద్ధవహించి రాజనీతిజ్ఞులతోడను బండితులతోడను రాజ్యగోష్ఠియు భాషాగోష్ఠియుఁ గూడ జరుపుచు నటురాజ్యమును నిటుపాండిత్యమును నభివృద్ధిచేసికొనుచుండెను. కవిత్వము చెప్పటలో సమర్థులగు నష్టదిగ్గజములకు నిఁక ననేకులు సంస్కృతపండితులను సంగీతశాస్త్రజ్ఞులను జ్యోతిషికులను నానావిధశాస్త్రవిశారదులను దనసభయందుంచి పోషించుచున్న ట్లీతనిశాసనములవలనఁ దెలియుచున్నది. అభ్యసించిన పాండిత్యముకంటె శ్రుతపాండిత్యమువలనఁ గలిగెడిమేలపారము. దానివలన నుదకమునందుఁ బడిన తైలబిందువువలె బుద్ధి చక్కగా వికసించును. రాయల కిట్టియవకాశము విశేషముగా లభించినది.

ఇతఁ డాముక్తమాల్యద యనునాంధ్రప్రబంధమును సంస్కృతమునఁ గొన్నిగ్రంథములును రచియించినాఁడు. కర్ణాటకమునం దేమేని గ్రంథములను రచియించెనేమో తెలియదు ఆముక్తమాల్యదయందలి యీక్రిందిపద్యమువలన నీతఁడు రచించిన సంస్కృతగ్రంథముల నామములు తెలియుచున్నవి.

సీ. పలికి తఁద్రేక్షోపమలు జాతి పెంపెక్క
  రసికులౌననమదాలసచరిత్రి
భావ ధ్వని వ్యంగ్య సేవధి గాఁగఁ జె
  ప్పితివి సత్యావధూప్రీణనంబు

శ్రుతి పురాణోపసంహిత లేర్చి కూర్చితి
సకలకథాసారసంగ్రహంబు
శ్రోత్రఘుచ్చటలు విచ్చుగ రచించితి సూక్తి
నైపుణి జ్ఞానచింతామణికృతి

తే. మఱియు రసమంజరీముఖ్య మధురకావ్య
రచన మెప్పించుకొంటి గీర్వాణభాష
నంధ్రభాష యసాధ్య మె యందు నొక్క
కృతి వినిర్మింపు మీక మాకుఁ బ్రియము గాఁగ.

ఈగ్రంథము లిప్పుడు నామమాత్రావశేషము లైనవి. కృష్ణరాయలు రచించిన "జాంబవతీపరిణయ"మను సంస్కృతనాటక మొకటి యీనడుమ తంజావూరు పుస్తకభాండాగారమున బయటఁబడినదఁట. నేను దానిని జూచుట తటస్థింపలేదు. రసగ్రహణపారీణుఁడగు నీమహారాజువలన నాంధ్రభాషకపారమగు మేలుసమకూరినది, ఆంధ్రభాషామహావృక్షమును నాటినవాఁడు రాజరాజనరేంద్రుఁడు. పెంచి పోషించి వికసింపఁజేసినవాఁడు కృష్ణదేవరాయలు.

ప్రపంచదర్పణ మనుసంస్కృతగ్రంథ మొకటి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునఁ గలది యీనడుమ బయటఁ బడెననియు నందు:—

"అల్లసాని పెద్ద నార్యేణ సత్యావధూపరిణయే" అనియు "అల్లసాని పెద్దనార్యేణై స్యైవ ముక్తం రసమంజర్యామ్" అనియున్నదనియు, నాముక్తమాల్యదపీఠికాకారులు వ్రాసియున్నారు. దీనినిబట్టి యీ సంస్కృతగ్రంథములు పెద్దనార్యకృతము లని తెలుచున్నది.

భానుదత్తుఁడనుకవి రసమంజరియను గ్రంథమును రచియించెను. అతఁడు శ్రీకృష్ణరాయలతో సమకాలికుఁ డనియు, రాయలపైఁ గొన్నిశ్లోకములను రచియించెననియు శ్రీ ఈయుణ్ణి వెంకటవీరరాఘవాచార్యులుగారు ప్రసంగవశమున నాతోఁ జెప్పియున్నారు. రాయల రసమంజరియు, భానుదత్తునిరసమంజరియు, నొకేగ్రంథమా వేఱు

వేఱుకావ్యములో తెలియదు. ఈశ్లోకములను, జాంబవతీపరిణయము న దొరకినభాగమును నొసంగెదనని శ్రీయాచార్యులువారు వాగ్దానమొసగి యున్నారు. అవి లభించెనేని యనుబంధముగాఁ బ్రకటించెదను.

రాయలు సకలకథాసారసంగ్రహమును సంస్కృతమున రచియించినట్లు ఆముక్తమాల్యదయందలి పైపద్యమువలనఁ దెలియుచున్నది. అట్టిదే యాంధ్రమున సకలకథాసారసంగ్రహమను పేరఁ బుత్తేటిరామభద్రునిచే రాయలు రచియింపఁజేసినట్లు కన్పట్టుచున్నది.

పైనివ్రాసినసంస్కృతగ్రంథములు రాయలు రచించినవగునా? కాదా? యనువిచారణతో మనకిప్పుడు పనిలేదు. ఇంతకును నాగ్రంథములిప్పుడు గన్పడుటలేదు-గ్రంథములు లభింపకుండుటచే నావిచారణ దుస్సాధ్యమును బ్రయోజన రహితము నగును. కావున నావిషయమును వదలివేయుదము,

ఈమహారాజు ఆంధ్రమున నాముక్తమాల్యదదక్క వేఱుగ్రంథములు రచియించినట్లు గన్పట్టదు. ఏమేనిరచియించియున్నను నవి కాలగర్భమునఁ బడిపోయినవి. వానిపేరు లైనను శ్రవణగోచరములగుట లేదు. మనకులభించినదొక్కటియేయైనను, నం దుదాహృతమైనస్వప్నకాలమునుగూర్చియు, నాగ్రంథరచనాకాలమునుగూర్చియు, నాగ్రంథకర్తృత్వమునుగూర్చియు, నింక ననేకవిషయములలో భిన్నాభిప్రాయములున్నవి. వానివిషయమున నించుక ప్రస్తావించెదను.

### VIII (1) ఆముక్తమాల్యదలోని స్వప్నకాలనిర్ణయము

ఈవిషయమునుగూర్చి ఆముక్తమాల్యదకృత్యాదియందుఁ గవి యిట్లు చెప్పియున్నాఁడు.

"అని యిష్టదేవతావందనంబు జేసి మున్నేఁ గళింగదేశవిజిగీషామసీమం దండెత్తిపోయి విజయవాటిం గొన్నివాసరంబు లుండి శ్రీకాకుళనికేతనుం డగునాంధ్రమధుమథను సేవింపంబోయి హరివాసరోపవాసం బచ్చటఁ గావింప నప్పుణ్యరాత్రిచతుర్థయామంబున."

శ్రీకాకుళేశ్వరుఁడు స్వప్నమునఁ గన్పడి కృతినిర్మాణము సేయుమని యాజ్ఞాపించెను. ఇందు "మున్ను" అని చెప్పియుండుటచేత గ్రంథ రచనమునకును స్వామియాజ్ఞకును సంబంధము లేదనిస్పష్టమగుచున్నది. స్వామియాజ్ఞయైన కొంతకాలమునకు గ్రంథరచన మారంభమైనది. ఆమధ్యవ్యవధి యెంతకాలమో తరువాత నాలోచింతము.

గ్రంథరచన కాజ్ఞయైన దెప్పు డనువిషయమే యిట నాలోచనీయము. అదిహరివాసరమై యుండవలయును. కళింగదేశవిజయ యాత్రకు బయలుదేరినతరువాత బెజవాడలో కొన్నిదినము లుండిన పిమ్మట నై యుండవలయును. కళింగదేశవిజయము సంపూర్ణమగు లోపుననై యుండవలయును. ఈలక్షణములతోఁ గూడినదిన మెప్పుడో తెలిసికొన వలసియున్నది.

తిరుపతి దేవస్థానమువారి రిపోర్టులో రాయలు శ్రీకాకుళమున కేఁగి హరివాసరోపవాస మొనర్చినదినము యువసంవత్సర మాఘశు౧౧ జయ వారమని నిర్ణయించినారు.[౧]

బ్ర॥శ్రీ॥ వీరేశలింగముపంతులుగారు ఆంధ్రకవులచరిత్రమున, "కళింగదేశవిజయయాత్రకయి విజయనాటి (బెజవాడ)కి వచ్చినది హూణశకము ౧౫౧౫ వ సంవత్సరమగుటచేత రాజీగ్రంథము నా సంవత్సరమునందుఁ జేయనుద్దేశించి ప్రారంభించియుండును" అని వ్రాసియున్నారు.[౨]

శ్రీ కొ. లక్ష్మణరావుగారు, వీరేశలింగముపంతులుగారితో నేకీభవింపక "కృష్ణరాయఁడు శ్రీకాకుళమందలి యాంధ్రవిష్ణువును సేవించినదినంబును, ఆతఁ డాతనికలఁ గాన్పించి యాంధ్రకావ్యము వ్రాయవలసినదని యానతిచ్చెనని యాముక్తమాల్యదలో వర్ణింపఁ బడినప్రసంగము జరిగినహరివాసరంబును శా. శ. ౧౪౦౦ అగు నేఁటి బహుధాన్యనామసం॥ర ఫాల్గుణ శు౧౧ (ఏకాదశి) శుక్రవార మని

౧ తిరుపతిదేవస్థానమువారి రిపోర్టులు పుట ౧౭౪.

౨ ఆంధ్రకవులచరిత్రము ౨వ భాగము. కృష్ణరాయలు.

స్పష్ట మగుచున్నది. లెక్కవేసిచూడ నిది క్రీ.శ. ౧౫౧౯వ సంవత్సర మందలి ఫిబ్రవరినెలలోని ౧౧వ తేదీ యగుచున్నది. కావున నాంధ్ర మహాకావ్యములలో నొక్కటి యగునాముక్తమాల్యద రచనప్రారంభింపఁబడిన దిన మింతనూత్నముగను నిశ్చయముగను మనకుఁ దెలిసినందుకు మన మెంతయు సంతసిల్లవలసియున్నది" అని వ్రాసియున్నారు.౧

పైయభిప్రాయములతోఁ గలియక శ్రీకుందూరి యీశ్వరదత్తుగారు "రాయలు శాలివాహనశకసంవత్సరము 1440 అగు బహుధాన్యనామసంవత్సర కుంభసంక్రమణ పుణ్యకాలమునందు దేవునిదర్శించి, యాదేవుని నిత్యనైవేద్యములకు, అంగరంగవైభవాలకు కొండపల్లివినుకొండసీమలలోని కొన్నిగ్రామములను ధారాపూర్వకముగ నిచ్చెను. ఆంగ్లమానము ప్రకారము బహుధాన్య సంవత్సరమునందలి కుంభసంక్రమణ పుణ్యకాలము క్రీ.శ. 27-1-1519 A. D. అగుచున్నది. ఆముక్తమాల్యదలోని వాక్యము ననుసరించి, రాయలు దేవుని సేవించినదిన మొకహరివాసరము. ఇచ్చట హరివాసరశబ్దమును హరిదినమునకుఁ బర్యాయపదముగ రాయలు వ్రాసియుండెను. లెక్కవేసిచూడఁగా, కుంభసంక్రమణ పుణ్యకాలమును, బహుధాన్య సంవత్సర మాఖబహుళైకాదశియు నొక్కదినముననే సంభవించెను. కాఁబట్టి రాయలు వ్రాసినవాక్యము సత్యమని తెలిసికొన్నారము. గ్రంథనిబంధమునకు, దలపెట్టవలసిన యవసర మాపుణ్యదినముననే కల్గెను. ఆదినము మనసారస్వతమునకు సహిత మత్యంతపుణ్యదిన మని మనవి చేయుచున్నాడను" అని వ్రాసియున్నారు.౨

పై యిరువురి యభిప్రాయములతో నేకీభవింపక శ్రీ ఓరుగంటి రామచంద్రయ్యగా రీవిషయమునుగూర్చి విపులముగఁజర్చించి, 'కళింగవిజయము సింహాద్రిశాసనకాల మగు క్రీ. శ. ౮-౮-౧౫౧౯ కి తరువాత పూర్తియైనది. ఆపిమ్మటనే శ్రీకృష్ణరాయలు తెలుంగువిష్ణువును

---

౧ లక్ష్మణరాయ వ్యాసావళి ౩౮-౩౯ పుటలు

౨ ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక సం ౨౮ సంచిక ౮ పుట ౧౨౧

సేవించుచు, హరివాసరోపవాస మొనర్చి. యాముక్త రచనా ప్రోత్సాహమును గలలో బడసినది. కావున నాముక్తములోని హరివాసరమునకును, శ్రీ కాకుళశాసనాంతర కుంభసంక్రాంతిదివసమున కెట్టిసంబంధమును లేదని నిశ్చయము. కృష్ణరాయ విజయరాజ్య వాచకములలోను కొద్దిమార్పుతో నన్నిజు వ్రాతయందును, విజయానంతరము శ్రీకృష్ణరాయలు కళింగరాజతనయను పెండ్లియాడినట్లు జెప్పబడినది. రాయలగ్నిసాక్షిగ గొన్నపండ్రెండుగురు భార్యలలో ముఖ్యులు ముప్వురనియు నందొకర్తె యొరిస్సారాజ దుహితయనియు పేజ్ వ్రాయసము. పేజ్ క్రీ. శ. ౧౫౨౦ సెప్టెంబరు ప్రాంతములలో విజయనగరమునందుండినవాఁడు. కావున కళింగవిజయానంతర మగునాహరివాసరము క్రీ.శ. ౮-౮-౧౫౧౯ కిని సెప్టెంబరు ౧౫౨౦ కిని నడుమనైయుండును. నాడే యాముక్తమాల్యదారచన కంకురార్పణ మైనది" అని వ్రాసియున్నారు.[1] ఈయభిప్రాయములలో నేది సత్యమునకు సమీపమో కనుఁగొనవలసియున్నది.

పాఠకులసౌకర్యముకొఱకు కీర్తుదిముప్వురు పండితులును నాధారపడిన శ్రీకాకుళసింహాచల శాసనముల సంగ్రహముల నీక్రింద నిచ్చుచున్నాఁడను.

(౧) శ్రీకాకుళశాసనము:—[2]

స్వస్తి శ్రీజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౪౦ అగునేంటి బహుధాన్య ఫాల్గుణ బ ౧౦శు శ్రీకాకుళపు తెలుంగురాయలకు శ్రీమన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీకృష్ణదేవరాయమహారాయలుంగారు దండం సమర్పించి యిచ్చిన ధర్మశాసనము. స్వామిని కుంభసంక్రమణ పుణ్యకాలమందు దర్శించి స్వామికి కొండపిల్లి సీమకుంజెల్లివచ్చిన దేవరపుంగోట స్థలంలోపలి యర్లగడ్డ గ్రామం ౧న్ని మేడూరిస్థలంలోపలి దేవరలంకవల్లి గ్రామం ౧న్ని ......కొండవీటిసీమలోని పెదగాడిపట్టున్న వినికొండ్ల శీమలోని మధుమంచినిన్ని ......

౧. భారతి వ్యయసం. శ్రావణము. ౧౦౯-౧౧౪ పుటలు.
౨. లక్ష్మణరాయ వ్యాసావళి పుట ౩౫

(౨) సింహాచలము దలి రెండవశాసనము-౧

“శుభమస్తు. స్వస్తి శ్రీవిజయాభ్యుదయ శాలివాహన శక వర్షంబులు ౧౪౪౧ అగునేటి ప్రమాదిసంవత్సర శ్రావణ శు౧౩ సోమవారాన (క్రీ. శ. ౧౫౧౯ ఆగష్టు ౮వ తేదీ) శ్రీమన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర మూరురాయరగండ అరిరాయవిభాడ భాషగెతప్పువ రాయరగండ యవనరాజ్యస్థాపనాచార్య శ్రీవీరప్రతాపకృష్ణదేవమహారాయలు విజయనగరం సింహాసనారూఢుడై సింహాద్రినాథునికి తమ పేరింటిభోగం నడిచే అందుకు ప్రతాపరుద్రగజపతి మహారాయలచేతను పుచ్చుకున్నగ్రామాలు. కళింగదండపాటలోని గ్రామాలు పెదగాణిగ్రామము ౧ అగనపూడిగ్రామము ౧ అందుకు చెల్లెపల్లెలు గంగవరం పాల్లెం పిన్న అగ్గపూడిపల్లెం

ఆముక్తమాల్యదారచనమునకు శ్రీకాకుళేశ్వరునియాజ్ఞయైన హరివాసరమునుగూర్చి పైముప్పురు పండితుల యభిప్రాయముతో నే నేకీభవింపజాలను. శ్రీవీరేశలింగముపంతులువారి యూహయే సత్యమునకుం జేరువగా నున్నదని నాయభిప్రాయము.

పైనివ్రాసిన శ్రీకాకుళశాసనమునాఁటికి, రాయలకు కళింగదేశ విజిగీషామనీష లేదు. కళింగదేశవిజయ మంతకుఁబూర్వమే పూర్తియైనది. ఈవిషయమునుగూర్చి “కృష్ణరాయలదిగ్విజయములు” అను శీర్షిక క్రింద నాయభిప్రాయమును దెలిపియున్నాఁడను.

శ్రీకాకుళశాసనమునాఁటి కింకను గళింగదేశ సంపూర్ణవిజయము కాలే దనియు, సింహాచలశాసనమునాఁటి కది లభించెననియు మొదటి యిరువురుపండితుల యభిప్రాయము. ఈరెండుశాసనముల నడుమయంతరము నాలుగు మాసముల పదునైదుదినములు మాత్రమే. ఈకాలములో, రాయలు శ్రీకాకుళమునుండి బెజవాడవచ్చి యటనుండి సైన్యసమేతుఁడై కటకమునకేఁగి యచ్చట దుర్గమునుముట్టడించి గజపతితోఁ బోరాడి, యాతఁడు తనకు విధేయుఁడగునట్లును యాతనితనయను దన కిచ్చి పరిణయముచేయునట్లును సంధిగావించుకొని యచ్చటనుండి మ

౧ ద.హిం.శా సం. ౬ సంఖ్య ౯౯౫

రల బయలు వెడలి సింహాచలమునకు వచ్చి శాసనము వ్రాయించుట యసంభవము. కళింగదేశసంపూర్ణవిజయయాత్ర [illegible] మధ్యకాలములో జరిగినది కాదు. ఈశ్వరసంవత్సరము (క్రీ శ ౧౫౧౭) లోనే రాయలకు సంపూర్ణవిజయము లభించినది

కళింగవిజయము ౮-౮-౧౫౧౯కి తరువాత జరిగినదని శ్రీరామచంద్రయ్యగారనిరే కాని యెప్పుడు జరిగెనో చెప్పలేదు కళింగవిజయము పూర్తియైనపిమ్మట, నెప్పుడో, ఒకసంవత్సరములోపల, నాముక్తమాల్యదారచనమున కంకురార్పణ మైనదని వారియభిప్రాయము. ఈయభిప్రాయమును నేనంగీకరింపఁజాలకుంటిని.

ఆముక్తమాల్యదారచనమును సాగించిన కాలము వేఱు. గ్రంథమంతయుఁ బూర్తియైనపిమ్మటఁ గృత్యాది రచియించిన కాలము వేఱు. కృత్యాదియందు సూచించిన "మున్నే కళింగ దేశవిజిగీషామనీషం దండెత్తిపోయి." ఇత్యాదివాక్యములయందుఁ జెప్పిన కాలము వేఱు.

కృత్యాదిరచనమునకుఁ జాలపూర్వము శ్రీకాకుళేశ్వరుని దర్శనమును జేసినట్లు "మున్ను" అనుశబ్దముచే రాయలు సూచించినాఁడు. అప్పటికాతని హృదయమునఁ గళింగదేశమును జయింపవలయునను కోర్కె కలదు. అంతియేకాని కళింగదేశమును జయించినపిమ్మట స్వామి స్వప్నములో దర్శన మిచ్చియుండలేదు.

ఈకారణములచేఁ బెమ్మయ్యరిపండితుల యభిప్రాయములును సత్యదూరములని నాయభిప్రాయము. తిరుపతిలోనున్న మూఁడుశాసనములను, "కృష్ణరాయల దిగ్విజయములు" అను శీర్షికక్రిందఁ బైనివ్రాసియుంటిని. అందు మొదటిరెండు శాసనములలోను (క్రీ. శ. ౧౫౧౮ జూలై ౬వ తేదీ: ౧౫౧౫ అక్టోబరు ౨౫వ తేదీ) కళింగదేశవిజయముకొఱకు బెజవాడవచ్చినట్లుదాహృతము కాలేదు. కాని ౧౫౧౭ జనవరి నెల ౨వ తేదీ గలశాసనములో "సామ్రాజ్యం చేస్తున్నమరిన్ని కళింగదేశదిగ్విజయార్థమై బెడవాడకు విచ్చేసి" అనివ్రాయఁబడియుండెను. ఈమాటలే ఆముక్తమాల్యదాకృత్యాదియందు "కళింగదేశవిజిగీషామనీషం...విజయవాటిం గొన్నివాసరంబు లుండి" యనుమాటలుగా మార్పుచెందినవి, ఈశాసనములో, సింహాద్రి, పొట్నూరికివిచ్చేసి,

అక్కడను జయస్తంభం వేయించి" అని వ్రాయఁబడియుండుటచే సిం
హాచలపు మొదటిశాసనము వ్రాయించిన ధాతసంవత్సర చైత్ర బ౧౨
కిని (౨౬మార్చి ౧౫౧౬) పైనిఁజెప్పిన తిరుపతిశాసనము వ్రాయించిన
యువసంవత్సర కార్తీక బ౩ గురువారము (౧౫౧౫ అక్టోబరు౨౫)
నకును నడుమ రాయలు బెజవాడవచ్చుటయు, శ్రీకాకుళమున కేఁగు
టయు జరిగియుండుట నిశ్చయము.

తిరుపతి దేవస్థానపురిపోర్టు వ్రాసినవారు రాయలఅహోబలశా
సనమును, కొండమరుసయ్య వ్రాయించిన బెజవాడశాసనమును తమ
నిర్ణయమున కాధారముగాఁ గైకొనిరి.

రాయలు విజయనగరమునుండి యువసంవత్సర కార్తికమాసా
దిని బయలువెడలి కార్తికబ౩ నాఁటికిఁ దిరుపతికివచ్చి యటనుండి పుష్య
శు౧౫ శుక్రవారమునాఁటి కహోబలమున కేఁగి (21 డిశంబరు ౧౫౧౫)
యచ్చట శాసనము వ్రాయించెను౧ అహోబలమునుండి బెజవాడకు
మాఘశుక్లపాడ్యమికి వచ్చియుండును. అటఁ గొన్నివాసరంబు లుండి
మాఘ శు౧౧ (౧౫ జనవరి ౧౫౧౬) నాఁటికి శ్రీకాకుళమున కేఁగి యుప
వాస మొనర్చె ననియు, నారాత్రియే స్వప్నమున స్వామి రాయలకు
దర్శన మొసంగియుండుననియుఁ, దిరుపతి దేవస్థానపురిపోర్టుకావ్యకర్తలు
వ్రాసియున్నారు ఇది చాలసమంజసముగ నున్నది. ఇది సత్యమనుటకు
సంశయింప నక్కఱ లేదు.

అటుపిమ్మట తెలంగాణావిజయమునకై బెజవాడ కేఁగుటయు,
నటనుండి కొండపల్లి మొదలుగాఁగలదుర్గములను జయించుటయు పదు
నైదు, ఇరువదిదినములలో జరిగియుండును. అట్లుజయించిన తెలం
గాణా దేశమును బరిపాలనాకార్యములకొఱకు కొండవీడుసీమలోఁ
జేర్చుటకై రాయలయాజ్ఞయైన ట్లాతనిమంత్రియు సేనాధిపతియు నగు
రాయసం కొండమరుసయ్య బెజవాడనుండి యువసంవత్సరఫాల్గుణ
శు౫గురువారము (7వ ఫిబ్రవరి ౧౫౧౬) నాఁడు శాసనము వ్రాయిం
చెను.

౧ A. R. 3౭౫ of ౧౯౧౯

రాయలు శ్రీకాకుళమున నుపవసించినదినము భీష్మైకాదశీ. పర్వదినము. ఆనాఁడే శ్రీకాకుళాంధ్రస్వామి రాయల కాముక్తమాల్య దారచనమున కాజ్ఞయొసంగెనని నిశ్చయింపఁదగియున్నది.

శ్రీకాకుళహరివాసరస్వప్నసంఘటనలకును శ్రీకాకుళశాసనము నకును సంబంధము లేదు. ఆశాసనకాలమునకు రాయలు మఱియొక మాఱు శ్రీకాకుళమునకు స్వామిదర్శనార్థమై వెళ్ళి కుంభసంక్రమణ కాలమున నాదేవునకు గ్రామముల నొసంగి శాసనము వ్రాయించి నట్లు నిశ్చయింపఁదగియున్నది. అట్లే సింహాచలమునకును మఱియొక మాఱు ప్రమాదిసంవత్సరమున నేఁగి ౮-౮-౧౫౧౯ తేదిగల శాసన మును వ్రాయించియుండును. శ్రీకాకుళమునకు మొదటిసారి విచ్చేసి నప్పుడు స్వామికి దానముల నొసంగి శాసనములను వ్రాయింపలేదా ? యని యెవ్వరైన నడుగవచ్చును. వ్రాయించినాఁడేమో ! అవి యిం కను బయలుపడలేదేమో? తెలియదు.

### ఆముక్తమాల్యదారచనాకాలము

మనుచరిత్రమునకుఁ బిమ్మటఁ గృష్ణరాయ లాముక్తమాల్య దను రచియించెననుటకు మనుచరిత్రములోనిపద్యము లిందుండుటయే సాక్ష్యము. విశేషించి మనుచరిత్రషష్ఠాశ్వాసమున స్వారోచిషమను వునకు శ్రీమహావిష్ణువు ప్రత్యక్షమయినసందర్భమున నున్న యీక్రింది పద్యమును గృష్ణరాయలు శ్రీకాకుళేశ్వరుఁడు తనకు స్వప్నములోఁ గనుపడినరూపముగా వేసికొనియున్నాఁడు. కావున మనుచరిత్రరచ నమునకుఁ దరువాతనే యీగ్రంథము రచియింపఁబడినదని చెప్ప వచ్చును.

సీ. "నీలమేఘముడాలు డీలు సేయఁగఁ జాలు
మెఱుఁగుఁజామనచాయ మేనితోడ
నరవిందముల కచ్చు లడఁగించుజిగి హెచ్చు
నాయతం బగుకన్నుదోయితోడఁ
బులుఁగురాయనిచట్టుపలువన్నె నొరవెట్టు
హొంబట్టు జిలుఁగు రెంటెంబుతోడ

నుదయార్క బింబంబు నొంటఁపు విడంబంబు
దొరలంగనాము కౌస్తుభముతోడఁ

గీ. దమ్మికేలుండఁ బెఱకేల దండయిచ్చు
లేము లుడిపెడు లేఁజూపు లేమతోడఁ
దోలఁకు దయదెల్పు చిఱునవ్వుతోడఁ గలఁ ద
దంధ్రజలజాక్షుఁ డిట్లని యాన తిచ్చె.

కేవలము మనుచరిత్రరచనాకాలముపై నాధారపడనక్క అ లేకుండ నాముక్తమాల్యదారచనాకాలమును నిర్ణయించుట కొగ్రంథమునందే యాధారమున్నది. ఈకవి యితరులవలె నాశ్వాసాంతముల యందు గద్యను వేసికొనక దానికిబదులుగాఁ బద్యములను వేసినాఁడు. ఆపద్యములు కాలనిర్ణయమునకుఁ దోడుపడఁగలవు. కావున వాని నీక్రింద నిచ్చెదను.

మ. ఇది కర్ణాటధరాధృతిస్థిరభుజాహేవాకల బ్ధైభరా
డుదయోర్వీధర తత్ప్రిత్రృవ్యకృత నవ్యోపాయనోష్ణీషర
త్నదృగంచత్పద కృష్ణరాయ వసుధాధ్యక్షోదితాముక్తమా
ల్యద నాశ్వాసముహృద్యపద్యముల నాద్యంబై మహింబొల్పగున్ ౧౪

మ. ఇదిభూమండనకొండవీడు ధరణీభృద్దుర్గపూర్వాద్రిభా
స్వదిభేశాత్మజవీరభద్రజనజీవగ్రాహరాహూయమా
ణనృధాంచద్భుజకృష్ణరాయమహిభృన్నామాస్మదాముక్తమా
ల్యదనాశ్వాసముహృద్యపద్యము ద్వితీయంబైమహింబొల్పగున్ ౨౮.

మ. ఇది పాత్రప్రహారేశ్వరప్రభృతి బంహిష్ఠోత్కలానీక గు
ప్తదివిస్పృక్పటుయంత్రి కొండపలి హృద్వ్యాబాహసి కదూర్జదీ
ప్యదుదారోద్యమ కృష్ణరాయనృప సంజ్ఞాస్మత్కృతాముక్తమా
ల్యదనాశ్వాసముహృద్యపద్యము తృతీయంబై మహింబొల్పగున్. ౩ఆ

మ. ఇది సింహాచలదంభకేసరిపదాభీష్టార్చనాపుణ్యాల
బ్ధదురుట్టంకణ పొట్నునూఁవిజయ స్తంభోపలోట్టంకితాం
కదృఢేష్టాక్షర కృష్ణరాయనృపసంజ్ఞాస్మత్కృతాముక్తమా
ల్యద నాశ్వాసవరంబు నాలవది హృద్యంబై మహిం బొల్పగున్ ౪ఆ.

మ. ఇది యాంధ్రోక్తి యథార్థనామయవనాస్వ్రక్ష్మాపూర్ణకెంబావివా
రిద పద్ధత్యవరోధివప్రవలయశ్రేణీవిఘాతక్రియా
స్పద సేనాగ్ర కృష్ణరాయమహీభృత్సంజ్ఞాస్మదాముక్తమా
ల్యద నాశ్వాసము పంచమం బమరు హృద్యంబైనపద్యంబులన్. ౫ఆ

మ. ఇది నైరామన యౌవనాంనిధవాహీనాభ్రచుంబిస్ఫుర
ద్విదితాభీల మణీగృహాళి దళనోద్వేలాగ్ర హాస్తివ్రజో
ద్యదనీకాగ్ర కృష్ణరాయ మహీభృత్సంజ్ఞాస్మదాముక్తమా
ల్యద నాశ్వాసవరేణ్య మాఱవది హృద్యంబైనపద్యంబులన్. ౬ఆ

మ. ఇది నీలాచలనీలచేలక సుభద్రేందీవరాభాక్షికో
ణదృగంచద్భుజవీర్యధుర్యజయ సన్నాహార్భటీవాద్యభీ
త్యుదితేభేశ్వరకృష్ణరాయమహిజాన్యాత్వాదితాముక్తమా
ల్యద నాశ్వాసము సప్తమం బరు హృద్యంబైనపద్యంబులన్. ౭ఆ

ఈపద్యములయం దాశ్వాసక విజయము వర్ణింపఁబడినది. వాని వివరముల నీక్రిందనిచ్చెదను.

౧ ఇది ఉదయగిరి విజయము. తిరుపతి దేవస్థానమందలిభావసంవత్సర ఆషాఢశు౧౫ (క్రీ.శ. ౧౫౧౪ జూలై ౬వ తేదీ) శాసనమునందు వర్ణితమైనది.

౨ ఇది కొండవీటివిజయము. తిరుపతిదేవస్థానమందలి యువసంవత్సర కార్తిక బ 3 గురువారం (క్రీ.శ. ౧౫౧౫ అక్టోబరు ౨౫వ తేదీ) శాసనమున నుదాహృతమైనది.

3 ఇది కొండపల్లి మొదలగు తెలంగాణాదుర్గములవిజయము. తిరుపతి దేవస్థానమందలిధాతసంవత్సరపుష్యశు ౧౦ శుక్రవారం (క్రీ.శ. ౧౫౧౭ సం. జనవరి ౨ వ తేదీ శాసనమున లిఖింపఁబడినది.

౪ ఇది సింహాద్రి పొట్నూరువఱకు గలవిజయము. సింహాచలమందలిధాతుసంవత్సరచైత్రశు౧౨ నాటి (౨౯ మార్చి ౧౫౧౬) శాసనమునఁ జెప్పఁబడినది.

౫ ఈపద్యమునందలి కెంబావినిగూర్చి శ్రీ కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారిట్లు వ్రాసియున్నారు.

"ఇందలి 'కెంబావి' యెద్ది? ఇచ్చటియవను లెవ్వరు? కెంబావి యనఁగా 'కెంబా' అనుపట్టణమని టీకాకారులువ్రాసియున్నారు. కెంబావి యన నిప్పుడు "క్యాంబే" యనుపట్టణ మేమోయని యుచ్చారణసామ్యముచేఁ దోఁపవచ్చును. కాని హైదరాబాదు రాజ్యపటముఁ జూడఁగా "కెంబావి" అనుగ్రామము గుల్బర్గాజిల్లాలోఁ గానవచ్చినది. ఇదిగుల్బర్గాకు నైరృతిమూలను ౪౦ మైళ్లమీఁదనున్నది. షారాపురము, సాగర్ అనునవి దీనికి సమీపమునం దేయున్నవి. పైన సురపుర మని చెప్పఁబడినషారాపురమునకు కెంబావి వాయువ్యమున ౧౮-౧౯ మైళ్లదూరముననున్నది. నగరపురమని చెప్పంబడిన సాగర్ కెంబావికిఁ దూర్పున ౧౬-౧౭ మైళ్లమీఁదనున్నది. కెంబావి, షారాపూర్, సాగర్ ఈమూఁడునుగుల్బర్గాజిల్లాలోనివి. ఈమూఁడును కృష్ణాభీమానదులయంతర్వేది(దువాబ్)లో కృష్ణకు నుత్తరమునను భీమకు దక్షిణమునను నున్నవి. రాయచూరునకుఁ గెంభావి వాయువ్యమూలగా ౬౦-౭౦ మైళ్లమీఁద నున్నది. రాయచూరు కృష్ణాతుంగభద్రల యంతర్వేదిలో నున్నదని చదువరులెఱిఁగియేయున్నారు. ఈకెంభావి విజయనగరమునకునూటిగ నుత్తరమున ౯౦ మైళ్లదూరముననున్నది. కావున నాముక్తమాల్యదలోని కెంబావి యిది యనియే తలంచుటన్యాయము. ఈశోధనతోఁడ కెంబావి యనఁగా క్యాంబేయగునేమో యన్నయూహ పూర్వపక్షమగుచున్నది నైజాము రాజ్యములోని యీకెంబావి పూర్వమొకప్పుడు చాళుక్యులకు ముఖ్యరాజధానిగా నున్నట్లు తెలియుచున్నది."[౧]

౬ ఈపద్యమునందలి నైరామనమునుగూర్చి శ్రీకుందూరి యీశ్వరదత్తు బి. ఏ, గారిట్లువ్రాసియున్నారు.

"ఈనైరామన మేమో తెలియక చరిత్రకారు లూరకుండిరి. ఇది రాయచూరుజిల్లాలోని, మాన్వేపురమునకీశాన్యమూలనున్నగ్రామము. నైరామనమునకిప్పటిపేరు నిరుమానూరు. నైజాముగవర్నమెంటువారి ఆర్షశాఖాధ్యక్షులగు 'యజ్‌డానీ'గారు వ్రాసిన లేఖనుబొందుపఱచుచున్నాను. "The Modern name of 'Nairamanam' is 'Nirumanuru'

౧ లక్ష్మణరాయ వ్యాసావళి.

a small village about seven miles N. E. of Mauri in Raichur District.౧

ఈపద్యమందలి "నైరామన"యనుపాఠమును "నైజామన"యని సవరించి, శ్రీ ఆచార్య వెంకటరమణయ్యగారు, అహముదానగరప్రభు వగునిజామునాహాతో జరిగినయుద్ధ మిందువర్ణింపఁబడినదని యభిప్రాయ పడియున్నారు౨. కృష్ణరాయలు ప్రత్యేకముగ నిజామునాహాతో రణమునకై యహముదానగరముపై దండెత్తినట్లు గాన్పింపదు. అయి నను, నైరామనమును గుర్తింపఁగలిగినప్పు డాపాఠమును సవరింపవల సినయావశ్యకము లేదు.

౭. ఈపద్యమునందు, రాయలు పూరిజగన్నాథమున కేఁగునప్ప టికిఁ బ్రతాపరుద్రగజపతి భయపడి పారిపోయెనని చెప్పఁబడినది.

ఈయేడుపద్యములలోను నేడుదండయాత్రలు వర్ణితములైనవి. కాని రాయలు వీనిని వరుసగాఁ గాలక్రమమున వర్ణించినట్లు గన్పట్టదు. ఇందు ౫-౬ పద్యములలో నుదాహృతము లైనదండయాత్రలు మహ మ్మదీయులపై నడచినవనుటకు సంశయము లేదు. ఇవి ౧౫౧౨వ సంవ త్సరమున జరిగిన రెండవరాయచూరు కలబరిగె యుద్ధములందు మేని యవి యుదయగిరియుద్ధమునకంటెఁ బూర్వము జరిగినవిగాన నీపద్య ములు మొదటనుండవలసియుండును. ౧౫౨౦ వ సంవత్సరమున జరిగిన మూఁడవరాయచూరుయుద్ధమునం దందు మేని, జగన్నాథయాత్రకుఁ దరువాత నుండవలసియుండును. అట్లుండక రెండింటికినడుమనుండుటచేఁ గవి యీవిజయములను వరుసగావర్ణింపలేదని నిర్ణయింపవలసియున్నది.

శ్రీ కుందూరియీశ్వరదత్తుగారు, కెంబావి నైరామన యుద్ధము ములు ౧౫౨౦వ సంవత్సరమున జరిగినరాయచూరుయుద్ధసందర్భమున జరిగినవనియు, నందుచే నాముక్తమాల్యదారచనము ౧౫౨౦ వ సం

౧. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక సం. ౨౪. సంచిక ౪. పుట ౧౨౨.
౨. భారతి 27 సం॥ సంచిక 6. పుట 613-626.

వత్సరాత్పరముననై యుండుననియు వ్రాసియున్నారు[1] కాని నేనువారి తో నేకీభవింపఁజాలను. నైరామనయుద్ధము ౧౫౧౯-౧౦ లో రాయ చూరుదుర్గమును రాయలువశముచేసికొని నప్పుడు జరిగియుండును. నైరామనప్రభువు మహమ్మదీయుఁడనుట నిక్కము. ఆపద్యమున వర్ణిత ములైన సౌధములా తురుష్కప్రభువునకు సంబంధించినవి. (బహుశః ఆప్రభువు ఆదిల్‌ఖానే అయియుండెనేమో) వానిని రాయలు నాశన ము చేసియుండెను. రాయచూరుదుర్గముతోఁబాటుగనావట్టణము (అది రాయచూరుజిల్లాలోనిది) రాయుల స్వాధీనమైయుండును. రాయచూరు, ముద్గల్లుదుర్గములు ౧౫౧౯లో రాయలస్వాధీనమైనప్పుడు, ఆమండ లములోని నైరామనము, ౧౫౨౦వఱకు, ఆదిల్‌ఖాన్ వశమునందుండె ననితలంచుట యస్వాభావికము. ౧౫౨౦ నాఁటికి, ఆప్రభువచ్చట లేఁడు. అతని సౌధములును లేవు.

'కెంబావి' గుల్బర్గాజిల్లాలోనిది. ౧౫౧౨ లో జరిగిన గుల్బర్గా దండయాత్రిలో నీ కెంబావియందు రక్తపాతము జరిగియుండును. నైరా మననాశనము ౧౫౧౯ లోను, కెంబావిరక్తపాతము ౧౫౧౨ లోను వేఱువేఱుగా జరిగినవి గనుకనే రాయలు వీనిని వేఱువేఱుపద్యములలో రెండుదండయాత్రిలుగా వర్ణించియున్నాఁడు. ౧౫౨౦ రాయచూరు దండయాత్రిలో నైరామనప్రశంస యుండఁబనిలేదు. అప్పుడు రాయ చూరుదుర్గమును స్వాధీనము చేసికొనుటకై ఇస్మాయిల్ ఆదిల్‌షాహా ప్రయత్నించెనేకాని యాతఁడు స్వాధీనముచేసికొని యుండలేదు. అదివఱకాతఁడు స్వాధీనము చేసికొనియుండెనని తలంచినను, నైరామన సౌధము లంతకుఁబూర్వమే రాయలచే నాశనమైయుండును. కావున ౧౫౨౦ రాయచూరు యుద్ధమునకును ఉవ పద్యమునకును సంబంధము లేదు.

రాయలు ౧౫౨౦ రాయచూరు యుద్ధానంతరము గుల్బర్గాకు వెళ్ళియుండుటసత్యమయ్యెనేని, యాదండయాత్రిలో కెంబావి రక్త పాతము జరిగియుండవచ్చునని తలంచుటకవకాశమున్నమాట సత్యము.

---

౧ ఆం. సా. ప. పత్రిక సం. ౨౮ సంచిక ౮ పుట ౧౨౨.

కాని ౧౫౨౦ లోకంటె ౧౫౧౩ లోనే కెంబావి వెళ్ళియుండునని తలం చుటసమంజసమని నాదృఢాభిప్రాయము.

రాయలు రెండుమాఱులుమాత్రమే గుల్బర్గమీఁదకుఁ బోయియుండెను. మొదటిసారి రెండవ రాయచూరుయుద్ధానంతరముచ ౧౫౧౩ లో గుల్బర్గాను జయించి, యచ్చట జయస్తంభమును వేయించెను. రెండవమాఱు మూఁడవ రాయచూరుయుద్ధానంతరమున బీదరు (బెడందకోట) వఱకునుబోయి తిరిగివచ్చునప్పుడు మూఁడుమూడుకాలు గడియలలో గుల్బర్గను జయించెను రెండవమాఱు జరిగినయుద్ధమత్యల్పము, ఈరణములలోఁ గెంబావిరక్తపాతమున కవకాశము లేదు. కావున మొదటిసారి గుల్బర్గకడ జయస్తంభమును నాటించిన దండయాత్రలోనే కెంబావిరక్తపాతము జరిగియుండునని తలంచుట న్యాయము.

పైపద్యసప్తకములోను నైదుపద్యములు ప్రతాపరుద్రగజపతిపై నడచినదండయాత్రలతో సంబంధించినవి. మిగిలిన రెండుపద్యములు మాత్రమే మహమ్మదీయులతో జరిగినవి. ఈపద్యములను వ్రాయునప్పుడు రాయలహృదయమున గట్టిగా నాటుకొనియున్న సంఘటనలనే వర్ణించి వాటికే ప్రాధాన్యమిచ్చియుండెనని తలంపవలసియున్నది. రాయచూరుయుద్ధమనియు, గుల్బర్గాయుద్ధమనియు, మనముచెప్పుచున్నను, ఆదండయాత్రలలో, నైరామనముకడను, గెంబావికడను జరిగిన సంఘటనలాతని హృదయమున దృఢముగా నెలకొనియుండును. అందుచే నాపద్యములను వ్రాసియుండును.

కెంబావియుద్ధము, కళింగదండయాత్రలోఁ క్రీ. శ. ౧౫౧౮-౧౫లో జరిగెనని కొందఱియభిప్రాయము. కళింగదండయాత్రలో, గుల్బర్గకు నైరుతిమూల నేఁబదిమైళ్లనున్న కెంబావికడ మహమ్మదీయులతో రణము జరుగుట యసంభవము. కళింగజైత్రయాత్రకును గెంబావికిని సంబంధము లేదు.

కావ్యనిర్మాణము కొలఁదికాలములోనగునది కాదు. ౧౫౧౬ జనవరి నెలలో స్వామియాజ్ఞనుశిరసావహించి రాయలప్పుడప్పుడు పద్యములనురచించుచు, నాల్గుసంవత్సరములలో ౧౫౨౦లో పునఃగృత్యాది సహితముగఁ గావ్యమునుబూర్తిచేసియుండునని నావిశ్వాసము.

కెంబావివర్ణనము మూఁడవరాయచూరుయుద్ధముతో సంబంధించినదనితలంచు నెడల నీగ్రంథము ౧౫౨౧ లో ముగించి యుండునని తలంపవలసియుండును.

కెంబావియే కాకుండ, నగరపురము, కలబరిగెలనుకూడ రాయలు జయించిన ట్లాముక్తమాల్యదకృత్యాదియందలి యీక్రింది పద్యము వలనఁ దెలియుచున్నది.

"సనకాది దివిజమస్కరిఫాలగోపిచం
దనపుండ్రవల్లికల్నాకినాకి
సెలసిహాహాహూహూలదండియులతంత్రి
దెవ్వసింగిళులుగాఁదివిచితివిచి
సప్తర్షికృతవియజ్ఝరివాలుకాలింగ
సమితిముచ్చెలకాళ్ళఁజమరిచమరి
రంభాప్రధానప్సరఃపృథూరోజకుం
భంబు లెచ్చటఁ గన్నఁబట్టిపట్టి
తిరుగుహరిపుర సురతరు సురలమరఁగి
బహుళ హాళహాళి భృతకలబరిగ నగర
సగరపురవర పరిభృడ జవన యవన
పృతన భవదసిననిఁదెగి కృష్ణరాయ! ఆ ౧-౪౧

ఈపద్యము తరువాతిపద్యమే, ఏదులఖానును వధించినట్లుచెప్పుచున్నది. కావునఁ బైనీసపద్యములోని సగరపుర, కలబరిగెనగరవిజయములుకూడ ౧౫౧౨-౧౩ సంవత్సరములలో జరిగినవే కాని, మూఁడవరాయచూరు యుద్ధానంతరమున ౧౫౨౦లో జరిగినవి కావని నిశ్చయింపఁదగియున్నది.

మూఁడవరాయచూరు యుద్ధవిషయము లాముక్తమాల్యద యందుఁ జెప్పఁబడలేదనియు, నాయుద్ధాత్పూర్వమే యాకావ్యము పూర్తియయ్యెననియు, నిర్ణయింతము.

## VII (3) ఆముక్తమాల్యదయందలి యాశ్వాసములెన్ని?

ఆముక్తమాల్యద ముద్రితప్రతులు రెండు ప్రస్తుతమునఁ బ్రచారములోనున్నవి. అందొకటి శ్రీ వావిళ్ళ రామస్వామిశాస్త్రి కృతరుచిసమాఖ్యానవ్యాఖ్యతోఁ గూడినది. రెండవది సుప్రసిద్ధపండితులగు వేదము వెంకటరాయశాస్త్రి కృతసంజీవనీవ్యాఖ్యాసమేతమైనది. మొదటిప్రతిలో గ్రంథమాఱాశ్వాసములుగా విభజింపఁబడినది. రెండవప్రతిలో నేడాశ్వాసములుగా విభాజితమైనది. ఆశ్వాససంఖ్యయందు మాత్రమే భేదము. గ్రంథమున హెచ్చుతగ్గులులేవు. ఆశ్వాసాంతపద్యములు నాలుగుమాత్రమే శ్రీ వేంకటరాయశాస్త్రిగారి గ్రంథమున నధికము. కాని యాశ్వాసాంతపద్యములనుబట్టి కాలనిర్ణయము చేయునప్పు డీపద్యములవలనఁ గొంతమార్పు కలుగవచ్చును. కావున నీయాశ్వాసచర్చ యవసరము.

పైనివ్రాసినపద్యము లేడింటిలోను, ౧ మొదలు ౫వ పద్యములుమాత్రమే శ్రీరామస్వామిశాస్త్రిగారి ప్రతియందున్నవి. "ఇదినైరామన" "ఇదినీలాచల"అను ౬ ౭ పద్యములందు లేవు. షష్ఠాశ్వాసాంతమున మరల "ఇదిసింహాచల" అనునాల్గవపద్యమే యున్నది. కవి యట్లు వేసియుండఁడు. కావున "ఇదినైరామన" అను ౬వ పద్యమునుగాని, "ఇదినీలాచల" అను నేడవపద్యమునుగాని షష్ఠాశ్వాసాంతపద్యముగా గ్రహింపవలసియున్నది. "ఇదినైరామన" యను పద్యమునే షష్ఠాశ్వాసాంతపద్యముగాఁ దీసికొందము. శ్రీవేంకటరాయశాస్త్రిగారి ప్రతిలో "ఇదినీలాచల"యనుపద్య మేడవయాశ్వాసాంతమున నున్నది కావున దీని నేడవపద్యముగా నే భావింపవలసియున్నది. ఈపద్యమును బట్టి యాముక్తామాల్యద కటకవిజయానంతరము పూర్తిచేయఁబడినదని నిర్ణయించియుంటిమి. ఈగ్రంథమాఱాశ్వాసములు కలదియే

యనియు, "ఇదినీలాచల" యనుపద్యము ప్రక్షిప్త మనియు నిర్ణయించి నను గాలవిషయమున మార్పుకలుగదు.

కటకవిజయమును గజపతితనయాపరిగ్రహణమును నేకకాలమున జరిగినవి. గజపతిపుత్త్రిక పేరు అన్నపూర్ణయైనను, గమలయైనను నామె రాయలదేవేరియని యాముక్తమాల్యదకృత్యాదియందుఁ జెప్పఁబడియుండుటచే నట్లును గళింగదేశసంపూర్ణవిజయానంతరమే (హంపీశాసనము ౧౫౧౮-౧౯ లో) ఆముక్తమాల్యదారచన ముగింపఁబడినదని నిశ్చయించుటకు సంశయింపఁబనిలేదు.

రాయలు సప్తమాశ్వాసగ్రంథముగ రచియించెనా? తరువాత నెవరైన షష్ఠాశ్వాసమును రెండుగవిభజించిరా? యనుప్రశ్నకు సమాధాన మాలోచింపవలసియున్నది. పూర్వాశ్వాసపద్యసంఖ్యనుబట్టి యీప్రశ్న కుత్తరమును సాధింపలేము. ఆపద్యసంఖ్యలను వరుసగా నీక్రింద నిచ్చెదను. (౧) ౮౮ (౨) ౧౦౦ (౩) ౯౩ (౪) ౨౮౮ (౫) ౧౬౧ (౬) ౬౯ (౭) ౭౫. మొత్తము ౮౭౪ పద్యములు.

రాయలతరువాత మఱియొకరు షష్ఠాశ్వాసమును రెండుగా విభజించుటకుఁ బ్రసక్తిగాని ప్రయోజనముగాని లేదు. కావున రాయలీగ్రంథమును నేడాశ్వాసములుగా రచియించెననియు, "ఇదినీలాచల" యను సప్తమాశ్వాసాంతపద్యము రాయలకృతమేయనియు నిశ్చయింపఁదగియున్నది. సుప్రసిద్ధవ్యాఖ్యాత లగు శ్రీ వేంకటరాయశాస్త్రులవా రట్లే నిర్ణయించియున్నారు.

## VIII (4) ఆముక్తమాల్యదను గృష్ణరాయలు రచియింపలేదా ?

ఆముక్తమాల్యదను గృష్ణరాయలు రచింపలేదనియు నలసాని పెద్దనయే రచియించి రాయలపేరు పెట్టెననియు నొకవాదను కలదు. ఈవాద మీనాడుమ బయలుదేరినది కాదు. నాపుట్టుకకుఁ బూర్వము నుండియు నీవిషయమున వాదప్రతివాదములు జరుగుచున్నవి. నాజననము క్రీ.శ. ౧౮౮౩ వ సంవత్సరము జూలైనెల ౨౮ వ తేది. అదివ

అనుఁబండితులు కొందఱు ఆముక్తమాల్యదను కృష్ణరాయలే రచియించెనని వ్రాయఁగా దానినంగీకరింపక యాగ్రంథమును బెద్దనయే రచియించెనని హేతుపూర్వకముగ గోదావరిమండలమునందలి శివకోడునందు సబ్‌రిజస్ట్రారుగా నుండెడి బోడపాటి రామలింగేశ్వరప్పగారు క్రీ.శ. ౧౮౮౭ సెప్టెంబరు ౨౮ తేదీగల యుత్తరముతో నాకాలమున సాహిత్యవిషయములలోఁ బాల్గొనుచున్న యముద్రితగ్రంథచింతామణి యనుపత్రికయం దొకవ్యాసమును బ్రకటించియున్నారు. దాదాపు డెబ్బది సంవత్సరములనుండి నిన్నమొన్నటివఱకు వివాదగ్రస్తమై యిదమిత్థమని నిర్ణయింప నశక్యముగనున్న యీవిషయమునుగూర్చి స్థిరమైన నిర్ణయముచేయుటకు నాకుఁ గొత్తగాలభించిన యాధారములులేవు. ఈవిషయమున నేమేనిఁవ్రాసి మఱల నొకతుపానును లేవదీయుట నాయుద్దేశము కాదు. శ్రీకృష్ణదేవరాయలు ఆముక్తమాల్యదవంటిగ్రంథమును వ్రాయలేనంతటి యసమర్థుఁడు గాఁడనియు, శైలిభేదము, వ్యాకరణదోషపరియుక్తము, మొదలగు కొన్నికారణములనుబట్టి యీగ్రంథము పెద్దనకృతము గాదనియు రాయలే యీగ్రంథకర్తయనియు దీనిని రచియించునప్పుడు రాయలు పెద్దనసాహాయ్యమును బొందియుండుననియుఁ బెద్దనకృతపద్యములు కొన్ని యిందుఁగలవనియు దీర్ఘచర్చానంతర మీనడుమఁ బండితు లొకతీర్మానమునకు వచ్చియున్నారు. ఇది యంగీకరింపఁదగిన విషయమనియు నెంతచర్చించినను నింతకంటె వేఱునిర్ణయ మసాధ్య మనియు నాయభిప్రాయము.

## VIII (౫) ఆముక్తమాల్యదాకథాసారము

ఈగ్రంథ మేడాశ్వాసములను దాదాపుగఁ దొమ్మిదివందల పద్యములను గలిగియున్నను నిందలికథ యత్యల్పము. ఇందలి ప్రధానకథ యాముక్తమాల్యద యనుకన్యకామణిని, శ్రీరంగమందలి దేవుఁడు రంగనాథస్వామి పెండ్లియాడుట. ఈమె నిజనామము గోదాదేవి. ఆమెకాముక్తమాల్యద యనుపేరువచ్చుటకుఁ గారణమును గవి యీ క్రిందిపద్యములలో సూచించినాఁడు:

"ఉ. ఎన్నినుఁ గూర్తు నన్న విను మే మును దాల్చినమాల్య మిచ్చు న
ప్పిన్నది రంగమం దయిన పెండిలి సెప్పుము, మున్ను గొంటి నే
వ న్ననదండ యొక్కమగవాఁ డిడ,నేను దెలుంగురాయఁడ
న్గనడరాయ, యుక్కొడువఁ గప్పు ప్రియాపరిభుక్తభాకథన్."

౧ ఆ౧౮

గోదాదేవి భూదేవియొక్క యవతారము. సీత జనకునకు లభించినట్లే గోద విష్ణుచిత్తుఁ డనువైష్ణవోత్తమున కుద్యానవనమున నొక తిన్నెపై దొరకినది. స్వామికర్పింపుమని తండ్రియొసంగిన పూలదండల నొక్కమాఱు గోదాదేవి తనకొప్పునముడుచుకొని తనయందమును జూచికొని పిమ్మట స్వామికర్పించుచుండెడిది. ఆవిషయమును గవి యిట్లు వర్ణించినాఁడు.

సీ. తమతండ్రి శ్రీశదత్తశ్రీలు గృహామునఁ
ద్రవ్వి తండమ్ముఁ దయ్యెఁ దనదుతోంటి
సగ్గినిర్మాణదాస్యం బను త్సేకత
జరపుచుఁ బ్రిజ్ఞ వైష్ణవపురాణ
సంహితావ్యాఖ్యారచనఁ బొద్దుఁ గడపుచుఁ
గట్టెడుకమ్మచెంగలువ విరుల
తోమాలె లలకలుదువ్వి కంతునకు బా
ర్ష్ణానిబద్ధఖేటకం బనఁగ నీల
వృషకకుదేక్షి నెడమ కొక్కింతయొఱగ
నిడినధమ్మిల్లవలయంబు నడుగు వ్రందుఁ
గొంతసే పర్థిఁ గీలించి కూపవారి
నీడ వీక్షించి క్రమ్మఱఁగూడ నునుచు.

౫ ఆ ౩౮

తాను ధరించిన దండల నర్పించునది యగుటచే నామె కాము క్తమాల్యదయని పేరు వచ్చినది. ఆనామమునే కవి గ్రంథమున కుంచి నాఁడు. శ్రీవిల్లిపుత్తూరు నివాసియు, పరమభాగవతోత్తముఁడు నగు

గోదాదేవికి జనకుఁడు నగువిష్ణుచిత్తునికథ యిందు ముఖ్యమగుటచే నీగ్రంథమునకు విష్ణుచిత్తీయ మని నామాంతరము కలదు.

పాండ్యదేశమునకు మధురాపురమురాజధాని. ఆదేశము నేలు రాజు మత్స్యధ్వజుడు. మధురాపురసమీపస్థపర్వతమున విచ్చేసియున్న స్వామి తెప్పతిరునాళ్ల కరుదెంచినబ్రాహ్మణు లొకనాఁడు మధురాపురదర్శనార్థమువచ్చి రాజపురోహితునియింటివీథియరుగుపై వెన్నెలలోఁ బరుండి తామభ్యసించినగ్రంథములయందలిశ్లోకములను బఠించుకొనుచుండిరి. అందొకవిప్రుఁడు:—

"వర్షార్థ మష్టౌ ప్రయతేత మాసాన్
నిశార్థ మర్థం దివసే యతేత
వార్ధక్యహేతో ర్వయసా నవేన
పరత్ర హేతో రిహజన్మనాచ"

[ఈశ్లోకమును, దీనికిఁ గృష్ణరాయలు రచించిన పద్యమును వరమయోగివిలాసమునందలిపద్యమును ఆముక్తమాల్యద పీఠికనుండి కైకొని యీక్రింద నిచ్చుచున్నాఁడను.

చ. వినిమొ, నెల ల్చతుర్ద్వయిని వృష్టిదినాళికి; రాత్రికై, దివం
బున; జరకై వయస్సునను; బూని, పరంబునకిప్డు, దుద్యమం
బనువుగఁ జేయఁగా వలయునంచుఁ బురోహితధర్మమాత్మఁగీ
ల్కొన నలవిప్రుఁ డాద్విజులలోన సుభాషితము న్స్మరింపఁగన్.

ఆ. మా. ౨ ౬౭౬

సీ. రాత్రుల కొనరు నర్థము లెన్ని యున్నియు
ఘటియింపవలయుఁబగళ్ల యందు
వానకాలమునకు వలసినయవి యెల్ల
నార్జింపవలయు మాసాష్టకమున
నపరవయోయోగ్య మగువస్తుజాలంబు
సాధింపవలయును జవ్వనమునఁ
బరలోకమునకు సంపాద్య మెయ్యది యది
గడియింపవలయునీ యొడలియంద. వ.వి ఆ. ౧౧.]

అనుశ్లోకమును బఠింప నామార్గమున భోగిని యింటికిఁ బోవు చున్నమత్స్యధ్వజుఁడు పరలోకసుఖమునకై తానిహలోకమున నేమియుఁ జేయ లేదనియుఁ గామభోగలాలసుఁడనై కాలము గడపితి ననియుఁ జింతించి తటాలున వెనుకకుఁ దిరిగిపోయి యాబ్రాహ్మణు నకుఁ భటునిచే బహుమానమంపియామఱునాఁడు పండితులనెల్లర రావించి, యేదేవుని సేవించిన మోక్షము లభించునో యెఱిఁగింపుఁ డని ప్రార్థించెను.

ఆనాఁడే శ్రీవిల్లుపుత్తూరున విష్ణుచిత్తుఁడష్టాక్షరీమంత్రపురస్స రముగా మన్నారుదేవునకుఁ బూలదండ వేయుచున్నసమయమున స్వామి "భక్తాగ్రగణ్యా! మధురలోఁ బాండ్యరాజు పండితులఁ బిలి పించి మోక్షమొసఁగుదేవుఁ డెవరని ప్రశ్నించుచున్నాఁడు. నీవాసభ కుఁబోయి శ్రీమహావిష్ణువే మోక్షదాయకుఁడని వాదించి గెలుపొంది, యారాజును వీరవైష్ణవునిగా నొనరింపుము. ఇందులకు నీవసమర్థుండవని సందేహింపవలదు. నాయనుగ్రహమున నీకు విజయము కాఁగలదు." అనియానతిచ్చెను. స్వామియాజ్ఞను శిరసావహించి విష్ణుచిత్తుఁడు పాండ్యునిసభకేఁగి వాదమున యన్యమతఖండన మొనర్చి విశిష్టాద్వైత మతమును స్థాపించెను. ఈవిషయ మీక్రిందిపద్యమువలనఁ దెలియును.

శా. విద్వద్వందితుఁ డాతఁ డిట్లు సుఖసంవిత్ప్రాబోధైకచుం
చుద్వైపాయననూత్నసచ్ఛ్రుతుల నీశు న్మక్రి న్నిరూపించి పైఁ
దద్విష్ణుత్వము దాని కన్యదివిషద్వ్యావర్తనంబు న్విశి
ష్టాద్వైతంబును దేటగాఁ దెలుప మాటాడె న్ప్రమాణంబులన్.

మతములలోకెల్ల విశిష్టాద్వైతమే శ్రేష్ఠమని పాండ్యరాజు హృదయమున నెలకొనుటకై విష్ణుచిత్తుఁడు ఖాండిక్యకేశిధ్వజసంవా దము నుదాహరణముగా రాజునకుఁ దెలిపెను. ఖాండిక్యకేశిధ్వజులు మిథిలానగర రాజగునిమివంశములోనివారు. అన్నదమ్ములబిడ్డలు. వారి ద్దరును రాజ్యకాంక్షతో ననుదినమునుబోరాడుచుండెడివారు, ఆరణములోఁ గేశిధ్వజుఁడు జయమొంది రాజ్యమంతయు నాక్రమిం

చుకొనియెను. ఖాండిక్యుఁడరణ్యావాసము సేయుచుండెను. కేశిధ్వ జుఁడు యావద్రాజ్యమును గైకొనియు, జ్ఞానియై, ధర్మముకొఱకుఁ బఱిహాలన మొనర్చుచు భోగములయం దాస విడిచి పద్మపత్రస్థజలబిం దువువలె నటించుచుండెను. అతఁ డొకప్పుడు జన్నమొకటి చేయసం కల్పించి, యందుకొఱ కొకధేనువును దెచ్చియుండ దాని నొకవ్యా ఘ్రము చంపివైచెను. యజ్ఞపశువును గాపాడఁజాలనందులకుఁ బ్రాయ శ్చిత్త మేమని పండితులను బ్రశ్నింప నాప్రాయశ్చిత్తమును నిర్ణయిం చుటకు ఖాండిక్యుఁడుదక్క మఱియొకరు సమర్థులు కారని వారు ప్రత్యుత్తర మిచ్చిరి. ఖాండిక్యునికొఱకుఁ గేశిధ్వజుఁడరణ్యమున కేఁగ నరణ్యమే శరణ్యముగానున్నను దనను సాధించుటకై వచ్చుచున్నాఁడని ఖాండిక్యుఁ డును నతనిమంత్రులును మొదట ననుకొని, యుద్ధసన్న ద్ధులైరి. కాని పిమ్మట నిజమెఱిఁగి ఖాండిక్యుండు కేశిధ్వజునకుఁ బ్రాయ శ్చిత్త విధానమును దెలిపెను. కేశిధ్వజుఁ డారీతిగ నొనర్చి జన్నము బూర్తిగావించి యజ్ఞరక్షణము నుపదేశించినఖాండిక్యునిఁ దనగురు వుగాభావించి యతనికి గురుదక్షిణసమర్పింప నరణ్యమునకేఁగి తన యుద్దేశము నెఱింగించెను. ఖాండిక్యునియనుయాయులు లర్థరాజ్య మును గోరుమనిబోధించిరి. కాని యతఁ డందుల కియ్యకొనలేదు మిథి లానగరప్రభువులు రాజ్యమునకంటె జ్ఞానమునే యధికముగాఁ దలం తురు. కావునఁ దనకు జ్ఞానోపదేశముచేసి సంసారతరణోపాయమును బోధింపుమని కేశిధ్వజు నడిగెను. అతఁ డందులకు సంతసించి యనేక మతధర్మంబులం జెప్పితుదకు"

సీ. శ్రీవిష్ణు నీగతిఁ జింతింపవలయుఁద
నర్మయుఁ డగుయోగి క్రమంబుతోడ
నొక్కయంగమె మున్ను చిక్కలో భావించి
యది దృఢంబగుటయు నవలియంగ
కము మఱి చింతింపఁగాదగు నట్టియ
భ్యాసంబువలన నయ్యవయవములు
నడచిన, నున్న, మానక యెద్దియేనియుఁ
జేయుచున్నను మదిఁ బాయఁడేని,

యతనిసామ్యంబుగని ముక్తు. డసురాది
భేదసంజనకాజ్ఞానమేదఁ బిదప
నలముకల్యాణగుణములు హరికిఁ దనకు
లేనిభేద మెవ్వాఁడు కల్పింపఁగలఁడు;

అనిబోధించెను. పిదప ఖాండిక్య కేశిధ్వజులు మిత్రులై తమతమ రాజ్యములయందుఁ దమపుత్త్రుల నిలిపి విష్ణుభక్తిపరాయణులై కాలముగడపి ముక్తినొందిరి. ఈకథను పాండ్యునకుఁ జెప్పి విష్ణుచిత్తుండు "ముముక్షున కుపాశ్రయణీయుం డధోక్షజుండు. పాండ్యక్షితీశా! నీవతనిభజియింపుమిదియె భక్తియోగంబు" అని యుపదేశించి యతనిని భాగవత ప్రధానుంగావించెను.

మొదటిమూఁడాశ్వాసములలోఁ బైకథయంతయు జెప్పఁబడినది. నాల్గవయాశ్వాసమునఁ బ్రసక్తానుప్రసక్తముగ యామునాచార్యునిచారిత్రము వర్ణితమైనది. ఇతఁడు వైష్ణవభక్తుల యాచార్య పరంపర లోనివాఁడు.[౧] బ్రహ్మచారి. పాండ్య దేశప్రభువును మత్స్యధ్వజునిపూర్వుఁడు నగునొకరాజు వీరశైవమతమును గైకొని వైష్ణవుల నిరాదరణ సేయుచుండెను. ఆరాజుభార్య మహాపతివ్రతయయ్యును విష్ణుభక్తురాలయ్యెను. శ్రీమహావిష్ణువుయాజ్ఞచే యామునాచార్యుఁడు విష్ణుచిత్తుని వలెనే పాండ్యునిసభ కేఁగి యన్యమతస్థులతో వాదమొనర్చెను. వారొకయశ్వత్థవృక్షమును మధ్యవర్తిగ నేర్పఱచుకొనిరి. వాదానంతరమావృక్షమునుండి, యామునాచార్యుఁడు జెప్పినదే సత్యమని యశరీరవాణి వాక్రుచ్చెను, రాజు శైవమతమును విసర్జించి వైష్ణవమతస్వీకార మొనర్చి యామునాచార్యునకుఁ దనసోదరినిచ్చి పరిణయముచేసి యర్ధరాజ్యం బిచ్చెను. యామునాచార్యుఁడు ప్రభువై రాజనుసరింపవలసిన నీతిని జెప్పి దదనుగుణముగ రాజ్యపరిపాలనముఁ జేసెను,

ఐదవయాశ్వాసమున, గోదాదేవివర్ణనమును, నామె విరహవర్ణనమును గలవు. ఆఱవయాశ్వాసమున విష్ణుభక్తుఁడైనమాలదాసరి

---

౧ ఈశ్వర మునికుమారుఁడు క్రీ.శ. ౯౧౮-౧౦౩౮. తి.దే.రి. ౯ సం. భా. ౨ పుట ౯

కథయు, నేడవయాశ్వాసమున నామాలదాసరిచే విముక్తుఁడైనబ్రహ్మ రాక్షసికథయుఁ గోదాదేవి వివాహవర్ణనము నున్నవి.

ఈగ్రంథమునఁ గథావైచిత్ర్యమేమియుఁ గాన్పింపదు. విశిష్టాద్వైతమతప్రశస్త్యమును దెలుపుటయు, నుత్ప్రేక్షాద్యలంకారములలో బ్రబంధోచితవర్ణనాంశములతో నొకమహాకావ్యనిర్మాణ మొనర్చుటయు నీగ్రంథరచనోద్దేశములు. ఇందుఁగలపద్యములు దాదాపు 800 లోను ౨౦౦ ఋతువర్ణనము. ౧౦౦ పద్యములు పురవర్ణనము, గోదాదేవిని, దద్విరహవేదనను ౧౦౦ పద్యములలోను, రాజనీతిని ౮౦ పద్యములలోను రచించియున్నాఁడు. మిగిలినవానిలోను, గొన్ని వర్ణనాంశములున్నను, నవి కథతో సంబంధించినవి.

## VIII (5) కవిత్వగుణము

ఆముక్తమాల్యద కష్టతరమైన యొకమహాకావ్యము. పాండిత్యమలవరచుకొనుటకై విద్యార్థులు చదువఁదగినది. సంస్కృతపదముల కంటె నిందాంధ్రపదములే కొంచెము హెచ్చుగనుండును. నూటికిరువదియాంధ్రపదములని చెప్పవచ్చును. అవియైనను, తఱచుగా నుపయోగింపఁబడునవి కాక వెదకి దెచ్చినట్లుండును. కవిత్వము స్రవంతివలెఁ బ్రవహింపక కుంటువడుచుండును. ఇందలిభావములు మనోహరములై పండితుల కాహ్లాదము గలిగించును; ఇందు సందర్భోచితముగ లోకోక్తులు పెక్కు లుదాహృతములైనవి గంభీరమైనశైలి. వ్యాఖ్యానసాహాయ్యముండినగాని, సామాన్యులకు సులభముగా నిందలి భావములు గోచరింపవు. కొన్నిపదము లర్థముకావు. ఈగ్రంథముపై శ్రీనివాసవ్యాఖ్య, జోగిజగన్నాథరాజు వ్యాఖ్య మొదలగు వ్యాఖ్యలు గలవు. శ్రీవావిళ్ళ రామస్వామిశాస్త్రులుగారును, శ్రీవేదము వెంకటరాయశాస్త్రిగారును గూడ నిరువదియవశతాబ్దియందు విపులముగ టీకాతాత్పర్యములను రచియించియుండిరి. అందు, శ్రీవెంకటరాయ శాస్త్రిగారు ప్రకటించినగ్రంథ ముత్తమమై విద్యార్థులకుఁ జాల నుపయోగముగా నుండును. వీరాంధ్రగ్రంథకర్తలు కావున వీరిచారిత్రి

ము నిరువదియవశతాబ్దికవులలోఁ జేర్చి వ్రాసెదను. ఆముక్తమాల్య దాటీకాకారులందఱి చారిత్రములనుగూడ నాయాకాలపు కవులతోఁ జాటుగ వ్రాయునుద్దేశము కలదు.

కృష్ణరాయ లీగ్రంథమునం దచ్చటచ్చట బమ్మెరపోతన కృత భాగవతము ననుకరించినట్లు కనుపట్టుచున్నది. మచ్చునకొకయుదాహరణము:—

ఉ. ఎవ్వనిచే జనించు జగ మెవ్వనిలోపలనుండు లీనమై
యెవ్వనియందు డిందుఁ బరమేశ్వరుఁ డెవ్వఁడు; మూలకారణం
బెవ్వఁ డనాదిమధ్యలయుఁ డెవ్వఁడు సర్వము దానయైనవా
డెవ్వఁడు వాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేఁడెదన్

భాగవతము ౮ స్కంధము.

ఉ. ఎవ్వనిచూడ్కిఁ జేసి జనియించు జగంబు వసించు నిజ్జగం
బెవ్వనియందు, డిందు మఱియెవ్వనియం దిది యట్టివిష్ణుతో
నివ్వల నొక్కవేల్పు గణియించినపాతకి నౌదు నేఁడ నే
నెవ్విధినైన ని న్గదియ నేని, యన న్విని బంధమూడ్చినన్.

ఆ మా. ౬ఆ. ౪౩

కఠినకావ్యమని త్రోసిపుచ్చక శ్రమపడి పఠించి, యిందలిభావములను గ్రహించి, పాఠకులు మహదానందమున నోలలాడుదురుగాక! ఈతనికవిత్వశైలి తెలియుటకై నియమానుసారముగ నాశ్వాసమున కొకపద్యము నీక్రిందనుదాహరించెదను.

చ. ద్రవిడకుటుంబినుల్ పసుపు రాచినరత్నపుఁదావకింద నం
బువు దెరవాఱఁగా నిదురవోయి గరుత్తతి వచ్చఁ బాఱినన్
భవనసరోమరాళములు భర్మమయచ్ఛద గుచ్ఛవిస్ఫుర
ద్దివిజధునీమరాళవితతి భ్రమఁ బూన్చఁ బురిన్ భ్రమించుచున్

౧ఆ. ౬౪.

చ. చిరసముపార్జితాగ్ని తడిఁ జెంది నశించు నటంచునో, కృతా
ధ్వరతఁ దదగ్ని పై నుసికి దాన నొకంగము తాచుచేతనో
పురధరణీసురు ల్నిగమభూధరము ల్జపయజ్ఞశీలు రా
హరిధనదాదులైన వలహస్తము సాఁపరు దానధారకున్. ౨ఆ.౩౩

మ. జని సాహస్రిబహుప్రియాణ మగుసంసారంపుఁద్రోవన్సదా
చనుచుండున్ ఘనమోహఖేదములమున్ సంసారి పాంథుండు వా
సనలన్ ధూళి ముసుంగుగాఁగ నెపుడేన్ జ్ఞానంపుటుష్ణోదకం
బున దత్క్షాళనసేయు వాని కపు డమ్మోక్షాశ్రమంబున్ జనున్.
౩ ఆ ౭౦

ఉ కాలునిదున్న నంది నయి గంటలు దున్నక మంటి నా మహా
కాలునినంది దున్న నయి కర్దమమగ్నత లేక మంటి నా,
హాలికు లెన్నఁడుం దెగనియేరులచేలును జొక్కమళ్ళునుం
గా లలి నేరు సాఁగి లిలఁ గల్గుపసిం గొని పేద ముచ్చగన్
౪ఆ. ౧౨౪

ఉ. మునుపే చంద్రబలంబు గల్గి మలయంపుం గమ్మ లేగాడ్పుఁ దే
రున నేతెంచులతాంతబాణునకు నూర్యుండు న్మహిం గ్రొత్తగా
ననుకూలించెఁ జలంబున న్విరహిణీప్రాణాపహారంబు సే
యన యూహించు విధాతకృత్య మది యేలా మాను నెప్పట్టునన్
౫ ఆ. ౧౦౧.

చ. తెవులయినం, గ్రహంబయినఁ దేలయినం, గరమైన, నాత్మ పెం
డెవులయిన, న్జలంబయినఁ డెక్కలిదైన, మృగాగ్నులైన, మే
ల్తవులయిన, వ్రణంబయినఁ, ద్రాఁచయిన, న్విషమైనఁ, దీర్పు పే
లవ తనువూరకే చెడ కిల న్నృపు నొక్కనిఁ బ్రోచుటొప్పదే
౬ఆ. ౩౦.

తే. కొలుతు సర్వేశు సర్వాత్మకుని ననంతు
నప్రకాశు నభేద్యు సమస్తలోక
సముదయాధారు నణుసమూహములకును న
ణీయు నిన్ను ననాధారు నిత్యు సత్యు. ౭ఆ. ౩౯.

## IX అష్టదిగ్గజములు

రాయలయాస్థానములో దిగ్గజములవలె నెనమండ్రుకవు లుం డెడివారని ప్రతీతికలదు. ఈయష్టదిగ్గజములకుఁ గడపమండలములోని తిప్పలూరు అనుగ్రామమును సర్వాగ్రహారముగాఁ జేసి రాయలు దానమిచ్చెనని యొకశాసనము వలనఁ దెలియుచున్నది. ఈదానమెప్పు డిచ్చెనో, ఆదానపరిగ్రహీతలగు నెనమండుగురుకవులెవరో తెలియదు. ఈసందర్భమునరాయలు వ్రాయించినశాసనములభింపలేదు ఆగ్రామ మునదొమ్మరివన్నుమాపుచేయుచు నితరులువ్రాయించినశాసనమును బట్టియీవిషయము తెలియవచ్చినది.

ఈయష్టదిగ్గజము లనుప్రఖ్యాతి గాంచినవా రాంధ్రకవులని చరిత్రకారులయభిప్రాయము.

"ఈతనియాస్థానమునందు అష్టదిగ్గజములను పేరిట నెనమండ్రు తెలుఁగుకవు లుండిరనిసమాట పరంపరగా వచ్చుచున్నది. అల్లసాని పెద్దన్న, నందితిమ్మన్న, దూర్జటి, మాదయ్యగారిమల్లన్న, అయ్యల రాజురామభద్రుఁడు, పింగళిసూరన్న, రామరాజభూషణుఁడు, తెనాలి రామకృష్ణుఁడు అనెడియెనమండ్రును అష్టదిగ్గజముల నివాదుకకలదు.౨

ఇందు మొదటినలుగురును రామకృష్ణుఁడును శ్రీకృష్ణరాయల కాలములోనివారు. ఆతనియాస్థానమునఁగవులుంగా నున్నట్లు నిదర్శన ములున్నవి. కాని తక్కినముగ్గురును అష్టదిగ్గజములలోనివారు కా రని నాయభిప్రాయము వారినిగూర్చి ఆయాకవుల చరిత్రములయందు వ్రాయఁదలఁచితిని.

అష్టదిగ్గజము లని ప్రఖ్యాతిగాంచినవారిలోఁ బైనవ్రాసిన యైదు గురునుగాక తక్కినవారు సంస్కృతకర్ణాటకకవులై యుందురని నా యుద్దేశము. కృష్ణరాయల కాంధ్రమునిన నభిమాన మెక్కువ యను మాట నిశ్చయమే. "దేశభాషలందుఁ దెలుఁగులెస్స"యనినుడి

---

౧ A R. 282 of 1937-38

౨ మహమ్మదీయమహాయుగము పుట ౩౮౦

వినవాఁడే. కానిదీనినిబట్టి అష్టదిగ్గజము లాంధ్రకవులేయని తలంపరా దనియు, నాతనియాస్థానమున సంస్కృతకర్ణాటకకవులుకూడఁగలర నియు, వారినిగూడ రాయలు సమానగౌరవముతోఁ జూచెననియుఁ దలంపవలసియున్నది.

## X కృష్ణరాయలు కృతిపొందినకావ్యములు

రాయలు కృతిపొందినయాంధ్రకావ్యములు రెండుమాత్రమే కన్పించుచున్నవి. మొదటిదిముక్కుతిమ్మనార్యకృతపారిజాతాపహరణము. రెండవది అలసాని పెద్దనార్యకృతస్వారోచిషమనుసంభవము. ఆ గ్రంథములనుగూర్చియు నాకవులనుగూర్చియు వారిచారిత్రముల యందు వ్రాసెదను. ఆకృతిదానకాలములనిర్ణయమునకుఁ గృష్ణరాయల దిగ్విజయ యాత్రలతో సంబంధమున్నందున వానినిగూర్చిమాత్ర మిట వ్రాయుచున్నాఁడను.

## X (1) పారిజాతాపహరణకృతి సమర్పణకాలము

కావ్యరచనాకాలమునకును గృతిసమర్పణకాలమునకును వ్యత్యాసముండును. కావ్యరచన మొక్కనాఁడు జరుగునదికాదు. అప్పుడప్పుడు గద్యపద్యములను రసోచితముగ వ్రాయుచు రచనపూర్తియైనపిమ్మటఁ గృత్యాదిని నాశ్వాసాద్యంతపద్యములను రచియించి కవికృతిసమర్పించె ననుట సహజము. ఇష్టదేవతాస్తుతి మొదలగుకొన్నిపద్యములు ప్రథమమున రచియించినను దక్కిన కృత్యాది మొదలగువానిని గ్రంథరచనానంతరము రచియించెనని తలంచుటయే లెస్స. ఇపుడు ముద్రితప్రతులలోఁ గన్పడుచున్నట్లు మొదటినుండి తుదివఱకును గృత్యాదితోఁ గూడ వరుసగానేరచియించెనని తలంపరాదు. ఇదిసామాన్యనియమము. ఈనియమమునననుసరించి పారిజాతాపహరణకృతిసమర్పణ కాలమును నిర్ణయించితము. శ్రీకృష్ణరాయలను వర్ణించినయీక్రిందిపద్యము లీసందర్భమునఁ గమనింపదగినవి.

చ. మునుకొని కొండవీటికడ మూఢత రుద్రుఁడు కృష్ణనందను
    న్ననసిజుసిన్ జయించె నది మానుష మే నరసేంద్రుకృష్ణరా

యనృపతి కొండవీటికడ నాహవభూమిఁ బ్రతాపరుద్రునం
దనుఁ డగువీరభద్రుఁ గరుణామతిఁ గాచె జగత్ప్రసిద్ధిగన్.

సీ. ఉదయాద్రి వేగ యత్యుద్ధతిసాధించె
వినుకొండ మాటమాత్రన హరించె
గూటము ల్పెదరంగ కొండవీ డగలించె
బెల్లముకొండ యచ్చెల్లఁ జెఱిచె
దేవరకొండయుద్వృత్తి భంగము సేసె
జల్లిపల్లె సమగ్రశక్తి దులిచెఁ
గినుక మీఱ ననంతగిరి క్రిందుపడఁ జేసెఁ
గంబంబుమెట్టు గ్రక్కునఁ గదల్చె

తే. బలనికాయము కాలమట్టులనె యడఁచుఁ
గటకమును నింక ననుచు నుత్కలమహీశుఁ
డనుదినమ్మును వెఱచు నెవ్వనికి నతఁడు
రాజమాత్రుండె శ్రీకృష్ణరాయవిభుఁడు.

ఈపద్యములనుబట్టిచూడఁగా, నీకృతిసమర్పణమునాఁటికిఁ గొండవీడువిజయమును దెలంగాణా విజయమును బూర్తియైనట్లును కటకవిజయము బూర్తిగానట్లును దెలియుచున్నది. సింహాచలయాత్ర, పొట్నూరికడజయస్తంభస్థాపనములనుగూర్చి పారిజాతాపహరణమున నేమియుఁ జెప్పఁబడలేదు. కావున సింహాద్రిశాసనాత్పూర్వమును తెలంగాణాదుర్గవిజయానంతరము నీకృతిసమర్పణమైనట్లు కన్పట్టుచున్నది. ఈకాలము ధాతసంవత్సరచైత్రశు ౧౨ నాఁటికిఁ బూర్వమును యువసంవత్సరకార్తిక బ ౩ గురువారమునకుఁ బరమును నగును. (క్రీ.శ. ౨౪-౧౦-౧౫౧౫–౨౯-౩-౧౫౧౬) అయిన నిందుల కొకప్రతిబంధకము కన్పట్టుచున్నది. యువసంవత్సరకార్తిక బ ౩ గురువారమునాఁడు తిరుమలవెంకటేశ్వరస్వామినిదర్శించి రాయలుతిరిగి విజయనగరమునకేఁగెను. అటుపిమ్మట నెలకో రెండునెలలకో పూర్వదిగ్విజయయాత్రకుబయలుదేరి ఆయాత్రలోఁ దెలంగాణాదుర్గములను రాజమహేంద్రవరమును జయించి ఆమార్గముననే సింహాద్రికి విచ్చేసినట్లు కన్పట్టు

చున్నది కాని తెలంగాణదుర్గవిజయానంతరము తిరిగివిజయనగరమునకు వచ్చినట్లులేదు. దీనినిబట్టి పారిజాతాపహరణకృతిసమర్పణము విజయనగరమున గాక ఏ రాజమహేంద్రవరముననో దండయాత్రామధ్యకాలమునజరిగినట్లు చెప్పవలసివచ్చుచున్నది. ఇది సమంజసముగాఁ దోఁచదు

ఈసందర్భమున పారిజాతాపహరణ చతుర్థాశ్వాసాంతమున నున్న యీ క్రిందిపద్యములను జూడవలసియున్నది.

క. చండతరమూరురాయర
గండమహాబిరుద! ధాటకారయవిచల
త్కొండపలి కొండవీటీ
మండల! కటకేశసింధుమందరకుధరా!

తోటకము. త్వరితాధరితానిలవాజినట
త్ఖురజోరురజోభరగూఢరవి
స్ఫురణా! కరణాధికసూతకృతిమ
ద్విరదాకరదారణవీరబలా!

ఈపద్యములయందు "కటకేశ్వరుఁడను సముద్రమునకు మందరపర్వతమైనవాఁడా!" "గొప్పశరీరములును శూరత్వ-రమునుగల యేనుఁగుల గుంపును జీల్చునట్టి వీరులైనసైనికులుగలవాఁడా!" అనియును రాయలను సంబోధించు వాక్యములున్నవి. ఈవాక్యములు కటకేశ్వరుని సంపూర్ణముగ జయించినట్లు స్ఫురింపఁజేయవు కాని యాతని ప్రదేశమును యుద్ధములచేఁ గలంచివేసినట్లును యాతనిగజబలమును విచ్ఛేదము చేసినట్లును స్పష్టమగుచున్నది. కావున నీవాక్యములవలన సింహాచల పొట్నూరువిజయములు దెలుపఁబడినవని తలంపవచ్చునని నా యభిప్రాయము. అదివఱకు గజపతియధికారమునం దున్నయుదయగిరి కొండపల్లిమొదలగు దుర్గములను రాయలు జయించియుండుటచే నీ వాక్యము లాదండయాత్రలకు సంబంధించినవేగాని సింహాచలదండయాత్రకుసంబంధించినవి కావని యొకయాక్షేపణము రావచ్చును. కాని సింహాచలదండయాత్రకివి సంబంధించవని చెప్పవీలులేదు. సరియే కదా, కొండవీడు, కొండపలివిజయములను, జెప్పి, పిమ్మట మరలనొక

వాక్యములో వేఱుగా "కటకేశసింధురసుంధరవుధరా"యనిచెప్పుటచే నివి సింహాచల యాత్రయాత్రలకుఁగూడ నన్వయించునని యే నిర్ణయింప వలసియున్నది. సింహాద్రిదండయాత్రతో గజపతిని జయించుట పూర్తి కాలేదని పైపీసపద్యములోని "ఉత్కలమహీశుఁడనుదినమ్మును వెఱచు"అనువాక్యములు బుజువు సేయుచున్నవి.

సింహాచలయాత్రనుండి విజయనగరమునకువచ్చినపిమ్మట ధాత సంవత్సరమున (క్రీ.శ. ౧౫౧౬-౧౭) పారిజాతాపహరణ కావ్యమును రాయలు కృతినందెనని నిశ్చయింపవలసియున్నది. పూర్వదిగ్విజయ యాత్రకు ముందుజరిగినదక్షిణ దేశదండయాత్రలను కవివర్ణింపలేదా ? యనుప్రశ్నరావచ్చును. వానినిగూడఁ గవి క్లుప్తముగ నీక్రిందిపద్యము లలో వర్ణించియున్నాఁడు.

శా. "సమ్మర్దక్షమ! ధీనిబంధనవిధాసంక్రందనాచార్య! శూ
రమ్మాన్యాచలవజ్రపాత! జగతీరత్నాంబుజార్కా! శర
ధ్యమ్మార్గస్థదశాస్యరాజ్యసమసహ్యాపోర్భవాతీరభా
గుమ్మత్తూరి శివసముద్రపురవప్రోన్మూలనాడంబరా!

స్రగ్విణి. నాగమాంబాధిభూనారసింహాత్మజా!
భోగలీలాపరాభూతసంక్రందనా!
త్యాగవిద్యానిషద్యాయితప్రాభవా!
సాగరాంతక్షమాసంపదేకాస్పదా!

ఈపద్యములో ఉమ్మత్తూరు శివసముద్రము దుర్గములను బడ గొట్టినట్లును సముద్రమువఱకును గల భూమినంతను జయించిపరిపాలిం చుచున్నట్లును జెప్పిదక్షిణదేశదిగ్విజయమును వర్ణించి యున్నాఁడు మఱియు:—

శా. శ్రీరంగేశ్వరనాభిపంకజరజశ్శ్రీకంటెఁ జోళేంద్రత
న్వీరాజత్కుచపాళికుంకుమముకంటె న్సహ్యభూభృత్తటీ
నీరంధ్రీకృతగైరికద్రవముకంటె న్వన్నె గావించెఁగా
వేరీతోయముఁ గృష్ణరాయఁ డహితోర్వీనాథరక్తప్రభన్.

ఈపద్యములో శ్రీరంగమును జోళదేశమును సహ్యాద్రిపజ్జ నునుగలభూమిని జయించి, నట్లు చెప్పియుండుటచే దక్షిణదేశము నే కాకుండ నుత్తరమున నున్నమహమ్మదీయ దేశములనుగూడ (గుల్బర్గ మొదలైనవి) జయించినట్లు కవివర్ణించియున్నాఁడు. ఇవియన్నియు క్రీ.శ. ౧౫౧౬-౧౭ సంవత్సరమునకు లోపల జరిగినవియే.

## X (2) మనుచరిత్రకృతి సమర్పణకాలము

మనుచరిత్రకాలమును నిర్ణయించుట సులభసాధ్యము కాకున్నది. ఈకృతిసమర్పణమునాఁటికి కటకవిజయము సంపూర్తియైనదా? యనునది యొకప్రశ్న! ఈసందర్భమున మనుచరిత్రయందలి యీక్రింది పద్యమును జదువవలసియున్నది.

సీ. తొలుదొల్త నుదయాద్రి శిలఁదాకి తీండ్రించు
 నసి లోహమున వెచ్చనయిజనించె
మఱి కొండవీ డెక్కి మార్కొని నవియైన
 యల కసవాపాత్రు నంటిరాఁజె
నట సాఁగి జమ్మిలోయఁబడి వేగిదహించెఁ
 గోనవిట్టేర్చి గొట్టానఁదగిలెఁ
గనకగిరిస్ఫూర్తిఁ గరఁచి గౌతమిఁ గ్రాచె
 నవుల నాపొట్నూర రవులుకొనియె
మాడెములు వ్రేల్చె నొడ్డాది మసి యొనర్చెఁ
గటకపురిఁ గాల్చె గజరాజు గలఁగిపఱవ
దోఃకచిచ్చన నౌర! యుద్ధురతఁగృష్ణ
రాయబాహుప్రతాపజాగ్రన్మహాగ్ని.

ఈపద్యమందలి మొదటిరెండుపాదములును జదువరుల కిదివఱకుఁ బరిచయములైనవియే. "వడ్డాది మసియొనర్చె" ననువఱకును గలవిజయములు సింహాద్రిదండయాత్రలో జరిగినవి. జమ్మిలోయ యనునది, బెజవాడకును వేగికిని నడుమనున్న మన్యప్రదేశమని తోఁచుచున్నది. వేగి పశ్చిమగోదావరిమండలములోనిది. కోన తూర్పుగోదావరిమండలములోని కోనసీమ. గొట్టాము కూడ గోదావరిమండ

లములోని తునిప్రాంతము. కనకగిరి గోదావరిమండలమందు రాజమహేంద్రవరమునకు సమీపముననున్న హేమగిరి, యనియు నిది యిప్పుడు వేమగిరియని పిలువఁబడుచున్నదనియుఁ గొందఱందురు. అది సత్యముకావచ్చును, నైజామురాష్ట్రమున గోదావరీతీరమునఁ గనకగిరి యనుపట్టణమున్నది. అదియేయిది యని కొందఱందురు. పొట్నూరు, మాడెములు ఒడ్డాది యివి విశాఖపట్టణ మండలములోనివి. ఈవిజయములన్నియు సింహాచలశాసనము నాఁటికిఁబూర్వము (౨౯ మార్చి ౧౫౧౬) జరిగినవి. దీనినేసింహాచలదండయాత్రయని పైనిఁబేర్కొన్నాఁడను. ఈయాత్రలో కటకవిజయము సంప్రాప్తముకాలేదు. పొట్నూరులో జయస్తంభముస్థాపించుటతో నీదండయాత్ర ముగిసినది. రాయలు తన సైన్యము నచ్చటనుంచెనో తనతోడ విజయనగరమునకుఁ దీసికొనిపోయెనో చెప్పఁజాలముకాని సింహాచలమునుండి రాయలుతిరిగి విజయనగరమున కేఁగెననుమాటమాత్రము నిశ్చయము. కటకపురీదహన మీదండయాత్రలోజరిగినది కాదు. కటకపురినిదహించుట యొకప్పుడును గజపతితోసంధియొనర్చుట వేఱొకప్పుడునైయుండదు. కావునఁ "గటకపురిఁగాల్చి గజరాజు గలఁగిపఱప" యను వాక్యములవలన నప్పటికి కటక విజయము పూర్తియైనదనియే భావింపవలసియున్నది.

కృష్ణరాయలప్రతాపము నగ్నితోఁ బోల్చిచెప్పుటచేఁ 'గాల్చి' 'ప్రేల్చి' ఇత్యాదిక్రియలు రూపకము కొఱకుఁ గవియుపయోగించెనే గాని కటకపురీదహనము వాస్తవము కాదని కొందఱనుచున్నారు. అది వాస్తవమే కావచ్చును. ఈసందర్భమున మనకుఁగావలసినది. కటకపురీదహనము వాస్తవమా? ఉత్ప్రేక్షయా? యనుప్రశ్న కుత్తరము కాదు. "కటకపురిఁగెల్చి" అనియున్నను జాలును. దానితోఁ గళింగదేశదండయాత్ర పూర్తియైనదనియే నిర్ధారిత మగుచున్నది. అది సింహాచలమందలి రెండవశాసనపు కాలమునకుఁ బూర్వమైయున్నదని పైనివ్రాసియుంటిని.

కావున మనుచరిత్రకాలము దీనితరువాత ననుట స్పష్టము. కృష్ణరాయఁదిగ్విజయవర్ణనము చేసినపట్టికొన్నిపద్యములు మనుచరిత్రలోఁగలవు. కానియందు రెండుపద్యములు దక్క తక్కినవన్నియు

కటకవిజయకాలమునకు లోపల జరిగినకార్యములను దెలుపునవియే కాని తరువాతివిజయములను దెలుపునవి కావు. కావున వానినిగూర్చి చర్చింప నక్కఱ లేదు. ఇఁక మిగిలినపద్యములలో నొకటి యిది.

కవిరాజవిరాజితము :—

నల నృగ రంతి భగీరథ భారతనందనకల్ప యనల్పయశ
శ్చులుకితలోక! విలోకవధూజనసూనశరాసన! మానఖనీ!
ప్రళయఘనాఘనఘోషజయానక భాంకృతిభీమచపేటలుక
త్కలబరిగీకటకక్షితిరక్షక! కన్నడరాజ్యరమారమణా!

ఈపద్యములో రెండువిజయములు వర్ణింపఁబడినవి ౧. కలబరిగి ౨. కటకము. కటకవిజయము ఈశ్వరసంవత్సరములోఁ బూర్తియైనది. కావున దానినిగూర్చి మరలఁ జర్చింపనావశ్యకము లేదు. కలబరిగి యుద్ధమును గూర్చియే యోచింపవలసియున్నది. కలబరిగిదండయాత్రలు రెండుమారులు జరిగినట్లు చరిత్రకారులు వ్రాసియున్నారు. మొదటిది క్రీ.శ. ౧౫౧౪ లో. రెండవది ౧౫౨౧లో. పైపద్యములో నుదాహృతమైనవిజయ మీరెండిటిలో యేది ? అను నంశము విచారణీయము. ఇందు మొదటిదండయాత్రయే యీపద్యమున, జెప్పఁబడిన దని నాయభిప్రాయము.

రాయచూరుయుద్ధము క్రీ. శ. ౧౫౨౦ సంవత్సరము మెయి 19 వ తేదీని జరిగినదని చరిత్రకారులందఱు నేకగ్రీవముగా నంగీకరించి యున్నారు. అది కృష్ణరాయలవిజయములలో విశేషఖ్యాతినిగడించినది. పాశ్చాత్యచరిత్రకారుల ప్రత్యేకదృష్టి నాకర్షించినది. దానినిగూర్చి మనుచరిత్రమున నొక మాటయైనను గన్పట్టుటలేదు. కావున నీ గ్రంథకృతిసమర్పణము క్రీ. శ. ౧౫౨౦ స. మెయ్యి ౨౦ తేదీకిఁ బూర్వముననను, ౧౫౧౭ డిశంబరు ౧ వ తేదీకి పరమునను అనఁగా గటకవిజయమునకును, మూఁడవ రాయచూరుయుద్ధమునకును నడుమ జరిగినట్లు నిశ్చయింపఁదగియున్నది. అయినను దీనికొక ప్రతిబంధకము గల్పించువద్యమొకటి మనుచరిత్రమునందే యున్నది అది యిది.

సీ. ఉదయాచలేంద్రంబు మొదల నెవ్వనికుమా
రతకుఁ గ్రౌంచాచలరాజమయ్యె
నావాడపతి శకంధర సింధురాధ్యక్షు
లరిగాఁపు లెవ్వానిఖరతరాసి
కాపంచగౌడధాత్రీపదం బెవ్వాని
కసివాలుగా నేఁగునట్టి బయలు
సకలయాచకజనాశాపూర్తి కెవ్వాని
ఘనభుజాదండంబు కల్పశాఖ
తే. ప్రబలరాజాధిరాజ వీరప్రతాప
రాజపరమేశ బిరుదవిభ్రాజి యెవ్వఁ
డట్టిశ్రీకృష్ణరాయవీరాగ్రగణ్యుఁ
డొక్కనాఁడు కుతూహలం బుప్పతిల్ల.

ఈపద్యమునందలి మొదటిమూఁడుపాదములపైని శ్రీకొమఱ్ఱాజు లక్ష్మణరావుపంతులు గారిట్లు వ్రాసియున్నారు.

"పైమూఁడుచరణములలోని 'ఉదయాచలేంద్రము' 'నావాడపతి' 'శకంధర' 'సింధురాధ్యక్షుఁడు' అనుపదములచేఁ గవి కొన్నిచరిత్రాంశముల సూచించినాఁ డనుటకు సందేహము లేదు. 'ఉదయాచలేంద్ర' మనగా నెల్లూరుసీమలోని ఉదయాద్రి. 'సింధురాధ్యక్షు' అనగా గజపతి అనిచెప్పినటీకాకారులయర్థమును మన మంగీకరింపవచ్చును. కాని యితరపదములవలన నేదేశమునుగాని యే రాజునుగాని గ్రహింపవలయునోటీకాకారుల వ్రాఁతలవలన నర్థబోధకమగుటలేదు. 'నావాడపతి= నావాడదేశపురాజు; శకంధర= శంకధరుఁడను రాజు; పంచగౌడధాత్రీపదము=కనోజీలు మొదలయినవారిఉత్తరదేశము;' అనిటీకాకారులువ్రాసియున్నారు. ఇంతకంటె నధికస్పష్టమైనయర్థ మేమైన నిందుండి లాగవచ్చునేమో యత్నింతము. ఇందలిశకంధరశబ్దము శికిందర్ (అలెగ్జాండర్ అను శబ్దమును పారసీకచరిత్రకారు లందఱును 'శికందర్' అనివ్యవహరించెదరు. దీనినే మనవారు 'శకంధర'గామార్చి శకశబ్దమునకును దానికిని సంబంధమును కల్పించిరని నాయూహ) అనుపారసీకశబ్దము

నకు సంస్కృతరూపమని నా తాత్పర్యము. కృష్ణదేవరాయలకాలమున గుజరాతు రాజ్యముపై శికందర్ అను నవాబుండెను. పెద్దనచేఁ బేర్కొనఁబడు గౌరవముఁగన్న శికందరుఁడీతఁడేయగునేని రాయలు గుజరాతు మీఁదికి క్రీ.శ౧౫౧౭ లో వెళ్లినని చెప్పుటయే గాక, ఆయేడు ఫిబ్రవరి, మార్చి, యేప్రిల్ ఈమూఁడునెలలలో నెప్పుడో యొకప్పుడు వెళ్లెనని కూడఁ జెప్పవచ్చును. ఎందుకన నీతఁడు మూఁడు నెలలే రాజ్యము చేసెను. ఈకాలము మన మిదివఱ కూహించిన కాలముతో సరిపోవుటలేదు. ఈ రెండు కాలములలో నేది నిజమో శోధింపవలెను.

'ఆపంచగౌడథాత్రీపదము'లోని'ఆఙ్'అనుదానికి మనము'మర్యాద' యనియే యర్థము తీసికొనవచ్చును. 'అభివిధి'అనితీసికొననక్కఱలేదు. (ఆఙ్ మర్యాదాభివిధ్యోః పాణిని ౨-౧-౧౩) 'ఆపంచగౌడ'అనగా పంచగౌడదేశమువఱకు ననియర్థము. పంచగౌడు లనఁగా సారస్వతులు, కన్యాకుబ్జులు, మైథిలులు, గౌడులు, నుత్కళులు. గుజరాతీయులు పంచద్రావిడులలోనివారేకాని, గౌడులు కారు. కావున ఆపంచగౌడ మనఁగా గుజరాతు దేశమువఱకును అని యర్థము చేయవచ్చును. దానికి గౌడదేశము తగిలియున్నదిగనుక 'ఆపంచగౌడ'పద మిచ్చుట మర్యాదపదము. ఇట్టిపద్యము కృష్ణరాయని యుత్తర(నర్మదకుత్తర) దిగ్విజయయాత్రను సూచించుచున్నదని, యర్థము చేసికొనవచ్చును. 'ఆపంచగౌడ' దేశమనఁగా నర్మదకు నుత్తరమున నున్నహింమూదేశమనియు, సాధారణముగ నర్థముచేయవచ్చును. ఇందునుగుఱించి యింతకంటె నెక్కుడు చర్చించుటకు నధికసాధనము లేవియు లేవు ౧

సుప్రసిద్ధచరిత్రకారులగు శ్రీ లక్ష్మణరావుపంతులుగారి యభిప్రాయము నంగీకరించితిమేని, మనుచరిత్రకృతిసమర్పణకాలము క్రీ.శ. ౧౫౧౬ ఏప్రియల్ నెలకుఁ దరువాత నైయుండునని చెప్పవలసివచ్చుచున్నది. శ్రీ పంతులుగారి యభిప్రాయము త్రోసి వేయఁజాలము. కాని యీవిషయమును మరల శోధించుటకు వారే యవకాశమిచ్చినందున నీసందర్భము నిఁక నొకమాఱు పరిశీలించిచూతము.

---

౧ లక్ష్మణరాయ వ్యాసావళి.

క్రీ. శ. ౧౫౨౮లోనే రాయలు చనిపోయెనను వాదమొకటియున్నది. ౧౫౨౫ లోఁ గృష్ణరాయల యేకపుత్త్రుఁడు చనిపోయినాఁడు. "తనసింహాసనమున కుత్తరాధికారి యెవ్వఁడు" అనునాలోచనలో రాయలు విచారగ్రస్తుఁడై యుండినకాల మది. అతఁడు ౧౫౨౫-౨౬ సంవత్సరములలో దండయాత్రలు జరిగించినట్లు చారిత్రకాధారములు గన్పించుటలేదు. విజయనగరమునుండి గుజరాతునకుఁ బ్రత్యేకముగ నాకాలమున దండయాత్రచేసెననుటకు వీలులేదు. అంతకుఁబూర్వము బీజపురము, బీడరు మొదలగు మహమ్మదీయ దేశదండయాత్రలుచేసి యావరుసను గుజరాతునకు వెళ్ళినాఁడనుట కాకాలములో నట్టిదండయాత్రలుచేసెననుట కాధారములు లేవు. ౧౫౨౬ ఫిబ్రవరి, మార్చి, ఏప్రియల్ నెలలలోరాయలు విజయనగరముననేయున్నట్లు శాసనములు గనఁబడుచున్నవి. అంతవఱకును మనుచరిత్ర కృతిసమర్పణము జరుగలేదని తలంపఁజాలము. కృష్ణరాయలు ౧౫౨౫ నకుఁ దరువాత నాల్గు సంవత్సరములు జీవించినను నాకాలమునం దాతఁ డుత్సాహముతోఁ గృతులను రచించుటకును స్వీకరించుటకును తగినస్థితిలోలేఁడనినాయభిప్రాయము. అయినచో 'శకంధర' శబ్దముమాట యేమని యడుగ వచ్చును.

పెద్దనార్యుని యీపద్యములోఁ గొంత యుత్ప్రేక్షయున్నదని నాయభిప్రాయము. ఆవంచగాడ పదమిట్టిదే. నర్మద కుత్తరమునఁగూడ రాయలవిహార ప్రదేశమున్నదని యంగీకరించితిమేని యది యప్పటి ఢిల్లీచక్రవర్తుల యధికారప్రదేశమువఱకువ్యాపించియుండెనని తలంపవలసియున్నది. ఇం దుత్ప్రేక్షయుండిననుండుఁగాక! ఆకాలమున నాప్రదేశము "లోడి" వంశీయుల యధికారముక్రింద నున్నది. లోడీవంశీయులలో "సికందర్‌లోడి" యనునతఁడొకఁడున్నాఁడు. అతఁడు క్రీ. శ. ౧౪౮౯ లో సింహాసనమధిరోహించి, యాగ్రాను నివాసముగా నేర్పఱచుకొని ౧౫౧౭ వఱకు పరిపాలనమును సాగించినాఁడు. ఇతనినే పెద్దనార్యుఁడు పైపద్యములో నుదాహరించినాఁ డని నాయభిప్రాయము. ఈసికందర్‌లోడీ రాయల కరికాఁపు గాకపోయిన పోవచ్చును. కాని రాయలశౌర్యప్రతాపాగ్నులను వర్ణించుటలోఁ బెద్దనార్యుఁ డు

ప్రేక్షను గనపఱచియుండెనని తలంపవచ్చును. మూఁడు నెలలు మాత్రమే రాజ్యముచేసిన గుజరాతు సికిందరు నరిగాఁపునుగా జేసినాఁడనుటకంటె నొకచక్రవర్తి నరికాఁపుగాఁ జేసె ననుట సమంజసము.

నావాడపతి యెవ్వరో తెలిసిన నీచిక్కు కొంత విడిపోవచ్చును. కాని తెలియ లేదు.

ఏదియో యొకవిధముగ నీయభ్యంతరమును దొలఁగించి, మనుచరిత్రకృతిసమర్పణమును క్రీ. శ. ౧౫౨౭ వఱకుఁ ద్రోసివేయక పైనఁ జెప్పినకాలమునకు సరిపుచ్చుటయే సమంజసము.

గోలకొండ, విజాపురము, అహమ్మదు నగరములు రాజధానులుగాఁ బరిపాలనము చేయుచున్న కుతుబ్ సాహా, అదిల్ (ఏదుల) సాహా, నిజామ్‌సాహాలకుఁదోడుగ నాగాపరిపాలకులుకూడఁ రాయలకు భయపడుచున్నట్లు కృష్ణరాయవిజయమునందలి యీ క్రిందిపద్యము చెప్పుచున్నది.

ఉ. ఆగజవాజబృందముల శౌభటకోటుల శాస్త్రపాలు బా
  హాగురుశైర్యధైర్యముల కాత్మఁ గలంగుచు విన్నమాత్రినా
  హా ! గణుతింపశక్యమె యహర్నిశమున్ భయమందియుండిర
  య్యాగర (ఆగ్రా) నాముదానగరియందు (అహమ్మద్ నగరము)
                    విజాపురి గోలకొండలోఁ.

కృష్ణరాయలు ఆగ్రాపై దండెత్తి యాప్రభువు నోడింపకపోయినను ఆతఁడు సహాయమొనర్చిన నిజామ్‌షాహా, ఏదుల్ షాహా, కుతుబ్ షాహా లనుజయించి మూరురాయరగండఁడను బిరుదమును గైకొనియున్న వాఁడగుటచే నాగాధిపతి యగు సికిందర్ లోడీనిగూడ జయించినట్లు పెద్దనార్యుఁడు వ్రాసియుండె నని తలంపవచ్చును.

## XI రాయలస్వరూప స్వభావాదులు

కృష్ణరాయలు దృఢకాయుఁడనియు, సౌందర్యశాలియనియు, మొగమునఁ గొలఁదిగ స్ఫోటకపుమచ్చలు గలవనియు, ప్రసన్నవదనమును, విశాలనేత్రములును నాజానుబాహువులును గలవాఁడనియు, సమకాలికులును రాయలను జూచినవారు నగుపోర్చుగీసుచరిత్రకారులు

వ్రాసియున్నారు. ఇతఁడనుదినమును శరీరవ్యాయామ మొనర్చుచు దేహదార్ఢ్యమును బెంపొందించుకొనుచుండినట్లు పెద్దనార్యుఁడు చెప్పిన "వ్యాయామస్థిరబంధిబంధ" అనువాక్యమువలనఁ దెలియుచున్నది.౧ గుఱ్ఱపుస్వారి చేయుటయం దితఁడు గడునేర్పరియఁట! ప్రపంచమున ఘనకార్యములను నెరవేర్చుటకై భగవదంశమున నప్పుడప్పు డుద్భవించుచుండెడి మహాపురుషులలో నీతఁ డొకఁడు. ఇతఁడు రణరంగమునఁ బట్టపగలింటి గ్రీష్మమార్తాండుఁడు. ప్రజాపరిపాలనమున శరదాత్రికాసీతకరుఁడు. వదాన్యమున నధరీకృతకర్ణుఁడు. కవి, పండిత, గాయకపోషకుఁడని, పారిజాతాపహరణ, మనుసంభవ, సంగీత సూర్యోదయాదులు సాక్ష్య మిచ్చుచున్నవి. దుష్టశిక్షణ, శిష్టరక్షణము లీతని నైజగుణములని, మూరురాయరగండ యవనస్థాపనాచార్య బిరుదములు ఋజువు సేయుచున్నవి. ఈతని రాజనీతిచతురత కాముక్తమాల్యదయందలి రాజనీతిపద్యములే నిదర్శనములు. ఇతఁడనుసరించినమతము విశిష్టాద్వైతము. అయినను బరమతద్వేషము లేనివాఁడనుటకు శ్రీశైలాదిశైవస్థానముల కీతఁ డొసంగినదానములును చంద్రచూడసరస్వతి మొదలగువారిని గౌరవించి చేసిన ధర్మములును జెప్పుచున్నవి. నిత్యమును శత్రువిజయముకొఱకుఁ బెనగులాడుచు రణరంగమునందే జీవితముగడపినను, జ్ఞానియై పరమార్థచింతతో మెలఁగెనని యీతఁడు రచించిన యాముక్తమాల్యదయందలి ఖాండిక్యకేశిధ్వజసంవాదము చెప్పక చెప్పుచున్నది. ఆముక్తమాల్యదయందుఁ జాలవఱ కీతనిస్వభావము సూచిత మయినది. రణరంగమునఁ గ్రౌర్యమును జూపినను, చేఁజిక్కినశత్రువును జంపుట కిష్టపడియెడివాఁడు కాఁడని పేరుగన్న శత్రువులను జీవగ్రాహముగాఁ బట్టుకొని యభయమిచ్చినట్లీతని శాసనములు చాటుచున్నవి. ఇతఁడు దైవభక్తిపరాయణుఁడనుటకు శ్రీవెంకటేశ్వరున కర్పించిన యాముక్తమాల్యదయుఁ జెన్నరాష్ట్రమందలి ప్రధానదేవాలయములకన్నిటికి లెక్కలేనంత ద్రవ్యమును, గ్రామములను నొసంగి వ్రాయించినశాసనములును వేనోళ్ళఁ జాటుచున్నవి. ఇతఁడు భారతీయసాంప్రదాయములయందును వేదశాస్త్రముల

౧. మనుచరిత్రము ౬-౫ ౧౨౩

యందును విశేషనమ్మకము కలవాఁడు. ఇతఁడు కట్టించినపట్టణములు పల్లెలు త్రవ్వించినతటాకములు లెక్కకు మిక్కిలిగా నున్నది.

ఇతని గుణగణముల నెన్నుటకు శక్తి చాలక "ఇతఁ డాదర్శక పురుషుఁ" డనియొక్కమాటను జెప్పి తృప్తి చెందెదను. ఇతఁడు దేశ క్షేమముకొఱకుఁ జేసినఘనకార్యములు మూఁడు. మొదటిది దక్షిణ హిందూదేశము మహమ్మదీయాక్రాంతము గాకుండఁ జేసి భారతీయ ధర్మములను గాపాడుట. రెండవది ఆంధ్రభాషామతల్లి నూతనాలంకారశోభితయై తనకటాక్షవీక్షణములచే నాంధ్రులహృదయపద్మములను వికసింపఁ జేయునట్లొనర్చుట. మూఁడవది దక్షిణదేశము సస్యశ్యామలమై శోభిల్లుటకును, ప్రజలు వ్యాపారతత్పరులై, విద్యావంతులై పౌరుషశాలులై, భగవదారాధనాసక్తులై యిహపరసాధకులగుటకుఁ బ్రోత్సాహ మొసంగుచు నందులకుఁ దగినయవకాశములు కల్పించుట.

ఈతఁ డవతారపురుషుఁడని చెప్పిన నందతిశయోక్తి లేదు. ఆముక్తమాల్యదయం దితఁ డొనర్చిన ఋతువర్ణనాదులను, జాగ్రతగఁ జదివిచూచిన నీతనిస్వభావమును, నాకాలమునాఁటి దేశపరిస్థితులును జాలవఱకుఁ దెలియును.

## XII శ్రీకృష్ణరాయుల నిర్యాణకాలనిర్ణయము

ఈవిషయమున భిన్నాభిప్రాయమున్నది. శా. శ. ౧౪౫౧ విరోధిసంవత్సర మాఘ మాసమువఱకును రాయలపే రుదాహృతములైనశాసనములు[౧] కన్పట్టుచుండుటచే క్రీ.శ. ౧౫౩౦ జనవరునెలప్రాంతము వఱకును శ్రీకృష్ణరాయలు జీవించియుండెనని పండితు లభిప్రాయపడియున్నారు. ఇట్లుండగా సుప్రసిద్ధచరిత్రకారు లగుశ్రీ కొ. లక్ష్మణరావుపంతులుగా రొకవ్యాసమునందీవిషయమున సంశయమును జూపి రాయలు శా.శ. ౧౪౪౬ ఖర సంవత్సరముననే చనిపోయినట్లు కాన్పించుచున్నదనియు, నీవిషయమై పరిశోధకులు పరిశోధన చేయవలయుననియు, వ్రాసియున్నారు. ఆవ్యాసమునందలి ముఖ్యభాగముల నీక్రింద నిచ్చెదను.

---

౧ A. R. 367 of 1912; 369 of 1912; 512 of 1919.

"కృష్ణదేవరాయలు, శా.శ. ౧౪౫౨ సరియయిన క్రీ.శ ౧౫౩౦ వ సంవత్సరమునఁ గీర్తిశేషుఁడయ్యె నని చెప్పునట్టి యీక్రింది చాటుపద్యము తెనుఁగుదేశమునందుఁ బరంపరగా వచ్చుచున్నది.

ఉ. బోరన యాచకప్రతతిభూరివిపద్దశ నొందుచుండఁగా
నారయ శాలివాహనశకాబ్దము లద్రియుగాబ్ధిసోములం
దారణవత్సరంబున నిదాఘదినంబున జ్యేష్ఠశుద్ధ ష
ష్ఠీ రవివాసరంబున నృసింహునికృష్ణుఁడు చేరె స్వర్గమున్
ద్వారకనున్న కృష్ణుఁ డవతారసమాప్తము నొందు కైవడిన్.

ఈచాటువునుబట్టిచూడఁగాఁ గృష్ణరాయుఁడు తారణసంవత్సర మగునట్టి శా. శ. ౧౪౫౨ యేట (ఇదిగతాబ్దముకాదు, జరుగుచున్న సంవత్సరపుసంఖ్యయని నాతాత్పర్యము.) జ్యేష్ఠశుద్ధ షష్ఠి ఆదివారము నాఁడు కీర్తిశేషుఁడయ్యెనని కానవచ్చుచున్నది. దీని కనుకూలముగఁ జెన్నపట్టణమందలి ఓరియంటల్ లైబ్రిరీలోనున్న "లోకల్ రికార్డ్సు" యొక్క ౧౮ వ సంపుముటలోని ౪౦౭ వ పుటలో రామరాజుచే నీయంబడిన యీ కౌలు కలదు.

"చింతరాజుపల్లెపాలెం వెంకటపతిరాయనివద్దనున్న కాగితపు కౌలుకు నకలు"

"స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౪౮ అగు నేటి వ్యయనామసంవత్సర వైశాఖ శు ౧౫ లు శ్రీమద్రాజాధిరాజ రాజకంఠీరవ రాజకందర్ప మహారాజాధి రాజపరమేశ్వర రాజపూజితు లగుమహారాజశ్రీ రామరాజయ్యగారు విజయనగరసింహాసనమున పృథ్వీసామ్రాజ్యము చేయుచుండగాను గురుగింజకూట నమలనేని కుమార పెద్దబుచ్చినాయనివారికి వ్రాయించియిచ్చిన కౌలు నిరూపం మహారాజశ్రీ కృష్ణరాయలయ్యగారికిన్ని తరికొండ తిమ్మనాయని కుమార రామానాయనికిన్ని విరోధం సంభవించినప్పుడు మీరు వారిలో కలసిస్తిరి అనిసంశయించి మీకు నడుస్తువున్నగ్రామాదులు నశరజప్తీ చేయించిరి గనుక కోటకొండ పెద్దవోబుళరాజు విప్పపెంట కుమారజంగమరెడ్డి గోపాలబుద్ధారెడ్డి వోగిమళ్ళ పెద్దరెడ్డి వీరబల్లెయ-

మాచిరెడ్డి గెండికోట బాగసాని పెద్దనల్లపరెడ్డి యీమొదలయిన దేశస్థులున్నూ మహారాజశ్రీ రాయలవారిముద్రికర్త వుదయగిరి మలహారి శంకరపంతులు కొమారుడు ఆనందగోపాలపంతులుగారు మాతో విన్నపం చేసిరి. గనుక చిత్తగించి మీకు నడుస్తువున్న గ్రామాదులు"

ఈకౌలునుబట్టిచూడ శా. శ. ౧౪౪౮ వ్యయనామ సంవత్సరము వైశాఖమాసమునందు విజయనగరమున రామరాజు ప్రభుత్వము చేయుచున్నట్లును అదివఱకే కృష్ణరాయలు కీర్తిశేషుఁడైనట్లును గానవచ్చుచున్నది. ఈకౌలు పైచాటువునకు సమాకారిగనే యున్నది.

కృష్ణరాయలు తారణనామసంవత్సరముననే కీర్తిశేషుఁడైయుండవచ్చుననుటకు మఱికొన్నిశాసనములు కానవచ్చుచున్నవి.

1. తారణనామసంవత్సర మార్గశిర శు ౨ వఱకుఁ గృష్ణరాయని కుమారుఁడైన తిరుమలరాయఁడు రాజ్యము చేయుచున్న ట్లొకకన్నడ శాసనము కలదు. (ఎ.పి. కర్నా. సం ౯ పుట ౭౫ బెంగులూరుజిల్లా మాగడితాలూకా సంఖ్య ౮౨) ఇది ముఖ్యముగఁ జూడదగినది గనుక దాని నిచ్చట నిచ్చుచున్నాఁడను.

"స్వస్తి శ్రీవిజయాభ్యుదయ శాలివాహనశకవర్ష ౧౪౪౬ నెయ తారణసంవత్సర మార్గశిరశుద్ధ ౨ శని స్వస్తి శ్రీమాన్ మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరభుజబలప్రతావ గజపతి అశ్వపతి భూడ శ్రీకృష్ణదేవమహారాయ ఉదరాబ్ధిచంద్ర శ్రీతిరుమలదేవ మహారాయన కాలదలు శ్రీమాన్ మహాసేవ సాళువ చతుస్సముద్రాధీశ్వర తిమ్మన్న దండనాయకర దేశదలు స్వస్తిశ్రీ అభినవ కాంచీసమకలు ఊరవర్ వరదరాజదేవర ఉత్తమసంధి దధ్యన్నదివసరకె శ్రీకృష్ణదేవమహారాయరిగె గంగోదకసేవితిరప్ప...కోనపనాయకరు, తిరుమలదేవమహారాయరిగు తిమన్నదన్నాయకరిగు ధర్మనాగచెకు ఎండుమారయన హల్లిగె ప్రతినామదొనాయకపురవను కొనపనాయకరు వరదరాజదేవరిగెసమర్పిసిదరు తావుమాడిదసెన ఆచంద్రార్కస్థాయిగాగి నడయు బైకంథు మ్మాడిదసేవె... ..."

ఈశాసనము వ్రాయువఱకుఁ గృష్ణరాయలు మృతినొందెనని యు అతనికుమారుఁడగు తిప్పప్ప రాజ్యము చేయుచుండెననియు మన మూహింపవచ్చును. ఇది మంత్రియైన సాళువతిమ్మరసు రాజ్యము నందుఁ జేయఁబడినదానము. కృష్ణదేవమహారాయలకుఁ గోనపనాయ కుఁ డనువాఁడు గంగోదకము సేవింపఁజేసె ననియు నిందుఁ జెప్పఁబడి యున్నది. చరమావస్థయందు గొంతులో గంగబోయునాచారము హిందూదేశమందంతటను గలదు. కావునఁ గోనపనాయకుఁడు రాయ లచరమదశయం దాతనిసేవ చేసి ధన్యుఁడయ్యెనని మనము తలంపవ చ్చును. పైచాటుపద్యమందలి మరణతిథియె నిజమైనయెడల ఈశాస నము రాయలమరణానంతరమున ఆఱునెలలలో వేయఁబడినదియగును.

2. శా. శ. ౧౪౫౪ లో నచ్యుతరాయలు విజయనగరమందు రాజ్యము చేయుచున్నట్లు నెల్లూరుమండలమునం దొకశాసనము కల దు. (నె. శా. సం. పుట ౮౦౪) దానినిచ్చట వలయునంత భాగము మాత్రమిచ్చుచున్నాఁడను,

"స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శ. ౧౪౫౪ అగు నేటి (పార్థివసంవత్సరఫాల్గుణ) శు ౧౫ బు మున శ్రీమన్మహామండలే శ్వర ...) అచ్యుతదేవమహారాయలువారువిజయనగరమందు వజ్రసిం హాసనారూఢులై ఏలుచుండ, వుదయగిరిపట్నంబున శ్రీమన్మహామండ లేశ్వర (శ్రీ) రాజు చినతిరుమలరాజులవారి కార్యకర్తలైన తిమ్మరా జులకార్యకర్తలైన తిమ్మరాజునందయ్యగారు వేదాద్రి శ్రీనరసింహదే వుని దివ్య శ్రీ పాద పద్మంబులకు సాష్టాంగదండప్రణామంబులు సమ ర్పించియిచ్చిన ధర్మశాసనక్రమ మెట్లన్నను ......"

ఈశాసనమునుబట్టిచూడ శా. శ. ౧౪౫౪ లో అచ్యుతదేవరా యలు విజయనగరమందు రాజ్యము చేయుచున్నట్లు అనఁగా కృష్ణరా యలు కీర్తిశేషుఁ డైనట్లు కానవచ్చుచున్నది.

3. శా. శ. ౧౪౫౬ లోఁ గృష్ణరాయనికుమారుఁ డైనతిరుమలదేవ రాయలు దానము చేసినట్లున్నది. (ఇది అరవశాసనము) (చెంగల్పట్టు జిల్లా) దామెల గ్రామమునందున్నది.

4. శా. శ. ౧౪౫౦, ౧౪౫౧, సంవత్సరములలో నచ్యుతరాయల శాసనములు కానవచ్చుచున్నవి.

వీనినన్నిటినిబట్టి చూడఁగా గృష్ణరాయలు శా. శ. ౧౪౪౬ లోనో ౧౪౪౭ లోనో మృతినొందినట్లును అప్పటినుండియు శా. శ. ౧౪౫౨ (క్రీ. శ. ౧౫౩౦) వఱకు విజయనగరరాజ్యమును ఆక్రమించుకొనవలయునని అతని కుమారుఁడైన తిరుమలరాయలును అల్లుఁడైన రామరాయలును తమ్ముఁడైన అచ్యుతరాయలు ప్రయత్నించుచుండినట్లును ఎవరికి వీలయినప్పుడు వారు శాసనములు వేయించుట, కాల్చుట మొదలయినపనులు చేయుచుండినట్టును ఈకాలమునందు ఎవరియధికారమును స్థిరపడనట్లును దోఁచుచున్నది.

ఈయూహాలకన్నిటికి వ్యతిరేకముగఁ గృష్ణరాయనిశాసనములు పెక్కులు శా. శ. ౧౪౫౨ వఱకును గలవు. కావుననే సుయెల్ మొదలయినతద్జ్ఞులు కృష్ణరాయలు శా.శ. ౧౪౫౨ (క్రీ.శ. ౧౫౩౦) వఱకును జీవించియుండెనని వ్రాసియున్నారు, కాని వారు, నేను పైనిఁ జూపినకాలునుగాని శాసనములనుగాని జర్చించి సమన్వయించుటకు యత్నించియుండలేదు. ఇఁకమీఁద జరిత్రవ్రాయువారు వీనినన్నిటిని సమన్వయింపవలసియున్నది. వీనినన్నిటి నొకవిధముగా సమన్వయింపవచ్చునేమో! ౧౪౪౬ లోనే రాయలు మృతినొందియుండవచ్చును. తరువాత ౧౪౫౨ వఱకును అచ్యుతరామరాజాదులు కలహపడుచు రాజ్య మరాజకముగా నున్నకాలమందుఁ గొందఱునాయకులు తటస్థులుగనుండి వీరివైపుఁ జేరక వారివైపుఁ జేరక యుండవచ్చును. అట్టివారు శాసనాదులు వ్రాయవలసి వచ్చినప్పుడు ఆ శాసనములలో నప్పుడు రాజ్యమునకై పోరాడుచున్నవారిలో నెవ్వరిపేరు చేర్చుటకును చెల్లక అంతకుఁబూర్వము నిశ్చయముగఁ బ్రభుత్వముచేసిన కృష్ణరాయలపేరే వ్రాయించియుందురు. ఇదియొక యూహ. ఈ యూహ ననుసరించి శా. శ. ౧౪౪౬ తరువాతి రాయలశాసనము లన్నియు బహుసూక్ష్మదృష్టితో శోధింపఁబడవలెను. ఆ పని యవకాశానుసారముగ నేను జేయుచునేయున్నాను కాని యితరులును జేయుదురుగాక!

శాసనములను శోధించెడు వారందఱును గృష్ణరాయని శాసనములు శా.శ. ౧౪౫౩ తరువాతివి, శోధించునపుడు నేను రాయలని ధన కాలమును గుఱించి పైనవ్రాసిన విషయములను జ్ఞాపక ముంచుకొందురని నమ్ముచున్నాడను."౧

పైని వ్రాసిన దంతయు శ్రీ లక్ష్మణరావుపంతులుగారు వ్రాసిన వ్యాసములోనిభాగములు. శ్రీకృష్ణరాయలనిర్యాణము తారణసంవత్సరములో సంభవించినదా? విరోధిసంవత్సరములో సంభవించెనా? యనునదియే యిందలిముఖ్యప్రశ్న. ఈ రెండునుగాక మఱియొకదినమున నాతఁడు చనిపోయె ననువాదము లేదు. అట్టివాదమును గ్రొత్తగా బయలు దేరదీయుటకుఁ దగినయుపపత్తులును లేవు. లక్ష్మణరావుపంతులుగారివ్యాసములలో నిచ్చినశాసనాదులనుబట్టి తారణసంవత్సరములోఁ గృష్ణరాయలుచనిపోయెనని నిర్ణయింపవలయునా? లేక కృష్ణరాయల నామముదాహృతమైన శాసనములనుబట్టి విరోధి సంవత్సరమాఖ మాసము వఱకు నాతఁడు జీవించియున్నట్లు తలంపవలయునా? ఇవి రెండే సారాంశములు.

ఇందుఁ దారణవాదమును బలపఱచు మఱియొకశాసనమును భారతిపత్రికలో టి. శివశంకరంపిళ్లగారు ప్రకటించియున్నారు. అది పద్యాత్మకశాసనము. అందలి మొదటిమూఁడుపద్యములును, తుదసీస పద్యమును నీక్రిందనిచ్చుచున్నాఁడను.

"౧. అనుపమ శాలివాహనశకాబ్దములుర్వియుగాబ్ధిదిక్కరుల్
ఘనవ్యయ చైత్రశుద్ధమనగా దగు ద్వాదశి సోమవారమున్
ఘనగిరి రాజ్యపాలన సుగాచతురుం డళిరామరాజుసొం
పున వసియించె నచ్చటను భూపజలుం గణుతింప వేడుకన్

౨. ఆరయ శాలివాహనశకంబులు యుర్వియుగాబ్ధిషడ్భృతుల్
తారణవత్సరంబున నిదాఘదినంబున జ్యేష్ఠశుద్ధష
ష్ఠీరవివాసరంబున నృసింహునికృష్ణుఁడు చేరె ద్వారకన్.

౧ లక్ష్మణరాయ వ్యాసావళి,

3 సీ. హరియందు కృష్ణరాయలు ఐక్యమందిన
కతనచే గ్రామముల్ గడ్డోనంగ
బహు అనాయికమై బరగుచు నుండిన
ఒకరిసామ్మొకరునుప్రకటితముగ
భుజియింపుచున్నట్టి పోల్కి విచారించి
పనిబూనియును ధర్మపద్ధతిగను
పూర్వప్రకారమప్పుడు నిర్ణయించియు
గరిమె రొడ్డంలోని గ్రామములును

గీ. పరిమి నెనిమిదింటికి మరిబాధ్యులైన
రడికరణంబులను యేర్పరించిశాస
నములు లిఖింపఁ జేసియున్నతముగాను
కరుణ నిచ్చెను కీర్తి విఖ్యాతిగాను.

సీ. అనువం దహోబళికిని రడికరణాల
తుది పద్యము నేర్పుగా నప్పుడునిర్ణయించి
వరుసతోడుత కొదవఆయగాండ్లను
రమణతోడుత విచారణ యొనర్చి
ఉంచుకొమ్మని సెల వొప్పగా నొసగిన
యేయేస్థళంబుల నెవ్వరెవ్వ
రికిదుర్కొనినట్లు ఘనమతి గావించి
చెలు వలరగ వహి శాసనంబు

గీ పరగ లిఖించియుండిన పద్ధతిగను
ఒకరికొకరును వైరమించుకయు లేక
స్వామికార్యమునందు వంచనయు లేక
యుండిరపుడు విభవసంయుక్తులగుచు.

ఈశాసనమునందలిపద్యములు లక్షణవిరుద్ధములుగా నున్నవి. ఇందలి మొదటిపద్యమునుబట్టి కృష్ణదేవరాయలయల్లుఁడైన అళియ రామరాజు, శాసనకాలమైన శా. శ. ౧౪౪౯ వ్యయసంవత్సర చైత్రశు ౧౨ సోమవాసరమునఁ బెనుగొండ రాజ్యపరిపాలనము చేయుచుఁ

బెనుగొండలోనున్నట్లు తెలియుచున్నది. శ్రీలక్ష్మణరావుగారి వ్యాస ములో నుదహరించిన చింతరాజుపల్లెకవులులో అళియరామ రాజువ్యయ సంవత్సర వైశాఖ శు ౧౫ నాఁడు విజయనగరసింహాసనాధిరూఢుఁ డైనట్లు వ్రాసియున్నది. ఒకనెలకుఁబూర్వము పెనుగొండను రాజధాని గాఁ జేసికొనియుండుట అసంభవము. అళియరామరాయలు పెను గొండ నివాసముగాఁ జేసికొనియున్నట్లు చరిత్రలు చెప్పుటలేదు. శ్రీ లక్ష్మణరావుగారి వ్యాసములోని చాటుపద్యము ౫ పాదములుగలది. అందలిమధ్యపాదములు మూఁడును ఇంచుకమార్పుతో నీపద్యశాసన మునందలి రెండవ పద్యముగా నున్నవి. చాటుధారలోఁగూడ ౫ పాదము లుండుట సంశయాస్పదముగా నున్నది. మొదటిపాదము నెవరో తరువాతఁ జేర్చియుందురు. మిగిలిననాల్గుపాదములలో నొక పాదము స్ఫురణకు రాకపోఁగా మిగిలినమూఁడు పాదములును నీపద్య శాసనమునఁ జేర్చియుందురు. ఈశాసనము కరణములు రెడ్లు నియామ కమునుగూర్చి వచ్చినతగవుతో సంబంధించినది. ఈసందర్భమున నెవరో యీశాసనమును గల్పించియుందురని నాయూహ. ఇందలి లిపిని పరీక్షించినను భాషను బరిశీలించినను గొంతకాలమునకుఁ బిమ్మట వ్రాయంబడినట్లు తోఁచినది కాని పదునైదవశతాబ్ది శాసనమువలెఁ గన్పిం పలేదు. కావునఁ గృష్ణరాయల నిధనకాల విచారణయందీ శాసనమును గూర్చి యాలోచింపక వదలివేయుదము.

కృష్ణరాయలు విరోధిసంవత్సరమువఱకు జీవించియున్నట్లు ఋజువుసేయు శాసనములలో శ్రీలక్ష్మణరావుగారు చూపినసంశయ మునకుఁ దావులేని శాసనము లున్నవేమో పరిశీలింపవలసియున్నది. కృష్ణరాయలనామ ముదాహృతమైయున్నను, విజయనగరసింహాసనము నకు లోఁబడినసామంతులు పాళె.గాండ్రు మొదలయినవారు వ్రాయిం చినశాసనము లనేకము లాకాలముననున్నవి. కాని యవి సంశయాస్ప దము లగుటచే వానిని వదలివేయుదము. తారణ-విరోధిసంవత్సరము లనడుమ (శా.శ. ౧౪౪౬-౧౪౫౧) కృష్ణరాయలశాసనములు కొన్ని యున్నవి. అందు లేశమును సంశయమునులేని యీ క్రింది శాసనము నాధారముగాఁగొని యీసమస్యనుబరిష్కరింపవచ్చును. ఈశాసనము

కృష్ణరాయలు స్వయముగా చెంగల్పట్టుమండలమునందలి "ఉదయాంబిక"మను గ్రామమును కంచి శంకరాచార్యపీఠస్థుఁడును చంద్రచూడ సరస్వతి శిష్యుఁడునగు సదాశివసరస్వతి కిచ్చి వ్రాయించినది. (ఎపి. ఇండి. సం ౧౪ పుట ౧౬౮)

ఈశాసనమందలి మొదటి ౨౭ శ్లోకములును వీరనరసింహరాయలయొక్కయుఁ గృష్ణరాయలయొక్కయుఁ దాన శాసనములందు సామాన్యముగా వ్రాయఁబడుచుండునవియే. కావున వాని నిటనీయ లేదు. తక్కినశ్లోకముల నిట నుదాహరించెదను.

స్తుత్యౌదార్యః సుధీభిః స విజయనగరే రత్నసింహాసనస్థః
క్ష్మాపాలాన్ కృష్ణరాయక్షితిపతి రధరీకృత్య నిత్యం నృగాదీః
ఆపూర్వాద్రే రథాస్తక్షితిధరకటకాదాచ హేమాచలాంతా
దాసేతోరర్థిసార్థశ్రియమిహ బహులీకృత్య నీత్యాసమింధే ౨౮
శకాబ్దే శాలివాహస్య సహస్రేణ చతుశ్శతైః
పంచాశతా పరిసంఖ్యాతే విరోధ్యబ్దే విరాజితే॥ ౨౯
విఖ్యాతే మాసి వైశాఖే పూర్ణిమాయాం మహాతిథౌ
విశాఖసమాయుక్తే దినేచ శుభవాసరే ౩౦
తుంగభద్రానదీతీరే శ్రీవిరూపాక్షసన్నిధౌ
పరమహంస పరివ్రాజకాచార్యాయ ముముక్షవే ౩౧
భస్మోద్ధూళితగాత్రాయ రుద్రాక్షావళిధారిణే
శీతోష్ణాదిద్వంద్వ దుఃఖాతీతాయ చ మహాత్మనే ౩౨
అష్టాంగయోగయుక్తాయ దయాశీలాయ ధీమతే
సర్వతంత్రస్వతంత్రాయ జ్ఞానవైరాగ్యశీలినే ౩౩
చంద్రశేఖర సరస్వత్యా శిష్యాయామిత తేజసే
సదాశివసరస్వత్యై గురవే శివరూపిణే ౩౪
పడవీడుమహారాజ్యే జయచోళాఖ్యమండలే
తిరక్కలీకుంనరండారూ పత్తనాచ సమన్వితే ౩౫
కలత్తూర్కోట్టసంయుక్తే శ్రీవిలిమలనాడకే
చంగలీపట్టసీమాఖ్యే క్షీరనద్యాస్తటే శుభే ౩౬

దీనికిఁ దరువాత గ్రామనామమును దానిసీమలు మొదలయినవి వ్రాయఁబడినవి. ఈ శాసనమునుగాని యందలి కాలమునుగాని యను మానించుటకుఁదగిన హేతువులు లేవు. ఈశాసనమునుబట్టి కృష్ణరాయలు విరోధిసంవత్సర వైశాఖశు ౧౫ వఱకు జీవించియున్నాఁడని నిస్సంశయ ముగాఁ జెప్పవచ్చును. ఇతఁడు తారణసంవత్సరమున స్వర్గమునలంక రింపలేదని చెప్పుటకీయొక్క శాసనమే చాలును. అయినను మఱిరెండు శాసనములనుగూడ నీసందర్భమున నిట నుదాహరించుచున్నాఁడను. ఇందొకటి పార్థివసంవత్సర కార్తిక శు ౧౨ నాఁడు శ్రీకృష్ణరాయల ప్రధానోద్యోగియగు అయ్యప్పరసయ్య వ్రాయించినది. మఱియొకటి కృష్ణరాయలచే బారకూరు రాజ్యపరిపాలనమున నియోగింపఁబడిన లింగ రసయ్యకడ నుద్యోగిగానున్న ఎతిరాయవొడయరు పార్థివ సంవత్సర ఫాల్గుణ శు ౧ సోమవారమునాఁడు వ్రాయించినది.

౧. ద. హిం, శా.సం. ౯ సంఖ్య ౬౨౦:—

"శ్రీగణాధిపతయేనమః శ్రీగురుభ్యోనమః శ్రీసరస్వత్యైనమః నిర్విఘ్నమస్తు శుభమస్తు నమస్తుంగశిరశ్చుంబి చంద్రచామరచారవే త్రైలోక్యనగరారంభ మూలస్తంభాయ శంభవే॥ స్వస్తిశ్రీ విజయా భ్యుదయ శాలివాహనశకవరుష ౧౪౪౭ సందు ఎంటినయ వర్తమాన పార్థివసంవత్సరద ఫాల్గుణ శు ౧ సోమవారదలూ శ్రీమన్మహారాజాధి రాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీవీర శ్రీకృష్ణరాయ మహారా యరు విజయనగరసింహాసనదలూ చిత్తయిసి సమస్తదుష్టనిగ్రహ శిష్ట పరిపాలనయాగి సకలవర్ణధర్మాశ్రీవనూ ప్రతిపాల్సుత్తిహాకాలదలూ శ్రీకృష్ణరాయమహారాయరూ బారకూరరాజ్యవనూ లింగరసయ వొడయరిగె పాల్సి ఆనిరూపదిం ఎతిరాయవొడయరూ బార్కూరు రాజ్యవ నాళువకాలదలూ శ్రీకృష్ణరాయమహారాయరిగె శత్రుక్షయ మిత్రోర్జిత ఆయురారోగ్య అయిశ్వర్యాభివృద్ధియాగబేకూ, ఎందు ఆనయగొందియ రఘుపతితీర్థ శ్రీపాదవొడయరూ శ్రీనివాసతీర్థ శ్రీపా దవొడయరూ ఆరాధిసువ శ్రీరామచంద్రదేవర నయివేద్య నందాదీప్తి అవరభిత్తాస్వాస్తిగ కొట్టి దానశిలాశాసనదక్రమవెంతెందరే..."

౨. ద. హిం. శా. సం. ౯ సంఖ్య ౫౧౮ :—

"శుభమస్తు. శ్రీగణాధిపతయేనమః స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహానశకవర్షగళు ౧౪౪౭ నెయ వార్థివసంవత్సర కార్తిక శుద్ధ ౧౨ లు శ్రీమన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీకృష్ణదేవమహారాయరూం స్థిరరాజ్యం గయితంఇరలు శ్రీమతు శ్రీకృష్ణదేవమహారాయర రాయస్త అయ్యప్పరసయ్య అయ్యనవరు కంభదూర శ్రీమల్లికార్జునదేవర దివ్యశ్రీపాదపద్మంగళిగకొట్టె భూదానగ్రామగళ శిలాశాసన క్రమవెంతెందరె కందురుపయరాజ్యద కంభదూర పడువణ స్థళద జాలువటి ఎంబ గ్రామమవనూ స్వామియ నైవేద్యాదీపారాధనరథోత్సవకె రాయస్త కొండమరుసయ్యవరిగె పుణ్యలోకప్రాప్తియాగబేకూ, ఎందు జాలవటియగ్రామనూ సహిరణ్యోదక దానధారాపూర్వక వాగిసద్యవరిఖేదవాగి ధారనరదుకొట్టి... ..."

ఈశాసనములు రాయలవారి యుద్యోగస్తులే వ్రాసినవగుట వలనను ఇందు రాయలయాయురారోగ్యైశ్వర్యాభివృద్ధికొఱకని వ్రాసియుండుట చేతను వీనిని సంశయించుటకుఁ దగిన కారణములు లేకపోవుటమూలముననను రాయలు తారణసంవత్సరమునఁ జనిపోలేదనియు విరోధిసంవత్సర కార్తికమాసమువఱకు జీవించియున్నాఁడనియు నిర్ణయించుటకు సంశయింపనక్కఱ లేదు.

అయినచోఁ గృష్ణదేవరాయల యల్లుఁడైన అళియ రామరాజు వ్రాయించినట్లు కనఁబడు చింతరాజుపల్లిపాలెం కోలు యెట్లువచ్చినదను ప్రశ్నకు సమాధాన మీయవలసియున్నది. ఈకౌలుతప్ప అళియరామరాయలు విజయనగరసింహాసనము నందున్నట్లు ఋజువుసేయుశాసనములుగాని వాఙ్మయాధారములుగాని లేవు. పైనిఁజూపిన కృష్ణరాయల శాసనములు ప్రబలమైనసాక్ష్య మిచ్చుచుండఁగా నీకవులునుబట్టి కృష్ణరాయలు తారణాసంవత్సరములోఁ జనిపోయెనని నిర్ణయించుటకు వీలులేదు. కావున నీకౌలు సత్యమైనదికాదనియుఁ గొంతకాలము గడచిన పిదప నెవరో తమయవసరము కొఱకుఁ గల్పించిరనియు నిశ్చయింపవలసియున్నది.

ఇఁక విరోధిసంవత్సరములోపల నచ్యుతరాయలశాసనము లెట్లు వచ్చిన ననుప్రశ్న యొకటియున్నది. అచ్యుతరాయలకును గృష్ణరాయలకును సఖ్యభావము లేదనియు నచ్యుతరాయలను దనజీవితకాలము వఱకు గృష్ణరాయలు చెఱసాలయందుంచెననియుఁ జెప్పెదరు. తన యనంతరమునఁ దనరాజ్యము తనకుమారునకుఁ జెందకుండ నచ్యుతరాయలాక్రమించుకొనునని తలంచి యతనిని జెఱలో నుంచియుండును. కాని తనయేకపుత్త్రుఁడు తనజీవితకాలమునందే చనిపోవుటచేఁ దనయనంతరమున నెట్లును నచ్యుతరాయలే సింహాసన మధిష్ఠింపఁ దగినవాఁడని తలంచి యతనిని చెఱలోనుండి విడిపించి ఉదయగిరిమొదలగుకొంతప్రదేశముపై పరిపాలనాధికార మిచ్చియుండుననియు, నాకాలమున నాతనిపేరుతోఁ గొలఁదిశాసనములు పుట్టియుండుననియు నాయభిప్రాయము. శ్రీలక్ష్మణరావుపంతులుగా రుదహరించిన నెల్లూరుమండల శాసనమున విజయనగరప్రభువులకుండు బిరుదావళి లేక "మహామండలేశ్వర"యనిమాత్రమే యుండుట నాయూహకు బలమిచ్చుచున్నది. విజయనగరరాజులు తమరాజ్యకాలములోఁ దమతనయులనో సోదరులనో యుదయగిరిసీమకుఁ బరిపాలకులుగాఁ బంపుటయు వారు తమపేరుతో శాసనములను వ్రాయించుటయు నాచారముగా నున్నది. తారణ-విరోధి సంవత్సరములనడుమ నచ్యుతరాయలనామమున్న శాసనము లత్యల్పము, నాలుగైదుకంటె నధికముగఁ గన్పడలేదు. ఈశాసనములనుబట్టి కృష్ణరాయలు తారణసంవత్సరమున స్వర్గస్థుఁ డయ్యెనని నిశ్చయింపరాదు.

తారణసంవత్సరమునఁ గృష్ణరాయలకుమారుఁ డగు తిరుమలరాయల పేరుదాహరింపఁబడిన శాసనము లేలవచ్చె నను ప్రశ్నకు "రాయల సంతానము"అనుశీర్షికక్రింద నీచరిత్రమునసే సమాధానము వ్రాసియున్నాఁడను. దానినిబట్టికూడ రాయల మరణము తారణ సంవత్సరమనిధ్రువపడదు.

కృష్ణరాయలు విరోధిసంవత్సర మాఘమాసమువఱకు లేదా యధమము కార్తికమాసమువఱకు జీవించియుండెనని నిశ్చయముగాఁ జెప్పవచ్చును.

## XIII తిమ్మరుసుమంత్రి

శ్రీకృష్ణరాయల మహోన్నత్యమున కంతకు నెవ్వఁడు మూలకారణమో అట్టితిమ్మరుసుమంత్రినిగూర్చి కొన్నివాక్యములనైన వ్రాయకుండ నీ చరిత్రమును ముగించితినేని, యదిగొప్పలోపమగును.

తిమ్మరుసుమంత్రి యాఱువేలనియోగిబ్రాహ్మణుఁడు. కౌండిన్యగోత్రుఁడు ఆపస్తంబసూత్రుఁడు. యజుశ్శాఖీయుఁడు. రాచిరాజుకుమారుఁడు. వేమరసుపౌత్త్రుఁడు. గోవిందరాజీతని కనిష్టసోదరుఁడు. భార్యపేరు లక్ష్మమ్మ. ఇంటిపేరు. సాళువవారు. ఈయింటిపేరుగలవారు క్షత్రియులలోఁ గూడనుండుటచే (సాళువనరసింహరాయలు) తిమ్మరుసుక్షత్రియుఁడని కొంద ఱూహించిరి. కాని యది సత్యము కాదు. ఇతనిజన్మస్థానమేదియో నిర్ణయించుటకు సాధనములు నాకు లభింపలేదు. ఇతఁడు సంస్కృతమున గొప్పపండితుఁడు. అగస్త్యకవికృత మగుబాలభారతమునకుఁ జక్కనివ్యాఖ్య రచించెను. ఆవ్యాఖ్య నాకు లభింపలేదు. ఇతనిజన్మస్థానాదులనుగూర్చి యం దేమేని వ్రాసియుండెనేమో తెలియదు. శ్రీకృష్ణరాయలయాస్థానమునం దున్నవాఁడని యందు వ్రాసికొనెనఁట. బళ్లారిమండలమో, అనంతపురమండలమో యితనిజన్మస్థాన మై యుండునని నాయూహ.

ఇతనితండ్రితాతలు రాజాశ్రయ మునం దున్నవా రనిచెప్పుట కాధారములు దొరకలేదు. తిమ్మరుసు మొదటఁ జాలదారిద్ర్యము ననుభవించినవాఁడనియుఁ బూర్వపుణ్యావశమునఁ గ్రమముగా విద్యావంతుఁడై మంత్రిపదవి నందినవాఁడనియుఁ జెప్పెదరు.

బట్టుమూర్తి యను కవియెడఁ దిమ్మరుసొకప్పు డనాదరణము చూపఁగా నాకవి,

శా. గుత్తిం బుల్లెలు కుట్టి చంద్రగిరిలోఁ గూడెత్తి, పెన్గొండలో
హత్తి న్నత్రమునందు వేఁడి బలుదుర్గాధీశు తాంబూలపుం
దిత్తుల్ మోసి పదస్థులైనఘనులన్ దీవించ.

అనునంతవఱకుఁ బద్యము చెప్పునప్పటికి, దిమ్మరుసు తనమెడ నున్నపచ్చలహారమును గవిమెడలో వేసెననియు, నందుమీఁదట నాబట్టాపద్యము నీరీతిగాఁ బూరించెననియుఁ జెప్పుదురు.

... ... ... దీవించెదన్.

మత్తారాతియయాతి నాగమసుతున్ మంత్రీశ్వరున్ దిమ్మనన్.

ఈపద్యమందలి తిమ్మన సాళువతిమ్మరుసుమంత్రియే యైనచో నీతనితల్లిపేరు నాగమ్మ యనిస్పష్టమైనది.)

మఱియు నాకవి యప్పుడే యీక్రిందిపద్యమునుగూడఁ జెప్పెనఁట,

క. అయ్యా వనిపించుకొంటివి
నెయ్యంబునఁ గృష్ణరాయనృపపుంగవుచే
నయ్యా నీసరియేరీ
తియ్యనివిలుకాడవయ్య ! తిమ్మరుసయ్యా.౧

ముప్పదియిద్దరు మంత్రులసీసమాలికలో "బట్టుమూర్తికిఁగనక-రెట్టింపఁ బచ్చలహార మర్పించెఁ దిమ్మరుసుమాళి" అని యీకథయే చెప్పఁబడినది.

పైకందపద్యమును వదలివేసిచూచినచో నీకథయందలి తిమ్మరుసు సాళువ తిమ్మరసగునో కాదో చెప్పలేము. ఆకాలమునఁ దిమ్మరుసు నామధారులు పదవులయందున్నవారు పెక్కురున్నారు. అచ్యుతరాయలయొద్దనే యిరువురు దండనాయకులున్నారు. కందపద్యము నాబట్టుకవియే చెప్పెననుట కాధారములులేవు. దానిని మఱియొకసందర్భమున వేఱొకకవి చెప్పియుండవచ్చును. ఈపద్యములను రచించిన బట్టుమూర్తికవి వసుచరిత్రనురచించిన రామరాజభూషణుఁడేయైనచో, నాతఁడు సాళువ తిమ్మరుసు మంత్రికాలములో లేఁడు. కావున నాపద్యములలోని తిమ్మరుసు సాళువతిమ్మరుసుకాఁడని చెప్పవలసియున్నది. లేదా, ఆబట్టుకవి రామరాజభూషణుఁడు కాక మఱియొకఁడయి యుండవలయును.

౧ ఆంధ్రకవుల చరిత్రము. ౧౮౮-౧౮౯ పుటలు.

తిమ్మరుసు బాల్యమున దారిద్ర్య మనుభవించెనో లేదో నిర్ణ యించుట కీకథ తోడుపడదు. బీదవారిలో మహాపురుషు లుద్భవించుట యరుదుకాదు. కావునఁ దిమ్మరుసు మొదట బీదవాఁడైననై యుండును.

తిమ్మరుసుభార్యయైన లక్ష్మమ్మ, నాదెళ్ళ తిమ్మమంత్రికి సోదరియనియు, సాళువతిమ్మరుసు సోదరిని నాదెళ్ల తిమ్మమంత్రికిచ్చి పరిణయ మొనర్చిరనియుఁ జెప్పెదరు. ఈవివాహమును "ఖండమార్పు పెండ్లి" యందురు. ఇట్టివివాహములు సామాన్యముగా జరుగవు. ఈ విషయమునుగూర్చి నాదెళ్ళ గోపమంత్రి చారిత్రమున వ్రాసెదను. మాదయ్యగారి మల్లనచే రాజశేఖర చరిత్రమును గృతినందిన అప్పయ మంత్రియుఁ గృష్ణార్జునసంవాదమును ద్విపదకావ్యముగా రచించిన గోపమంత్రియు, నీనాదెళ్ల తిమ్మమంత్రితనయులు. సాళువతిమ్మరుసు మంత్రికి, మేనయల్లుండ్రు.

తిమ్మరుసు మంత్రియు, నీతనిసోదరుఁడైనగోవిందరాజునుగూడ వీరనరసింహరాయలయొద్ద నుద్యోగులై దండనాయకపదవిని మంత్రిపద వినిగూడ వహించి మెప్పువడసిరి ౧ వీరనరసింహరాయల యనంతర మునఁ గృష్ణరాయలనాశ్రయించి, తమబుద్ధిబలమును భుజబలమును జూపి, రాజాస్థానమున మిగులఁ బ్రఖ్యాతపురుషులైరి. తిమ్మరుసు తుళువనరసనాయకునికడ మంత్రిగానుండెనని యందురు. కాని యం దుల కాధారములులేవు.

తిమ్మరుసు పండితుఁడును మంత్రియునేగాక దండనాయకుఁడై రాయలయుద్ధయాత్రలయం దాతనికి సాహాయ్యుఁడుగనుండి రణరంగ ములయం దాతనికి జయమొనగూర్చెడివాఁడు. కొండవీడు దుర్గమును బట్టుకొనుటలోఁ దిమ్మరుసు తనశౌర్యప్రతాపములనుజూపి రాయల కీర్తిని నిలువఁబెట్టెను. ఆదుర్గవిజయములోఁ బ్రధానపాత్ర వహించిన వాఁడు తిమ్మరుసు మంత్రియే. గజపతిపైజరిగిన తుదిదండయాత్రలో తనబుద్ధికౌశలముచే భేదోపాయమున జయము నొడగూర్చినదీ మహా పురుషుఁడే. ఆవిషయమును జిత్రకవి ధర్మన్నచరిత్రమున వ్రాసెదను.

౧. A. R. 389 of 1904.

గజపతి దైవబ్రాహ్మణభక్తిపరుఁడును దాతయును గవి పండితపోషకుఁడును సరస్వతీవిలాస మను ధర్మశాస్త్రకృతికర్తయు నగుటచే నాతని నాశనమున కంగీకరింపక తిమ్మరుసు తనబుద్ధిబలముచే నాతనికిని రాయలకును బాంధవ్యము నొనగూర్చెను.

వీరనరసింహరాయలచేఁ గృష్ణరాయలకు రాజ్యమిప్పించుటలో నేమి, కర్ణాటకసింహాసనమును నిష్కంటకముగఁ గృష్ణరాయలకు వశముచేయుటయం దేమి, రాయలపరిణయ విషయములనేమి, సప్తాంగ రక్షణములో నేమి, తిమ్మరుసుమంత్రియే తన యసాధారణ బుద్ధికౌశల మునుజూపి రాయలనంతయౌన్నత్యస్థితికిఁ దెచ్చినవాఁడు. వేయేల ! తిమ్మరసు సాహాయ్యమే లేకున్న రాయలచారిత్ర మీవిధముగా నుండెడిది కాదు. వత్సరాజునకు యుగంధరునివలెనే శ్రీకృష్ణరాయలకుఁ దిమ్మరుసు మంత్రియై సర్వదా తనప్రభువు శ్రేయోభివృద్ధికై తనజీవితమును ధారవోసెను.

తిమ్మరుసుసామర్థ్యమును రాయలెఱుంగును. ఆతనియందు పితృభావముంచి "అప్పాజీ" యని పిలుచుచుండెడివాఁడు. ఆతనితో నాలోచింపకుండ నేకార్యమును జేసెడివాఁడు కాఁడు. తిమ్మరుసుశక్తినినమ్మి దుర్ఘటములైన కార్యములను సాధింపనమకట్టెడివాఁడు. ఇంతయేల తనప్రాణరక్షణవిషయమునఁ గూడ తిమ్మరుసుదే భారమని నమ్మియుండెను.

తిమ్మరుసుచూపిన బుద్ధికౌశలమును, రణకౌశలమును దెలుపు కథ లనేకము లాంధ్రలోకమునఁ బ్రచారములోనున్నవి. చాటువులనేకమున్నవి. గ్రంథవిస్తరభీతిచే వానినిట వ్రాయఁజాలనైతిని.

ఈమహామంత్రి ఆంధ్రభాషయందొక కావ్యమును రచించుట గాని యొకకావ్యమునైనఁ గృతినందుటగాని చేయలేదు. కారణము మృగ్యము.

ఈతఁడొసంగిన ధర్మములను దెలుపుశాసనములు కొన్ని యున్నవి.[౧]

ఈమహాత్మ్యశేఖరునకుఁ గర్మవశమున నొకకళంక మాపాదితమైనది. ఈవిషయమున మహమ్మదీయమహాయుగమునం దిట్లున్నది.

"కృష్ణరాయలు చరమదశయందు నాఱేండ్లవాడగు తనకుమారునికిఁ బట్టాభిషేకము చేసి తానుమంత్రిగాను, తిమ్మరుసు కార్యదర్శిగాను, తిమ్మరుసుపుత్రుఁడు సేనాధిపతిగనునుండి రాజ్యము చేయుచుండెను. కాని యెనిమిదినెలలతరువాత నాకుమారుఁ డేదో కారణమువలన మృతుఁడయ్యెను. తిమ్మరుసుకొమారుఁడు విషముపెట్టి తనకుమారునిఁ జంపెననితలఁచి రాజు తన్నుఁ బుత్త్రినవలెఁ గాచినతిమ్మరుసును, అతని తమ్ముని పుత్రునిఁ జెఱఁ బెట్టించెను. తిమ్మరుసుపుత్రుఁడు తప్పించుకొనిపోయి రాయలమీఁద ధ్వజమెత్తెను. రాయలబలము లాతనితో బోరాడి యాతనినిపట్టుకొనివచ్చెను. అంతఁ దిమ్మరుసుయొక్కయు, నతనికుమారునియొక్కయు, తమ్మునియొక్కయు నేత్రము లతికౄరుఁడై రాయలుతీయించెను. తిమ్మరుసు చెఱసాలలోనే మృతుఁడయ్యెను.[౨] ఇతఁడు ౧౫౨౭ లోఁ గిరిశేషుఁడయ్యెను."[3] రాయలకుమారునకు విషముపెట్టుటలోఁ దిమ్మరుసునకుగూడ సంబంధము కలదని కొందఱందురు.

తిమ్మరుసుపై మోపఁబడిన యీనిందకు పోర్చుగీసుదేశీయుఁడగు న్యూనిజు వ్రాఁతలే కారణములు. దేశీయచరిత్రకారులు తమతమగ్రంథములయం దాతనిని ననుకరించుచువచ్చిరి. తిమ్మరుసుస్వభావమును, రాయలకును నాతనికిని గలయనుబంధమును బరికించిచూచినచో

౧. తి. దే. శా. సం. 3 సంఖ్య ౧౯, ౨౧, ౨౨; సంపుటము ౪. సంఖ్య ౭౨, ౭౪, ౯3. ద. హిం. శా. సం ౯ సంఖ్య ౫౨౯. A. R. 216 of 1913; 350 of 1932-33; 113 of 1922; 387 of 1904; 329 of 1892; 258 of 1929-30; 336, 335, 353, 442 of 1915; 634 of 1920;297 of 1935; 387 of 1904; 342 of 1905; 341 of 1933; 355 of 1920; నె. శా. సం. 1035.

౨ మహమ్మదీయమహాయుగము. 3౭౫-3౭౬ పుటలు.

3 " 3౫౫ పుట

నాతఁడట్టిక్రూరకృత్యమును జేసియుండుననినమ్ముట కవకాశము లేదు. ఏమిలాభమునుగోరి యాతఁ డట్లుచేసెనో ఆచరిత్రకారులు చెప్ప లేదు. తిమ్మన పేరుగలవారు రాయల కాలమందు మరికొందఱు రాయలయుద్యోగము నందున్నారు. వారు అచ్యుతరాయలయొద్దకూడ నుద్యోగములో నుండిరి. రాయలకుమారుని జంపినవారు వీరిలో నెవ్వరైన నైయుండిరేమో తెలియదు.

తిమ్మరుసు కృష్ణరాయల యనంతరమున నైదారేండ్లు జీవించి యున్నట్లు శాసననిదర్శనము లున్నవి. ఆతఁడు చెఱసాలయందే ౧౫౨౭ లో నేకేశ్రేషుఁ డయ్యెనని వ్రాసినవ్రాఁతల నీశాసనములు ఖండించుచున్నవి. అవియసత్యములని స్పష్టమైనప్పుడు, రాయలకుమారుని హత్యావిషయములుకూడ నసత్యములని మనమూహించుట తప్పుకాదు. రాయలతరువాత సింహాసనమునకు రాఁదగినవాఁడు అచ్యుతరాయలు. ఆతని ప్రేరేపణమువలననో, ఆతనినిమిత్తమో యీహత్యజరిగియుండవలయును. రాయల యనంతరమున నీహత్యజరిగినదనినచోఁ నందుఁ గొంతయర్థముండును. రాయలుండగాఁ గుమారునిజంపినందువలనఁ దిమ్మరుసునకుగాని యాతనితనయునకుఁగాని వీరిని ప్రోత్సహించినవారికిఁగాని యేమిలాభముండును?

రాయలకుమారుఁ డైనతిరుమలరాయలు బలవన్మరణము పాలగుటకుఁ దిమ్మరుసుగాక మఱియెవ్వరైనకారకులైయుండి, యానింద యీతనిపైఁ బడియె నేమో తెలియదు. నిజముగా నీదారుణము జరిగియేయున్నయెడల నందులకుఁ గేవల రాజకీయ కారణములే గాక వేఱుకారణము లనేకములుండి యుండును. తిరుమలరాయలు స్వాభావిక మరణమందెనేమో యదియును జెప్ప లేము. పైనివ్రాసిన దానినిబట్టి తిరుమలరాయలు క్రీ. శ. ౧౫౨౫ లో చనిపోయియుండవలయునని తెలుచున్నది. ౧౫౩౦ వఱకుఁ గృష్ణరాయలు జీవించి యున్నాఁడు. ౧౫౨౫-౧౫౩౦ నడుమ రాయలశాసనములుచాలగలవు. కాని రాయలుగాని తిరుమలదేవిగాని, తిరుమలరాయలకు స్వర్గప్రాప్తికొఱకు దానములను జేసినట్లు గాన్పింపదు.

తిమ్మరుసుమంత్రి, చెఱసాలలో మరణము నొందలేదు. రాయల యనంతర మాతండ్లు అనఁగా ౧౫౩౭ వఱకు జీవించియున్నాఁడు ఇందులకు సంశయింపఁబనిలేదు. తిమ్మరుసును నతనిసోదరుఁడైనగోవింద రాజును దిరుపతిలోని శ్రీవెంకటేశ్వరునకు అంగరంగనైవేద్యవిభవాదులకు దానములను జేసినప్పుడు ప్రసాదముక్రిందఁ గొంతభాగము వారి కిచ్చుట కేర్పాట్లు జరిగియుండెను. వారు తమభాగములను రామానుజకూటమునకో మరియొకరికో యిచ్చివేయుచువచ్చిరి. కాని యాప్రసాద స్వామ్యము మాత్రము తమయందే యుంచుకొనిరి. క్రీ.శ.౧౫౩౬ లో తిమ్మరుసు ౪౬౦౦ పణముల కొకమారును, ౫,౨౦౩ పణముల కొకమారును ౧౯౦౦ పణముల కొకమారును (౧౫ పణములొక వరహా) ఆప్రసాదస్వామ్యమును దాళ్లపాక అన్నమాచార్యుల కుమారుఁడగు పెదతిరుమలయ్యంగారికి విక్రయించి క్రయశాసనములను వ్రాయించెను.[1] ఆశాసనములు తిరుమలలో స్వామిసన్నిధిని వ్రాయఁబడినవి. అప్పుడు తిమ్మరుసు తిరుపతిలో నుండెను. చెఱసాలలో లేఁడు. ఆశాసనములను నమ్మకపోవుటకుఁ గారణములేదు. దీనినిబట్టి తిమ్మరుసు క్రీ. శ. ౧౫౩౬ డిశంబరు ౨౮ వ తేదీవఱకు జీవించియున్నాఁడనుట నిస్సంశయము. కాని యానాఁడు దిమ్మరుసు దారిద్ర్యమనుభవించుచుండెనని తోఁచుచున్నది. లేకున్న ప్రసాదస్వామ్యము నమ్ముకొనుట తటస్థింపదు. కాని యిది కేవల మూహ. దాని నమ్ముకొనుట కితరకారణము లేవయిన నుండవచ్చును. తిమ్మరుసును జెఱలో నుంచె ననుటకుఁగాని, కండ్లుతీయించె ననుటకుఁగాని యాధారములు లేవు. తిమ్మరుసునకుఁ గుమారులెందఱో, యందెవ్వఁడైనరాయలపైఁ దిరుగఁబడియెనో లేదో నిర్ణయించుటకును నాధారములు లేవు. కృష్ణరాయలంతవానిపైఁ దిరుగఁబడు నంతటిసైనికబలము, తిమ్మరుసుకుమారున కున్నదని తలంచుటకుఁగూడ నవకాశము లేదు. ఈతనితోఁ గలిసి రాయల నెదిర్చెడిసామంతులుకూడ నాకాలమున నెవ్వరు నున్నట్లు కన్పింపదు. విదేశీయునివ్రాఁతతప్ప యాకాలమునాఁటి వాఙ్మయ శాసనదృష్టాంతము లేవియు నీవిషయమును సూచనగానైనఁ జెప్పుటలేదు.

---

[1] తి. దే. శా. సం. ౪ సంఖ్య ౭౨-౭౪-౯౩.

కావునఁ బ్రబలమయినసాక్ష్య మన్యథా లభించువఱకు నీకథయందు సత్యములేదనియే విశ్వసింపవలసియున్నది. క్రీ. శ. ౧౫౨౫-౧౫౩౦ నడుమఁ గృష్ణరాయలతోఁ దిమ్మరుసునకు వైరము కలుగలేదని ఋజువు సేయుసాధనము లేమైనఁ గలవేమోయని ప్రయత్నించితిని. కాని య ట్టివి లభింపలేదు. భావిపరిశోధనమున నట్టివి సమకూరెనేని, యీాప్ర వాదమునుండి తిమ్మరుసు విముక్తినందఁగలఁడు. ప్రొద్దుటూరుతాలూకా కొట్టపాడులో సాళువకుమార తిమ్మరుసు శాసనమొకటి యున్నది. అందుఁ గాలముండెడిభాగము శిథిలమైనది. ఈతఁడెవ్వరో తెలిసికొన వలసియున్నది.

తిమ్మరుసును గోవిందరాజును నచ్యుతరాయల కొలువునం దుం డిరని కొందఱనుచున్నారు. కాని యది సత్యమనుట కాధారములు లభింపలేదు. తిరుపతియందుండుగోవిందరాజస్వామి కొకగ్రామము నిచ్చి వ్రాయించినశాసనమునుబట్టి (క్రీ.శ ౧౫౪౧ నవంబరు ౫వ తేదీ)[౧] గోవిందరాజు, ౧౫౪౧ వఱకు జీవించియున్నట్లు స్పష్టమగుచున్నది కాని, యీాశాసనమున నచ్యుతరాయల నామ ముదాహృతము కాక పోవుటచే నాతనికొలువున నున్నాఁడని చెప్పుట కవకాశము లేదు.

ఈగోవిందరాజు, తనకుమార్తెయైన తిరుమలమ్మకు, హానుమాను గుంట యనుగ్రామము నిచ్చియుండెనఁట ! అగ్రామము నామెకుఁ బు ణ్యలోకావాప్తికొఱకా మెభర్త, యజుశ్శాఖీయుఁడు ఆపస్తంబసూ త్రుఁడు, హారితగోత్రుఁడు పెండ్లికొడుకు నరసింగయ్యకుమారుఁడు నగుచినన్నయ్య శ్రీవెంకటేశ్వరస్వామికొసంగి (20-11-1524) శాసన మువ్రాయించెను[౨] రాయల కొలువునందు విఖ్యాతిఁగాంచిన రా యసము కొండమరుసయ్య, అప్పరుసయ్య మొదలగుమంత్రులును, పెమ్మ సాని రామలింగానాయఁ డాదిగాసర్దారులును సేనాధిపతులును పెక్కు రున్నారు. వారినిగూర్చి వ్రాయుటకిట తావులేదు.

ఇంకను వ్రాయవలసిన సంఘటనలు పెక్కులున్నను, రాయల చారిత్ర మీాగ్రంథమున నిదివఱకే విపులమగుట నీతనిచారిత్రమును ముగించుచున్నాఁడను.

---

౧. తి. దే. శా. సం. ౪ పుట ౩౧౬.

౨. ,, ,, ౩ పుట ౩౩౨

# 96 అల్లసాని పెద్దనార్యుఁడు

ఆంధ్రకవితా పితామహుఁడని ప్రఖ్యాతిఁ గాంచిన యీమహా కవి నందవరీకనియోగిబ్రాహ్మణుఁడు ; చొక్కనామాత్యుని పుత్త్రుఁడు. ఈతనిజన్మస్థానము బళ్ళారిప్రాంతములయం దున్న దూపాడు పరగణా లోని దోరాలగ్రామ మని కవిచరిత్రకారులు వ్రాసియున్నారు. ఈకవి శ్రీకృష్ణదేవరాయల యాస్థానకవులలో నగ్రగణ్యుఁడు. ఇతఁడుస్వారో చిష మనుసంభవమను నాఱాశ్వాసముల యుత్తమ ప్రబంధము (దీనికి మనుచరిత్ర మనినామాంతరము)ను హరికథాసార మనువేఱొక గ్రంథమును రచియుంచెను. ఈతఁడింక ననేకగ్రంథములను సంస్కృ తాంధ్రభాషలలో రచియించెనని చెప్పుదురు. కాని యవి యిప్పుడు లభించుటలేదు. వానినామములైనఁ దెలియుటలేదు. ఈతని హరికథా సారమునందలి కొన్నిపద్యములు లక్షణగ్రంథములలో నుదాహృతము లైనవి. అవిదక్క గ్రంథ మెచ్చటను బూర్తిగా లేదు. మనుచరిత్రము మాత్రమే యిప్పుడు లభ్యమగుచున్నది. ఈమహామహుఁడు రచించిన తక్కినగ్రంథములు లభింపకపోవుట యాంధ్రులదురదృష్టము. ఈతఁడు రచించిన మనుచరిత్రమువలన నీతనివృత్తాంత మంతగాఁదెలియదు. మనుచరిత్రమునందలి గద్య యిట్లున్నది.

"ఇది శ్రీమదంధ్ర కవితాపితామహసర్వతోముఖాంక పంక జాక్ష పాదాంబుజాధీన మానసేందిందిర నందవరపుర వంశో త్తంస శఠగోపతాపస ప్రసాదాసాదిత చతుర్విధ కవితామతల్లి కాల్లసాని చొక్కయామాత్య పుత్త్ర పెద్దనార్య ప్రణీతంబైన స్వారోచిషమను సంభవంబను మహాప్రబంధంబు".

ఈతని గోత్రసూత్రములనుగూడ నిందుఁ దెలుపలేదు. కాని యీక్రింద వ్రాయఁబోవు అన్నూరుశాసనమునుబట్టి యీతఁడుఋగ్వేది యనియు, నాశ్వలాయన సూత్రుఁడనియు వసిష్ఠగోత్రుఁడనియుఁ దెలియుచున్నది. ఈతనికి శఠకోపయతి గురువైన ట్లీక్రింది పద్యముల వలనఁ దెలియఁగనగు చున్నది.

క. కొలుతున్ మద్గురు విద్యా
నిలయుం గరుణా కటాక్షనిబిడ జ్యోత్స్నా
దళిదాశ్రిత జనదురిత
చ్ఛలగాఢధ్వాంతసమితి శఠకోపయతిన్. మనుచరిత్ర

క. శఠగోపయతికి శఠతరు
కుతారకోపమమతికిని గురుసుతహృత్క
ర్మఠ నిరతికిఁ జతురాగమ
పఠనాయతనియతికి నజపాసంభృతికిన్ హరికథాసారము

ఈశఠగోప యతి అహోబలమఠ సంస్థాపకుఁడనియు, నితఁడు సంగమవంశజుఁడును గర్ణాటప్రభువునైన దేవరాయలరాజ్యకాలములో హూణశకము ౧౪౩౭ ప్రాంతమున జన్మించి ౧౫౧౫ వఱకుజీవించి యున్నవాఁడనియు నీతఁడే అల్లసానిపెద్దనార్యునకు గురువనియుఁ దిరుపతి దేవస్థానమువారు ప్రకటించిన శిలాశాసనకర్తల వంశావళుల యందున్నది. ఈశఠకోపజియ్యరునకు వేదాంతాచార్యుఁడనుబిరుదుగల దఁట! ఈయనశిష్యుఁడును నీయన యనంతరము మఠాధికారమును వహించినవాఁడు నగు నారాయణజియ్యరు తిరుపతి వేంకటేశ్వరస్వామి వారికిఁ గొంతద్రవ్యమొసంగి వేయించిన శిలాశాసనములు రెండుశాలి వాహనశకము ౧౪౩౮ వ సంవత్సరమునాఁటివి (20వ అగష్టు 1516 వ సంవత్సరము 7వ నవంబరు 1516 వ సంవత్సరము) తిరుపతి దేవస్థానము నందున్నవి. అందుఁబెద్దనార్యుని నామముదాహృతముకాలేదు. కాని శఠకోపజియ్యరువారి నామమున్నది. అహోబలమఠము పెద్దనార్యుని జన్మస్థానమునకు నాతిదూరమగుట వలనను, ఇరువురు నేకకాలము వారగుటను నీశఠగోపయతియే పెద్దనార్యునకు గురువని విశ్వసింప వచ్చును. ఈతనినిబట్టియే పెద్దనార్యుఁడు జననముచే నద్వైతియయ్యు నను విశిష్టాద్వైత మతాభిమానము కలవాఁడై శ్రీకృష్ణదేవరాయ లొసంగిన కోకటాగ్రహారమును వైష్ణవుల కగ్రహారముచేసియిచ్చి దానికిఁ దన గురువుపేరిట శఠగోవపురమని పేరుపెట్టెనని చెప్పుదురు. పెద్దనార్యుఁడు క్రీ. శ. ౧౪౭౦ ప్రాంతమున జన్మించి ౧౪౯౦ ప్రాంతమున శఠగోప యతికిశిష్యుఁడై ౪౦ ఏండ్లవయసున రాయలవారిస్థానమ్మునఁ బ్రవేశించి

యుండునని యూహింపవచ్చును. సాళువతిమ్మరుసుమంత్రియు నీతఁడును సమవయస్కులై యుండురు. వీరిరువురిలో నొకఁడు మంత్రియై యొకఁడు కవియై తన యాస్థానము నలంకరించి తనను గీర్తికాయునిగాఁ జేయుట కృష్ణదేవరాయల యదృష్టమని చెప్పనొప్పును.

పెద్దనార్యుఁడు కర్ణాటప్రభువైన శ్రీకృష్ణదేవరాయల యాస్థాన కవులలోఁ బ్రథముఁడై రాయలచే నమితగౌరవముఁనంది యగ్రహారాదికములను బడసి తాను రచించిన మనుచరిత్రము నాతని కంకితము చేసెను. మనుచరిత్రమును దనకంకితము చేయుమని శ్రీకృష్ణదేవరాయలు తననుఁ గోరినట్లు పెద్దన రచించిన పద్యముల నీక్రిందనిచ్చుచున్నాఁడను.

సీ. ఇందీవరంబుల నీను కాల్గన్నుల
శరదిందుముఖులు చామరము లిడఁగఁ
బణినమానుకణాద బాదరాయణసూత్ర
ఫక్కి విద్వాంసు లుపన్యసింపఁ
బార్శ్వభూమి నభీరుభటకదంబ కరాళ
హేతిచ్ఛటాచ్ఛాయ లిరులుకొనఁగ
సామంతమండనోద్దామ మాణిక్యాంశు
మండలం బొలసి యీరెండఁ గాయ
మూరురాయరగండ పెండారమణిమ
రీచిరింఛోళిఁ గలయ నావృతము లగుచు
నంకపాళి నటద్దుకూలాంచలములు
చిత్రమాంజిష్ఠ విభ్రమశ్రీ వహింప.

క. భువనవిజయాఖ్య సంస
ద్భవనస్థితసింహపీఠిఁ బ్రాజ్ఞులగోష్ఠిం
గవితామధురిమ డెందము
దవులం గొలువుండి సదయత నన్నుఁ బల్కెన్.

తే. సప్తసంతానములలోఁ బ్రశస్తిఁ గాంచి
ఖిలముగాకుండునది ధాత్రిఁ గృతియ కాన

కృతి రచింపుము మాకు శిరీషకుసుమ
పేశలసుధామయోక్తులఁ బెద్దనార్య !

క. హితుఁడవు చతురవచోనిధి
వతుల పురాణాగమేతిహాసకథార్థ
స్మృతియుతుఁడ వాంధ్రకవితా
పితామహుఁడ వెవ్వ రీడు పేర్కొన నీకున్.

క. మనువులలో స్వారోచిష
మనుసంభవ మరయ రసమంచితకథలన్
వినవింపు కలిధ్వంసక
మనఘ భవచ్చతురరచన ననుకూలంబున్.

వ. కావున మార్కండేయపురాణోక్తప్రకారంబునం జెప్పుమని కర్పూర తాంబూలంబు వెట్టినంబట్టి మహాప్రసాదంబని మోదంబున నమ్మహాప్రబంధనిబంధనంబునకుఁ బ్రారంభించితి." కృత్యాది.

ఈయుత్తమప్రబంధకథాసారము నీక్రిందవ్రాయుచున్నాఁడను.

మనుచరిత్రకథకు మూలాధారము మార్కండేయపురాణమని కవి తనగ్రంథమునందు చెప్పుకొనియున్నాఁడు.

ఆర్యావర్తమున నరుణాస్పద మనుపట్టణ మొండు కలదు. అందతిథిపూజాతత్పరుఁడు, దానజపాగ్నిహోత్రపరతంత్రుఁడు, రూపజితమన్మథుఁడు, పరాంగనావిముఖుఁడు. ప్రవరుఁడను విప్రోత్తముఁడుండెను. ఒకనాఁడాతనియింటికి మంత్రౌషధసిద్ధుఁ డొకఁడువచ్చి ప్రసంగవశమునఁ దాసేవించిన పుణ్యక్షేత్రంబులను దీర్థంబులను నందుఁగల విశేషంబుల నేకరువుపెట్టఁ బ్రవరుం డాశ్చర్యవశుండై యాపరదేశిని "అయ్యా ! మీవయసుచూడ నెంతయో లేదు. అల్పకాలమున నిన్ని తీర్థముల నెట్లుసేవింపఁగలిగితి"రని ప్రశ్నింప నాఁతడు దనయొద్ద నొకపాదలేపముండెననియు దానిప్రభావమునఁదలచిన తావునకు మనోవేగమునకంటె నధికవేగమునఁ బోఁగలరని నుడువఁ బ్రవరుఁడట్టిలేపమును దనకిమ్మని ప్రార్థించెను. సిద్ధుఁడుతవసంచిలో దంతపుబరణియందున్న పసరునొకింత ప్రవరునిపాదములకుఁబూసి నీయిష్టము వచ్చిన

చోటకుఁ బోవచ్చుననియెను. కాని పాదలేపరహస్యము నాతనికిఁ జెప్పలేదు.

ప్రవరుఁడును హిమవత్పర్వతమునకుఁ బోవలయునని తలంచినంతన యచ్చోటనుండెను. అందలివిశేషముల నవలోకింపుచు, సంతోషనిమగ్నుఁడై, యిటునిటు తిరుగుచుండెనే కాని యచ్చటి మంచునీటిచేఁ దనపాదలేపము కరఁగిపోవుట నెఱుఁగఁడాయెను. ఇంతలో సూర్యాస్తమయం బాసన్నంబగుట సాయంకాలకృత్యంబుల నిర్వర్తించు సమయంబయ్యెనని స్మృతికిరాఁగా నింటికిసత్వరమే పోవలయునని సంకల్పించుకొనియెను. కాని యాతనికోర్కె సఫలీకృతము కాదయ్యె. పాదలేపము కరఁగిపోయెనని గ్రహించి యిలుసేరు నుపాయంబుఁ గానక నప్పర్వతంబున నటునిటుదిరుగాడుచుండ వరూధినియను నప్సరస యౌవనవతి, జితరూపరతి యతనికిఁ గాన్పించెను ప్రవరుఁడామెను సమీపించి, తనయింటికిఁజేరుమార్గమును దెల్పుమని యడిగెను. వరూథిని మూర్తీభవించిన సౌందర్యరాశియగు ప్రవరునిఁ గాంచి నర్మగర్భంబులగు మాటలాడియు, విలాసచేష్టల నొనర్చియు, దనయభీష్టమును స్పష్టముగ వ్యక్తీకరించియు, గార్యంబుఁగానక నిర్లజ్జయై తుదకాతనిం గౌఁగిలించుకొని యధరం బాసించెను. జితేంద్రియుండగు ప్రవరుండామె నవలందోసి తనయిష్టదైవంబైన నగ్నింబ్రార్థించి యతండొక వారువం బొసంగ దానినధిరోహించి కాలాతిక్రమణంబు గాకుండ నింటికిఁ జేరెను.

వరూథినియు విరహానలతప్తయై ప్రవరునే మనంబుననిల్పి యేమియుందోఁచక యాపర్వతమునఁ గ్రుమ్మరుచుండ నదివఱకామెను మోహించి, యామెచేనిరాకృతుఁడైన గంధర్వకుమారుం డొక్కఁడిది యదననియెంచి, గంధర్వమాయచేఁ బ్రవరరూపధారియై యాసమీపమునఁ గన్పడి, యామెచేతను, నామెచెలికత్తెలచేతను బ్రార్థింపఁబడియుఁ జివాట్లుదినియు నెట్టకేలకు విధిలేకయొడఁబడినట్లంగీకరించి, రతివేళలందామె కనులు దెరువకుండగను (రతిసమయములయందును మరణమొందునపుడును మాయారూపము నిలువక నిజస్వరూపము బయలుపడునని సాంప్రదాయము.) తానామెను సమ్మతింపఁజేసి వెడలి

పోవుటకు నామె దననువిడిచిపోకుండనుండునట్లును సమయమేర్పఱచి యామె యందులకంగీకరింప నామాయాప్రవరుఁడనేక కాలంబామెతో నిష్టోపభోగములనుభవింపుచుండ నామెగర్భవతియయ్యెను. తనయింటి కడఁ దాను లేమింజేసి తనవ్యవహారములన్నియుఁ జెడిపోయెననియుఁ దనతలిదండ్రులు తనకై విలపించుచున్నారనియు నవిచక్కఁ జేసికొని మరలవచ్చెదననియుఁ దెలిపి వరూధినినోడంబఱచి, మాయాప్రవరరూప ధారియగు గంధర్వకుమారుండెందేనిఁజనియె. వరూధిని సుముహూర్తమున నొక్కబాలుని దివ్యతేజోయుతునింగాంచి యాపర్వతంబుననే విడిచి తనలోకమునకుం బోయెను. అచ్చటి మునులాతనింబెంచి పెద్ద వానినిజేసి విద్యాబుద్ధులం గఱపిరి. ఆతని పేరు, స్వరోచి.

స్వరోచి, కళల నభ్యసించి ధనుర్విద్యావిశారదుఁడై యాపర్వతమున విహరింపుచు నొకనాఁ డొకస్త్రీయార్తనాదమును విని యటకుఁ బఱువెత్తిచూడ నొకరాక్షసుఁ డొకకన్యకామణిని మ్రింగివేయ యత్నించుచుండెను. ఆయువతి స్వరోచికడకుఁ బరువెత్తివచ్చి "రాజచంద్ర! నాతండ్రి యిందీవరాక్షుఁడను గంధర్వరాజు నాతల్లి మరుదశ్వుఁ డనుగంధర్వరాజుకూఁతురు. ఒకనాఁడు నేను నాచెలికత్తెలిరువురుతోఁగూడ వనమున విహరించుచునొకచో వికృతాకారమున నున్నయొకమునిం గాంచి, యాతని వదనమును నాచేతితోఁ బట్టుకొంటిని. అందుపై నాతఁడు కోపించి రాక్షసునిచేఁ బట్టువడుమని నాకు శాపమొసంగినాఁడు. అందుల కాతనిని నాచెలికత్తెలు నిందింప రాజయక్ష్మవ్యాధిచేఁ బీడింపఁబడుఁడని వారిని శపించెను వారికిఁ దత్క్షణమే యావ్యాధి యంకురించినది. సదయహృదయా! నాయొద్ద యస్త్రవిద్య యున్నది. దానిని నీవు సంశయింపక గ్రహించి యీరాక్షసుని బారి నుండితప్పింపుము." అనిచెప్పెను. స్వరోచి యప్పుడే యావిద్య నామె కడగ్రహించి, యాదానవునితో ఘోరరణమొనర్చి, యాతనిపై నాగ్నేయాస్త్రముఁ బ్రయోగింపసమకట్టునంతలో నాతఁ డారూపమునువదలి గంధర్వరూపమును ధరించి "మహారాజా! నే నిందీవరాక్షుఁ డనుగంధర్వుఁడను. ఈమె నాపుత్త్రి, నేను నీతల్లికి సోదరుఁడను, ఒకమహర్షి శిష్యుల కాయుర్వేదము నుపదేశించుచుండ నాకుఁగూడ నావిద్య నిమ్మ

నియడిగితిని. కాని యందుల కతఁ డీయకొనలేదు. నేను నాసురీవిద్యచే
నాతనికిఁ గనఁబడకుండ నచ్చటనేయుండి యావిద్య నభ్యసించి, "నీవీ
యకపోయినను నాశక్తిచే నీవిద్య నెఱింగితి'ననియొకప్పు డాతని నపహ
సించితి నందుల కాతఁ డలిగి నీవాసురీవిద్యచే నన్ను వంచించుటయే
కాక నన్నపహసించితివి. కావున నీవు రాక్షసుఁడవు కమ్మని శపించెను.
నే నాతనిపాదములపైఁబడి శాపాంతము ననుగ్రహింపుఁడని వేఁడుకొన
నీతనయను భక్షింపఁబ్రయత్నించునప్పుడు నీకు విముక్తి గలుగునని
యనుగ్రహించెను. "నీయనుగ్రహమున నాశాపము తీరిపోయినది.
ఆయుర్వేదమును నేను నీకిచ్చెదను. దానితోఁగూడ నాతనయను బరిగ్ర
హింపుము." అనిచెప్పి యాయుర్వేదము నుపదేశించి మనోరమ నొ
సంగి పరిణయము చేసెను.

ప్రథమసమాగమ సమయమున దీనాననయై నశ్రుపులంగా
ర్చుచున్న మనోరమను స్వరోచి "మహానందముతో నుండఁదగినయీ
తరుణమున దుఃఖించుటకుఁ గారణంబే"మని యడుగ "నాచెలులు
దారుణరోగపీడితలై దుఃఖించుచుండ నేను సుఖము నెట్లనుభవింపఁగ
లనని యామె ప్రత్యుత్తర మొసంగెను. స్వరోచియామెతోఁగూడ
నాచెలులున్న తావునకుఁ బోయి యాయుర్వేదవిధిని నౌషధసేవ సే
యించి, వారిరుజమాన్పెను.

అందొకరితపేరు విభావసి. మందారుఁ డనువిద్యాధరునితనయ
ఆమెకడ మృగపక్షిజాతులభాష లెల్లఁ దెలియువిద్య కలదు. స్వరోచి
యామెకోర్కెపై నావిద్యతోఁగూడ నామెను బరిగ్రహించెను.

రెండవయామెపేరు కళావతి, ఆమెతండ్రి పారుఁడను బ్రహ్మర్షి.
గొప్పతపశ్శాలి. ఆతనితపస్సునకు భయ మొంది దేవేంద్రుఁ డాతనిత
పోభంగ మొనర్చుటకై పుంజికస్థలయను నప్సరసం బంపెను. బ్రహ్మర్షి
యింద్రియనిగ్రహ మొనర్పఁజాలక యామెతోఁ గ్రీడింప వారికిఁ గళా
వతి జన్మించినది. ఆమెను దేవాపి యనుగంధర్వుఁడు కామించి తనకుఁ
బరిణయము చేయుమని పారునిం గోరెను. కాని యందుల కాతఁ డీ
యకొనలేదు. దేవాపి కోపించి యర్ధరాత్రమునఁ బారునికంఠ

మును గోసివేసెను. కళావతి దిక్కు లేనిదై తండ్రి కగ్నిసంస్కారము లొనర్చి దుఃఖార్తయై యాత్మహత్యచేసికొనుప్రయత్నములో నున్నంతఁ బార్వతి యామె ననుగ్రహించి, యాత్మహత్యా ప్రయత్నమును మాన్పించి పద్మినియనువిద్య నుపదేశించి స్వరోచియను మహాపురుషుఁడు భర్త కాఁగలఁడనిచెప్పెను. స్వరోచి యామెవలన నావిద్యను గ్రహించి యామెను బరిణయ మయ్యెను.

స్వరోచి బహువత్సరము లీముగ్వురితోఁగూడ గ్రీడింపుచుండెను. ఒకనాఁ డొకకలహంసిక యొకచక్రవాకిం జూచి "అనురాగవతులగు ముగ్వురుభార్యలతో నింతకాలము మహాసుఖమనుభవించుచున్న యీస్వరోచియు నీతనిభార్యలును ధన్యాత్ము"లని యుగ్గడింప నాచక్రవాకి బహుభార్యలు గలపురుషునకును, నావనితలకునుగూడ సుఖములేదు. నాపతికి నేనొక్కతనేభార్యను. మాదంపతులకుఁ గల సుఖ మీదంపతులకు లేదు" అని ప్రత్యుత్తరమిచ్చెను. పక్షిభాష నెఱిఁగి యున్నస్వరోచి యామాటలను విని విచారము నొందెను. మఱి కొంతకాలమునకాఁడు లేడిపిండుతోనున్న మగలేడినిస్వరోచి దనభార్యలకుఁ జూపుతఱి నాలేళ్లు ఆయిఱ్ఱికడకువచ్చి తమరతివాంఛ నాయిఱ్ఱి నెరుగమును మూర్కొనుటాదిగాఁ గలచేష్టలచే నెఱింగింప నది "సర్వదా మీతోఁ గ్రీడింప నేను స్వరోచినిగాను, నాభోగేచ్ఛను త్యజించితిని. మీయిచ్ఛవచ్చినకడకుఁ బొండు" అని చెప్పెను. మృగభాష దెలియుట స్వరోచి యాసంభాషణ నెఱింగి చక్రవాకి పలుకులు స్మృతికి రాఁగా వైరాగ్యముఁ నొంది, తనభార్యలయందుఁ గనినముగ్వురుకుమారులకు వేఱువేఱ మూఁడు పట్టణంబులుగట్టియిచ్చి యొకనాఁడు వేఁటకై యడవి కేఁగి యొకవరాహముపై బాణమును వేయుయత్నించుచుండ నాసమీపమున నున్నయొకలేడి "రాజోత్తమా! నిర్హేతుకముగ నావరాహము నేల వధించెదవు? ఆబాణము నాపైఁ బ్రయోగింపు"మనియెను. మృత్యువును గోరుటకు నీకేమి యాపదవచ్చిన'దని రాజు ప్రశ్నింప నాహరిణి

"అన్యసతులయందు నాసక్తుఁడగువాని
దమక మొదవికూడఁ దలఁచుకంటె

మరణమైన మేలు" అనిప్రత్యుత్తరమిచ్చెను. "నీహృదయ మెవ
నిపై నిలిచె"నని రాజు మరలఁబ్రశ్నింప నీమీఁదనే"యని యదిబదులు
నుడువ రాజు "నీవు మృగిని. నేను నరుఁడను. మనకు సాంగత్యమెట్లు
కుదురు" ననియెను. "నీవొకసారి నన్నాలింగనము చేసికొనుము. అం
తియేచాలును." అని లేడియన దయార్ద్రహృదయుఁడగు స్వారోచియా
లేడి నాలింగనము చేసికొనియెను. ఆతనికౌఁగిలిలోనున్న యాహరిణి
యొకదివ్యాంగనయై "నేనీవనదేవతను. మనువు కాఁదగిన యొకమహా
పురుషుని నీవలనం గనుమని దేవతలాజ్ఞాపింప నీకడకీరీతిగవచ్చితిని. నా
యందొక కుమారునిం గని పుణ్యలోకముఁ బడయుము." అని చెప్పెను
అట్లేస్వారోచి యామెయందొక పుత్రునిఁ గనియెను. అతఁడేస్వారోచి
షమనువు. ఆతనికి శ్రీమహావిష్ణువు ప్రత్యక్షమై ద్వితీయమనువువై
ప్రజలఁబాలింపుమనియుఁ దుదిని సాలోక్యము నిచ్చెదననియు నాన
తిచ్చుటతో గ్రంథమును బూర్తిచేసి గ్రంథాంతమున ఫలశ్రుతి నీ
క్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు.

క. కోరిక నీ స్వారోచిషు
చారిత్రము వినిన వ్రాయఁజదివిన ధనదా
న్యారోగ్య పుత్త్రవంతులు
నైరూఢిగఁ గండ్రుపిదప నమరత్వంబున్.

మారనకవి యించుమించుగ నూటయేఁబది పద్యములలోఁ
జెప్పిన యాకథనుబెంచి యెనిమిదివందల పద్యములలోఁజెప్పి పెద్ద
నార్యుఁడీ మహాకావ్యమును రచించినాఁడు. సందర్భోచితముగ సంభా
షణలనుబెంచియుఁ బ్రబంధమునం దుండవలయునని పదునెనిమిదివర్ణ
నములనుజేర్చియు నలంకారసంయుతంబుగఁ గావించి పాఠకుల హృద
యము లుప్పొంగునట్లు రసవంతమై యొప్పారు నిట్టికావ్యమును రచి
యించుటచేతనే యాతనికిఁ గృష్ణరాయ లాంధ్రకవితా పితామహుఁ
డని బిరుద మొసంగియున్నాఁడు.

ఈకవి కాంధ్రకవితాపితామహబిరుదము మనుచరిత్ర రచించు
టకుఁ బూర్వమే వచ్చినట్లు మనుచరిత్రలో నా బిరుదమును వేసికొని

యుండుటవలన నూహింపఁదగియున్నది. కాని యీబిరుదమును గ్రహించుటకుఁ దగినగ్రంథములేవియు నతఁడంతకుపూర్వము రచియించినట్లు కన్పట్టదు. అప్పుడప్పుడు కొన్నిపద్యములు రచించినంతమాత్రమున నట్టిబిరుదమున కాతఁడర్హుఁడై యుండఁడు. కవులు సామాన్యముగా గ్రంథమునంతయు రచించినపిమ్మట గద్యమును కృత్యాదియు వ్రాయుచుండుటప్రసిద్ధము. పెద్దనార్యుఁడును మనుచరిత్రమును రచించినపిమ్మట రాయలది చదివించివిని యాతనికవిత్వమునకు మెచ్చుకొని "ఆంధ్రకవితాపితామహ" బిరుదము నొసంగియుండును. అతఁడు పిమ్మట రచించినకృత్యాదియందును గద్యము నందును, నాబిరుదమును వేసికొనియుండును. పెద్దనార్యుఁడు సంస్కృతమునఁ గొన్నిగ్రంథములు రచించియున్నవాఁడని యంగీకరించినను, ఆంధ్రకవితాపితామహ బిరుదమునకది కారణము కాఁజాలదు. మనుచరిత్రమునకుఁ బూర్వము మఱికొన్ని గ్రంథములు రచించియున్నాఁడని చెప్పుట యూహామాత్రమేకాని యందుల కాధారములేదు మనుచరిత్రమునవట్టి గ్రంథ ప్రస్తావమేమియు లేదు.

మనుచరిత్రకుఁ బూర్వమున నాచనసోముఁడు, శ్రీనాథుఁడు, మొదలగువారు ప్రబంధరీతులను దమగ్రంథములలోఁ జొప్పించిరచించి యున్నారనుటనిజమేయైనను వారురచించినవి కేవలస్వతంత్రగ్రంథములుగాక సంస్కృతగ్రంథముల కాంధ్రీకరణములైయుండెను. అందువారు కొంతస్వాతంత్ర్యమునుగైకొని నూతనమార్గమును జూపియుండిరి. కాని పెద్దనార్యుఁడట్లుగాక మార్కండేయ పురాణమందలి యొకచిన్నకథను దీసికొని దానిని తనస్వకపోలకల్పనలతోఁ బెంచి యొకకావ్యసౌధమును మనోహరముగా నిర్మించి నవీనకవిప్రపంచమునకుఁ బితామహుఁడైనాఁడు. అందులకే యాతనిని శ్రీకృష్ణరాయలు "ఆంధ్రకవిపితామహ!" యని సంబోధించినాఁడు. పెద్దనార్యుని మనుచరిత్రమునకుఁ బిమ్మట నట్టికావ్యములనేకము లాంధ్రభాషయందు వెలువడినవి. కృష్ణరాయలకుఁ బూర్వము పురాణయుగమనియు, నాతనికిఁదరువాతఁ బ్రబంధయుగమనియుఁ బండితులు వాకొనుచున్నారు. కావున నీతనికాంధ్ర

కవితాపితామహబిరుదము మనుచరిత్ర రచనమువలననే వచ్చినదని తలంపవలసియుండును.

ఆంధ్రకవిపితామహబిరుదము నూతనము కాదు. పెద్దనకుఁబూర్వమే శివదేవయ్యకును, కొఱవి భీమకవికిని నీబిరుదముకలదు. పెద్దన తరువాత మట్లఅనంతభూపాలుని యాస్థానకవియగు ఉప్పుగుండూరు వెంకటకవియు నీబిరుదమును గైకొనియుండెను.౧

పెద్దనార్యునికవిత్వము నిరర్గళధారకలది. సమసంస్కృతాంధ్ర పదసంయుత మైనది. లోకోక్తులు పెక్కు లిందు సందర్భోచితముగఁ బ్రయోగింపఁబడినవి. వర్ణనలు స్వాభావికములై యింపుగొలుపుచుండును. పాత్రపోషణమునం దీతనికిఁ గడు నేర్పు కలదు. శ్రీనాథునికవిత్వము ననుకరించిన ట్లచ్చుటచ్చుట నాతనిపద్యములవంటి పద్యములను రచించుటనుబట్టి తెలియుచున్నది.

మనుచరిత్రమునందలి యితివృత్తము, చాలభాగ మస్వాభావిక సంఘటనలపై నాధారపడియున్నది. పాదలేపనమాహాత్మ్యము, అశ్వప్రదానము, మాయారూపధారణము, ఇత్యాను లిందులకు నిదర్శనములు ఇట్లున్నను బాఠకులహృదయము లావంకకుఁ బోవకుండ నరికట్టి తన్మయులై యందలిరసాస్వాదనమున వారిని నిమగ్నులనుగాఁ జేయుటకు పెద్దనార్యుని కవితాసామర్థ్యమే కారణము.

ఏపద్యమును జదివినను రసవంతమై హృదయమున కానందము గల్గించును.

ఈగ్రంథముపైఁ బండితులు విశేషవిమర్శనములను గావించి యందలిభావములను మాధుర్యరసమును దమశక్తికొలఁది లోకమునకు వెల్లడించియున్నారు. ఒకప్పుడు మనువసుచరిత్రలలో నేదియుత్తమమను వాదము బయలుదేరి విమర్శనగ్రంథములు, ఖండనగ్రంథములు, ఖండనాఖండనగ్రంథములు వెలువడినవి. అవి నిష్పాక్షికములు గాక పోవుటచే లోకమున కంతగా నుపయుక్తములు గాకపోయినను, రసగ్రహణపారీణులకుఁ గొంతవఱకు సాహాయ్య మొనర్చినవి.

---

౧ శ్రీ నిడదవోలు వేంకటరావుపంతులు M. A. గారి వ్యాసము. భారతి పార్థివ-ఫాల్గుణము.

మనుచరిత్రమున స్వారోచిషమనువుతో సంబంధించిన చరిత్రము వర్ణితము కాలేదు. స్వారోచి కొతఁడు జన్మించుటకుఁ బూర్వపువృత్తాంతమే యిందు చెప్పఁబడినది అందుచేతనే పెద్దన దీనికి స్వారోచిషమనుసంభవమని పేరుంచి గద్యలయం దట్లువ్రాసియున్నాఁడు సౌకర్యమునకొఱకు మనుచరిత్ర మనినాఁడు

పెద్దనకవితాశైలి తెలియుటకై కొన్ని పద్యముల నీక్రింద నిచ్చుచున్నాఁడను.

మనుచరిత్రము:—

ఉ. ఓచతురాస్య వంశకలశోదధి పూర్ణశశాంక ! తీర్థయా
త్రాచణశీలినై జనపదంబులు పుణ్యనదీనదంబులం
జూచితి నందునందుఁ గలచోద్యములం గనుఁగొంటి నావటీ
రాచల పశ్చిమాచల హిమాచల పూర్వదిశాచలంబులన్ ఆ౧

ఉ. ఇంతలు కన్నులుండఁ దెరువెవ్వరివేడెదు భూసురేంద్ర! యే
కాంతమునందు నున్నజవరాండ్ర నెపంబిడి పల్కరించు లా
గింతియకాక నీవెఱుఁగవే మునువచ్చినత్రోవచొప్పు నీ
కింత భయంబు లే కడుగనెల్లిద మైతిమె మాటలేటికిన్. ఆ౨

ఉ. దానజపాగ్నిహోత్రపరతంత్రుఁడ నేని ; భవత్పదాంబుజ
ధ్యానరతుండ నేనిఁ; బరదారధనాదులఁ గోరనేని ; స
న్మానముతోడ నన్ను సదనంబున నిల్పుమినుండుపశ్చిమాం
భోనిధి లోనఁ గ్రుంకకయమున్న రయంబున హవ్యవాహనా.

ఉ. ఓసరసీరుహాక్షి! వినవో రతిగాఁగిట నీవు చేర్చునిం!
పాసురభర్తకైనఁ గలదా వలదంచుఁ బెనంగ నేమి స
న్న్యాసినె యొక్కటే తమాతమాత్మన సొగ్గదు కేలిపై "ననా
శ్వాసితదుఃఖితే మనసిసర్వమసహ్యా" మనా నెఱుంగవే. ఆ౩

శా. ధీరస్వాంతవు వంత నీకుఁదగునే దివ్యాంగనల్కోవిద
ల్గారే యోగవియోగము ల్సతములే కర్తవ్యముల్సేయరే
పోరే రారె ప్రియంబు గల్గినజనుల్పోవరామి పోఁబోవునే
ఘోరాటండఁగ నేమి కాళ్ళుదెగనే పుల్లాంబుజాతేక్షణా. ఆ౩

ఉ. ఓయి! దయావిహీనమతి! యూరక యీపసిబిడ్డఁ గొట్టఁగాఁ
జేయెటులాడె నీకు నిది చేసినదేమి వృథాశపింతురే
బోయవె యాడుతోడునను బుట్టవె శాపనిమిత్తమే తపం
బీయెడనున్న శాంతిపరు లేమనువారిఁక నీచరిత్రికున్. ఆర.

చ. అలికులవేణి యొక్కతె రతాంతమునం దనయంగవల్లికం
బులకలు చొక్కులేఁజెమరు పుట్టఁగ నేఁగి నరేంద్రుఁజూడ నా
పులకలు చొక్కులేఁజెమరు వోవక యట్లనయుండెనిట్టి దాఁ
జెలువగువానిఁ గన్గొనినఁ జెల్వకుఁ జూపులుగా వెకూటముల్.

చ. బరువన కింతులం దనకుఁబల్వురఁ గూర్చుట భోగవాంఛ గా
కరయఁగ నొందుగాదు ధనమన్న ధ్రువంబుగ సంగనాజనో
త్కరసము వార్త్రితం బటులుగావున పీనికి లేదిహాంబునుం
బరమును నన్ను నట్లఁబఱుపం బనిలేదిది చెప్పనేటికిన్. ఆఇ.

ఆంధ్రకవితాపితామహుఁడైన యీ పెద్దనామాత్యుఁడు హరికథాసార మనునొక కావ్యమును రచియించెనని లాక్షణికు లగుకవులు తమగ్రంథములయందుదాహరించిన లక్ష్యములవలనఁ దెలియుచున్నది. హరికథాసార మిప్పు డెచ్చటను లభించుట లేదు. లక్షణగ్రంథములలో నుదాహృతములైన పద్యముల నీక్రింద వ్రాయుచున్నాఁడను.

క. అంబరము వగుల నార్చి వ్రి
లంబాసురుఁ డాగ్రహము వెలయఁ గదిరిన వే
ళం బలరాముడు చేముస
లంబున వానితలఁ ద్రుంచె లావు మెఱయఁగన్.

క. ఆదేవోత్తముఁడు సుధాం
బోధివటైకాగ్రినుదళమున బాలుండై
చేదోయిచేత దక్షిణ
పాదముఁ గొని నోటఁ జేపెఁ బకపకనగుచున్.

క. తెంపరియై మదియింతచ
లింపక వనిలోనఁ దెగియె నెవ్వాఁ డతఁడు నై

లింపసభనుండు ననుఁడు బ
దంపడి యార్యులు వచింపఁ దా నిట్లనియెన్.

క. శరకోపయతికి ఖలతరు
కుఠారరూపమతికి శఠగురుసుతవ్యాతక-
ర్మరసనిరతికిఁ జతురాగమ
పఠనాయతనియతికి యజపాధికభృతికిన్.

గీ. అఖిలపారికాంక్షి కాశ్రియపర్ణశా
లోపకంఠమునకు లోకకర్త
చేర నేఁగి యచట వారువంబును డిగ్గి
యధివసించియుండు నట్టియెడను.

క. శయధృతఫణివలయ! భవా
వ్యయవిహిత విశుద్ధసంవిదాత్మక! మాయా
మయ! నానావిధలీలో
దయ! సదయకటాక్ష శైలతనయాధ్యక్షా!

క. బాలరసాలకిసాలముఁ
గ్రోలుచుఁ బలికెడిపికంబు క్రోయనఁ జాలా
జాలిపడి యానయతిమధు
రాలాపముల ననియె నాదరణమున వినఁగన్.

ఈపద్యము లనుబట్టి యిందుఁజెప్ప బడినకథ లేవియో స్పష్టము గాఁ దెలియుట లేదు. శ్రీమహావిష్ణుని యిరువదియొక యవతారముల తో సంబంధించినకథ లిందు వర్ణితములై యుండనోపు.

కృష్ణదేవరాయ లొకనాఁడు కవిపండితసభలో బంగారు పెండె రము నొకపళ్ళెరమున నునిచి సంస్కృతాంధ్రములయందు సమానము గా నాశుకవిత్వమును జెప్పఁగలిగినవా రీపెండారమునుగ్రహింప నర్హు లని యానతీయఁ బెద్దనార్యుఁడులేచి యీక్రింది యుత్పలమాలికను జెప్పెనఁట!

ఉ. పూఁతమెఱుంగులున్ బిసరుపూపబెడంగులుఁ జూపునట్టి వా
కైతలు జగ్గునిగ్గు నెనగావలెఁ గమ్మన కమ్మనన్వలెన్

రాతిరియున్ బవల్ మఱపురాని హొయల్ చెలియూరజంపు ని
ద్దాతరి తీపులంబలెను దారసిలన్వలె లోఁదలంచినన్
బ్బాతిగఁ బైకొనన్వలెను బైదలికుత్తుకలోని పల్లటీ
కూఁతలనన్వలెన్ సొగసుకోర్కులు రావలె నాఁకించినన్
జేతికొలందిఁ గౌఁగిటను జేర్చినఁ గన్నియచిన్నిపొన్ని మే
ల్మ్యాంతల చన్నదోయివలె ముచ్చటగావలెఁ బట్టిచూచినన్
డాతొడ నున్నమిన్నుల మిటారపు ముద్దులగుమ్మ కమ్మనౌ
వాతెఱ దొండపండువలె వాచవిగావలెఁ బంటనూఁదినన్
గాతలఁదమ్మిచూలిదొర కైవసపుం జవరాలిసిబ్బెపు
న్మేతెలియుబ్బురంపు జిగి నిబ్బరపుబ్బగు గబ్బిగుబ్బ పొం
బూఁతల నున్నకాయ పరిపోఁడిమి కిన్నెరమెట్లబంతి సం
గాతపు సన్నబంతి బయకారపుఁ గన్నడగౌళపంతు కా
సాతత తానతానల పసందిపుటూడెడుగోట మీటుబల్
మ్రోఁతలునుం బలెన్ హొరువు మొల్లముగావలెనచ్చతెన్గు లీ
రీతిగ సంస్కృతంబు పచరించినపట్టున భారతీవధూ
టీతపనీయ గర్భనికటీభవదానన పర్వసాహితీ
భాతికనాటకప్రకర భారతభారతసమ్మత ప్రభా
శీతనగాత్మజా గిరిశశేఖర శీతమయూఖ రేఖికా
పాతసుధాప్రవూరజవాలుభంగ ఘుమంఘుమఘుంఘుమార్భటీ
జాతశతాళియుగ్మలయసంగతి చుంచువిపంచికా మృదం
గాతత తేహితత్తహిత హాధిత దంధణుధాణుధిం ధిమి
వ్రాత నయానుకూలపద వారకుహూద్వహ హారికింకిణీ
నూతన ఘల్ఘలాచరణ నూపురఝాళఝళీ మరందసం
ఘాతవిశుద్ధనీచకచకద్విశచోత్పల సారసంగ్రహా
యాత కుమారగంధవహ హారిసుగంధవిలాసయుక్తమై
చేతము చల్లఁ జేయువలె జిల్లునఁజల్లవలె న్మనోహర
ద్యోతక గోస్తనీఫల మధుప్రవ గోఘృత పాయస ప్రసా
రాతిరస ప్రసార రుచిరప్రతిమంబుగ సారెసారెకున్

ఆంధ్రసంస్కృతములయందుఁ గవిత్వమెట్లుండవలయునో సూచించుచు

జెప్పిన యీయుత్పలమాలికను విని పరమానందభరితుఁడై రాయలా గండపెండేరమును తాను స్వయముగఁ గవిపాదమునఁ దొడిగెనఁట !

పెద్దనార్యునియెడలఁ గృష్ణరాయలు మిగులగౌరవము గలిగి యుండెడివాఁడు. పెద్దనార్యుఁడును దనరచనములచే రాయలను మెప్పించుచు, నాతనియెడ వినయమ్ముంటెఁ జనవు నెక్కువగాఁ గలవాఁడై యాతఁడు చెప్పుమనినప్పుడుగాక, తనయిష్టమువచ్చినప్పుడు మాత్రమే కవిత్వముచెప్పు స్వాతంత్ర్యముఁగలవాఁడై యుండెను. రాయలొకప్పు డొకకృతి చెప్పుమని వేఁడగా నీక్రిందిపద్యముఁ జెప్పెనఁట.

చ. నిరుపహతిస్థలంబు రమణీప్రియదూతిక తెచ్చియిచ్చు క
    ప్పురవిడె మాత్మ కింపయినభోజన ముయ్యెలమంచ మొప్పుత
    ప్పరయు రసజ్ఞు లూహ తెలియంగలలేఖక పాఠకోత్తముల్
    దొరకినఁగాక యూరక కృతుల్ రచియింపు మటన్న శక్యమే.

ఈకవి కృష్ణరాయలయనంతరమున గొంతకాలము జీవించియుండెను. రాయలమరణమున కీతఁడు దుఃఖించుచు వ్రాసిన యీక్రింది పద్యము మిగులజాలిని కల్గించునదిగానున్నది. మఱియు రాయలీతని యందెంత గౌరవముఁ జూపుచుండినదియు నీపద్యమువలనఁ దెలియును.

సీ. ఎదురైనచోఁ దనమదకరీంద్రము డిగ్గి
        కే లూఁత యొసఁగి యెక్కించుకొనియె
    మనుచరిత్రం బందుకొనువేళఁ బురమేఁగఁ
        బల్లకి తనకేలఁ బట్టియెత్తె
    బిరుదైన కవిగండపెండేరమున కీవె
        తగుదని తానె పాదమునఁ దొడిగెఁ
    గోకటగ్రామాద్య నేకాగ్రహారము
        లడిగినసీమల యందు నిచ్చె
    నాంధ్రకవితాపితామహ! యల్లసాని
    పెద్దనకవీంద్ర! యనినన్నుఁ బిలుచునట్టి
    కృష్ణరాయలతో దివి కేఁగలేక
    బ్రదికియుండితి జీవచ్ఛవంబ నగుచు

కృష్ణదేవరాయ లిహలోకమును వీడిపోవగనే సమయమును వేచియున్న యాతనిమామయు శత్రువునగు గజపతి దండెత్తివచ్చి కృష్ణరాయల శవమును దహనముచేయకుండ నాటంకముఁజేయ యత్నించెననియు నప్పుడు పెద్దనార్యుఁ డీక్రిందిపద్యమును వ్రాసి పంపఁగా నతఁడు లజ్జనొంది వెనుకకు మరలిపోయెననియుఁ జెప్పుదురు.

సీ. రాయరావుతుగండ రాచయేనుఁగు వచ్చి
యారట్లకోటఁ గోరాడునాఁడు
సంపెట నరపాలసార్వభౌముఁడు వచ్చి
సింహాద్రి జయశిలఁ జేర్చునాఁడు
సెలగోలుసింహంబు చేరి ధిక్కృతిఁ గంచు
తల్పులఁ గరుల డీకొల్పునాఁడు
ఘనతర నిర్భరగండపెండెర మిచ్చి
కూఁతు రాయలకును గూర్చునాఁడు
నొడలెఱుంగవో చచ్చితో యుర్వి లేవో
చేరఁజాలక తలచెడి జీర్ణమైతొ
కన్నడం బెట్లు చొచ్చెదు గజపతీంద్ర
తెఱచినిలు కుక్కచొచ్చిన తెఱఁగు తోఁప.

రాయలు విజయనగరమునఁ జనిపోయియుండెననియు, శవదహనము చనిపోయిన యొకదినములోపున జరుగుననియుఁ దలంచుట సహజము. గజపతి కటకమునుండి లేక గజపతి యధీనమునందున్న ప్రదేశమునుండి విజయనగరమునకు వచ్చుట కొకదినములోపలసాధ్యముకాదు, కావున శవదహనము కాకుండ నాపుట కాతఁడు యత్నించెనని తలంపరాదు. చనిపోయిన కొన్నిదినములకు విజయనగరము నాక్రమించుటకై గజపతి ప్రయత్నించియుండుననియు నప్పుడీపద్యమును బెద్దన రచియించియుండుననియుఁ దలంపవచ్చును. గర్భశత్రువైన గజపతి రాయలు చనిపోవగనే కర్ణాటకముపై దండెత్తివచ్చుట పెద్దనహృదయమున కమితవేదనను గలిగించియుండును. ఈపద్యమునందలి మూఁడు నాలుగు పాదములు రాయలు కటకముపైఁ బ్రత్యేకముగ దండయాత్ర సాగించలేదను వాదమును బూర్వపక్షము చేయుచున్నవి.

ఈకవి కవిత్వముండవలసినరీతిని గూర్చి యీాసవృగా

చ. ఘనతర ఘూర్జరీకుచయుగ క్రియ గూఢము గాక ద్రావిడీ
స్తనగతిఁ దేటగాక యరచాటగు నాంధ్రవధూటి చొక్కపుం
జనుఁగవలీల గూఢతయుఁ జాటుతనంబును లేకయుండఁ జె
ప్పిన యదె పో కవిత్వమనిపించు నగిం చటుగాకయుండినన్.

అనుపద్యమును జెప్పెనందురు. కాని యది సత్యము కాదు. ఈపద్యము బైచరాజు వెంకటనాథకవి కృతమగు పంచతంత్రమునం గానవచ్చు చున్నది. ఈపద్యమున కీభావముతోడనే మాఱుపద్యమొకటి కవిజీవిత ములలో నుదాహృతమైనది. దానినెవరురచించిరో తెలియదు. బహుశః శ్రీరామమూర్తి పంతులుగారిదేమో!

ఉ. అఱవల చన్నులంబలె బయల్పడనీయక ఘూర్జరాంగ నా
గురుకుచయుగ్మముం బలె నిగూఢము కాక తెనుంగు దేశపుం
గరితల చన్నులంబలె నొకానొకయించుక గానుపించినన్
సరసులు మెత్తురక్కవిత చందము నందముగా జగంబునన్.

రాయలొకనాఁడు తామరాకుపై నుండునీటి బిందువును, గుక్కటమును వరాహమును దిరస్కరించుచుఁ బద్యములను జెప్పుఁడని ముక్కుతిమ్మ నను, బెద్దనార్యుని, బట్టుమూర్తిని గోరఁగా వారీదిగువ పద్యములను జెప్పిరఁట.

ఉ. స్థానవిశేషమాత్రమునఁ దామరపాకున నీటిబొట్టు! నిన్
బూనిక ముక్తికంబనుచుఁ బోల్చినమాత్రన గర్వమేటికిన్
మానవతీశిఖామణుల మాలికలందును గూర్పవత్తువో
కానుకలీయ వత్తువొవికాసముఁ దెత్తువొ మేలుదెత్తువో!

ముక్కుతిమ్మన

శా. రంతుల్మానుము కుక్కుటాధమ! ధరిద్రక్షుద్రశూద్రాంగణ
ప్రాంతోలూఖలమూలతండులకణగ్రాసంబుచేఁ గ్రొవ్విదు
ర్ధ్వాంతాభీలవిశేషభీషణ ఫణాంతర్మాంస సంతోషిత
స్వాంతుండైన ఖగేంద్రకట్టెదుట నీజంఝూటము ల్సాగునే.

పెద్దనార్యుఁడు

ఉ. తక్కక నేల ముట్టికొని త్రివ్వఁగనేర్తు నటంచు దాఁకు తా
నొక్కటె జాతియంచు ముదమొందకు బుద్ధిని వెఱ్ఱిపంది! నీ
వెక్కడ యాదిఘోణి యన నెక్కడ నద్రిసముద్రముద్గ దూ
ర్భాకుతలంబు నొక్కయరపంటనె మింటికి నెత్త నేర్తువే?

బట్టుమూర్తి.

బట్టుమూర్తి (రామరాజ భూషణుఁడు) రాయల కాలములో నున్నట్టు గాన్పింపదు. ఆవిషయమునుగూర్చి యాతని చరిత్రమున వ్రాయుదును. ఈకడపటిపద్యము రాయల యాస్థానదిగ్గజకవులలో మఱి యెవ్వరైన రచియించియుందురు.

పెద్దనార్యుని వలియెడిచాటుధారలింకను జాలగలవు. ఈతనిని గూర్చిన కథలును బెక్కులున్నవి. అవియన్నియు సత్యములని చెప్ప లేము కావున వాని నిందు వదలివైచితిని. రాయలయాస్థానమున కరుదెంచిన కవులకీతఁడే సమస్యలనిచ్చి పరీక్షించెడివాఁడట! చింతలపూడి యెల్లయకిచ్చిన సమస్యలను వానిపూరణముల నాతనిచరిత్రమునవ్రాసెదను. ఆంధ్రపద్యములలో నన్యభాషాపదములను జేర్చుట కీతఁడే మొదటివాఁడు. అట్టిపద్యము నొకదాని నీక్రింద నిచ్చెదను.

మ. రాయగ్రామణి! కృష్ణరాయ! భవదుగ్ర క్రూరఖడ్గాహిచేఁ
గాయం బూడ్చి కళింగదేశనృపతుల్ కానిర్ఝరీపోషణీ
మాయాభీకు ముటాకులోటుకుపాటూమామాయాసటాజాహిరే
మాయాగ్గేయ మడే యటంద్రు దివి రంభాజానునిన్ యక్షునిన్.

పెద్దనార్యుఁడు రామస్తవరాజము, అద్వైతసిద్ధాంతము, నను రెండు కావ్యములు రచియించియుండె ననియు, రాయల నిర్యాణకాలమున కఱువదియేండ్లవాఁ డయిన పెద్దన ౭౦ సంవత్సరముల వయసునఁ జని పోయెననియుఁ గావలి వెంకటరామస్వామిగారు వ్రాసియున్నారు. ఆకావ్యము లిప్పుడెచ్చటను గానవచ్చుట లేదు.

కృష్ణరాయల యనంతరమునఁ జెప్పినపద్యములోఁ "గోకటగ్రామాద్యనేకాగ్రహారము"లని పెద్దనచెప్పియుండెను. కాని కోకటము తప్ప మిగిలినయగ్రహారము లపేరులు తెలియ లేదు. వానితోసంబంధించిన శాసనములును లభింప లేదు. పెద్దనార్యుఁడుచేసిన దానములను

దెలుపు శాసనములు మూఁడులభించినవి. వానిని విజ్ఞానసర్వస్వము౧ నుండి గైకొని యీక్రిందనిచ్చుచున్నాఁడను.

(౧) కోకటము ౧ వ శాసనము:—"శుభమస్తు. స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౪౦ అగు నేటి బహుధాన్యనామసంవత్సర వైశాఖ శు ౧౫ లు శ్రీ మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీకృష్ణదేవమహారాయరు పృథివిరాజ్యం చేయుచుండగాను అళసాని చొక్కరాజుగారి కొమారుడు పెద్దయ్యంగారు కోకటం సకలనాథుని లింగానకు ఇచ్చిన భూదాన ధర్మశాసనము. శ్రీకృష్ణదేవరాయ మహారాయరు మాకున్ను ఘండికోటశీమలోను వుంబళికిన్ని పాలించినవధరించిన కోకటగ్రామమందును సకళేశ్వరదేవుని నైవేద్యానకున్ను దీపారాధనకున్నుగాను మమ్మడాజుకుంటకు దక్షిణం కాంచిమట్టస్థానకు నైరుతిమూలను వాంగుకు వుత్తరాన ఖ ౧॥౦ న్ను ఆదక్షిణం చాకంవారికుంటకు వుత్తరం ఖం॥౦న్ను వుభయం చేను ౨కే నైవేద్యానకుసమర్పించినచేను ఖ ౧ దేవునిసన్నిధిని నందాదీపాలు ౨కిన్ని సమర్పించినచేను ఖ ౧ వుభయం చేను ఖ౨ యీయిరువుట్టిచేనున్నూ సర్వమాన్యంగాను కృష్ణాతీరమందునను బెజవాడ మల్లిఖార్జునిదేవునిసన్నిధిని సోమగ్రహణపుణ్యకాలమందున సహిరణ్యోదకదానధారాపూర్వకంగాను ధారవోసియి స్తిమి: ఆచంద్రార్కస్థాయిగాను అనుభవించేది. యీధర్మానకు యవ్వరు రెండుతలంచినాను తమతల్లితండ్రులను గోబ్రాహ్మణులను గంగాతీరమందున వధించినపాపాన బోవువారు"

(౨) కోకటము ౨ వ శాసనము. దీనిపూర్తియైన నకలులేదు. ఈక్రిందివిధముగ నున్నది. "ఈశకసంవత్సరములో యీ కవీశ్వరుఁడే కార్తీక శు౧౨లు కోకటము చెన్నకేశవపెరుమాళ్లకు అల్లసాని చొక్కయ్యంగారిపుత్రుండు పెద్దయ్యంగారుయిచ్చిన భూదానశాసన క్రమమెట్లన్నను, "కృష్ణదేవరాయులు ఘండికోటసీమలోను, మాకువుంబళి

౧ సంపుటము 3 పుట ౧౬3౮.

గా౧ నీయనవధరించిన కోకటానను దేవుని నైవేద్యమునకును దీపారాధ నమునకును మేము ఉత్థానద్వాదశి పుణ్యకాలమందు సమర్పించినచో చర్మం చేను ఖర. అనివ్రాసియున్నది.

(3) అన్నూరుశాసనము. "స్వస్తి శ్రీమన్ రాజాధిరాజ రాజ పరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీకృష్ణదేవరాయమహారాయలు పృథ్వీసామ్రాజ్యము సేయుచుండగాను స్వస్తి శ్రీవిజయాభ్యుదయ శాలివాహన శక స ౧౪౪౨ అగు నేటి ప్రమాదిసంవత్సర కార్తిక శు.౧౨ భా సోమోపరాగ పుణ్యకాలమందు శ్రీమతువసిష్ఠగోత్ర ఆశ్వలాయనసూత్రం ఋక్శాఖాధ్యాయులయిన అల్లసాని చొక్కరాజుగారిపుత్రులయిన ఆంధ్రకవితాపితామహులయిన పెద్దిరాజుగారు శ్రీకృష్ణమహాదేవరాయలు తమకు నాయంకరానకుపాలించిన కలివాచి సీములోని అన్నూరిగ్రామమందు కృతల నాగరాజుగారు కటించి నిలువవద్ద వరదరాజ పెరుమాళ్లునగరు కడుమానుకట్టించి వరదరాజపెరుమాళ్లును నాచిమార్లును ప్రతిష్ఠచేయించి ఆ పెరుమాళ్లకు అంగరంగవ ఇభవాలకును నిత్య నైవేద్యాలకును దీపారాధనకును గాను సమర్పించిన భూదాన ధర్మశాసనక్రమమెట్లన్నను మాకు నాయంకరానకు (నాయఁకరము = నాయకత్వము అని శబ్దరత్నాకరము. పెద్దన కలివాచిశీమకు అధికారి. ఒకసీమకు అధికారియనిన నిప్పటికలెక్టరుతోఁ బోల్పఁదగిన యధికారమని చెప్పనొప్పును. అన్నూరు దక్షిణార్కాడుజిల్లా లోనిది. పెద్దనపుట్టినది బళ్లారిజిల్లా. అగ్రహారము సంపాదించినది కడపజిల్లా. ఉద్యోగముచేసినది బళ్లారిజిల్లా. వి. స. ౧౬౩౭ పుట] చెల్లేశలివాచి సీమలోని అన్నూరిగ్రామమందు......వరదరాజపురమున్న అష్టభోగ తేజస్వామ్యసహితముగాను సహిరణ్యోదకదానపూర్వకముగాను ఈ సోమోపరాగపుణ్యకాలమందు త్రివాచకముగాను సమర్పస్తిమి."

పెద్దనార్యుఁడు పినాకినినుండి కోకటమున కొక కాలువత్రవ్వించి నట్లు కోకటం కైఫీయతులోని యీక్రింది వాక్యమువలనఁ దెలియుచున్నది. "ఈకాలువపూర్వం అల్లసానిపెద్దన కవీశ్వరుఁడు బ్రాహ్మణులకు అగ్రహారంచేసి యిచ్చినప్పుడు త్రవ్వించినాఁడు.౨"

౧ వుంబళియనఁగా, 'దుంబాలా' యని యర్థమైనట్లు తోఁచుచున్నది.
౨. ఆం. వి. స. ౧౬౩౭ పుట

పెద్దన కోకటగ్రామమును వైష్ణవుల కగ్రహారముగా నిచ్చెనని కోకటము కైఫియ్యతునందున్నది. పైశాసనములలో నావిషయము గన్పట్టదు. శివకేశవులకుఁ గొంతభూమి యిచ్చినట్లుమాత్రమే కలదు. తరువాత మఱెవ్వఁడైన గ్రామమంతయు బ్రాహ్మణుల కిచ్చియుండ నేమో !

కోకటశాసనములలో నాంధ్రకవితాపితామహాబిరుద ముదాహృతము కాలేదు. అన్నూరుశాసనమున నాబిరుదమున్నది. అందుచే బహుధాన్య సంవత్సర కార్తిక శు ౧౨ లకును, ప్రమాది సంవత్సర కార్తిక శు ౧౫ కును నడుమ ననఁగా క్రీ. శ. ౧౫౧౮–౧౯ లో రాయలీబిరుదమును పెద్దనకుఁ బ్రసాదించియుండును.

కోకటము కడపమండలమునఁ బ్రొద్దుటూరు తాలూకాలోఁ గాశీరామేశ్వరములకుఁబోవు గొప్పబాటప్రక్కనున్నది. కోకటగ్రామమున శా. శ. ౧౫౧౧ శా. శ. సంవత్సరములలోని శాసనములు మఱిరెండు కలవు. ౧

పెద్దనార్యుఁడు వైష్ణవశిష్యుఁడైనను, విశిష్టాద్వైత మతానుయాయి యగు ప్రభునాస్థానమునఁ గవిగానున్నను శివకేశవులయెడల సమాన భక్తిగలస్మార్తుఁడును, నద్వైతియునైన ట్లీతని మనుచరిత్రమందలి పద్యములును గోకటమందలి సకలేశ్వరుని కర్పించిన దానశాసనమును జెప్పుచున్నవి.

ఇతఁడు కేవలకవియే గాకుండ రాజకార్య నిర్వహణమునందు రాయలకు హితోపదేశముచేయు మంత్రిగను నాయంకరముచేయు నుద్యోగిగను నుండెడివాఁడు. పెద్దనార్యునితండ్రి చొక్కయ్యకూడ లౌకికవ్యవహార దక్షుఁడైనట్లమాత్య శబ్దమువలనఁ దెలియుచున్నది.

మనుచరిత్రకృతి ప్రదానకాలమును రాయలచారిత్రమునఁ దెలిపియుంటిని. ఇతఁడచ్యుతరాయల యాస్థానమునందున్నట్లా ధారములు లేవు. కృష్ణరాయల యనంతరమునందుఁ గొన్నినాళ్ళున్నాఁడు. కావున క్రీ. శ. ౧౫౩౩ ప్రాంతమునం దీతఁడు చనిపోయియుండును. చనిపోవు

౧. A. R. 714 of 1926; 717 of 1926.

నప్పటికిఁ బెద్దనార్యుని వయసు దాదాపు డెబ్బదిసంవత్సరములుండునని యనుకొనవచ్చును.

అళియరామరాయ లొక వేశ్యను దీసికొనివచ్చి యామెపైనొక పద్యమును జెప్పుమనికోరఁగా నీక్రిందిపద్యమును జెప్పెనని యందురు. కాని యది సత్యమనుట కాధారము లేదు.

"చ. పడిగము తమ్మలం బుమియువల్లనకోటికి నోరు; వేణియం
గడిసవరంబు; సంతసారకాయ లురోజము; లిచ్చలచ్చసా
వడియొడ; లూరువుల్ గవనివాతియనంటులు; మోవియొడ్డిగి
జ్జడి; వెలయాలిజీవనము జీవనమే యది యెంచిచూచినన్"

కవిజీవితములు పుట ౧౭౫

"ఖలము గాకుండునది ధాత్రి కృతియె"యనిచెప్పి యందుల కనుగుణముగ నొకమహాకావ్యమును రచించి తనకీర్తియుఁ గృష్ణరాయల యశస్సును నాచంద్రార్కము జిరస్థాయిగావించిన పెద్దనార్యుఁడు ధన్యాత్ముఁడు ధన్యాత్ముడు. ధన్యాత్ముఁడు.

---

## 98. మాదయ్యగారి మల్లన్న

ఈతనిగృహనామమేదియో మనకుఁ దెలియదు. ఈతని నివాస గ్రామమున్న మఱికొందఱు మల్లన్న లుండుటనుబట్టియో ప్రౌఢకవి మల్లన్న మొదలుగా మఱికొందరు మల్లన్నలు కవులలో నుండుటను బట్టియో యితనిని తండ్రితోఁగూడఁ జేర్చి మాదయ్యగారిమల్లన్నయని యనుచున్నారు. ఈతఁడు రాజశేఖరచరిత్ర మనుమూఁడాశ్వాసముల ప్రౌఢప్రబంధమును రచించి నాదిండ్లయప్పయామాత్యున కంకితము చేసెను.

కృతిపతి తననుగూర్చి పలికిన ట్లీక్రిందిపద్యములను గవి రచించి యున్నాఁడు.

క. పేరోలగ ముండి కవి
త్వారూఢవిశేషగోష్ఠి నాలించుతమిని
రా రమ్మని సన్నుఁ బిలిచి సు
ధారసమధురోక్తిఁ బలికెఁ దద్దయుఁ బ్రీతిన్.

ఉ. శంకరపాదసేవనవ శంవదమానస పంకజాత ని
శ్శంకవచో విలాసరుచిసారవినిర్జిత పూర్ణపూర్ణిమా
శాంక! దురక్షరాననభయంకర! శౌనకగోత్రపాత్ర! య
య్యంకి పురాగ్రహారవిభవాకర! మాదయమల్లసత్కవీ!

క. నీ విపుడు చెప్పఁదలఁచిన
భావరసోద్యన్మహాప్రబంధము నాపైఁ
గావింపు మంకితంబుగఁ
గోవిదహృదయ ప్రమోదగుంఫితఫణితిన్.

పైపద్యమునుబట్టి కవి అయ్యంకి పురాగ్రహారవిభవాకరుఁడని యు, శౌనకగోత్రుఁడనియుఁ దెలియుచున్నది. ఈక్రిందనుదాహరించిన గ్రంథాంతగద్యవలన నీకవి యఘోరశివశిష్యుఁడనియు, మాదయామాత్యపుత్త్రుఁడనియు గ్రహింపనగును.

"ఇది శ్రీమదఘోరశివాచార్య గురుకరుణా విశేషలబ్దసార స్వత మాదయామాత్యపుత్ర మల్లయనామధేయప్రణీతం బైన రాజశేఖరచరిత్రం బనుమహాప్రబంధంబు"

తండ్రి కమాత్యశబ్దమును జేర్చుటచే నీతఁడు నియోగిబ్రాహ్మణుఁ డని నిశ్చయింపవచ్చును. అయ్యంకి యగ్రహారనేతయగుటచే నీతనినివాసము కృష్ణామండలములోని అయ్యంకి యని తలంపవచ్చును. ఈతనిగృహనామము 'అయ్యంకి' యని నాయభిప్రాయము. తురగా రామకవితోఁ గలిసినాగరఖండమును రచించిన, అయ్యంకిబాలసరస్వతి శౌనకగోత్రజుఁడు. ఈమల్లనకవియు శౌనకగోత్రుఁడు. కావున నీతఁడయ్యంకిమల్లన యయియుండునని తలంచుచున్నాఁడను. ఇతఁడు వైదికబ్రాహ్మణుఁడని శ్రీవీరేశలింగముపంతులుగారు వ్రాసియున్నారు. కాని యితఁడు వీరశైవుఁడు కాఁడు. సామాన్యముగా శైవబ్రాహ్మణు

ఁని పిలువఁబడిమెడి శివార్చకుఁడును గాఁడు ఈశ్వర ధ్యానాసక్తుఁడగునియోగిబ్రాహ్మణుఁడు. ఇతఁడు వీరశైవుఁడు కాఁడనట కితఁడు రచించిన రాజశేఖర చరిత్రమందలి శ్రీవెంకటేశ్వరస్తుత్యాత్మక మగు మొదలిపద్యమే నిదర్శనము.

ఈతఁ డఘోరశివగురుని యనుగ్రహముచే విద్యనార్జించినట్లు గద్యవలనఁ దెలియుచున్నది, అఘోరశివగురుఁడు విద్యాగురువే కాని దీక్షాగురువుకాఁడు. కావున గురువునుబట్టి మల్లన వీరశైవుఁడని తలంప రాదు.

కడపమండలములోని కడపతాలూకాయందలి పుష్పగిరి యను గ్రామమున నఘోరశివాచార్యునిశాసనములు రెండు కన్పించుచున్నవి. మొదటిది శా. శ. ౧౪౭౩ దుర్మతిసంవత్సరములోనిది ౧ రెండవది శా. శ. ౧౪౬౩ ప్లవసంవత్సరములోనిది.౨ అఘోరశివగురుఁడు క్రీ. శ. ౧౪౪౫ ప్రాంతమున జన్మించి తొంబదియేండ్లు జీవించి యుండినట్లు కన్పట్టుచున్నది. ఈశాసనములనుబట్టి యీశివగురుఁడు కడపమండలమువాఁడని నిర్ణయింపఁదగియున్నది.

వరాహపురాణాదికృతులను రచించిననందిమల్లయ ఘంటసింగయకవులలో సింగయకవియు, నాతని మేనల్లుఁడును పారిజాతాపహరణకర్తయు నైనముక్కుతిమ్మనయు నీమాదయగారి మల్లనయు నఘోరశివగురునిశిష్యులు. ఘంటసింగయకవి క్రీ. శ. ౧౪౮౦ ప్రాంతమునఁ బ్రబోధచంద్రోదయమును ౧౫౧౦ ప్రాంతమున వరాహపురాణమును రచియించియుండెనని యాతనిచరిత్రమున వ్రాసియుంటిని.

సింగయకవి, ౧౪౫౦ ప్రాంతమున జన్మించి, తనకంటెఁ బదునైదేండ్లు పెద్దవాఁడైన యఘోరశివగురునియొద్ద శిష్యుఁడై ౨౦-౨౫ సంవత్సరముల వయసునఁ దన మేనమామతోఁగూడ ప్రబోధచంద్రోదయమును రచించియుండునని తలంపవలసియున్నది.

---

౧ A. R. 307 of 1905

౨ A. R. 303 of 1905

అఘోరశివగురుఁడు, రామానుజాచార్యునిపోలిక, వేదాంతదేశికునిరీతి, అన్నయాచార్యునివలె, నూఱేఁడ్లు జీవించినట్లు కన్పట్టుచున్నది. పైశాసనకర్త లిరువురును భిన్నవ్యక్తు లనుట కవకాశములు లేవు.

ఈమాదయగారిమల్లన క్రీ. శ ౧౪౭౦ ప్రాంతమున జన్మించి ౧౪౯౫ ప్రాంతమున నఘోరశివగురునిశిష్యుఁడై ముప్పది-ముప్పదియైదేండ్లవయసున రాజశేఖరచరిత్రమును రచియించి, యఱువదేండ్ల ప్రాయమున నిహలోకమును వీడియుండును. కృష్ణరాయలయనంతరమున గొంతకాల మీకవిజీవించియుండెనని శ్రీవీరేశలింగముపంతులుగా రాంధ్రకవుల చారిత్రమున వ్రాసియుండిరి. కాని యందుల కాధారములను జూపలేదు. అది సత్యమైనఁ గావచ్చును.

కృష్ణామండలములోని యయ్యంకియగ్రహారవిభవుఁ డగునీకవి బళ్ళారిమండలవాసి యగునఘోరశివునకు శిష్యుఁ డెట్లయ్యెనో తెలియదు. అతనిపాండిత్యమును విని చిన్నవయసున విద్యాభ్యాసముకొఱ కచ్చట కేఁగియుండును.

కృతిపతియైన నాదిండ్ల అప్పయామాత్యుని వంశవృక్షము నీక్రింద నిచ్చుచున్నాడను. నాదిండ్లవారు కౌశికగోత్రులైన యాఱువేల నియోగి బ్రాహ్మణులు.






కృతిపతికిఁ బ్రపితామహుని సోదరుఁడైన చిటిగంగన సాళువనర సింహరాయులయొద్ద మంత్రిగానున్నట్లీ క్రిందిపద్యములోఁ గవి వర్ణించి యున్నాఁడు.

ఉ. సాళువనారసింహమనుజ ప్రభు కార్య కళాధురంధరుం
డై లవణాబ్ధివేష్టిత ధరాధిపదుర్మతమంత్రి మంత్రి ఘుం
డాలవితానకేసరి యనంగ ననంగసమానరూప రే
ఖాలలి తాంగుఁడట్టి చిటిగంగనయొప్పు గుణానుషంగుఁడై.

ఈసాళువ నరసింగరాయలు జైమినీభారత కృతిపతియైన నరసింహరాయలే కాని యితరుఁడు కాఁడు. కర్ణాటరాజ్య మీతనికాలముననే సంగమవంశమునుండి సాళువవంశములోనికి వచ్చినది కర్ణాటరాజ్య సింహాసనమున నీతఁడుపట్టాభిషిక్తుఁడైనది క్రీ. ౧౪౮౫ ప్రాంతమైనను, యీనరసింహరాయలు ౧౪౫౦ మొదలు కర్ణాటరాజులకు సామంతుఁడై దండనాథుఁడైనట్లీతని శాసనములవలన దెలియుచున్నది. (ఇతనిని గూర్చి పిల్లలమఱ్ఱి పినవీరనచరిత్రమును జూడుఁడు)

ఈచిటిగంగన రాజసభలయందు మాటలాడుటలోఁ గడు నేర్పరియనియు, గొప్పవక్తయనియు నీక్రింది పద్యములోఁ గవివర్ణించి యున్నాఁడు.

శా. అంగాధీశ కళింగరాజ మగధాద్యక్ష్మాది భూభృత్సభా
రంగాభంగవిహారముల్ ఘనశిలాగ్రావస్థలీసంసర
ద్గంగోత్తుంగ తరంగనిర్గళిత నిధ్వానోద్భవప్రక్రియా
సాంగత్యంబులు చిట్టిగంగవిభు వాచాసంభ్రమారంభముల్.

ఈచిట్టిగంగనకడ సాళువతిమ్మరుసు మంత్రి శిష్యుఁడుగానుండి యార్థిక రాజకీయ విషయములను నేర్చుకొనియెనఁట[౧]

---

౧ కృష్ణార్జున సంవాద పీఠిక.

కృతిపతియైన యప్పయామాత్యుఁడు, వీరనరసింహరాయలకును కృష్ణదేవరాయలకును మంత్రియై ప్రఖ్యాతిగనిన సాళువ తిమ్మరసు మంత్రికి యల్లుఁడైన ట్లీక్రింది పద్యములలోఁ జెప్పియున్నాఁడు. అప్ప మంత్రిభార్య తిరుమలాంబిక.

సీ. ఏమంత్రిమణి నిజస్వామికార్యక్రియా
 తత్పరమానసోత్సాహశాలి,
 యేమంత్రిమణి మిత్రహితబాంధవాశ్రిత
 పరికరరక్షణ కళాప్రౌఢబుద్ధి,
 యేమంత్రిమణి వచోహేలాతినైర్మల్య
 శీతలతాధూత శీతరోచి,
 యేమంత్రిమణి సుధాధామ శాంబవధామ
 ధాళధళ్యసుతుల్య ధవళకీర్తి,
 యట్టిమంత్రి కులోత్తంస మహితనృపతి
 పటలమకుటాగ్ర ఘటితసత్పద్మయుగళి
 సకలకర్ణాట రక్షావిచక్షణుండు
 దీనసురశాఖి సాళువతిమ్మమంత్రి,

గీ. అమ్మహామంత్రి కతనియర్ధాంగలక్ష్మి
 సకలపుణ్యాంగనాజనశ్లాఘనీయ
 లక్ష్మమాంబకు నుదయించి లలిని మెఱయు
 తిరుమలాంబికఁ బెండ్లియై దేజరిల్లె.

సాళువతిమ్మరుసున కీయప్పమంత్రి మేనల్లుఁడుకూడ నైయున్నాఁడు.

అప్పయమంత్రికి దమ్ముఁడైన గోపమంత్రి గుత్తిదుర్గపరిపాలకుఁడై ప్రతిభఁగాంచినట్లీ కవి రచియించిన రెండుపద్యములను గోపమంత్రి చారిత్రమున నుదాహరించి యున్నాఁడను అప్పయమంత్రిని గవి వర్ణించిన పద్యములలో ముఖ్యములైన రెండుపద్యముల నీక్రింద వ్రాయుచున్నాఁడను.

క. ఆయనుఁగుందమ్ముఁడు విన
 యాయతమతిఁ గొల్వ నప్పనార్యుఁడు నతఁడున్

బాయక యన్యోన్య క్రియ
లై యలరిరి రామకృష్ణాకృతులగుచున్.

సీ. నిజకీర్తి జలధి సన్నిభ ప్రగుణస్ఫూర్తి
        నిత్యపూర్ణేందుగా నిలిపినాఁడు
కరహేతి పరశిరఃక్రమకిరీటాగ్ర
        పీఠములపై కాఁడిఁ బెట్టినాఁడు.
ధరఁ బాల్ప హరిదంతి సంతానంబు
        మూలకు ముట్టఁగాఁ దోలినాఁడు
వాచానిరూఢిగర్వము చూపవచ్చిన
        శేషాహి నాలుకల్ చీఱినాఁడు

కపటరాజన్య మంత్రిదుర్గర్వ భార
తిమిరపటలంబు శేముషీతీవ్రభాను
భానుమాలికచేఁ బటాపంచ చేసి
వెలసినాఁడవ నప్పన వినుతిఁ గాంచె.

ఈమల్లనకవి శ్రీకృష్ణదేవరాయల యాస్థానకవులగు నష్టదిగ్గజములలో నొకఁడని ప్రతీతికలదు. కుమారధూర్జటిరచించిన కృష్ణరాయవిజయమునందలి యాక్రిందిపద్యములలోఁ గృష్ణదేవరాయలు శత్రువులనుజయించినపుడీ మల్లనకవియాతనికీర్తిని గొనియాడి యున్నాఁడని వ్రాసియున్నాఁడు.

గీ. అటులు జయలక్ష్మిఁ జైకొని యలరుకరుల
హరుల ధనపంక్తులను వనపరముచేసి
వెలయు శ్రీకృష్ణరాయలవిభవగరిమఁ
గాంచి కన్నులపండువుగాఁగ నపుడు.

గీ. సరససాహిత్యరచన విస్ఫురణ మెఱయు
సారమధురోక్తి మాదయగారిమల్ల
నార్యుఁడల యల్లసానిపెద్దార్యవరుఁడు
ముక్కుతిమ్మన మొదలైన ముఖ్యకవులు.

క. వినిపించి రఘుడు వారికిఁ
గనకాంబరభూషణములు ఘనత నొసఁగియా
జనవరుఁ డప్పాజిఁ గనుఁ
గొనియిట్లని పలికెనపుడు కుతుకంబలరన్.

ఈకవి కృష్ణరాయల యాస్థానకవియనుటకుఁ గుమారధూర్జటి వ్రాసిన యీపద్యములుతప్ప యితరాధారములేవియు నాకులభింప లేదు. అయినను గృష్ణదేవరాయలకుఁ దరువాత దాదాపొక శతాబ్ది లోనున్న కుమారధూర్జటి గ్రంథస్థముచేసిన యీతనిమాటలుసత్యము లనియే మనము విశ్వసింపవలసియున్నది. కాని, యీతఁడు రచించిన రాజశేఖర చరిత్రమునందుఁ గృష్ణదేవరాయల ప్రశంసయేమియుఁ గానవచ్చుటలేదు. అందుచేఁ గృష్ణరాయలు గర్ణాటరాజ్యసింహాసన మునఁ బట్టాభిషిక్తుఁడగుటకుఁ బూర్వమే రాజశేఖరచరిత్రము రచితమ యినదని నిర్ణయింపవలసియున్నది. సాళువతిమ్మరుసుమంత్రిని వర్ణిం చిన సీసపద్యములో "సకలకర్ణాటరక్షావిచక్షణుండు" అని మాత్రమే చెప్పియున్నాఁడు. తిమ్మరుసు కృష్ణదేవరాయలయొద్దనే కాకుండ నం తకుపూర్వముకూడ ననఁగా కృష్ణరాయల సోదరుఁడైన వీరనరసింహ రాయలయొద్దఁగూడ మంత్రిగానున్నట్లు కుమారధూర్జటికవి కృష్ణ రాయ విజయమునఁ జెప్పియున్నాఁడు. తిమ్మరుసు వీరనరసింహరాయల కాలములోనే తనయల్లునితమ్ముఁడైన నాదిండ్లగోపమంత్రికి గుత్తిదుర్గా ధిపత్య మిప్పించియుండును. తిమ్మరసున కల్లుఁడైన యప్పయమంత్రిని గవివర్ణించిన పద్యములను బరిశీలించితిమేని, యీతఁడు మంత్రిగను, దండనాథుఁడుగను నుండుటకుఁగావలసిన లక్షణములన్నియు గలవాఁడు గనే గన్పించుచున్నాఁడు. కాని యీతనిచే నొకదుర్గముగాని రాజ్యము గాని పరిపాలితమగుచున్నట్లుగాన్పింపదు. అన్నయైన యప్పయామా త్యుఁడుండఁగాఁ దమ్ముఁనకుఁ గుత్తిదుర్గరక్షకత్వ మొసంగుటకుఁ గారణ మేమియోఁ దెలియరాలేదు. శ్రీకృష్ణదేవరాయలు కొండవీడును జయించినపిమ్మటఁ గొండవీడురాజ్యము తిమ్మరుసు పరిపాలనములో నుండెను. పేరునకుఁ దిమ్మరసు కొండవీడు పరిపాలకుఁడుగా నియమిం పఁబడినను, ప్రస్తుతపుగంజాముమండలము మొదలు దక్షిణమున సము

ద్రిమువఱకునుగల కర్ణాటరాజ్య మహాభారమును కృష్ణరాయనితో సమానమ్ముగ వహించుచున్న మహామంత్రిసత్తముండగు తిమ్మరసున కొక్క కొండవీడునందుండుటకు సాధ్యముకాదు కావునఁ గొండవీఁడు రాజ్యనిర్వహణభారమును గోపమంత్రిపైఁ బెట్టియుండెను. ఈవిషయమునుగూర్చి గోపమంత్రిచారిత్రమున వ్రాసెదను. గుత్తిదుర్గాధిపత్యము లేకున్నను, గొండవీటిపరిపాలనమునందును అప్పయామాత్యునకు జోక్యమున్నట్లు గాన్పింపదు. దీనికిఁగారణ మప్పయమంత్రి యసమర్థుఁడని చెప్పవలనుపడదు. పాండవులలో ధర్మరాజును అర్జునుఁడును ఎట్టివారుగనుండిరో, అప్పయామాత్యుఁడును గోపమంత్రియు నట్లేయుండి రాజకార్యములను నిర్వహించుచుండిరని తలంపవలసియున్నది. తిరుపతి దేవస్థానమువారు ప్రకటించిన 116వ వంశవృక్షమున నప్పయమంత్రి కొండవీడురాజ్యమునకు మొదటిపరిపాలకుఁడనియు, గోపమంత్రి రెండవ పరిపాలకుఁడనియు వ్రాసియున్నారు. ఇదినిజముకాదు. కొండవీఁడు రాయలకిందకు రాఁగానే గోపమంత్రి పరిపాలకుఁడుగా నియమింపబడియెను. పిమ్మటఁ గొండవీడు కొండపల్లిసీమ లేకముచేయఁబడి యారాష్ట్రపాలనము రాయసము కొండమరుసయ్య కప్పగింపఁబడెను. పిమ్మట మఱికొంతకాలమునకు మరల గోపమంత్రి కొండవీడు పాలకుఁడుగా నియమితుఁడై రాయలజీవితాంతమువఱకును నతఁడే యారాష్ట్రపాలకుఁడుగా నుండినట్లు శాసనములు చెప్పుచున్నవి అప్పమంత్రి పెద్దవాఁడు కావున నాదెండ్లకరిణీకముచేయుచు నాగ్రామమున నేయుండ, గోపమంత్రి గుత్తిదుర్గపరిపాలకుఁడుగా నియమితుఁడై యుండవచ్చును. కొండవీటి పరిపాలనమునుగురించి రాజశేఖరచరిత్రయం దేమియుఁ జెప్పఁబడలేదు. కావున నాగ్రంథమును రచించునాఁటికిఁ గొండవీటి రాజ్యపాలనము గోపమంత్రికిగాని, అప్పయామాత్యునకుఁగాని రాలేదని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. గుత్తిదుర్గరక్షణాధికారము గోపమంత్రియందున్నదని చెప్పినట్లుకవి, కొండవీడు రాజ్యసంరక్షణభారము వారిరువురిలో నెవరియందున్నను ఆవిషయమును రాజశేఖరచరిత్రమునఁ జెప్పకయుండఁడు. కావున రాజశేఖరచరిత్రము, కొండవీడు దుర్గమును శ్రీకృష్ణదేవరాయలు పట్టుకొనకపూర్వము రచింపఁబడియుండునని భావించుచున్నాఁడను.

ఈనాదిండ్లవారికి గర్ణాటకరాజ్య పాలనముతో సంబంధము సాళువ నరసింహరాయలనాఁటినుండియుఁగలదు. సాళువనరసింహరాయలయొద్దనున్న చిటిగంగన ౧౪౫౦ ప్రాంతమునుండియు మంత్రిగానుండెనని తలంపవచ్చును అతనియన్నకుమారుఁడైన వరదయ, ఇంచుమించుగా చిటిగంగనతో సమవయస్కుఁడు. వరదయకుమారుఁడైన తిమ్మన ౧౪౫౦ ప్రాంతమున జన్మించి, సాళువతిమ్మరుసుమంత్రికంటె నించుకపెద్దవాఁడయియుండును తిమ్మరుసుమంత్రి సోదరియైన కృష్ణమాంబికను, ఈనాదిండ్ల తిమ్మనమంత్రి పెండ్లియాడెను. ఈతిమ్మన మంత్రి సోదరియైన లక్ష్మమ్మను సాళువతిమ్మరుసు వివాహమాడెనని తిరుపతిదేవస్థానమువారు ప్రకటించిన శాసనసంపుటములలో నున్నది. ఈవివాహమును కుండమార్పు పెండ్లియందురు. సరియైనయాధారము దొరకువఱకు నిదియథార్థమని యనలేము. నాదిండ్ల తిప్పయమంత్రికి, ౧౪౮౦ ప్రాంతమున అప్పమంత్రి, గోపమంత్రులు జన్మించియుండురని తలంచితిమేని క్రీ. శ. ౧౫౧౦ సంవత్సరమునాఁటికి వీరికువురును ముప్పదిసంవత్సరములవయసుగలవారైయుందురు. ఆయీడున నప్పయమంత్రి రాజశేఖరచరిత్రమును కృతినందెననినను గోపమంత్రి గుత్తిదుర్గ పరిపాలకుఁడుగ నుండెననినను నంతయు విరుద్ధమేమియుఁ గన్పట్టదు. సాళువతిమ్మరుసుమంత్రి క్రీ. శ. ౧౪౭౦ సంవత్సరప్రాంతమునజన్మించెననుకొన్నచో, వీరనరసింహరాయుల పరిపాలనారంభమునాఁటి కాతనికి ముప్పదియైదేండ్లును, కృష్ణరాయల రాజ్యారంభకాలమునకు నలువదియేండ్లును ఉండును. అప్పటికి నాదిండ్ల యప్పమంత్రి యల్లుఁడగుటయు నసంభవముకాదు.

కావునఁ గృష్ణదేవరాయల రాజ్యారంభకాలమునాఁటికిఁబూర్వమే, రాజశేఖరచరిత్రము పుట్టియుండవచ్చును. అట్లు కాదేని, కొండవీడుదుర్గమును రాయలు జయింపకపూర్వమైనను అనఁగా క్రీ. శ. ౧౫౧౫ వ సంవత్సరమునకుఁ బూర్వమైనను రచితమై యుండవలయును. కాని ౧౫౧౫ సంవత్సరమునకుఁ దరువాతనై యుండదు. కొండవీడుదుర్గమును జయించినపిమ్మట వెంటనే యాదుర్గాధికారము గోపమంత్రి కప్పగింపఁబడిన ట్లాతనిచరిత్రమున ఋజువుచేసియున్నాఁడను.

రాజశేఖరచరిత్రము, కొండవీటి దుర్గవిజయానంతరమున రచితమయ్యె
నేని, యందు గోపమంత్రిని వర్ణించినపద్యములో గుత్తిదుర్గముతోఁబా
టుగ కొండవీడునుగూడ జేర్చియుండును. కావున నాగ్రంథము ౧౫౧౫
కు పూర్వము రచియింపఁబడినదని నిశ్చయముగాఁ జెప్పవచ్చును.
మల్లనకవి, రాజశేఖరచరిత్ర రచనానంతరము నాదెండ్ల యప్పమంత్రి
గోపమంత్రుల యాదరణముచేఁ గృష్ణరాయల యాస్థాన ప్రవేశముఁ
గల్గించుకొని యాస్థానకవియై యష్టదిగ్గజములలో నొకఁడై ఖ్యాతిఁ
గాంచియుండును. ఈతఁడింక నేమేనికావ్యములను రచియించెనేమో
తెలియదు. కృష్ణరాయల కంకితమొసంగిన కావ్యముగాని యాతనిపై
రచించిన పద్యములుగాని కన్పట్టుటలేదు.

రాజశేఖరచరిత్ర మించుమించుగ నెన్మిదివందల యేఁబదిపద్య
ములు గలది. హేమధన్వుఁడనురాజు సంతానమునుగోరి తపసుచేయ
నీశ్వరప్రసాదమున నొకతనయుం డుద్భవింప నాతనికి రాజశేఖరుఁడని
పేరిడియెను. కుమారునకు యుక్తవయసువచ్చి ధనుర్విద్యాపారంగతుఁ
డైన పిదప నొకనాఁడాతనితోఁగూడి హేమధన్వుఁడు సభయందుండఁగా
నొకమునివచ్చి రాక్షసుఁడొకడు తనకుమార్తె నెత్తుకొనిపోయెననియు
రాజశేఖరుంబంపి యారాక్షసుని వధియింపఁజేసి తనతనయ నిప్పింపు
మనియుఁగోరఁ దండ్రియానతింగొని ససైన్యుఁడై యారాక్షసుఁడున్న
యరణ్యంబునకేఁగి యొకమహర్షి రాక్షసమాయను జయించు మం
త్రంబు నొసంగఁ గైకొనియారాక్షసునిజయించి యాతఁడుపార్వతీభక్తుఁ
డగుటచే నామెయాజ్ఞ నారాక్షసుని వధింపక విడిచిపుచ్చి యొకయో
గిని మూలమున నొకచిలుకను బ్రాహ్మణకన్యకను బడసి యాక
న్యక నామెతలిదండ్రుల కొసంగెను. మునిశాపవశంబున సింధుదేశా
ధీశునకుఁ గన్యకయైజన్మించిన గంధర్వస్త్రీయగు కాంతిమతియను కన్య
కామణిని మార్గమధ్యమునఁజూచి రాజశేఖరుఁ డామెను గామించి,
పార్వతితనకొసంగిన మణిమాలమునను యోగినియొసంగిన చిలుక
మూలమునను నామెవృత్తాంత మెఱింగి యామెను దనకొడఁగూర్చు
టకై చిలుకనామెకడ కంపెను. కాంతిమతియు రాజశేఖరునిఁజూచినది
మొదలుగ నాతనిపై విరాళింగొని తనచెలికత్తెను రాజశేఖరునికడ

కంపెను, ఈయుదంతమునెఱింగి యామెతండ్రి చిలుకమూలమున రాజశేఖరుని కులశీలములఁ దెలిసికొని తనకొమరిత నాతనికొసంగి పరిణయ మొనర్చెను. ఇది యీగ్రంథమునందలికథ.

మల్లనకవిత్వము మిగులప్రౌఢమై, లోకోక్తులతో నొప్పారుచుఁ బాఠకుల హర్షాంబుధి నోలలాడించును. కొన్నితావుల నీతనికవిత్వమును పింగళి సూరనకవిత్వమును నొక్కపోలికగనుండును. కాని సూరనకావ్యములయందలి కథాచాతుర్యమిందు లేదు. కవిత్వమెట్లుండ వలయునను విషయమునఁ గవికృత్యాదియందు రచించిన రెండుపద్యముల నీక్రిందనుదాహరించుచున్నాఁడను.

క. చెప్పఁదగు కవిత రసములు
చిప్పిల నప్పప్ప బళిబళీయన లేదో
యెప్పుడు జేయకయుండుట
యొప్పనుమీ సుకవి యెంతయుచితజ్ఞుఁడోకో.

శా. గాఢార్థప్రతిపాదన క్రమకళాకౌశల్యము ల్లేక వా
చాఢక్కార్భటితోడఁ దామతము మర్ఘ్యాయించుఁగైవారముల్
ప్రౌఢిం జేయుచుఁ బ్రాజ్ఞులన్నగుచు గర్వగ్రంథులైయుండున
మ్మూఢస్వాంతులమెచ్చకుండుటయ సమ్మోదంబుమాబోంట్లకున్

ఈతఁ డీపద్యములలోఁ జెప్పిన ట్లీతనిగ్రంథమునరసములు చిప్పిలుచున్నమాట నిక్కము. ఇట్టి రచనాసామర్థ్యముగలకవులు లెక్కకుఁ మిక్కిలితక్కువగానుందురు. ఇందు స్వల్పముగ నచ్చటచ్చటవ్యాకరణ మంగీకరింపని ప్రయోగములున్నను నవి గణుతింపఁదగినవికావు.

కవితాశైలి తెలియుటకై కొన్నిపద్యముల నిట నుదాహరించుచున్నాఁడను.

మ. అని యంతంతకు నమ్మహామహిమ కత్యాశ్చర్యముం బొంది య
జ్జననాథాగ్రిణి పాహిపాహియనుచున్ సంతానదానక్రియా
జనకంబైనఫలంబు మ్రాళి నిడి వక్షఃపీఠిపైఁ దార్చి లో
చనయుగ్మంబునఁ జేర్చుచున్ బొగడుచున్ సంతోషితస్వాంతుఁడై

౧ ఆ.

శా. ఓరోరీ కలగంటివో బ్రిమసితో యుగ్రాహవాటోపదు
ర్వారప్రక్రమమామకీన భుజగర్వంబెన్నవో కాక నా
పేరెవ్వారు నెఱుంగరో యకట నిర్భీతిన్ నరుం డెవ్వఁడేఁ
జేర న్వచ్చునె నన్ను బెబ్బులివయిన్ జీంబోతు లంఘించునే. ౨౬

చ. చిలుక పురోహితుం డగుచుఁ జెంగటనుండఁగ సిగ్గుపెందెరల్
దొలఁగఁగఁద్రోచి బంధుగతిఁ దోరపుఁగోర్కులు సందడింపఁగా
దలఁపులతాంగి కన్నమును తాన కనుంగవ దోయిలించి చూ
పులఁ దలఁబ్రాలు పోసె నృపపుత్రునిపై విరహాగ్ని సాక్షిగన్. ౩౭

బ్రి. శ్రీ వేటూరిప్రభాకరశాస్త్రిలుగారు చాటుపద్యమణిమం జరి ౯౩ వ పేజీలో "రాజశేఖరచరిత్రమును రచియించిన మల్లయకవి తండ్రి మాదయ మైరావణచరిత్రమున వెంజెర్లగోపమంత్రి తన్నిట్లు ప్రశంసించినట్లు చెప్పుకొన్నాఁడు" అని వ్రాసియున్నారు కాని యది సత్యము కాదు. మైరావణచరిత్రరచియించిన కవినామము మాడయ గాని మాదయ కాదు. ఒకవేళ మాదయయని యెంచినను, అతనిది శ్రీవత్సగోత్రము. రాజశేఖరచరిత్రను రచించినమల్లనది శౌనకగోత్రము. కావున వారిరువురును తండ్రియుఁ గుమారుఁడును గాఁజాలరు. మైరావణచరిత్రి కృతిపతియు, రాజశేఖరచరిత్రకృతిపతి సోదరుఁడును గోపమంత్రులే. కాని యతఁడు వేజెళ్ళగోపమంత్రి. ఇతఁడు నాదెళ్ళ గోపమంత్రి. ఇరువురునుగూడ వీరనరసింహరాయల కాలములోనివారుగాఁ గన్పట్టుచున్నారు. రెండుమూఁడు విషయములలో నిరువురకును సామ్యముండుటచే వారిరువురును బితాపుత్త్రులని భ్రమ కొల్పుచుండును. కాని గోత్రభేదముండుటచే వారికా సంబంధములే దనుట నిశ్చయము.

కృతిపతియైన నాదెండ్ల అప్పమంత్రి, కృష్ణదేవరాయలయాజ్ఞచే వినుకొండ గుత్తి సీమలకుఁ బరిపాలకుఁడుగా నుండినట్లాతని శాసనముల వలనఁ దెలియుచున్నది.

## అప్పమంత్రి దానములు

(1) వినుకొండసీమ లోనిమైలవరమను గ్రామమును చెన్నకేశవ స్వామికి యువసం॥ర మార్గశిర శు౧౩ గురువారమునాఁడు తన

మేనమామయైన సాళువతిమ్మరసుమంత్రికిని ఆతనిభార్యయైన లక్ష్మమ్మకును బుణ్యలోకావాప్తికొఱ కిచ్చెను.౧

(2) వినుకొండలోని అంగడిగోపినాథవారికి మండపముకట్టించి అప్పాపురమను గ్రామము నొసంగెను. క్రీ. శ. ౧౫౧౭.

(3) రొంపిచర్ల అనంతనాథదేవునకు గోపవరము అనుగ్రామము నిచ్చెను.

(4) మద్దిరాలలో మాధవీదేవికి పైనిమట్టియను గ్రామమునిచ్చి సత్రముకట్టించెను.

(5) వినుకొండ రామేశ్వరస్వామికి మండపప్రాకారముల నిర్మించెను. క్రీ. శ. ౧౫౧౭.

(6) నందిపాటిలో శివాలయనిర్మాణము చేసెను. క్రీ. శ. ౧౫౧౫.

(7) నూతులపాటిలో వీరేశ్వరాలయమును గట్టించెను. క్రీ. శ. ౧౫౧౭.

(8) క్రాంజలో అగస్త్యేశ్వరునకు మండపము కట్టించెను. క్రీ. శ. ౧౫౧౮.

(9) వినుకొండసీమలోఁ దల్లితండ్రులకుఁ బుణ్యముకొఱకు సర్వమాన్యముల నొసంగెను. క్రీ. శ. ౧౫౧౭.

(10) చెన్నకేశవరామనాథునకు మల్లవరాగ్రహారము నిచ్చెను. క్రీ. శ. ౧౫౧౭.

(11) ఆతుకూరుగ్రామదానము ౧౫౧౫.

(12) మంగళగిరి నృసింహస్వామికి ప్రాసాదము, తొమ్మిదిబంగారు కలశములు, మండపము కట్టించెను.

(13) రేటూరిలోనిభాగమును అప్పాపురమను పేర బ్రాహ్మణాగ్రహారముగాఁ జేసెను.

(14) ఏచూరిలో ఔబలనారసింహస్వామికి భూదానము.

(15) రాయనభాస్కరునకు భర్తపూడిగ్రామము నొసంగుట.

---

౧. A. R. 340 of 1935

(16) దేచయామాత్యునకు (నాదెండ్లగోపమంత్రి కడమంత్రి) అన్న వరగ్రామదానము.

(17) నాదిండ్లలోనిభాగము అప్పాపురమనుపేర బ్రాహ్మణులకు నగ్రహారముగాఁ జేసియిచ్చుట.౧

ఈదానములన్నియు, క్రీ. శ. ౧౫౧౬–౧౫౨౦ నడుమ చేసినట్లు కన్పట్టుచున్నది. రాజశేఖరచరిత్రమున నీదానప్రశంస యేమియు లేదు. కావున రాజశేఖరచరిత్రము క్రీ.శ.౧౫౧౫ సంవత్సరమునకుఁ బూర్వమే చేసియుండెనని నిశ్చయింపవచ్చును.

---

# 99· నాదిండ్ల గోపమంత్రి

ఈతఁడాఱువేల నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; కౌశికగోత్రుఁడు; తిమ్మయమంత్రికిని కృష్ణాంబకును బుత్త్రుఁడు. మాదయ్యగారి మల్లనకవి రచియించిన రాజశేఖరచరిత్రమును గృతినందిన నాదిండ్ల యప్పయామాత్యుఁడీకవికగ్రజుఁడు. బహుసమర్థతతోఁ గర్ణాటరాజ్యరమను బోషించిన మహాప్రధానియగు సాళువతిమ్మరసుకకీఁ గోప మంత్రి మేనల్లుఁడు; ఈతనివంశవృక్షమును, మల్లనకవి చరిత్రమున నిచ్చియున్నాఁడను. ఈగోపమంత్రిని, మల్లనకవి రాజశేఖరచరిత్రమునందిట్లు వర్ణించియున్నాఁడు.

ఉ. ప్రాపితరాజ్యవైభవనిరాకృతపాకవిరోధి యైన యా
గోపనమంత్రి ధర్మధనగోపన సమ్మతి గుత్తిదుర్గల
క్ష్మీపరిపాలనక్రమసమిద్ధభుజాబలశాలి రూపరే
ఖాపరమత్స్యలాంఛనుఁ డయాపహకార్యధురంధరుం డిలన్.

సీ. శీతలాకృతిఁ గొంత చెప్పంగఁదగు జందు
నెలనెల నుష్ణాంశుఁ గూడఁడేని
వితరణస్థితిఁ గొంత వర్తివచ్చు మేఘుండు
చపలానుషంగంబు నడలేనేని

---

౧. ఈదానవివరములను శ్రీకృష్ణార్జున సంవాదపీఠికనుండి గైకొంటిని.

భోగసంపదఁ గొంత పురుడింపఁదగు నిందుఁ
బాకారి యనుపేరఁ బరఁగఁడేని
సౌందర్యమునఁ గొంత సరివత్తు రాశ్వినే
యులు భేషణం బూనియుండ రేని
కొంత యెనవచ్చు గాంభీర్యగుణమునందు
నంబుధిస్వామి యొకవేళ నడఁగఁడేని
యనఁగ సర్వగుణఖ్యాతి నతిశయిల్లె
మానధనరాశి గోపనమంత్రి వరుఁడు.

ఈగోపవప్రధాని కృష్ణార్జునసంవాద మనుమూఁడాశ్వాసముల ద్విపదకావ్యమును రచియించి కొండవీటియందలి రాఘవేశ్వరస్వామి కంకితము చేసెను. ఆగ్రంథకృత్యాదియందుఁ గవిరచించిన యీక్రింది గద్యలవలన నీతనివంశావళియు నీతఁడొనర్చిన ధర్మములును దెలియు చున్నవి

శ్రీరమ్యముగ నొక్కకృతి యొనర్చెదను
చారుమదీయవంశం బెట్టిదనిన
సరస విశ్వామిత్రసంయమివంశ
శరనిధి సంపూర్ణచంద్రుఁడై పరఁగు
వరదధీమణి కర్థి వరదేవమణికి
గురుపుణ్యచారిత్ర గోపమాంబకును
తిమ్మమంత్రియుఁ జినతిమ్మప్రియుండు
నమ్మేరునగధీరుఁ డైనకొండనయు
నుదయించి రందులో నురుశత్రుమంత్రి
మదగర్వహారుఁడు తిమ్మప్రధానునకు
శ్రీకాంతతో సాటిచెప్పఁగాఁ జాలి
శ్రీకరాకృతి యైనకృష్ణమాంబకును
గొమరొప్పఁ బుట్టిరి కోనధీమణియు
నమరాద్రిసమధీరుఁ డప్పమంత్రియును
నందు నప్పయమంత్రి యాచక
మందారలోకసమానవైభవుఁడు

రాజశేఖరచరిత్రకు నధినాథుఁ
డాజి కిరీటి మహాభాగ్యయుతుఁడు
కాంతామనోహర కాంతివిజిత
కంతు జయంతసంకాశుఁడై తనరి
శ్రీయశోనిత్యుండు శ్రీకృష్ణదేవ
రాయసామ్రాజ్యభారధురంధరుండు
బలవదరాతిభూపతినుతపాద
తలుఁడు సాళువతిమ్మదండనాయకుఁడు
లక్ష్మమహాదేవి లాగున నొప్పు
లక్ష్మమ్మకు జనించి లాలితలీలఁ
బెరిగిన తిరుమలాంబికఁ బెండ్లియాడి
నిరుపమప్రాభవనిత్యుఁడై వెలసె
నతనికి ననుజుండు ననఘవర్తనుఁడు
చతురనానావిధజాలకోవిదుఁడు
భద్రలక్ష్మణ రామభద్ర ప్రసాద
సద్రాజ్యబహుళ రక్షావిచక్షణుఁడు
సమదశాత్రవరాజ సచివదుర్మంత్ర
తిమిరసూర్యుండు నాదిండ్లశాసనుఁడు
వరగుణాకరుఁడు విశ్వంభరాచక్ర
పరిపూర్ణయశుఁడు గోపప్రధానుండు
దండితాహితమహీధవ సాళ్వతిమ్మ
దండనాయకుని సంతతకృపామహిమ
వినుతికెక్కిన కొండవీటిదుర్గంబు
ఘనతనేలుచు సొంపుగా నొక్కనాఁడు
నవరసజ్ఞులు హితుల్ నటులు మాగధులు
కవులును రాజపుంగవులును గొలువ
వన్నెగా బాంధవవర్గంబుతోడ
మున్నతశ్రీలఁ బేరోలగం బుండి
మద్వంశకర్తమై మహి నుతిఁ గన్న

సద్వర్తనుండు విశ్వామిత్రమౌని
యజ్ఞవాటమునఁ బాయనివేల్పు గాన
విజ్ఞానముఁనఁ జాలవివరించి కొండ
వీటికాభ్యంతరవిలసితయజ్ఞ
వాటికారాఘువేశ్వరునకు వరుసఁ
బ్రాకారగోపురప్రాసాదతతులు
ప్రాకటశ్రీలఁ జూపట్టఁ గట్టించి
నలువుతోఁ జిత్రవర్ణములు గావించి
బలితంపు హేమకుంభంబు లెత్తించి
యలఘు ధరశ్రీల కాస్పదం బగుచు
నలరి మైదవో లనుపురోత్తమము
వినుతమహోత్సవ విగ్రహంబులను
బెనుపొందువేడ్కఁ నర్పించి చిత్తమునఁ
దనివోక లాఘౌజిత (?) జేయఁ దలఁచి
వనజాతబాంధవాన్వయవర్ధనునకు

... ... ... ...

నతపదాంభోజాతునకు లసత్కొండ
వీటికాభ్యంతర విలసితయజ్ఞ
వాటికారాఘువేశ్వరుపేరఁ బరమ
శాంతమానసునకు జానకీపతికి
నెంతయుఁ బ్రీతిగా నే రచియించు
చారుకృష్ణార్జున సంవాదమునకు
బరఁగు కథాసూత్ర మెట్టిదనిన

శ్రీకృష్ణుఁడు సూర్యున కర్ఘ్యమొసంగుటకై దోయిట నీరుపట్టియుండ, నప్పు డాకాశమార్గమునఁ బోవుగయుఁ డనుగంధర్వరా జుమియఁగా నది ప్రమాదవశమున నానీటఁ బడుటయు నందులకుఁ గినిసి కృష్ణుఁ డాగయుని సంహరింపఁబ్రతిజ్ఞ గైకొనుటయు, నారదా దేశంబునగయుఁ డర్జునునిశరణుఁ జొచ్చుటయు, నీగ్రంథమందలి ప్రధానకథ. ఈకథనే గయోపాఖ్యానమను పేరఁ గొందఱుకవులు పద్యకావ్యములను రచి

యించియుండిరి. ఈకథ భారతమున లేదు. మఱియేపురాణమునను గన్పడ లేదు ఈకథను గోపమంత్రి యేకల్పించెనో మూలమెచ్చటనైనఁ గలదో యెఱుంగవలసియున్నది. గయుని విడిచిపెట్టుమని సుభద్ర, అక్రూరుఁడు, ద్రౌపది మొదలగువారిచే నర్జునునకు శ్రీకృష్ణుఁడు చెప్పి పంపుటయు, నందుల కర్జునుఁడు డీకొనక ప్రత్యుత్తరము లంపుటయు నిందు విశేషముగా వర్ణింపఁబడినందున నీగ్రంథమునకుఁ గృష్ణార్జున సంవాద మని కవి పేరిడియెను. ఈగ్రంథమందలి కవిత్వము మృదువై మనోహరమై లోకోక్తులతో నిండియున్నది. శైలి తెలియుటకై కొన్ని ద్విపదల నుదాహరించెదను.

ఆవల ప్రాణభయాతురుఁ డగుచు
నీవె దిక్కని నిలిచినవాని
భూపాలవర్యులు పుడమిని ద్రోల్లి
చేపట్టివిడిచిరే చెప్పుమా నీవు
విని ప్రాణభయమున వెనుకఁ జొచ్చినను
గనికరంబున శిబి గావఁడే ఖగము
ఆవిభు శరణాగతు మున్న
కావఁడే చేపట్టికరుణ రాఘవుఁడు
పరికించి భూపతి పట్టినప్రతిన
అరయ శిలాక్షరమై యుండవలదె
అటుగాన భూపతు లవనిలోఁ గీర్తి
వడిఁ దలపైఁ దల వచ్చిననైన
విడువను గంధర్వవిభునిఁ బొమ్మనియె...
ఏవారి కెవ్వార లెక్కడిగయుఁడు
ఏయూరి కేయూరి కెక్కడిగయుఁడు
నీవేల పెనఁగెదు నీతిఁ బోవిడిచి
చెలఁగి వెన్నుఁడు నీకుఁ జేసినమేలు
తలఁపక మాటాడ ధర్మంబు గాదు
దైవంబు గురుఁడు బాంధవుఁడు మిత్రుండు
గోవిందుఁ డతని ఘూర్కొనఁ దగునయ్య

నిగ్రహానుగ్రహనిపుణుండు శౌరి
ఆగ్రహింపక మున్నె యనుపుము గయుని...
అరుదెంచి ప్రాణభయంబున గయుఁడు
శరణంబుఁ జొచ్చిన జక్కఁ గాచితిని
శరణాగతుల వధూజనుల బాలకుల
దారకొని హింసించుదోషకారులకు
నిలను బ్రాయశ్చిత్తమే పుట్ట దనుచుఁ
బలికెడు శ్రుతివాక్యపద్ధతి వినవె
కావున దయమాలి గయుఁ బట్టి
గొటియగా నిచ్చుటే పాతకంబు పొమ్మనిన...

ఈగోపమంత్రి మొట్టమొదట నాదెండ్లపురశాసనుఁ డైనట్టుకృష్ణార్జున సంవాద గ్రంథాంతమున నీద్విపదలలోఁ జెప్పియున్నాఁడు.

"జానకీవిభు పాదజలజభృంగాయ
మానమానసుఁడు తిమ్మయమంత్రిసుతుఁడు
ధీసమన్వితుఁడు నాదిండ్ల శాసనుఁడు
భాసురకీర్తి గోపప్రధానుండు
చారుకృష్ణార్జునసంవాద మొనరఁ
గా రచియించె సత్కవులు నుతింప.

కరణములను బురశాసను లనుట కవిసాంప్రదాయము. దీనిని బట్టి యీగోపమంత్రి మొదట నాదిండ్లకు గ్రామకరణమై పిమ్మట గుత్తిదుర్గాధ్యక్షుఁడై యటుతరువాత కొండవీడురాజ్యమును మేనమామ యైనసాళువతిమ్మరుసుమంత్రిపక్షమునఁ బరిపాలకుఁడై ప్రఖ్యాతిఁ గాంచి యున్నవాఁడు. గోపమంత్రినిగూర్చి శేషాద్రిరమణకవులు కృష్ణార్జున సంవాదపీఠికయందు వ్రాసినవాక్యముల నీక్రిందఁ బొందుపఱచుచు న్నాఁడను.

"ఈయనగుణప్రశంస కావ్యాదికములలోఁ గలదు. ఇంతియ గాక యీయనరచించిన సంస్కృతగ్రంథవ్యాఖ్యానములు జిజ్ఞాసువు లకు వాఙ్మయభిక్ష ప్రసాదించుచున్నవి. కవియై త్యాగియై భోగియై

నీమహామహుఁ డాంధ్రదేశమున కొనర్చినసేవ యపార మైనది. ఈయన కొండవీటిసామ్రాజ్యమును నిరంకుశముగాఁ బరిపాలించు చున్నందుల కీక్రిందియాధారము చాలును.

"శ్రీకృష్ణక్షితిపాలమాళిసచివః శ్రీసాళ్వతిమ్మప్రభుః
జామాతృప్రవరే ధురంధరవరే శ్రీగోపమంత్రీశ్వరే
ప్రాదత్తాఖిలకొండవీటినగరీసామ్రాజ్యదారేయతాం
మత్తేభాశ్వపదాతిసైన్యకలితాం పల్యంకికాం చామరీం."
"శ్రీకృష్ణరాయనరనాథశిరఃప్రధానః
శ్రీసాళ్వతిమ్మసచివేశ్వర భాగినేయః
నాదెండ్లగోపసచివో నయతత్త్వవేదీ
శ్రీకొండవీటినగరైకధురంధరోభూత్"

## కొండవీటిశాసనము

ప్రకృతశాసనమున నింకను గోపమంత్రి ప్రశస్తి యభివర్ణింపఁ బడినది. సప్తసంతానములసైతము బడసినటు లందుఁ గలదు. ఈయన యంకిత మొందినకృతులు దురదృష్టవశమున నేఁటివఱకు వెలువడ కున్నవి. గోపమంత్రి పండితవంశసంజాతుఁడు. మేనమామ యగుతిమ్మ రుసుమంత్రి బాలభారతాదిగ్రంథములకు వ్యాఖ్యవ్రాసిన ప్రచండ పండితుఁడు. అన్న యగుఅప్పయ్యమంత్రి మాదయగారి మల్లనచే రాజశేఖరచరిత్రము నంకితమునొంది జీవన్ముక్తుఁ డైనధన్యుఁడు. ఈయనయమాత్యుఁ డగుఊరదేచమంత్రి తెనాలిరామలింగకవిచేఉద్భ టారాధ్యచరిత్రము నంకితముగాఁ గొనియు దేవీపంచస్తవికి వ్యాఖ్య యొనర్చియుఁ బేరొందినవాఁడు ఆస్థానవిద్వాంసుఁ డగులొల్లలక్ష్మీధర యజ్వ సమస్తశాస్త్రపారంగతుఁడు. సంస్కృతమునఁ బ్రచండకవి. సపరివారముగా వాఙ్మయసేవకై జీవితము వెచ్చించిన నాదిండ్లగోప మంత్రిజీవితము ప్రశస్తతరము. గోపమంత్రి కవులనాదరించువాఁడ నియు, సత్ప్రాలకుఁడనియు, శాస్త్రపారంగతుఁడనియు, సుందరాకారుఁ డనియు, మహాత్యాగియనియు, వీరాధివీరుఁడనియు గ్రంథాంతరము లందుఁగలదు. ఇట్టిరసికరత్నము కావ్యరచనమునకుఁ గడంగినయసా

మాన్యకౌశలాతిశయమును గవితాకల్పనమునఁగూడ లోకమునకుఁ దెలుపఁబూనుట గొప్పవిశేషము.

నాదెండ్లగోపమంత్రి కొండవీటిని పాలించినది (శా శ. ౧౪౩౭_౧౪౫౫) క్రీ శ 1515_1533 వఱ కనికొండవీటిదండకవిలెలోఁ గలదు. తిమ్మరుసుమంత్రి క్రీ.శ. ౧౫౧౫ జూను 23 వ తేదీకి సరిపడు శా శ. ౧౪౩౭ ఆషాఢ శుద్ధ ద్వాదశినాఁడు కొండవీడు జయించెను. వెంటనే రాజప్రతినిధిగ నేర్పడియుండెఁ గాన నీదండకవిలెలోని కాలము విశ్వసనీయము కానోపు. ఈమధ్యకాలమున కృష్ణార్జునసంవాదము పూర్తి చేయఁబడినటుల విశ్వసింపవచ్చును. ప్రబోధచంద్రోదయవ్యాఖ్యయు నీకాలముననే యిక్కవి రచించినట్లు తోఁచుచున్నది."

తెనాలిరామలింగకవి తనయుద్భటారాధ్యచరిత్రమునం దీగోపమంత్రిని, నాల్గుసీసపద్యములలో వర్ణించియున్నాఁడు. గ్రంథవిస్తరభీతిచే నందొక్కపద్యము నిందుదాహరించుచున్నాఁడను.

సీ. అరిపురజయలక్ష్మి హరునిఁ బోలెను గాని
తగులండు విషధరత్వంబు నింత
సంపూర్ణతరకాంతిఁ జంద్రుఁ బోలెను గాని
దోషాకరోన్నతిఁ దొరలఁ డెందు
నిజభుజాబలరేఖవిజయుఁ బోలెను గాని
భీమోన్నతస్ఫూర్తిఁ బెరుఁగ నీఁడు
గాంభీర్యమునఁ బాలకడలిఁ బోలెను గాని
భంగసాంగత్యదభుఁ బట్టఁ డర్థి

గీ. నఖలదుర్మంత్రివదనముద్రాకరుఁ
డాత్మపంకజవీధివిహారిశౌరి
కీర్తిగంగాపవిత్రితక్షితితలుండు
గుణమరున్మంత్రి నాదెండ్ల గోపమంత్రి.

ఈగోపమంత్రి యన్న యగునప్పయమంత్రి నాళువతిమ్మరుసుమంత్రికల్లుఁడనుటకు సందియము లేదు. గోపమంత్రికూడ తిమ్మరుసున కల్లుఁడే యనియు, తిమ్మరుసున కిరువురుతనయలనియు, వారి నిరువుర

నన్నదమ్ముల కిరువురకు నిచ్చి పరిణయ మొనర్చిరనియు తిరుపతి దేవస్థానమువారు ప్రకటించిన శాసనసంపుటములో నాఅవధానియందున్నది. కొండవీటిశాసనములోని దని శేషాద్రిరమణకవులు ప్రకటించిన పై శ్లోకములోని "జామాతృపవరే"యను వాక్య మీవిషయమును బలపర్చుచున్నది. అయినను నీవిషయ మింకను విచారణీయము. గ్రంథకర్తలెవరును గోపమంత్రి తిమ్మరుసునకు మేనల్లుఁడని చెప్పిరేగాని యల్లుఁడని చెప్పలేదు. గోపమంత్రి రచించిన కృష్ణార్జునసంవాదమునందాను తిమ్మరుసునకు మేనల్లుఁడ ననిమాత్రమే జెప్పుకొనియెను. కాని యల్లుఁడ నని చెప్పుకొనలేదు ఒకనికుమార్తెల నన్నదమ్ముల కిచ్చి పరిణయము చేయు నాచారముకూడ నరుదుగాఁగాని లేదు. మాదయగారి మల్లన రాజశేఖరచరిత్రమున గోపమంత్రిని, తిమ్మరుసుమంత్రికల్లుఁడని చెప్పలేదు. మేనల్లుఁడనిమాత్రమే చెప్పియున్నాఁడు. గోపమంత్రి రచించినప్రబోధచంద్రోదయవ్యాఖ్యయందలి గద్యలోఁ:—(ఇతి శ్రీమదాంధ్రరాజపరమేశ్వర శ్రీమత్ప్రతాప శ్రీకృష్ణరాయమహాసామ్రాజ్య ధురంధర సాళ్వతిమ్మదండనాయకభాగినేయ నాదిండ్లగోపమంత్రిశేఖర విరచితాయాం ప్రబోధచంద్రోదయవ్యాఖ్యాయాం....)

దాను సాళ్వతిమ్మరుసునకు భాగినేయుఁడననియే చెప్పుకొనినాఁడు కాని జామాతనని వ్రాసికొనలేదు. కొండవీటిశాసనమున జామాతయని వ్రాయుట పొరపాటై యుండును. కాదేని జామాతృశబ్దమునకు భాగనేయుఁ డనునర్థముకూడ నుండియుండవలయును. పైమాఁదు గ్రంథములకుబిమ్మట గోపమంత్రి సాళువతిమ్మరుసున కల్లుఁ డయ్యెనని తలంచుట కవకాశము లేదు. ఇంతకంటెఁ బ్రబలమైనయాధారము లభించునఁతను నీగోపమంత్రి సాళ్వతిమ్మరుసునకు మేనల్లుఁడే కాని యల్లుఁడు కాఁడని నిర్ణయింతము.

కొండవీడునందు విశ్వామిత్రియజ్ఞవాటిక కలదఁట! ఆయజ్ఞమును రక్షింపనేతెంచిన శ్రీరాముని దేవాలయముగూడ నందున్నదఁట! ఆరాఘవేశ్వరునకే యీగ్రంథము నంకితము చేసినట్లు పైద్విపదలలోఁ గవి చెప్పియున్నాఁడు. ఆరాఘవేశ్వరునకే ప్రాకారగోపురప్రాసాదాదులును, సోపానములును గట్టించినట్లును, హేమకుంభము లెత్తించిన

ట్లును మైలవర మనుగ్రామమును ఉత్సవవిగ్రహములను నొసంగినట్లును పైనివ్రాసినకృత్యాదిద్విపదలలో నున్నది. ఈదానములు శా.శ ౧౪౪౨ ౧౪౪3 (క్రీ.శ. ౧౫౨౦- ౨౨) లోఁ గావి,చెను.౧ ఇతని శాసనము లింకను. గొన్నికలవు౨ వీనినిబట్టి కృష్ణార్జునసంవాదము క్రీ.శ. ౧౫౨౨ నకుఁ బిమ్మట రచియింపబడినట్లు తలంపవచ్చును.

గోపమంత్రి క్రీ. శ. ౧౪౮౫ ప్రాంతమున జన్మించియుండును. శ్రీకృష్ణరాయలు చనిపోయిననాఁటికితనికి ౪౫సంవత్సరములవయసు కల వాఁడని చెప్పవచ్చును. ఇతఁడు క్రీ.శ. ౧౫3 3 వఱకుఁ గొండవీటిదు ర్గపరిపాలకుఁడుగా నున్నట్లు చెప్పుచున్నారు. అది సత్యమయ్యేనేని అచ్యుతరాయలకాలములోఁగూడ నీతఁడు కొండవీడును బరిపాలించు చుండెనని నిశ్చయింపవచ్చును.

గోపమంత్రి యెప్పుడు స్వర్గ మలంకరించెనో, అప్పమంత్రి యెప్పుడు చనిపోయెనో సాళ్వతిమ్మరసు గతించునప్పటికి వీరుండిరో లేదో తెలియదు.

గోపమంత్రినిగూర్చి, తెనాలిరామకృష్ణునిచారిత్రమునఁ గొన్ని విషయములు వ్రాయఁదలంచి యింతటితో నీతనిచారిత్రమును ముగిం చుచున్నాఁడను.

---

౧ శ్రీకృష్ణార్జునసంవాదపీఠిక by విద్యారత్న.

౨ A. R. 433 of 15 శా. శ ౧౪౪3 వృష సం. కార్తీక శు ౧౫ సోమ వారం; Epigraphia Indica సం ౬ పుట ౧౧౨

# నంది తిమ్మయ్య (ముక్కు తిమ్మన)

శ్రీకృష్ణదేవరాయల యాస్థానాష్ట దిగ్గజకవులలో నొకఁ డగు నీకవివతంసుఁ డాఱువేలనియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; కౌశికగోత్రుఁడు; సింగయామాత్యునకును దిమ్మాంబకును బుత్రుఁడు.

ఈతఁడు పారిజాతాపహరణ మను నైదాశ్వాసముల శృంగార ప్రబంధమును రచించి శ్రీకృష్ణదేవరాయల కంకితము చేసెను. ఈకవి తనను గూర్చి పారిజాతాపహరణమున నిట్లు చెప్పుకొనియున్నాఁడు.

సీ. కౌశికగోత్రవిఖ్యాతుఁ డాపస్తంబ
　　　సూత్రుఁ డార్వేలపవిత్రకులుఁడు
నందిసింగామాత్యునకును దిమ్మాంబకుఁ
　　　దనయుండు సకలవిద్యావివేక
చతురుఁడు మలయమారుతకవీంద్రునకు మే
　　　నల్లుండు కృష్ణరాయక్షితీశ
కరుణాసమాలబ్ధ ఘనచతురంతయా
　　　నమహాగ్రహారసన్మానయుతుఁడు

తే. తిమ్మయార్యుండు శివపరాధీనమతి య
ఘోరశివగురుశిష్యుండు పారిజాత
హరణ మనుకావ్య మొనరించె నంధ్రభాష
నాదివాకరతారా సుధాకరముగ.

ప్రబోధచంద్రోదయ వరాహపురాణాది కావ్యములను రచించిన నందిమల్లయ ఘంటసింగయకవులలో సింగయకవికి మలయమారుతకవి యని నామాంతరమున్నట్లు కవిచారిత్రమున వ్రాసియున్నాఁడను. ఆమలయమారుతకవియే యీకవికి మేనమామ. "సాధారణముగ ముక్కుతిమ్మన్న యనఁబడెడు నందితిమ్మకవి యీమల్లయకవికి మనుమఁడని చెప్పుదురు. కాని పారిజాతాపహరణమునందు కవి తనవంశమును జెప్పుచో నీక్రిందిపద్యమునం దాసంగతి చెప్పియుండలేదు" అని కవుల చరిత్రకారులు నందిమల్లయ ఘంటసింగయకవుల చారిత్రమున వ్రాసి

పైవద్యమునిచ్చియున్నారు. నందిమల్లయకుఁ దిమ్మయ పౌత్రదౌహిత్రరూపమున మనుమఁడుగాకపోయినను, మేనకోడలు కుమారుఁడై వరుసకు మనుమఁడే యగుచున్నాఁడు. ఆసంబంధమును జూపువంశవృక్షము నీక్రింద నిచ్చుచున్నాఁడను.




పైవంశవృక్షములోఁ జూపఁబడిన నందిమల్లయకు సింగయ్యయనుకుమారుడుండెననియు, నాతఁడే తిమ్మాంబభర్తయనియు, నాతఁడే మన ముక్కుతిమ్మకవికిఁ దండ్రియనియు శ్రీకొణిదెన బాలకృష్ణయ్యగారు భారతిపత్రికలో (సం 8 భా2 పుటలు 175-179) వ్రాసి యీక్రిందివంశవృక్షము నిచ్చియున్నారు.



ఈసంబంధము నిజమగు నెడల నది యెదురు మేనరిక మగును. ఇది శాస్త్రవిరుద్ధమును నాచారములేనిదియు నగుసంబంధ మగుచున్నది. ప్రబలప్రమాణముండినఁగాని యిట్టివివాహము జరిగెనని చెప్పరాదు. తిమ్మకవికి, నందిమల్లయకవి పితామహుఁ డైనచో మలయమారుతకవికి మేనల్లుఁడ నని చెప్పుకొనినవాఁడు, మల్లయకవికి మనుమఁడనని చెప్పుకొనకుండ నుండఁడు. మల్లయకవికంటె మలయమారుతకవి ప్రజ్ఞావంతుఁడైన నగుఁగాక! అంతమాత్రముచే మలయమారుతకవిని జెప్పి తన పితామహునిపే రెత్తఁ డని చెప్పుటలో స్వారస్యము లేదు. రెండుగ్రంథములలో గ్రంథకర్తగానుండి తుళువనరసనాయకుని కృతిపతినిగాఁ జేసిన మల్లయ్యపేరును బ్రజలేదియో యనుకొందురని తనగ్రంథమునఁ జెప్పసంశయింపఁడు. ఆతఁడు సంగీతనందియని పేరొందినవాఁడు. ఆ మాటలైనఁ జెప్పఁడా? తిమ్మకవితండ్రి యైనసింగయ, మల్లయకవి కుమారుఁడుగాక వేఱొక నందిసింగయ యనియూహింపఁదగియున్నది. ఇంతకును నందిమల్లయ్యకు ముక్కుతిమ్మన మనుమఁ డనుటకుఁ గవిచరిత్రకారులమాటలే కాని యితరాధారములు లేవు.

గురుజాడ శ్రీరామమూర్తిపంతులుగారు. కవిజీవితములలో నంది సింగనమంత్రికి (పైవంశవృక్షములో మూలపురుషుఁడు) ఇరువురుభార్యలనియు, నందొకయామె మలయమారుతకవి (వరాహపురాణకర్తలగు జంటకవులలో నొకఁడుగాక వేఱొకఁడు) సోదరియైన తిమ్మాంబయని యు, ఆమెయందు సింగనమంత్రికిఁ గలిగినకుమారుఁడే ముక్కుతిమ్మన్న యనియు, సింగనమంత్రి రెండవభార్య యైనపోచమ్మకు మల్లయ్య యనుకుమారుఁడును అమ్మలాంబ యనుకుమార్తెయునుగల్గిరనియు, నా యమ్మలాంబకుమారుఁడే జంటకవులలో నొకరగు మలయమారుతకవి యనియు వ్రాసియున్నారు. కాని యీవ్రాఁత నిరాధారమైనది. నంది సింగనమంత్రి కిరువురు భార్య లుండిరనిచెప్పుటకుఁగాని, మలయమారుతులిద్ద రుండిరనుటకుఁగాని, వారిరువురును గవులై యుండి రనుటకుఁ గాని, యాధారములు లేవు. కాలవ్యత్యాసముకూడఁ గన్పించుచున్నది. నిరాధారము లైనయిట్టియూహా సిద్ధాంతములను విమర్శించుట

వలన నయ్యెడు ప్రయోజనము లేదని యింతటితో నీచర్చను వదలి వేయుచున్నాఁడను.

పాఠకుల సౌకర్యముకొఱకు శ్రీరామమూర్తి పంతులుగారిచ్చిన వంశవృక్షము నీక్రింద నిచ్చుచున్నాఁడను,




తిమ్మాంబసోదరుఁడైనమలయమారుతకవియు, ఘంటనాగయ్యకొడుకైనమలయమారుతకవియు నేకవ్యక్తి యందుమేని నందిసింగనమంత్రి దౌహిత్రిని పెండ్లాడినవాఁ డగును. ఇది యసంభవము. కావున నీయిరువురును భిన్నవ్యక్తులు. ఈవంశవృక్షము ననుసరించి కృష్ణరాయల కాలములోనున్న ముక్కు-తిమ్మన్నకు వరాహపురాణమునురచించి కృష్ణరాయలతండ్రి యైననరసనాయకునకుఁ గృతియిచ్చిన ఘంటసింగయ్య సవతిమేనల్లుఁడగును, ఇదియు నసంభవమే.

నందితిమ్మనయును నాతనిమేనమామయైన మలయమారుతకవియుఁగూడ నఘోరశివగురునిశిష్యులు. నందితిమ్మన యఘోరశివుని వృద్ధాప్యమున శిష్యుఁడై యుండును.

ఈకవి గృహనామమునంది వారయియుండగా నీతనిని ముక్కుతిమ్మన యనియును నెందువలన నని ప్రశ్నింపవచ్చును. ఇతఁడు నాసికావర్ణనముఁ జేయుచు నొక పద్యమును రచియించి యుండెననియు, నందలిస్వారస్యమును గ్రహించి, రామరాజభూషణకవి కొంతద్రవ్యము నిచ్చి కొని తనవసుచరిత్రమున వేసికొనెననియు, నందుమూలమున

నీతనిని ముక్కుతిమ్మనయని పిలుచుచుందు రని యు నొకకథ చెప్పె దరు. ఆపద్యమిది:—

శా. నానాసూనవితానవాసనల నానందించుసారంగ మే
లా నన్నొల్ల దటంచు గంధఫలి బల్కానం దపంబంది యో
షానాసాకృతిఁ దాల్చి సర్వసుమనస్సౌరభ్యసంవాసియై
పూనెం బ్రేక్షణమాలికామధుకరీపుంజంబు లిర్వంకలన్.

ఈకథ విశ్వాసార్హమైనది కాదు. ఇంతకంటె నద్భుతకల్పన లను జేయఁగలిగిన రామరాజభూషణుఁ డీపద్యమును విలిచి సిగ్గువడక తనపుస్తకమునందు వేసికొనె ననుటయు నసంగతమే. శ్రీకృష్ణదేవరా యలచే నగ్రహారాదికమును బడసినమహాకవి రసవత్తరమైనపద్య మును దనగ్రంథమునం దుంచుకొనక యమ్ముకొనెననుటయు, నసం గతమే కవిచరిత్రకారులును, పారిజాతాపహరణ పీఠికాకారులును, నీతనికి ముక్కు పెద్దది గానుండుటచే నీపేరు వచ్చియుండు నని యభి ప్రాయపడియున్నారు. ఆయూహయే యంగీకరింపఁదగినది.

సామాన్యముగాఁ గవులు తమయిష్టదైవమును మఱియుతర దేవతలను గృత్యాదిని స్తుతిఁజేయుచు నాదైవములు గృతిపతి కాయు రారోగ్యసంపదల నిచ్చునట్లాశీర్వదించుట ప్రాయికముగా నున్నది. ఈకవి శ్రీ వెంకటేశ్వరుని, యీశ్వరుని, విఘ్నేశ్వరుని, లక్ష్మీసరస్వ తులను స్తోత్రముచేసి పిమ్మటఁ జంద్రునిఁగూడ నీక్రిందిపద్యములో వర్ణించియున్నాఁడు.

చ. వలిమలయల్లువాఁడు, తలవాఁక ధరించినపూవుగుత్తి, వే
ల్పులఁగమిజీవగఱ్ఱ యుడివోవనిచల్వలటెంకి వెన్నెల
ల్మొలచినపాదు పాల్కడలిముద్దులపట్టి నృశింహకృష్ణరా
యలఁ గరుణారసంబు నునుపారెడిచూపులఁ జూచుఁ గావుతన్.

శ్రీకృష్ణదేవరాయలు చంద్రవంశపురా జని కవి యీపుస్తక మునఁ జెప్పి యావంశకర్తయైన కారణమునఁ గాఁబోలు చంద్రుని గ్రంథావతారికయందు వర్ణించియున్నాఁడు. చంద్రవంశపురాజులకుఁ గృతియిచ్చినకవులు పలువు రున్నారు. కాని వారెవ్వరును గ్రంథాదిని సుధాంశుని యిష్టదైవముగాఁ గొనియాడినవారు లేరు.

ఈకవిని శ్రీకృష్ణదేవరాయలభార్యయైనతిరుమలదేవి కామె పుట్టినింటివా రరణముగా నిచ్చిరని యొకప్రతీతికలదు. పూర్వము రాజు తమకన్యలకు వస్తువాహనాదికముతోఁ బాటుగ దాసదాసీజనమునే గాక కవులనుగూడ నరణముగా నిచ్చెడియాచారమున్న దందురు. ఈయరణమును దిరుమలదేవికిఁ గాదనియుఁ, గృష్ణరాయల రెండవభార్య యైనచిన్నాదేవికనియుఁ గొందఱనెదరు. చిన్నాదేవి వేశ్యకులసంజాతయని రాయలచారిత్రమున వ్రాసియుంటిమి. అందుచేఁ దిమ్మకవి యామె కరణపుఁగవి గాఁజాలఁడు. తిరుమలదేవిమైసూరు రాజుతనయయని చెప్పియుంటిమి. అతఁడు కర్ణాటకుఁడు. ఆంధ్రకవి నరణముగా నిచ్చెనా ? యని సంశయము. ఈకథ సత్యమనుటకు గ్రంథస్థాధారము కనుపడలేదు. ఈకవికి మేనమామ యయినములయమారుతకవి, కృష్ణదేవరాయలకుఁ దండ్రియైననరసరాయలయాస్థానమునందుండి వరాహపురాణము నాతని కంకితము చేసియుండెను. మేనమామయు, మేనల్లుఁడు నించుమించుగసమకాలికులు కావున, మేనమామనుబట్టి యీకవియు నాస్థానమునఁ బ్రవేశముఁ గల్గించుకొని కృష్ణరాయలకాలమునఁ బ్రఖ్యాతిఁ గనియుండును.

ఈతిమ్మకవి పారిజాతాపహరణమును రచించుటకుఁ గారణమును దెలుపునట్టికథ యొకటి చిరకాలమునుండి వచ్చుచున్నది. రాజులవిషయమునను గవులఁగూర్చియుఁ గథ లనేకములు పుట్టుచుండుట క్రొత్త గాదు. కథయందు సత్యమున్నదనుకారణమునఁ గాకపోయినను పాఠకులకు వినోదముగ నుండుననుతలంపుననాకథ నిచట వ్రాయుచున్నాఁడను. శయనాగారమునకు రాజుకంటె రాణి ముందుగా జని నిద్రించునెడల, రాజు పరుండుశయ్యపై నాతనిపాదములుంచుతావునఁ దనశిర ముంచి పండుకొనుటయుఁ బిమ్మట రాజువచ్చి పరుండఁబోవునప్పు డామెను మేల్కొలుపుటయు నప్పు డామె రాజును గౌరవించి రాజున కభిముఖముగఁ బరుండుటయు నాచార మఁట.

ఒకప్పుడు తిరుమలదేవి కృష్ణరాయలకంటె ముందుగ శయనింపనేఁగి పైనచెప్పిన యాచారప్రకారముగ నిద్రించె నఁట. రాజకార్యసమాలోచనమును ముగించుకొని కృష్ణరాయలు పరుండఁబోయి నిద్రిం

చుచున్నతిరుమలదేవిని లేపకయే తాను నాశయ్యాయందే పరుండి నిద్రించెనఁట! నిద్రలోనుండగాఁ బంగారుటందియలతో నున్నతిరుమల పాదము కృష్ణరాయనిశిరమునకుఁ దగుల నాతఁడు లేచి యామెబుద్ధి పూర్వకముగనే యట్లు చేసియుండుననిశంకించి యామెపైఁ గ్రోధము వహించి నాఁటనుండియు నామెతో సహాశయ్యాసంభాషణాదులను వర్జింపఁ దిరుమలదేవి తననిర్దోషత్వమును రాయలకు విన్నవించియు నాతనియనుగ్రహమును సంపాదింపఁజాలకపోయెనఁట!

అరణపుగవి యగునందితిమ్మయ దాసీజనమూలమున నీయుదంతమును విని పారిజాతాపహరణకావ్యమును రచియించి కృష్ణరాయల కంకితమొనర్చి యాగ్రంథమును గవిపండితబంధుసామంతసమక్షమున మహాసభలోఁ జదివి వినిపించినప్పుడు, సత్యభామకోపోద్దీపితయై తనకు నమస్కరించుచున్నశ్రీకృష్ణునియుత్తమాంగము నెడమకాలితోఁ దలఁ గఁద్రోచినసందర్భమున రచించిన యీక్రిందిపద్యములు గలకథపట్టును జదువఁగా విని రాయ లద్దానిని మరలఁ జదువుమని హెచ్చరించి విని సంతసించి యానాఁటికి సభ చాలించెనఁట! రాజాభిప్రాయమునెఱింగి తిమ్మకవి, దాసిమూలమున తిరుమలదేవికి, "రాజీనాఁ డామెసౌధమున కరుదెంచుననియు, నుచితరీతి వర్తించి రాజుప్రేమను జూఱగొనుమ నియుఁ గబురంపెనఁట! కవిమనోరథము ఫలించినది. ఆనాఁటినుండియు రాజామెను మరలనాదరించి పూర్వమువలె గౌరవించెనఁట. ఈపిల్లకథయందలినాయిక తిరుమలదేవి కాదనియు, రెండవభార్యయైనచిన్నాదేవియనియుఁ గొందఱనెదరు.

ఉ. పాటలగంధి చిత్తమునఁ బాటిలు కోపభరంబు దీర్ప నె
 ప్పాటను బాటుగామి మృదుపల్లవకోమలతత్పదద్వయీ
 పాటలకాంతి మౌళిమణిపంక్తికి వన్నియ వెట్ట నాజగ
 న్నాటకసూత్రధారి యదునందనుఁ డర్మిలి మ్రొక్కె మ్రొక్కినన్

మ. జలజాతాసనవాసవాదిసురపూజాభాజనంబై తన
 ర్చు లతాంతాయుధుకన్నతండ్రిశిర మచ్చో వామభాగంబునం
 దొలఁగం ద్రోచె లతాంగి యట్ల యగు నాథుల్నేరముల్సేయఁ బే
 రలుకం జెందినయట్టికాంత లుచితవ్యాపారముల్నేర్తురే.

క. కోపనపదహాతిఁ గుహనా
  గోపాలుఁడు గాంచి మెయి గగుర్పొడవఁగ ను
  ద్దీపితమన్మథ రాజ్య
  ప్రాపితుఁడై పలికెఁ గూర్మి బయటపడంగన్.

చ. నను భవదీయదాసుని మనంబున నెయ్యపుఁ గిన్కఁ బూని తా
  చినయది నాకు మన్ననయ చెల్వగునీపదపల్లవంబు మ
  త్తనువుల కాగ్రకంటకవితానము దాఁకిన నొచ్చునంచు నే
  ననియెద నల్క మానవుగదా యిఁకనైన నరాళకుంతలా!

ఈకథయం దలిసత్యాసత్యములమాట యెటులున్నను నతుకు బాగుగాఁ గలిసినది కృతిపతులు తమ పేరఁ గృతిని రచింపుమని కవినిఁ గోరినట్లు, కృతికర్తలు తమగ్రంథములలోఁ బ్రాయికముగా వ్రాయుచుందురు. మనుచరిత్రమునఁ జూడుఁడు.

"క. మనువులలో స్వారోచిష
  మనుసంభవ మరయ రసమంచితకథల
  న్వినవింపు కలిధ్వంసక
  మనఘ భవచ్ఛ్రుతిరరచన కనుకూలంబున్.

వ. కావున మార్కండేయపురాణోక్తప్రకారంబునం జెప్పుమని కర్పూరతాంబూలంబు వెట్టినం బట్టి మహాప్రసాదంబని మోదంబున నమ్మహాప్రబంధనిబంధనంబునకుం బ్రారంభించితి..."

పారిజాతాపహరణమునం దీభాగ మెందువలననో లుప్తమయినది. తిరుమలదేవిపై నిర్నిమిత్తముగ రాయ లాగ్రహించినందులకై యాతిని నన్యాపదేశముగఁ జివాట్లు పెట్టవలయునని తిమ్మకవి తనంతటఁదానుగా గ్రంథమును రచించినవాఁ డగుటచే నాభాగ మిందు లేకపోయినదని తలంచుట కవకాశమున్నది. అదిసత్యమైనఁ గావచ్చును. ఈకథయందలి సత్యౌచిత్యములనుగూర్చి విమర్శించి పాఠకులు తమ యిచ్చవచ్చిన యభిప్రాయమునకు వచ్చెదరుగాక!

ఈగ్రంథమును వినినమీఁదట రాయలు తిరుమలదేవిపై నాగ్రహమునువిడిచి, యామెవశంవదుఁడయ్యెనని తలంచుట కిష్టపడక,

పరిణయకలహము తాత్కాలికము కావున దానివికారమును తాత్కా
లికమే యని తలంచువారు, శృంగారకావ్యరచనాభిలాషియై, పురాణ
కథలను దిరుగవేయుచు, హరివంశమందలికథ నాధారముగాఁగొని
యితివృత్తమును గల్పించుకొనుసందర్భమునఁ గృష్ణరాయ తిరుమలా
దేవుల పరిణయకలహవృత్తాంతము స్ఫురణకు రాఁగా, దానిని గవి
తనయితివృత్తమున కాధారముగాఁ దీసికొనెననియు నిందుమూలమునఁ
దమపరిణయకలహకథ లోకమునఁ జిరస్థాయియగును గదాయని
దక్షిణనాయకుఁడును గీర్తికాముఁడును శృంగార రసాభిలాషియునగు
శ్రీకృష్ణరాయలు సంతసించి కవిని గౌరవించెననియుఁ దలంచుటకైన
నంగీకరింపకపోరు.

పారిజాతాపహరణమునఁ గథావైచిత్ర్య మంతగా లేదు నర
కాసురవధానంతరమున నారదుఁడు శ్రీకృష్ణదర్శనార్థమై ద్వారక కరు
దెంచుచు నందనోద్యానమునుండి పారిజాతపుష్పమును దనతోఁ దీసి
కొనివచ్చి, రుక్మిణీదేవితో నత్త మాడుచున్న శ్రీకృష్ణుని సందర్శించి
యాదంపతులచే నుచితసత్కారములంది యాపుష్పమును శ్రీకృష్ణున
కిచ్చి యాకుసుమమును రుక్మిణి కీయుదునా? సత్యభామకంపుదునా?
యనియాలోచించుచున్నకృష్ణునకు రుక్మిణి కిమ్మని కనుసన్న చేసెను.
ఆతఁ డట్లే చేసెను.

కలహభోజనుఁ డగుసమ్మని యాపుష్పమహిమను నెంతయో
గొనియాడి యంతటితో నూరకుండక:—

ఉ. ఇన్నిదినంబులున్ సవతు లిందఱిలో నలసత్యభామ కన్
సన్నలఁదిమ్మరున్ హరివశంవదుఁడై యన వింటఁగాని యా
కన్నియ! నీయెడం గలుగుగారవ మెయ్యెడఁ జూచి కాన లే
కున్న ననర్ఘ్యదివ్యకుసుమోత్తమ మేరికి నైన నిచ్చునే!

ఉ. చక్కనిదాననంచు నెఱజవ్వని నంచు జగంబులోనఁ జే
రెక్కనదాన నంచు బతి యెంతయు నాకనురక్తుఁడంచుఁ దా
నెక్కుచు విఱ్ఱవీఁగుచు గణింపదు కాంతల సత్య యింతకున్
సుక్కక యున్నె నీమహిమ సూచిన చోటులు విన్నవించినన్.

౧ ఆ౬౫-౬౬.

ఈమాటలు సత్యచెవులం బడినవి. ఆమె వేత్రిటు వడ్డయురగాం గన దైనది

చ. అతులమహానుభావ మని యవ్విదిఁ బా నొక పెద్ద చేసియు
చ్యుతునకు నిచ్చకం బొదవ నూడిద యిచ్చిన నిచ్చెఁగాక తా
నతఁడు ప్రియంబు గల్గునెడ కర్పణ సేసినఁ జేసెఁ గాక యా
మతకరివేలుపుందపసి మమ్ముఁ దలంపఁగ నేల యచ్చటన్. ౧౮

అని యహంకారపూరితయై యుడుకుబోతుతన మావరింప కోపగృహం బునకుఁబోయి పండుకొనినది.

శ్రీకృష్ణుఁడు సత్యభామయింటి కరుదెంచి కళావిహీనమైయున్న యాగృహము నవలోకించి సత్యభామ యున్నకోపగృహమున కేఁగి ముసుఁగిడియున్నయామెం జేరి విసరుచున్నదాసిచేతి వీవనఁగొని విసరు చుండఁ బారిజాతకుసుమపరిమళము గృహమునం దలముకొనియెను. అది యేమని సత్యభామ ముసుఁగుందీసి శ్రీకృష్ణునిం జూచి మరల ముసుంగు వెట్టుకొని లోలోపలదుఃఖించుచు మాటలాడకుండెను. ఆమె ననునయింప నాశ్రీకృష్ణుఁడెన్నియో పాట్లుపడియెను. కాని యామె యాగ్రహము శమింపలేదు. అప్పుడు శ్రీకృష్ణుఁ డేమిచేసెనో తెలుపు పద్యములు నాల్గుపైని వ్రాసియుంటిని.

అతికష్టముపై శ్రీకృష్ణుఁడు సత్యభామ నూరార్చి "ఒకపువ్వము నకై యింత వగపెందులకు? దేవేంద్రుని నందనోద్యానమునుండి పారి జాతవృక్షమునే తెచ్చి నీపెరటియందు నాటెదను"అని శపథ మొనర్చి యామెప్రేమను జూఱగొనియెను. ఇంతలో నారదుఁడచ్చటికి వచ్చి శ్రీకృష్ణునితోఁగూడ దృష్టిగాభుజించి తనకు నమస్కరించినసత్యభామను

మ. పతి నీవై విహరింపఁగా జనము సంభావింపఁగా బంధుసం
తతి నిన్నుం గొనియాడఁగా సవతికాంతల్చూచి లజ్జింపఁగా
నతులప్రాభవ వైభవోన్నతులపోత్రివై యిట్లు వర్తించు నీ
కితరస్త్రీజనబుద్ధి దీవనలు నే నే మిచ్చెద న్మానినీ. ౨౯ ౨౮.

క. అటు లైనను గానిమ్మా
కుటిలాలక ! నీకు మగఁడు గోరినకోర్కుల్

ఘటియించుఁగాక తానెం
తటికార్యం బైనడించి నాదీవనలన్. ౨౮ ౨౫.

అని యాశీర్వదించి వెడలిపోవుచుండ శ్రీకృష్ణుఁడు "మునిసత్తమా! నరకునిసంహరించి యాతఁడపహరించిన కుండలములను మరలఁ దెచ్చితిననియు సత్యభామాసహితుండనై యమరావతికివచ్చి యాకుండలంబుల నామెకు సమర్పింతుననియు మాయమ్మ యదితితోఁ జెప్పుము" అనియెను.

అట్లే సత్యభామతోఁగూడ శ్రీకృష్ణుఁడమరావతికరిగి దేవమాత యగునదితికి వందనపూర్వకముగఁ గుండలంబుల నర్పించి శచీపురందరులచే సత్యాసమేతముగఁ బూజలనంది కొన్నిదినంబులందుండి వచ్చునప్పుడు నందనోద్యానమున నున్న పారిజాతవృక్షమును బెకలించుకొని తెచ్చి యడ్డమువచ్చిన నిర్జరేంద్రాదినిలింపులజయించి ద్వారకకరుదెంచి సత్యభామయుద్యానవనమున నావృక్షమును నాటెను.

పిమ్మట నారదోపదేశానుసారముగ సత్యభామ పుణ్యకవ్రతమును జేసి వ్రతోద్యాపన వేళ శ్రీకృష్ణుని నారదునకు ధారవోసెను. భర్తను శాస్త్రపరిజ్ఞాతయు దపస్వియు నగునొక బ్రాహ్మణునకు దానమిచ్చి యావిప్రోత్తముఁ డడిగినంత ద్రవ్యమిచ్చి భర్తనుమరల విలిచికొనుటయు సవతులతోఁగూడ పేరటాండ్రను బూజించిగౌరవించుటయు నాపుణ్యకవ్రతమున ననుష్ఠేయములైన ముఖ్యకార్యములు. సత్యస్వాధీనపతికయని లోకమునకుఁదెలుపుటకును నామె యహంభావము నడగించుటకును నీవ్రతముద్దేశింపఁబడినది.

మార్కండేయపురాణమునం దున్నయొకచిన్నకథను దీసికొని యల్లసాని పెద్దన మనుచరిత్రమును రచియించినట్లే తిమ్మయామాత్యకవి శ్రీమద్భాగవతదశమస్కంధమందలియాకింది నాల్గుశ్లోకములలో నిమిడియున్నకథను గ్రహించి యించుమించుగ నైదువందలపద్యములలో నొకమనోహరమైనకావ్యమును రచించెనని పండితులు కొందఱు తలంచిరి. కొందఱీపారిజాతాపహరణమునకు మూలముసంస్కృత హరివంశమని తలంచుచున్నారు.

చోదితో భార్యయో త్పాద్య పారిజాతం గరుత్మతి
ఆరోప్య సేంద్రాన్ విబుధా న్నిర్జిత్యోపానయత్పురం
స్థాపితం సత్యభామాయాః గృహోద్యానోపశోభనః
అన్వగు ర్భ్రమరా స్స్వర్గా ద్యద్గంధాసవలంపటాః
యయాచ ఆనమ్య కిరీటకోటిభిః
పాదా స్స్పృశ న్నచ్యుత మర్థసాధనం
సిద్ధార్థ ఎతేన విగృహ్యతే మహా
నహో పరాణాంచ తమోధిగార్యతాం

ఈశ్లోకములను బోతయామాత్యుఁ డీవిధమున నాంధ్రీకరించెను.

"......పిదప సత్యభామ గోరిననందనవనంబు సొచ్చి. ౨౧౪

మ. హరి కేలం బెకలించి తెచ్చి భుజగేంద్రారాతిపైఁ బెట్టి సుం
దరగంధానుగతభ్రమద్భ్రమరనాదవ్రాతముం బల్లవాం
కురశాఖాఫలవర్ణపుష్పకలికాగుచ్ఛాదికోపేతమున్
గిరిభిత్త్రాతముఁ బారిజాతముఁ ద్రిలోకీయాచకాఖ్యాతమున్ ౨౧౫

వ. ఇట్లు పారిజాతంబునుహరించి యదువల్లభుండు వల్లభయుం దానును విహగవల్లభారూఢుండయి చనుచున్నసమయంబున. ౨౧౬

సీ. నరకాసురునిబాధ నలఁగి గోవిందుని
కడ కేఁగి తత్పాదకమలములకుఁ
దనకిరీటము సోఁక దండప్రణామముల్
గావింప నాచక్రి కరుణసేసి
చనుదెంచి భూసుతు సమయించి తనవారిఁ
దన్ను రక్షించుటఁ దలఁప మఱచి
యిందుఁడు బృందారకేంద్రత్వమదమునఁ
బద్మలోచన పోకు పారిజాత

ఆ. తరువు విడువు మనుచుఁ దాఁకె నడ్డము వచ్చి
తఱిమి సురలు నట్ల తాఁకి రకట
యెఱుక వలదె నిర్జరేంద్రత గాల్పనే
సురలతామసమును జూడనరిది. ౨౧౭

వ. ఇట్లు తనకు నొడ్డారించి యడ్డంబు వచ్చిన నిర్జరేంద్రాదుల నిర్జించి తనపురంబునకుం జని నిరంతరకుసుమమకరందమాధురీవిశేషంబులకుఁ జొక్కి చిక్కక నాకలోకంబుననుండి వెంట నరుగుదెంచు తుమ్మెదలకు నెమ్మదలంచు చున్నపారిజాతమ్ము నాశ్రితపారిజాతుం డయినహరి మహాప్రేమాభిరామ యగుసత్యభామతోఁ గ్రీడించు మహోద్యానంబున సంస్థాపించి నరకాసురునియింటం దెచ్చినరాజకన్యక లెంద ఱందఱకు నన్ని నివాసంబులుగల్పించి గృహోపకరణంబులు సమర్పించి" ౨౧౮

భాగవతము, దశమస్కంధము, ఉత్తరభాగము.

పారిజాతవృక్షమును శ్రీకృష్ణుఁడు నందనోద్యానమునుండి హరించి తెచ్చుట యిందలి ప్రధాన కథయగుటచేఁ గవి దీనికిఁ బారిజాతాపహరణ మని పేరిడియున్నాఁడు.

ఈకథ సంస్కృతహరివంశమున ౬౮–౭౬ అధ్యాయములలో నున్నదనియు, సూర్యోదయాస్తమయాదిప్రబంధోచితవర్ణనలు సంస్కృతమున లేకపోయినను, తిమ్మనకవి యాంధ్రమునఁ జేర్చినాఁడనియుఁ, బుణ్యకవ్రతమునుగూర్చి సంస్కృతమున నంతవిస్తారముగా లేదనియు బారిజాతమునకొఱకు శ్రీకృష్ణుఁడు తపము నొనర్చెనని సంస్కృతమున నుండగా దానినాంధ్రమున విడచివేసెననియు, నిట్టివే స్వల్పమార్పులు దక్క సంస్కృతమునకును దెలుఁగునకును గథాంశములలో విశేషభేదము లేదనియుఁ బారిజాతాపహరణపీఠికయందు శ్రీ విద్వాన్ దూశి రామమూర్తిశాస్త్రిగారు వ్రాసియున్నారు. దీనినిబట్టి పారిజాతాపహరణప్రథమాశ్వాసము నందలికథయంతయును, ద్వితీయాశ్వాసమున సాయంకాలవర్ణన మారంభమగువఱకునుగలకథయును సత్యాకృష్ణు లమరావతి కేఁగినప్పుడు శ్రీకృష్ణదర్శనలాలసలైవచ్చినపురస్త్రీలవర్ణనమును, పుణ్యకవ్రతాంశమును సంస్కృతహరివంశముననున్నవనియే తలంపవలసియున్నది. పారిజాతాపహరణమున నీభాగములే శృంగారరసాలవాలములు. తిమ్మకవికవితామృత మిందే వెల్లువవలెఁ బ్రవహించుచున్నది.

సంస్కృతహరివంశమును నాచనసోముఁడును, నెఱ్ఱాప్రెగ్గడయు నాంధ్రీకరించిరి. వీరియాంధ్రీకరణవిధానమును వారిచరిత్రలయందు వ్రాసియున్నాఁడను. నాచనసోముఁడీకథనాంధ్రీకరింపక వదలివైచి నాఁడు. ఇతఁడు శృంగారరసాభిలాషి. శృంగారరసాత్మక మైనయిట్టికథ నాంధ్రీకరింపక యీతఁ డేలవదలివేసెనో తెలియకున్నది మూలాను సారముగ నాంధ్రీకరణమును సాగించినయెఱ్ఱాప్రెగ్గడ, భాగవతము వలెనే క్లుప్తముగ నీకథను వ్రాసియున్నాఁడు. రుక్మిణీసంబంధ మిందు లేనేలేదు. పుణ్యకవ్రతప్రశంసయు లేదు. శ్రీకృష్ణుఁడు సత్యాసమేత ముగా నరకాసురవధానంతర మమరావతికేఁగి యింద్రాదిదేవతలచేఁ బూజలంగొని, యదితికిఁ గుండలములర్పించి, తిరిగి వచ్చునప్పుడు పారి జాతవృక్షమును బెకలించుకొనివచ్చి ద్వారకయందు నాఁటె ననునంత వఱకుఁ గలకథను మాత్రమే ౭౦ పద్యములలోను గొన్నివాక్యముల లోను ఎఱ్ఱాప్రెగడ వ్రాసియున్నాఁడు. అతిరసవంతమై పాఠకుల హృద యాకర్షణ మొనర్చు నీకథను మూలానుసారముగ నాతఁ డేల యాంధ్రీ కరింపలేదో తెలియకున్నది.

పారిజాతాపహరణము హరివంశకథానుసరణమని తిమ్మనరచిం చిన యీక్రిందిపద్యము వలన సూచితమగుచున్నది.

సీ. హరివంశకథలెల్ల నానుపూర్విగ నిట్టు
విని కృతార్థుఁడనైతి మునివరేణ్య!
యాదానవారాతి యమరులఁ బ్రోవంగఁ
బూని యాయదువంశమున జనించి
యతఁడు గ్రమ్మఱవారి కాధారమగు పారి
జాతంబు పుడమికేరీతిఁ దెచ్చె
ననుమతి నిచ్చిరో యావేల్పు లొండేని
బలిమిఁ జేకొనియెనో పాడి దొఱఁగి
తే. తెలియ నానతియిమ్ము సందియముదీఱ
వినఁగ వేడుకయయ్యె సవిస్తరముగ
ననిన నావ్యాసముని శిష్యుఁడతనితోడ
నధిప వినుమని పలికె సత్యాదరమున.”

ఈపద్యమునుబట్టి హరివంశకథలన్నియుఁ బూర్తిగా వినినపిమ్మట జనమేజయుఁడు పారిజాతాపహరణ వృత్తాంతమును విపులముగ వినఁగోరి మరల ప్రశ్నించెనని స్పష్టమగుచున్నది. ఈపద్యార్థమునిచ్చు సంస్కృతశ్లోకములు హరివంశమున నున్నవో లేవో ఆగ్రంథమీాచారిత్రమును వ్రాయునప్పుడు నాయొద్దలేమింజేసి చెప్పఁజాలను. సంస్కృతమున ౬౮-౭౬ అధ్యాయములు హరివంశమధ్యమున నున్నవి. అంతకుఁబూర్వము హరివంశకథలన్నియుఁ బూర్తికాలేదు. స్వల్పభాగమేమైనవి. అందుచేత "హరివంశకథ లెల్ల" ననియర్థమిచ్చు శ్లోకములు సంస్కృత హరివంశమునందుండుట యసంభవము. అట్లున్నచో నాశ్లోకములు ప్రక్షిప్తములన వలసివచ్చును.

భారతశేషము హరివంశమయినట్లే హరివంశశేషము పారిజాతాపహరణమని పైపద్యమువలన ద్యోతకమగుచున్నది. అట్లయినచో, నీ పారిజాతాపహరణ వృత్తాంతము హరివంశమధ్యమున నుండుట సంభవింపదు.

పైనీసపద్యమునందలి తక్కిన పాదములనుబట్టి పారిజాతాపహరణవృత్తాంతము మొదటక్లుప్తముగా వైశంపాయనుఁడు చెప్పెననియు నప్పుడే జనమేజయుఁడాకథను సవిస్తరముగఁ దెలుపుమని యడిగెనని యుఁ దలంపవచ్చునని పైసందేహమునకు సమాధానమీాయవచ్చును. కాని యాపక్షములో మొదటిపాదమునకు బ్రసక్తియుండదు.

ఈసందర్భముల నన్నటిని బరికించిచూఁడగా నెట్టాప్రగడ యాంధ్రీకరించిన స్వల్పభాగమే మొట్టమొదట సంస్కృతహరివంశమున నుండెననియు, దానింగైకొని తిమ్మనార్యుఁడుతనస్వకపోలకల్పనలతో నీయుత్తమకావ్యమును హరివంశశేషముగా రచియించెననియు, నాతరువాత నెవ్వరో పండితావతంసుఁ డీకథయందుఁ బాతోచితములుకావనియో ననమంజసములనియో తనకుఁదోచినభాగములను మార్చి శ్లోకములుగా రచించెననియు; నవిక్రమముగా సంస్కృత హరివంశమునఁ జేరియుండుననియుఁ దోఁచుచున్నది.

హరివంశములోని కొన్నికథలను నాచనసోముఁ డాంధ్రీకరింపలేదు. అయినను నిట్టిచక్కనికథను నాతఁడైనను నాంధ్రీకరింపక యుండఁడు. సత్యభామకోర్కె ననుసరించి శ్రీకృష్ణుఁడు స్వర్గమున కేఁగి పారిజాతవృక్షమును దెచ్చినను స్వల్పగాథ యాతనిదృష్టి నాకర్షింపకపోఁగా నాతఁడు దానిని దెలిఁగింపక వదలివేసెనని తలంపవచ్చును. కాని మూలానుసారియగు నెఱ్ఱాప్రెగ్గడ రసవంతమగుభాగమును విడిచి నీరసమగుభాగమును క్లుప్తీకరించి రచియించెనని తలంపరాదు. నరకాసురునితో సత్యభామ యుద్ధము చేసినప్పుడు శ్రీకృష్ణుఁడొనర్చిన శృంగారచేష్టలను జక్కఁగావర్ణించిన యెఱ్ఱన యీభాగమును వదలివేయునని యెంచరాదు. ౬౮-౭౬ అధ్యాయములు గలభాగ మెఱ్ఱనకు లభింపలేదనియు భాగవతమువలెనే క్లుప్తమైనకథను గలిగియున్నప్రతియే లభించుటచే నందున్నట్లుగానే యాతఁడు తెలిఁగించెననియు మనము తలంపవలసియున్నది. ఈయూహ వాస్తవమయ్యేనేని సంస్కృతమందలి ౬౮-౭౯ అధ్యాయములలోఁ గొంతప్రక్షిప్తమనక తప్పదు. అయిన నీవిషయమున నింకను బరిశోధన మావశ్యకము. ఉత్తరహిందూదేశమందలి హరివంశతాళపత్రప్రతులును దక్షిణదేశమందలి వ్రాఁతప్రతులును బరిశోధించు టావశ్యకము.

గ్రంథవిస్తరభయమున్నను నెఱ్ఱనరచించిన పారిజాతభాగమును బరిశోధకుల సౌకర్యముకొఱకు క్రిందనిచ్చుచున్నాఁడను.

"క. ఏతరువు సురాభ్యర్చిత
మేతరువు గరం బభీష్ట మింద్రాణికి వి
ఖ్యాతం బేతరువు నిజ వి
భూతిఁ ద్రిభువనంబులం బ్రభూతస్థితులన్. ౨౧౮

క. ఏతరువు సమీపమునకు
నే తేరఁగ నాఋణాంబ యెంతయు నరుదై
జాతిస్మరత్వ మగునే
జాతికి నే నట్టిపారిజాతముఁ గనియెన్. ౨౧౯

ఉ. అత్తరి సత్యభామ తను నాదిసురాంగనగాఁ దలంచు చ
య్యుత్తమదివ్యవాసనసముద్ధతమై మది నుల్లసిల్లఁ బె
ల్లెత్తినవేడ్క నవ్వరమహీరుహముం దనసొమ్ము సేతకై
మెత్తన వేఁడెఁ జిత్తవిభు మేకొని యచ్యుతుఁడుం జెచ్చెరన్. ౨౧౭

తే. పెఱికి పారిజాతముఁ దార్క్ష్యుపెద్దవీఁపు
మీఁద నిడికొని ప్రియకాంత మెచ్చి యలర
దేవలోకంబు వెలువడఁ గా వనంబుఁ
గాచియున్నకింకరులు పెక్కండ్రు గడఁగి ౨౧౮

వ. అడ్డపడి యనేకశస్త్రాస్త్రవిలసనంబుఁ జూపిన నవ్వుచు నవ్వీరుండు ౨౧౯

మ. స్ఫుటశార్ఙ్గచ్యుత తీవ్రబాణపటలస్ఫారప్రచారంబునం
దుత్రుటితగ్రీవుల దారితోదరుల నిర్ఘూర్ణాంఘ్రులన్ భిన్నహ
స్తతటులం జేయఁగఁ గొంద ఱేఁగి యధికత్రాసంబునం జెప్ప ర
ప్పటుబాహావిభవుం డొనర్చినక్రియాపర్యాప్తి గోత్రారికిన్. ౨౨౦

క. దేవాధిపతియు మదిలో
నావిభుఁడు త్రిలోకహితసమాచరణకళా
కోవిదుఁ డగుట యెఱిఁగి య
థావిధ మగుతత్కృతంబు తగ నోడఁబడియెన్. ౨౨౧

ఆ. మనసు పట్టలేక యనిమిషకోటితో
నరిగి యతనిఁ దాఁకి యనియొనర్చి
వజ్రమతనిమీఁద వైచి తద్వేగసం
స్తంభనమున మదము దక్కి సుగ్గి ౨౨౨

వ. అమ్మహాత్ముతోఁ దదీయవివృత్తిపర్యంతంబు దివ్యమహీరుహంబు మహీతలస్పర్శిగా నోడంబఱిచి యమరావతికిం జనియె. కృష్ణుండు నిత్తెఱంగునం బారిజాతంబు గైకొని నిజపురాభిముఖుండయ్యె. ౨౨౩

... ... ... ...

వ. పారిజాతంబును నవతారితంబు సేసి ప్రద్యుమ్ను నాజ్ఞాపింపనతం
డయ్యుత్తమతరువు నంతఃపురంబునకుం గొనిపోయెఁ దత్సన్నిధానం

బున సకలకుకురాంధకవరులుఁ గుమారులును దివ్యంబు లగుతమ పూర్వజన్మంబులు సంస్మరించి యది తదీయప్రభావంబుగా నెఱింగి యద్భుతంబు నొందిరి. గోవర్ధనధరుం డాధరణీధరశిఖరంబును గల్ప వృక్షంబును బ్రశస్తంబు లగు నెలవులం బ్రతిష్ఠితంబులు సేయించి

౨౩౧.

ఉత్తరభాగము. చతుర్థాశ్వాసము.

పారిజాతమును సత్యభామయుద్యానవనంబునఁ బ్రతిష్ఠించెనని భాగవతమునం దుండ నిందట్లులేక ప్రశస్త మగు నెలవున నాటించె నని యున్నది.

సంస్కృతహరివంశ మందలియధ్యాయములు ప్రక్షిప్తమను టకే, యుపపత్తు లధికముగఁ గన్పట్టుచున్నవి. ఆకాలమునఁ బురాణములయం దుండెడిచిన్నకథలను దీసికొని పెంచి కావ్యములను రచించుటయందును, కథ నుగల్పించి ప్రబంధములను నిర్మించుటయందును, గవులకేమి, కృతిపతులకేమి యభిరుచి మెండు. ఇందులకు మనుచరిత్రము, రాజశేఖరచరిత్రము, వసుచరిత్రము, కృష్ణార్జునసంవాదము, కళాపూర్ణోదయము మొదలగుకావ్యములు నిదర్శనములు. హరివంశమునఁ దొమ్మిదియధ్యాయములలోనున్నకథను భాషాంతరీకరించెననుటకంటె నాయధ్యాయములు ప్రక్షిప్తము లనితలంచుటయే యుచితము.

తిమ్మకవికవిత్వము మృదుమధురపదసంయుతమై మనోహరముగా నున్నది. ఆకాలపుకవులే "ముక్కు తిమ్మనార్యుముద్దుపలుకు" అని శ్లాఘించియున్నారు. తమగ్రంథములయం దితనినుతించినకవులు పెక్కురున్నారు. వారు రచించినపద్యములను, గ్రంథ మధికమగుననుభీతిచే నిట నుదాహరింపను. వట్టమట్టసరస్వతిసోమయాజికృత మగునొక్క పద్యము నీక్రింద నిచ్చెదను.

క. భారతికి ముక్కు నిల్పిన
ధీరులకును దిక్కు ముక్కు తిమ్మయ సూ! యం
చారసి యారసికునికృతి
సారస్యముఁ దలఁతు ధీరసారస్యముగన్ ...పృథుచరిత్ర

ఈకవియందుఁ గృష్ణరాయలకధిక గౌరవము కలదు. రాయలీతని కగ్రహారాదుల నిచ్చి సన్మానించినట్లీతఁడు చెప్పిన "కృష్ణరాయక్షితీశ కరుణాసమాలబ్ధ ఘనచతురంతయాన మహాగ్రహారసన్మానయుతుఁడు" అను వాక్యములవలన స్పష్టమగుచున్నది.

ఇతని నివాసము బళ్లారిమండలమని యూహింపవచ్చును. ఇతని జననమరణకాలములను నిర్ణయించుటకాధారములు లేవు. ఇతఁడు తనమేనమామయైన ఘంటసింగయకంటె నిరువదిసంవత్సరములు చిన్నవాఁడనియుఁ గృష్ణరాయలరాజ్యకాలమంతయు నాతనియాస్థానమునందున్నవాఁడనియు నిర్ణయించుటకు సంశయింప నక్కఱలేదు. రాయల యనంతరము నందీతఁడు జీవించియుండెనో లేదో, ఉన్నచో నెంతకాలముండెనో తెలియదు. ఇతఁడు యుద్ధయాత్రలలో రాయలతోఁగూడ నుండెడివాఁడు.

శ్రీకృష్ణరాయలును పెద్దనార్యుఁడును ముక్కుతిమ్మనయుఁ దమతమగ్రంథములలో దశావతారములను నుతించుచుఁ బద్యములనువ్రాసియుండిరి. వాని నిట నుదాహరించినచో వారికవితా తారతమ్యము తెలియునని యూహించితిని. కాని గ్రంథవిస్తర శంక చేసీయ లేదు.

ఈకవినిగూర్చి కథలనేకమున్నవి. ఆంధ్రకవులచరిత్రమున నుదాహృతమైన యొకకథనిట వ్రాయుచున్నాఁడను.

"ఈకవియొక్క దాతృత్వమునుగూర్చి యొకకథగలదు. ఇతఁడు పారిజాతాపహరణమును రాజున కంకితముచేసినపుడు రాజు చతురంతయాన మహాగ్రహారములును మణికుండలములును బహుమానము చేసెను. ఆయమూల్యమణి కుండలములను ధరించి తిమ్మనవాకిట గూరుచుండియుండఁగా నొకబట్టువచ్చి యాతనికవనసైపుణి నిట్లుస్తుతించెనఁట!

క. మాకొలఁది జానపదులకు
నీకవితాశైలి యబ్బునే కూపనట
ద్భేకములకు గగనధునీ
శీకరములచెమ్మ నందిసింగయతిమ్మా ?

స్తుతింపఁగానే యతఁడు తనయొద్దనప్పుడు మఱేదియునమూల్య వస్తువు లేకపోవుటచేత వెంటనే తనచెవినున్న యమూల్యరత్నకుండల మొకటి యాబట్టుకవి కిచ్చెనఁట! మఱునాఁడు తిమ్మకవి యొంటిచెవికుండలముతోనే రాజాస్థానమునకుఁ బోయియుండఁగా నచ్చటికాబట్టుకవియు వచ్చెనఁట! అపుడు ప్రస్తావవశమునరాజాకుండలదాన వృత్తాంతమును బట్టుచెప్పిన పద్యమును విని యాపద్యమునందలి 'గగన' శబ్దమునకు మాఱుగా 'నాక' యనియుండినచో మరింత సరసముగా నుండునని సెలవిచ్చెనఁట అప్పుడాపద్దెమునకు వన్నె దెచ్చితిరనిచెప్పి తనచెవికుండలమును దిమ్మకవియుఁ దనచెవికుండలమును బట్టుకవియు రాజుముందఱఁ పెట్టిసమర్పించిరట! రాజువారి యౌదార్యమునకును సరసత్వమునకును మెచ్చి యిరువురకును సర్వబహుమతులిచ్చి పంపెనఁట!

ఈతని కవిత్వశైలిచూపుటకుఁ బైనివ్రాసిన పద్యములే చాలియున్నను నిదివఱకుదాహృతములుకాని ౩,౪,౫ ఆశ్వాసములనుండి మఱి మూఁడుపద్యముల నుదాహరించి యీతనిచారిత్రమును ముగించెదను.

చ. జలరుహనేత్రుఁగాంచి సరసత్వము మీఱఁగ నొక్కవేడ్కఁపుం
జిలుకలకొల్కి రాచిలుకచేఁ బిలిపించిన సత్యభామ కా
కలికి తెఱంగు శౌరి కడకన్నులసన్నలఁజూపెఁ గోపక
న్దళికలుపాయితొక్కి వలనంబుల నాసతిదన్నదల్పఁగన్ ౩ఆ౨౦

ఉ. తానఁటె పారిజాతవసుధారుహముం గొనిపోవువాఁడు క
న్గానఁడు యాదవుండనుచుఁ గన్నులు వేయును జేవుఱింప వై
శ్వానరధర్మదైత్యనర వారిధిపానిలయక్ష నాయకే
శానులదిక్కు చూచికులిశంబుకరంబునఁబూఁచిపట్టినన్.౪ఆ౬౩

మ. సమయజ్ఞుండయి గర్గసంయమి మహాసంకల్పముం జెప్పఁగ
ల్పమహీజంబు సదక్షిణాకము నిజప్రాణేశుఁగూడ న్నృప
ర్వముని శ్రేష్ఠునకిచ్చె దానముగ ధారాపూర్వ మవ్వేళఁ "దు
భ్యమహం సంప్రదదేనమోనమ" యటం చద్దేవి మోదంబునన్
౫ ఆ ౮౨.

నారదునియొద్దనుండి శ్రీకృష్ణుని మరల విలిచికొనుటకై యాతని యెత్తు ధనమిమ్మని నారదుఁడడిగెననియు నంపులకు సత్యభామయొద్ద

నున్న ద్రవ్యమంతయుఁ జాలకపోఁగా నామెచే: బ్రార్థితయై రుక్మిణి యచ్చటకు వచ్చి యొకతులసీదళము తులయందుంచఁగా నది శ్రీకృష్ణు నితోఁ దులదూగెననియు నొకయైతిహ్యము కలదు.

---

# 101 ధూర్జటి కవి

ఈకవి కాళహస్తి మాహాత్మ్యమను నాల్గాశ్వాసముల పద్యకావ్యమునురచించి కాళహస్తీశ్వరున కంకితము చేసెను. ఈక్రిందనుదాహరించిన యాశ్వాసాంతగద్యతక్క కవి తననుగూర్చి గ్రంథమున నొక్కమాటయైనను, జెప్పుకొనియుండలేదు.

"ఇది శ్రీమత్కాళహస్తీశ్వరచరణకమల సేవాపరాయణ సింగమరమానారాయణ జక్కయనారాయణ తనూభవ భవపరాఙ్ముఖధూర్జటిప్రణీతంబైన శ్రీకాళహస్తిమాహాత్మ్యంబను మహాప్రబంధంబునందు సర్వంబును జతుర్థాశ్వాసము"

ఈపద్యమునుబట్టి కవి తల్లిపేరుసింగమయనియు తండ్రిజక్కయతనయుఁడైన నారాయణుఁడనియుఁ దెలియుచున్నది. కృత్యాదియందిష్ట దేవతాప్రార్థన మైనపిదప షష్ఠ్యంతములకుఁ బూర్వమీక్రింద నుదాహరించిన యైదుపద్యములను వ్రాసియున్నాఁడు.

క. ఈరీతి నిష్టదేవ స
మారాధన మాచరించి యస్మత్కృతిక
న్యారత్నమునకు విద్యా
పారంగతుఁడైన వరునిఁ బరికించి మదిన్.

శా. వాగర్థంబులు శ్రోత్రవక్తలు జగద్వంద్యాంఘ్రులు న్నద్వైత వి
ద్యాగోష్ఠిన్ వివరింప నీశ్వరుఁడ కాదామ్రప్రబంధాధి ప
త్యాగణ్యుఁడు వేఱొకండు గలఁడే యామాట లేలంచుఁ జే
తోగమ్యుండగు కాళహస్తిపతి నాథుంగా సమర్థించితిన్.

ఉ. ఈశుభకావ్య రత్నమునకీశు నధీశుని జేసివన్ మహా
దేశికసార్వభౌముఁడు మదిం బ్రముదంబు వహించి ధూర్జటీ
నీశివభక్తి కావ్యసరణిం గడుధన్యతఁబొంద నవ్యభా
షాశతథానిగుంభనరసస్థితి నొప్పఁదలిర్పఁ జెప్పుమీ.

క. అని గురుఁ డనుపమ కరుణా
వనధియనుగ్రహము సేయవరమౌని మనో
వనజవనరాజ హంసము
ననుభవగోచరుఁ గృతీశు నభివర్ణింతున్

మ. తనయిల్లాలఖిలైక మాత; తనసంతానంబు భూతవ్రజం;
బనులాపంబులు వేదము: ల్దనవిహారాగారము ల్మౌనిహృ
ద్వనజంబు; ల్దనసేవకుల్గమల జాతశ్రీధరు; ల్గాఁ జెలం
గిన దేవోత్తము నమ్మహాత్ముఁ దరమే కీర్తింపఁగా నేరికిన్.

ఈపద్యములో నైనను ధూర్జటియను పేరొక్కటితక్క మరియేవిషయ మును గానరాదు. గురునిపేరయినను జెప్పలేదు. కాళహస్తిమాహాత్మ్య మునందీ ధూర్జటి యేకులమువాఁడో, ఎప్పటివాఁడో, ఎచ్చటివాఁడో తెలిసికొనుటకుఁ దగినయాధారము లేవియు లేవు.

శ్రీకృష్ణరాయవిజయమును రచించినకుమారధూర్జటి యనినా మాంతరముగల వెంకటరాయామాత్యకవి ధూర్జటికిఁ బౌత్రుఁ డయి నట్లు కృష్ణరాయవిజయమందలి యీక్రిందిపద్యమువలనఁ దెలియు చున్నది.

సీ. నను భరద్వాజగోత్రుని సదాపస్తంబ
సూత్రుని బాంధవస్తోత్రపాత్రుఁ
బాకనాఁ టార్వేలవంశప్రసిద్ధుని
ధూర్జటిపౌత్రు బంధురచరిత్రు
సద్గురుకారుణ్యసంప్రాప్తవిద్యావి
హారుని శ్రీకాళహస్తినిలయు
చిత్రపనూనాంబికా శ్రీకరానుగ్రహ
సాధిత కవితారసజ్ఞహృదయు

సారరచనాధురీణుఁ గుమారధూర్జ
టిప్రధానాగ్రగణ్యుఁ బటీరహీర
మహితసత్కీర్తిఁ గాళయామాత్యపుత్త్రు
వేంకటార్యుని బిలిపించి వేడ్క ననియె.

ఈపద్యమునుబట్టి మనధూర్జటికవి పాకనాటి యార్వేలనియోగి బ్రాహ్మణుఁ డనియు ఆపస్తంబసూత్రుఁ డనియు భరద్వాజగోత్రుఁ డనియుఁ జెప్పవచ్చును. కాని ఈసీసపద్యములో వర్ణింపఁబడినధూర్జటియుఁ గాళహస్తిమాహాత్మ్యమును రచించినధూర్జటియు నొక్కఁడేయని నిశ్చయించుట కాధారములిందు లేవు. పైపద్యములో ధూర్జటినిఁ గవి యని చెప్పలేదు, కృష్ణరాయవిజయమును రచించినకుమారధూర్జటికి లింగరాజకవి యనునొక తనయుఁడు కలఁడు. అతఁడు పెదకాళహస్తి మాహాత్మ్య మనుగ్రంథమును రచించి, కాళహస్తిని బాలించుచున్న దామెర్ల అక్కరాజు వెంకటపతిగారి కంకిత మిచ్చి యుండిరనియు, దానిని తాము చదివియుంటి మనియు వ్రాయుచు, ధూర్జటికవికృత కాళహస్తిమాహాత్మ్య ముద్రితప్రతిపీఠికలోఁ బీఠికాకారులగుకొత్తపల్లిపద్మనాభశాస్త్రులుగారు పెదకాళహస్తిమహాత్మ్యములోనివని యుదాహరించినపద్యముల నీక్రింద నిచ్చుచున్నాఁడను.

సీ. శ్రీకాళహస్తిగౌరీనాథపదపద్మ
సద్భక్తియుక్తి నిశ్చలతఁ గాంచి
సారసుధాసారసరసోక్తిగుంభనఁ
గాళహస్తిమహత్త్వకథ నొనర్చి
కృష్ణరాయకిరీటకీలితమణిగణా
ర్చితపదాబ్జద్వయశ్రీ వహించి
యాసేతుకాశీతటావనీవిఖ్యాత
సత్కీర్తివిస్ఫూర్తిఁ జాల వెలసి
ధరణిఁ జెలువొందె నేకవీశ్వరవతంస
రత్న మెమ్మహనీయుఁ ధూర్జటిసుధీంద్రుఁ
డలఁతు జలనిధివీచికాకలకలాను
కారి భూరికవిత్వవాక్పటిమ గులుక,

సీ. శ్రీకాళహస్తీశసేవనాసక్తచిత్త
చిత్తజాకార లక్ష్మీవిహార
రమణీయశీల భారద్వాజగోత్రప
విత్ర యాపస్తంబసూత్ర మహిత
ధూర్జటివంశపాథోధిచంద్ర కుమార
ధూర్జటినామ విస్ఫూర్జితాంక
స్తుతమతి వేంకటపతితనూభవ లింగ
రాజకులేంద్ర ధైర్యాచలేంద్ర

క. వినుకాళహస్తిమహిమం
బనుపమమై వెలయు మును షడధ్యాయికథన్
దెనుఁగునఁ గావ్యముగ నొన
ర్చెను పెదధూర్జటికవీంద్రశేఖరుఁ డనఘా.

గీ. బహుపురాణమథితభవ్యార్థశివతత్త్వ
సార మెల్ల నైక్యసరణిఁ బొదలి
జగతి శివరహస్య సగ్రహ మనునితి
హాస మొనరు విబుధు లభినుతింప.

సీ. అయితిహాసంబునందలి యుత్తర
భాగంబునందు భాస్వన్నిరూఢిఁ
గాళహస్తిమహత్త్వకథ నూటయిర్వది
యధ్యాయములఁ జెలు వమరు చుండుఁ
దత్కథఁ దెనుఁగున చారిత్రరసార్మికా
పరిపాకవిస్ఫూర్తిఁ బరిఢవిల్లఁ
గృతి యొనర్పుము మదంకితముగ శబ్దచ
మత్కృతిఁ బండితు లాది గణింప,

ఈపద్యములవలనఁ పెదధూర్జటికవి కాళహస్తిమహాత్మ్యమును రచియించినట్లును, అతఁడు కృష్ణరాయలయాస్థానమున గౌరవము నందినట్లును దెలియుచున్నది. ఈతనిని పెదధూర్జటి యనిచెప్పుటచేత పెదధూర్జటియనియు చినధూర్జటియనియు నిరువురుధూర్జటులు కలరని

యు, నందు చినధూర్జటిపౌత్త్రుఁడు కుమారధూర్జటి యనియుఁ గృష్ణ రాజవిజయమునందలి పైనీసపద్యమున, కుమారధూర్జటి తనపితామహు డైన చినధూర్జటినే తలపెట్టెననియు నూహింపఁదగియున్నది. ఈయూ హ సరియైన దనుటకు, కృష్ణరాయవిజయమునందలి యీక్రిందిపద్యము సాక్ష్య మొసంగుచున్నది.

చ. స్తుతమతి యైనయాంధ్రకవి ధూర్జటిపలుకుల కేల కల్గెనో
యతులితమాధురీమహిమ నా మును మీపెదతాత చాలస
న్నుతిఁ గనెఁ గృష్ణరాయలమనోజ్ఞసభ న్నీను మీవు నట్ల మ
త్కృతబహుమానవైఖరులఁ గీర్తి వహింపుము ధాత్రిలోపలన్.

కృష్ణరాయలచే గౌరవమునొందిన ధూర్జటి, కుమారధూర్జటికిఁ బెదతాతయని యిందు స్పష్టముగా నున్నది. దీనినిబట్టి పైనీసపద్యము లోని "ధూర్జటిపౌత్త్రు" అనువాక్యమునందలిధూర్జటి కుమారధూర్జటికి బితామహుఁ డనియు, నూహించుటలోఁ దప్పులేదు. కాని కాలనిర్ణ యముఁ గావింపవలసివచ్చినప్పు డీయూహలు సరియైనవికావని తేలినది, 'పెద్దతాత' అనఁగా వరుసకుఁ దాతయనియు కేవలము పెదతాత కాఁ డనియు స్పష్టమైనది. ఈవిషయమును గుమారధూర్జటి చారిత్రమున విపులముగాఁ జర్చించియున్నాఁడను.

కాళహస్తిమాహాత్మ్యమును రచించినధూర్జటికృష్ణదేవరాయల సభ యందలియష్టదిగ్గజములలో నొకఁ డనిప్రతీతి కలదు. "స్తుతమతి యైన యాంధ్రకవిధూర్జటిపల్కుల కేలఁగల్గెనో యతులితమాధురీ మహిమ!" అని కృష్ణరాయలే ప్రశ్నించెననియు, నందుపైఁ దెనాలి రామకృష్ణుఁడు లేచి "హా! తెలిసెన్ భువనైకమోహనో ద్ధతసుకు మారవారవనితాజనతాఘనతాపహార సంతతమధురాధరోదితసుధా రసధారలు గ్రోలుటంజుమీ" అని ప్రత్యుత్తర మిచ్చె ననియుఁ జెప్పె దరు. తెనాలిరామకృష్ణకవి కృష్ణదేవరాయలకాలములోనివాఁడు కాఁ డనియు మఱియేకవియో దీనిని బూరించియుండుననియుఁ గొంద ఱం దురు. రామకృష్ణకవి కృష్ణరాయలకాలమువాఁడని స్థిరపడినచో నీ

పూరణకర్త యాతఁడని నిశ్చయింపవచ్చును. కుమారధూర్జటియే గ్రంథస్థముచేసియున్నందున రాయలసభలో నీసంభాషణమే జరుగలే దనియు నిది యసత్య మనియుఁ జెప్పుటకు వీలులేదు. కాళహస్తి మాహాత్మ్యముఁబట్టి శివభక్తులలో నగ్రగణ్యుఁ డని చెప్పఁదగినధూర్జటి సంతతవేశ్యాప్రియుఁ డగుట యాశ్చర్యముగ నే గన్పట్టును. యౌవన మున నట్లు స్వేచ్ఛగా సంచరించి, వయసు మరలినపిమ్మట పశ్చాత్తప్తుఁడై శివభక్తాగ్రేసరుఁడై కాళహస్తిమాహాత్మ్యమును రచియించి యుండవచ్చును. శ్రీకృష్ణదేవరాయలు, స్తుతమతి-యతులితమాధురీ మహిమ" అని కొనియాడుట కీకాళహస్తిమాహాత్మ్యమే కాకుండ మరి యేదేని కృతిగాని యేవేని కృతులుగాని ధూర్జటిచే రచితములయ్యె నేమోయని యనుమానము కలుగుచున్నది. కాని అట్టివి యున్నట్లు కుమారధూర్జటిగాని లింగరాజుగాని చెప్పియుండలేదు.

ఇత్వసంధులు, రేఫద్వయమైత్రి మొదలగుప్రయోగము లీకావ్యమునఁ గన్పట్టుచున్నవి. ఇవి కవికి సమ్మతములని యే యూహింపఁదగి యున్నది. కాని తెలియక ప్రయోగించెనని తలంపరాదు.

ఈతనికవిత్వము ద్రాక్షాపాకమున మృదుపదసంయుతమై యన ర్గళధారతో భక్తిరసపూరితమై యొప్పారుచున్నది. కవిత్వశైలి తెలియుటకై కొన్నిపద్యముల నుదాహరించుచున్నాఁడను. కాళహస్తీశ్వర మాహాత్మ్యమందలికథలుగూడ మనోహరములై శివునిమహిమలం దెలుపుచు భక్తిరసోద్దీపకములై యొప్పుచున్నవి. వానిసారము వ్రాయుటకు తావు చాలదు.

చ. పరిచితబంధనైపుణి నపారకళానుభవప్రసక్తి నా
దరసవివేకసంపద సదాశుకవాక్యసుధానుభూతి మో
హరహితవృత్తి బ్రస్ఫురదనంగరహస్యవిచారబుద్ధి న
ప్పురమునఁ గామినీజనులు పొల్తురు యోగిజనంబు పోలికన్. ౧౮

శా. ఓవెఱ్ఱీ! సుతు లందఱుం దెగిన నయ్యో దుఃఖివై యీగతిన్
జావం బుట్టువు దీఱునే? మనములో సంసారమున్ రోసినన్

దేహోత్థంసునిఁ బార్వతీరమణు భక్తిం గొల్చుమీ చేకుఱున్
జీవన్ముక్తి యటంచు ధాత్రి యుపదేశింపం బ్రమోదంబునన్ ౧ఆ

శా. ఈసంసారపయోధిలోనఁ బడి మే మీఁదీది దేహంబుపై
నాస ల్మానక తేలుచు న్మునుఁగుచుం బ్రాణప్రయాణోన్ముఖా
యాసంబుల్ శతసంఖ్య లోర్చితిమి దేవా మమ్ము రక్షించి మి
థ్యాసౌఖ్యంబులు చాలు నిత్యసుఖ మిమ్మా యంచుఁ బ్రార్థించినన్ ౨ ఆ.

ఉ. ఎన్నిమహానదు; ల్వనము లెన్ని; గిరీంద్రము లెన్ని; బోయపీ
ళ్ళెన్ని; మృగంబు లెన్ని; జనహీనములైనపథంబు లెన్ని; నే
నిన్నియు దాఁటి యేకరణి నీశ్వరుశైలముఁ జూడఁ బోయెదన్
గన్నదిగాదు విన్నయదిగాని సదాశివ యేమిసేయుదున్. 3 ఆ

ఉ. కాముకహృద్ధతిం గలఁచు కవ్వము; బువ్వము దేవకోటికిన్
వ్యోమపథంబు తేనె; పెరకొప్పు సుపర్వము; మవ్వ ముత్పల
శ్రీమతికిన్; జకోరమహిషీమధుపాళికిఁ బ్రోచునన్నమై
యామవతీశబింబ ముదయాచల మెక్కెఁ బ్రభాళి పెక్కువన్. ౪ఆ

ఈతనిపద్యముల నుదాహరించుటలోఁ దృప్తి గలుగుట లేదు. వే యేల? ప్రతిపద్యమును రసవంతమై మాధుర్యమును గురియుచున్నది. అందుచేతనే కృష్ణరాయలు అతులితమాధుర్యమెట్లుగలిగెనని ప్రశ్నించి యున్నాఁడు. అట్టిప్రశ్నము నడిగించుట కీగ్రంథ మొక్కటియే చాలు ననియు, వేఱుకృతి యవసరము లేదనియుఁ దోఁచుచున్నది.

ఈతఁడు "కాళహస్తీశ్వరా" యనుమకుటముతో నొకశతకమును రచియించెనని చెప్పుచున్నారు. కాళహస్తిమాహాత్మ్యపీఠికాకారు లా శతక మీతనిది కాదని వ్రాసియున్నారు. మన కిప్పుడు ౧౧౫ పద్యములుగల కాళహస్తీశ్వరశతకము ద్రితప్రతిలభించుచున్నది. అందీశతకము ధూర్జటికృతమని చెప్పుటకుఁ దగినయాధారములు గన్పట్టలేదు. కాని యీశతకమీ ధూర్జటి కృతమని చిరకాలానుగతమగు ప్రతీతి లోకమునవ్యాపించియున్నది. కస్తూరిరంగకవి యభేదయతి కుదాహరణముగఁ దనరంగరాట్ఛందమునందు "ధూర్జటివారి కాళహస్తీశ్వరశతకములోనిదని యీక్రిందిపద్యము నుదాహరించియున్నాఁడు.

శా. నీకుంగాక కవిత్వమెవ్వరికి నేనీనంచు మీఁదెత్తితిన్
జేకొంటిన్ బిరుదంబుఁ గంకణము ముంజేఁగట్టితిన్ బట్టితిన్
లోకుల్మెచ్చవ్రతంబు నాతలఁపుతీరున్ భీరునింగాదు ఛీ
ఛీ! కాలంబున రీతిత్రప్పుకునుమీ! శ్రీకాళహస్తీశ్వరా!

కాళహస్తి మాహాత్మ్యమును ఈశతకమును జదివిచూచినచో నిందలి పదములకూర్పు, ధార, భావ, మాధుర్యము, భక్తి రసము వీనిని బట్టి యీ రెండిటికిని కర్తయొక్కఁడేయని తోఁచును. పైని వ్రాసిన "స్తుతమతియైన" యనుపద్యమునుబట్టి ధూర్జటికవి సంతత వేశ్యానురక్తుఁడని తోఁచుచున్నదని పైనివ్రాసియుంటిని. అందులకను గుణముగ నీక్రిందిపద్యములలో నీశతకకర్త యౌవనమున స్వేచ్ఛాసంచారిగ నున్నట్లు వ్రాసికొని యుండుటనుబట్టి అతఁడే యీతఁడని తోఁపింపఁజేయుచున్నది.

శా. కాయల్గాచె వధూనఖాగ్రములచేఁ గాయంబు వక్షోజముల్
రాయన్నాపడె ఱొమ్ముమన్మథవిహారక్లేశవిభ్రాంతిచేఁ
బాయంబాయెను బట్టఁగట్టెఁదల చెప్పన్రోఁత సంసారమేఁ
జేయంజాల విరక్తుఁజేయఁగదవే శ్రీకాళహస్తీశ్వరా!

మ. చెడుగుల్ కొందఱుకూడి చేయఁగఁబనుల్ చీకట్లఁదూఱంగఁ బా
ల్పడితింగాని చరింపరాని నినునొల్లంజాలుఁ బొమ్మంచు ని
ల్వడలందోచినఁ జూరుపట్టుకొని నే వ్రేలాడుదుంగొఱ్ఱెఁగో
రెడియర్థంబులు నాకు వేఁగలుగవో శ్రీ...

గ్రంథర్వయైకర్తృత్వమున కిది బలవత్తరమైన కారణము కాక పోయినను, నితరకారణములపై నది స్థిరమగునప్పు డిది యందులకు దోడుపడఁగలదు. ఉత్తమశతకములలో శ్రీకాళహస్తీశ్వరశతక మొకటి. తనతప్పును బహిరంగముగ నంగీకరించినవా రల్పసంఖ్యాకులు. అందులో ధూర్జటి యొకఁడు. ఈశతకము ననుకరింపవలయునని యెందఱో కవులు శతకములను వ్రాసియుండిరి. కాళహస్తీశ్వరశతకములే రెండు మూఁడున్నవి. కాని ఒకటియుఁ దీనితో సరి రాలేదు. రాజులను నిందించుచు నీకవి యీశతకమునఁ బదిపద్యములకుఁ బైగా వ్రాసియుండెను. అందు మూఁడుపద్యముల నీ క్రింద నుదాహరించెదను.

శా. రాజు ల్మత్తులు వారిసేవ నరకప్రాయంబు వా రిచ్చునం
భోజాక్షీచతురంతయానతురగీభూషాదు లాత్మవ్యథా
బీజంబుల్ తదపేక్ష చాలుఁ బరితృప్తిం బొందితిన్ జ్ఞానల
క్ష్మీజాగ్రత్పరిణామ మిమ్ము దయతో శ్రీ...

శా. రాజన్నంతనె పోవునా కృపయు ధర్మం బాభిజాత్యంబు వి
ద్యాజాతక్షమ సత్యభాషణము విద్వన్మిత్రసంరక్షయున్
సౌజన్యంబు కృతం బెఱుంగుటయు విశ్వాసంబు గాకున్న దు
ర్జజశ్రేష్ఠులుగాఁ గతంబు గలదే శ్రీ.

శా. వేధం దిట్టఁగరాదు గాని భువిలో విద్వాంసులం జేయ నే
లా! ధీచాతురిఁ జేసెఁ జేసినగులా మాపాట నే పోక క్షు
ద్భాధాదుల్ కలిగింపనేల! యది కృత్యం బైన దుర్మార్గులం,
జే! ధాత్రీశులఁ జేయ నేటి కకటా! శ్రీ.

వీనినిబట్టిచూడఁగాఁ గవి రాజులనాశ్రయించియు లాభముఁ గానక విరక్తిఁ జెందినవాఁడై యిట్టిపద్యములను రచియించెనని తోఁచుచున్నది. ఈతఁడు కృష్ణదేవరాయలయాస్థానకవి యని ప్రతీతి కలదు కదా! కృష్ణరాయలు కవులనాదరించనివాఁడు కాఁడు. అట్టిచో నీతనికీనిరాశ యెట్లుకలిగెను? అని సంశయము కలుగుచున్నది. కృష్ణరాయల తుదిదినములలో నీతఁడుండి రాయలయనంతర మితరరాజుల నాశ్రయించియు ఫలితమును బొందఁ జాలక నిరాశ జనింపఁగా నిట్టి పద్యములు వ్రాసియుండునని తోఁచుచున్నది.

శా. సంతోషించితిఁ జాలుఁ జాలు రతిరాజద్వారసౌఖ్యంబులన్
శాంతిం బొందితిఁ జాలుఁ జాలు బహురాజద్వారసౌఖ్యంబులన్
శాంతిం బొందెదఁ జూపు బ్రహ్మపదరాజద్వారసౌఖ్యంబు ని
శ్చింత న్శాంతుఁడ నౌదు నీకరుణచే శ్రీ.

ఇత్యాదిపద్యములవలన నీతఁడు యౌవనమున స్వేచ్ఛావిహారియు, బహురాజాశ్రయుఁడునై జీవితమును గడపి వయసుచెల్లినపిమ్మట రాజాశ్రయమున నిరాశ జనింపఁగాఁ బశ్చాత్తప్తుఁడై పరమేశ్వరపాదారవిందములందవిలినహృదయముతో నీశతకమును రచించినవాఁ డని

తోఁచుచున్నది. శతకమందలి పద్యములనుబట్టి కవిజీవితమును నాతని గుణనిర్ణయమును జేయుట, యొక్కొక్కప్పుడు ప్రమాదమునకు కారణమయినఁ గావచ్చును. కాని ధూర్జటిపట్ల నది సత్యమే యని తోఁచుచున్నది.

“రోసీ రోయదు” మొదలగు వ్యాకరణ మంగీకరింపని ప్రయోగము లున్నను, నవి యజ్ఞానకృతములు గావనియు, రసాభివృద్ధి కట్టి ప్రయోగము లవసరములని యాతఁడు భావించెననియుఁ నెంచఁదగి యున్నది. ఈశతకమున భక్తివైరాగ్యభావములు చక్కఁగాఁ బ్రదర్శింపఁబడినవి. భగవంతుఁ డెదురుగానుండినట్లు భావించి యాతనితో వినయముగను, న్యాయనిష్ఠురముగను, కోపముతోడను మాటలాడుచున్నట్లు కవి పద్యములను రచించియున్నాఁడు. శైలి తెలుపుటకై మఱినాలుగు పద్యముల నుదాహరించుచున్నాఁడను.

మ. తనువే నిత్యముగా నొనర్పు మది కాదా చచ్చి జన్మింపకుం
డ నుపాయంబు ఘటింపు మీగతుల రెంట న్నేర్పు లేకున్న లే
దని నా కిప్పుడె చెప్పు చేయఁగలకార్యంబున్న సంసేవఁ జే
సి నినుం గాంచెదఁగాక కాలముననో శ్రీకాళహస్తీశ్వరా!

మ. చవిగాఁ జూడ వినంగ మూర్కొనఁ దనూసంఘర్షణాస్వాదమొం
ద వినిర్మించెద వేల జంతువుల? నేత్రత్రిక్కడలే పాతక
వ్యవహారంబులు సేయ నేమిటికి మాయావిద్యచేఁ బ్రొద్దుపు
చ్చి వినోదింపఁగ దీన నేమిఫల మోశ్రీ.

శా. నీ నా సం దొడఁబాటుమాట వినుమా నీచేత జీతంబు నేఁ
గానిం బట్టక సంతతంబు మది వేడ్కన్ గొల్తు నంతస్సుప
త్నానీకంబున కొప్పగింపకుము న న్నాపాటియే చాలుఁ దే
జీ నొల్లం గరి నొల్ల సిరులన్ శ్రీ.

శా. అంతా సంశయమే శరీరఘటనం బంతా విచారంబె లో
నంతా దుఃఖపరంపరార్జితమె మే నంతా భయభ్రాంతమే
యంతానంతశరీరశోషణమె దుర్వ్యాపారమే దేహికిన్.
జింత న్నిన్నుఁదలంపఁబొందరు నరుల్ శ్రీ.

ఈధూర్జటివంశమునఁ గవులు నల్గురైదుగురు కలరు. వారిని జూపువంశవృక్షము క్రింద నిచ్చుచున్నాఁడను. ఇందు జూపఁబడిన కవులచరిత్రము లీగ్రంథమున వేఱు వేఱుగా వ్రాయుదును. ఇది సంపూర్ణవంశవృక్షమని యెంచవీలులేదు. తెలిసినంతవఱకిందుఁ జూపితిని.

భరద్వాజ గోత్రమున




ఈ వేంకటరాయకవి తన వంశమునకు మూలపురుషుఁడైన మన ధూర్జటికవి నిట్లు నుతించియున్నాఁడు.

మ. పటుగంగాలహరీతరంగసముశుంభత్ప్రౌఢతాంచత్కళా
ఘటనన్ [illegible]దవినమ్రకృష్ణవరదారాడ్గంభీరకోటీరవి

స్ఫుటరత్నద్యుతిపాటలీకృతపదాంభోజాతు సర్వజ్ఞు ధూ
ర్జటినింగొల్చెద నస్మదీయకులకర్తన్ భక్తి రంజిల్లగన్.

ధూర్జటికవి, రాయల కంకిత మిచ్చినగ్రంథములుగాని, రాయలపైఁ జెప్పినపద్యములుగాని కానవచ్చుట లేదు. ఈతనికాలమును సరిగా నిర్ణయించుట కీతనిగ్రంథముగాని శతకముగాని తోడుపడ లేదు. కృష్ణరాయవిజయమునఁ గుమారధూర్జటిచెప్పిన "మీ పెదతాత" అను శబ్దమునకు పితామహుని సోదరుఁడని యర్థము చెప్పితిమేని, ధూర్జటి కవి కృష్ణరాయలయాస్థానములోవాఁడు కాఁడనియు, "స్తుతమతీ" ద్యాదిపద్యములు కల్పితములనియుఁ జెప్పవలసివచ్చును. ఈరెండిటిలోను పెదతాతశబ్దమునకు "తాతకుఁదాత"యనియర్థము చెప్పుటయే యుక్తమని తోఁచి యట్లొనర్చితిని.

కాకినాడ: జార్జిప్రెస్‌యందు ముద్రింపఁబడియె —1950.